ల: ఎందుకురా, ఆమెను అట్లా తిప్పలుపెడతావు. ఆమె కాబట్టి నీవు పెట్టే బదవలన్నీ పడుతున్నది.

సా: కంచంలోనే ఉంచండి. ఒక్క చిటికెలో చదువుకొని వస్తా.

శాం: ఇప్పుడు నే చెయ్యబొయ్యే అమ లేమున్నది? మళ్ళీ వడ్డిస్తాలే.

చౌ: మానాయనకు చదువుమీద ఎక్కడలేని శ్రద్ధానూ! వాడికి చదువుకునేటందుకు ఒక గది ఏర్పరచి అందులో ఒక బల్లా, కుర్చీ ఏర్పాటుచేస్తా. ఇంగ్లీషు పుస్తకాలు పెట్టుకొనేటందుకు ఒక చిన్న బీరువా కొంటా. వాడి పొలంలో డబ్బులేపెట్టి యిటువంటి వెన్నయినా కొనవచ్చు. రేపు గుంటూరు పోయినప్పుడు మూడు గాళ్ల బండి యెంతకిస్తారో కనుక్కొని రావలె. నాన్న కూర్చుంటే దర్జాగా ఉంటుంది.

శాం: ఇక పదిహేనురోజులకు వాడు పుట్టినపండుగ వస్తుంది. ఆరోజున వాడికి బండి చదివించండి.

చౌ: అట్లయితే వాడిసొమ్ములోనుంచి బండి తేవడానికి వీలు లేదు. మనమే కొనిపెడదాం. వాడిడబ్బుతో మరివొక వస్తువు కొనవచ్చు. నాన్నా! ఇంకా నీ కేమి కొనమంటావోయ్?

సా: నన్ను ఇప్పుడు మాట్లాడించబోకు తాతయ్యా! నాకు పద్యం రాదు.

చౌ: సరే, దబ్బున అన్నం తిను. దర్జీవాడు రాంగనే కబురంపిస్తా.

సా: శాంతమ్మగారూ! నాకు పద్యం వచ్చింది. ఇక నాకు అన్నం పెట్టండి.

శాం: ఇదుగో! బొట్టు పెట్టించుకో!

సా: నాకు సాదు వద్దు. ప్రహ్లాదుడు పెట్టుకున్నట్లు నామాలు పెట్టండి. (నామాలు పెట్టించుకొని) శాంతమ్మగారూ! ప్రహ్లాదుడు కాక ఇంకా భక్తు లెవరైనా ఉన్నారా?

శాం: మార్కండేయుడనే ఆయన ఉన్నాడు. ఆయన శివ భక్తుడు.

సా: ప్రహ్లాదుడుమోస్తరు కావలెనంటే ఏమిచెయ్యాలె?

శాం : ఆయనమోస్తరుగా బుద్ధిమంతుడవై విష్ణుభక్తి గలిగి ఉండాలె.

సా : నేను రోజూ రాములవారిని ప్రార్థిస్తాను.

శాం : కదలబోకు బొట్టు చెరుగుతుంది—అట్లాగే ప్రార్థించు. ఇక పద అన్నం తిను.

సా : (అన్నం దిని) నాకు బూట్సు దొడగండి.

శాం : (బూట్సులు తొడుగుతూ మీగాళ్లు వత్తిచూచి) అమ్మగారూ! వీడి కాళ్లు చూడండి. వత్తితే గుంటలు పడుతూ ఉన్నవి.

ల : (పరిశీలించి) నాకూ అనుమానంగానే ఉన్నది. బాగా చూడు.

శాం : వణుకుతూ-నా కేమీ కనబడడంలేదు. దడగా ఉన్నది. మీరు చూడండి.

ల : అదేమి ? పసిరికలైనవి. ముసలాయనతో జెప్పితే దిగులు పడతాడు. వెంకటయ్యను బిలిపించి వైద్యునికి కబురంపించు.

చౌ : (లోపలికి ఇంతలో వచ్చి) నే దిగులుపడడం దేనికి ! ఏమిటి పరీక్షిస్తున్నారు ?

ల : ఏమీ లేదు, బూట్లు తొడుగుతున్నది.

చౌ : కనుపొట్టలు ఉబ్బినట్లున్న వే, కొంప మునిగిందా ఏమి ?

ల : ఇంతలోకే గడబిడపడతా వెందుకు ? కామెర్లైతే అట్లాగే ఉంటవి.

చౌ : ముదిరినట్లున్నవి. ఇన్నాళ్ళుచూకా మీ రెందుకు జూడలేదు ? మొఖంకూడా పచ్చబడ్డది.

శాం : నిన్న చూచి జ్వరం నయమై కొత్తనెత్తురు పెడుతున్న దనుకున్నా. ఈవేళ జూస్తే పైకి బాగా కనబడుతున్నది.

చౌ : ఈపూట కేదో చిట్కా వైద్యం చేయించండి. రేపు ప్రొద్దుటుకి గుంటూరు పోయి డాక్టరును తీసుకొనివస్తా.

శివార్చకుడు వచ్చి చెయిచూచి 'లోజ్వరం వస్తున్నది. పైకి కనిపించకపోయినా అంతర్గతం వదలడంలేదు. రేపటిదాకా చూచి మందిస్తా' నన్నాడు. శాంతమ్మకు గుండెలో రాయిపడ్డట్టయింది. ఆమెకు పిల్లవాడు బాగా మాలిమిగావడంచేత వాడికి యేకాస్త

జబ్బుచేసినా దిగులుపడి కూర్చుంటుంది. ప్రతినిమిషం వత్తిచూస్తుంది. మధ్యాహ్నం రెండుగంటలకల్లా పులిక దగిలింది. సన్నగా తెల్లవార్లూ జ్వరంకాస్తూనే వున్నది. తెల్లవారి అన్నం పట్టివేస్తూ తిన్నాడు. రోజూ బళ్లోకిపోతానని మారం పెట్టేవాడు, ఆరోజు స్థబ్ధుగా ఊరుకున్నాడు. తిన్నన్నం యిముడలేదు. తేపా వోకిలించుకుంటున్నాడు. సాధారణపుజబ్బుకు వక్రపెట్టేవాడుగాదు. త్రోసివేసుకొని తిరుగుతూనే ఉంటాడు. ఝామ్రుప్రొద్దెక్కిన తర్వాత శాంతమ్మను చలిగాఉంది గుడ్డగప్పమన్నాడు. శాల్వగప్పి చెంపన చేయిపెట్టుకొని మంచందగ్గర కూర్చున్నది.

ల: శాంతమ్మగారూ! అన్నందిందురుగాని రండి. రాత్రి గూడా తినకపోతిరి.

శాం: నాకు ఆకలి కాలేదండీ.

ల: మా ఖర్మాలకు మీరేంచేస్తారు. దరిమాలిన ఆస్తి ఉంది. పెద్దవాడికి నలుగురు ఆడచెత్తదప్ప యింతమగనలుసు పుట్టకపోయెను. రెండుకుటుంబాలకూ తారకం వీడే. పంచప్రాణాలూ వీడిమీద బెట్టుకొని ఉన్నాం. ముసలాయన రాత్రి విస్తరిదగ్గర కూర్చున్నాడన్నమాటేగాని అన్నం ముట్టలేదు. మధ్యాహ్నం అన్నం దినంగనే లేచి ఆ యెండలోనే కంపనబడ్డకాకివాలె పరుగెత్తాడు. ఈ జబ్బు దీర్ఘంక్రిందబడితే రాత్రింబగళ్ళు మేలుకోవలసివస్తుంది. మీరు యిప్పుడే మూలబడితే తర్వాత కష్టం.

అంతట శాంతమ్మ లేచి యెంగిలిపడ్డది. లంకణం చెడగొట్టడమేగాని అన్నం లోపలికి పోలేదు.

ల: నేనూ తోడుపడుకోనా? తెల్లవార్లూ వొక్కరే మేలుకోవడం కష్టం.

శాం: అవసరంలేదు లెండి.

రాత్రి వొంటిగంటకు జ్వరమెక్కువై పెనంకాగినట్టు కాగింది. జ్వరతీవ్రంచేత తెల్లవార్లూ పండ్లుగొరికాడు. తెల్లవారిన తర్వాత పైపొంగు దీసినా జ్వరం తగ్గలేదు. శాంతమ్మ కంటికి కడివెడుగా యేడుస్తున్నది. రామానాయుడు పిల్లవాడిదగ్గరకు వచ్చి యెట్లా ఉన్నదని అడిగాడు.

శాంతమ్మ కండ్లనీళ్ళు గుక్కుకుంటూ యేదో చెప్పిందిగాని రామానాయుడుకు వినబడలేదు. ఆయన వొళ్ళుపట్టి చూచి వెళ్ళి పోయినాడు. గడియ ప్రొద్దెక్కేటప్పటికి గుఱ్ఱబ్బండిమీద చౌదరయ్యా, డాక్టరూ వచ్చి దిగారు. డాక్టరు వచ్చి రోగిని జూచి చెయ్యి చూడలేదనుకుంటారని నాడి పరీక్ష చేశాడు. అంతుపట్టలేదు. గాజుపుల్ల పెట్టి జ్వరం గొలిచాడు. నూటనాలుగు డిగ్రీ లున్నది.

డాక్టరు: యీ పిల్లవాడికి జ్వరం యెన్నాళ్లనుంచి?

చౌ: నెలరోజులక్రింద పదిహేనురోజులు జ్వరందగిలింది. లోపల జ్వరపు పలుకు వదలందే వైద్యుడు మందు మానివేశాడు. పైకి కనబడకపోయినా జ్వరం అంతర్గతంగా ఉంది. వుబ్బుచూపే వరకూ జ్వరసొక్కు ఉన్నదని మే మనుకోలేదు. వుబ్బుచూపినప్పుడే నీరు ఉన్నదని నిన్న గుర్తుపట్టాం.

డాక్టరు: విరేచన మవుతున్నదా?

శాం: తినుకుతాడు. బాగా కాదు.

డాక్టరు: ఆక లెట్లాఉంది?

శాం: బొత్తిగా క్షీణించింది. తిన్నదికాస్తా హరించుకోవడంలేదు.

డాక్టరు: అబ్బా! రోగం యెంతముదరనిచ్చారండీ!

శాంతమ్మ నిట్టూర్పు విడిచింది. చౌదరయ్య మాట్లాడలేక పోయినాడు.

చౌ: (తడబడుతూ) తమ అనుగ్రహ ముంటే అన్నీ చక్కబడుతవి.

డాక్టరు: భగవంతుడి అనుగ్రహ ముండాలె.

చౌ: తమరు మందు వెంటవెంటనే నడపండి, గుంటూరు నుండి దాదిని పిలిపిస్తారా? డబ్బు ఖర్చవుతుందని వెనుకదీయవద్దు.

డాక్టరు: సాయంత్రం చెపుతా. మందు నడుపుదాం. అనుకున్న ప్రకారం ముందు రెండో వంద ఇయ్యండి. రెండు రోజులు అయిన తర్వాత మూడో వంద యిస్తురుగాని.

చౌ: ఇదుగో తీసుకోండి. తమ అనుగ్రహ ముంటే అనుకున్న కాడికి ఒక వంద అదనంగా ముట్టజెప్పుతా. తమకు భోజనం మన ఇంటిదగ్గరే చేయిస్తా.

డాక్టరు: ఈ మందు గంట కొక గీటు చొప్పున ఇయ్యాలె. ఈ చిన్నసీసాలోది ఆ మం దిచ్చిన తర్వాత అరగంటకు ఒకమా రిస్తుండాలె.

చౌ: తమ గా ప్రకారం మందు నడిపితే నయముగా కేమాతుంది?

రామా: (లోపలికి వచ్చి) ఇదుగో, నాయుడుగారేనా?

డాక్టరు: తమరు విద్యార్థిగా ఉండగా ఆస్పత్రికి వస్తూవుండే వారేకదా.

రామా: లేదు. మీతో అప్పుడప్పుడు టెన్నిసు ఆడుతుండే వాణ్ణి.

డాక్టరు: అవు నిప్పుడు జ్ఞాపకం వచ్చింది. ఈ పిల్లవాడు తమ పిల్లవాడేనా?

రామా: చిత్తం. తమరు శ్రద్ధగా పనిచెయ్యాలె. నే జెప్పనే అవసరంలేదు.

డాక్టరు: నిస్సందేహంగా. ఈ మందు జాగ్రత్తగా వాడ గలవా రెవరు?

రామా: శాంతమ్మగారికంటే శ్రద్ధా, ఓపికా, గలవాండ్లు లేరు. ఆమెవల్ల గావాలిసిందే.

చౌ: ఆ గీట్లకొలతలు మా కెవరికీ దెలియవు. మందు ఆమె చేతికే ఇయ్యండి. గుర్తుగా పెట్టుకుంటుంది.

ల: ఇతరులు ఇచ్చినా మందు దాగడు. మారం చేస్తాడు. ఆమె ఇవ్వవలసిందే.

డాక్టరు భోజనంచేసి పడుకున్నాడు. రెండుగంట లయ్యేవరకు పది మోతాదుల మందు పడ్డది. యేమూలబోయిందో తెలియదు. పిల్లవాడు కొద్దిగా పక్కలు ఎగరవేస్తున్నాడు. మగతగా ఉన్నట్లు కనబడుతున్నది. మొఖం బాగా పచ్చబడ్డది. ఎదురురొమ్ముమీద గూడా గుంటలు పడుతున్నవి. కాళ్లు పట్టి చూచేవరకు శాంతమ్మ కాళ్లు చల్లబడ్డవి. కండ్లలోమాత్రం కాంతి తగ్గలేదు. గంట కొక మాటు తెరలుతెరలుగా మంపులు వస్తున్నవి. తెర అణిగిన తర్వాత పిల్లవాడు రెప్పలు దెరిచేవరకు కండ్లు చుక్కలవలె మెరిసినవి,

శాం: బాలకృష్ణా!

సాహు: శాంతమ్మగారండీ! నాకు ఒంట్లో ఎట్లా ఉన్నది?

శాం: బాగానే ఉన్నది.

సాహు: ఏమో! నేను కొన్ని సంగతులు అడుగుతా, చెపుతారా?

శాం: నాన్నా అడుగూ?

సా: ప్రహలాదుడు చాలా మంచివాడుగదా?

శాం: అవును, మంచి భక్తుడు.

సా: ఆయన ఎక్కడ ఉంటాడు?

శాం: స్వర్గంలో ఉంటాడు.

సా: స్వర్గంలో ఎవ రుంటారు?

శాం: దేవుడూ, దేవతలూ, పుణ్యాత్ములూ, ప్రహ్లాదుడూ అక్కడనే సుఖ మనుభవిస్తూ ఉంటారు. పాపాత్ములు నరకంలో బాధపడుతూ ఉంటారు.

సా: నే నెక్కడికి వెళ్లుతానో!

శాం: నాన్నా! అట్లా అనవద్దు?

సా: కాదు చెప్పండి.

శాం: నాన్నా!

సా: ముం దీ మాట చెప్పండి.

శాం: నీవు స్వర్గానికే వెళ్లుతావు.

సా: అక్కడ మా అమ్మ ఉంటుందా?

శాం: మీ అమ్మ అక్కడ ఉండదు. పాపాత్మురాలు.

సా: మా అమ్మ పాపాత్మురాలు కాదండీ. ఆమె యెక్కడ ఉటుంది?

శాం: ఆమె నరకంలోనే ఉంటుంది.

సా: అయితే నేనుగూడా నరకానికే వెళ్ళుతా! మా అమ్మను చూడవచ్చు. అమ్మా! అమ్మా!

శాంతమ్మకడుపు దరించుకొనిపోయింది. "వోయ్!" అని పలకడానికి నోచుకోలేదు. ఆపుకోలేక,

శాం: నాన్నా! నీ కొకసంగతి చెపుతా, యెవరితోనూ అనవుగదా.

సా: అనములే చెప్పండి!

శాం: మీ అమ్మను నేనే.

సా: తేరిపారచూచి - ఇట్లా ఉన్నారేమీ?

శాం: స్ఫోటకంపోసి యిట్లా అయినా.

సాహు: మా అమ్మమోస్తరుగానే దయగా ఉన్నారు! అమ్మా! నీవు అమ్మవుకే? నా దగ్గర పడుకొని నీ పొట్టమీద పండుకోబెట్టుకోవే.

శాంతమ్మ మంచంమీద పండుకొని సాహును పొట్టమీద పడుకోబెట్టుకున్నది. వొళ్ళుమరిచింది. స్తన్యం వర్షించింది. సాహు పాలు త్రాగుతున్నట్టు ఆమె భావించింది. ఉభయులూ యీ మధ్య గడిచిన సంవత్సరాలన్నీ మరిచిపోయినారు. అమ్మ యెక్కడికీ వెళ్లనట్టే. పాపాత్మురాలూగాదు. ఆవిధంగా ఉభయులూ వొక అరగంటసేపు పడుకున్నారు. కమలమ్మ పిల్లవాణ్ణి పడుకోబెట్టి లేచింది. మళ్లీ మబ్బుతెర వచ్చింది. కండ్లు మూతలుపడుతూ ఉన్నవి. ఆమె కెవ్వున కేకవేసింది. యింట్లోవాండ్లంతా పోగై నారు. నారాయణ! నారాయణ! అంటూ క్రిందికి దింపారు. యేమిటో లేచిపోయింది. యింతమట్టి మిగిలింది. దానిమీద గుడ్డగప్పారు. అంతా అంధకారమైంది.

ఉత్తరక్రియలు జరిపారు.

## 22. నా కమలవా!

శాంతమ్మ స్నానంచేసి వచ్చి లోపల బడుకున్నది. భోజనానికి లేవలేదు. లక్ష్మమ్మపోయి పిలిచింది.

శాం: ఇక నా కన్న మక్కరలేదు. నన్ను బలవంతపెట్టి ప్రయోజనంలేదు.

ల: శాంతమ్మా! నీవు అన్నండినక చేసే దేమున్నది? అహోరాత్రాలు నిద్రమాని తల్లికంటే యెక్కువగా జేశావు. ప్రాప్తం దీరింది. చేయి గడుక్కున్నావు. వెనకా ముందూ దప్ప అందరం పోయేవాండ్లమే. మనం అన్నగతప్రాణాలం. ఉన్నంత వరకూ తినడం, నిద్రపోవడం; దినచర్య తప్పదుగదా? లే అమ్మా! లే, లేచి కాస్త యెంగిలిపడు.

శాం: అమ్మా! నీచేతిఅన్నం నాకు ప్రాప్తం తీరిపోయింది. నాకొరకెవరూ శ్రమపడక మీ మీ పనులకు దయచేయండి.

ల: జ్వరమున్నదేమో డాక్టరును వచ్చి చెయి చూడమను.

చౌదరయ్య డాక్టరుకోసం పరుగెత్తాడు.

శాం: నాకు ఇంకా డాక్టర్లెందుకు? పాపరోగాలు కుదర్చ గల సాహుకృష్ణుడే నాకు వైద్యుడు.

ల: మనిషి పైత్యానబడి సంబంధంలేకుండా మాట్లాడు తున్నది. మజ్జిగలో అన్నంపిండి ధారకంచేస్తే బాగుండును.

వెం: ఆమె తింటేఏ కష్టాలైనా పడవచ్చు. పట్టుపట్టితే మనం చెయ్యగలదేముంది? ఆమె తెలియందైతే తెలిపైనా చెప్ప వచ్చు. ఆమె మహాభక్తురాలు. యేదో నియమం పెట్టుకొని ఇట్లా చేస్తున్నది. చెప్పడానికి యిష్టంలేదనుకుంటాను.

డాక్ట: ఏమమ్మా శాంతమ్మగారూ! లేచి కొంచెం భోజనం చెయ్యండి. తర్వాత మీకు మంచి మందిస్తా.

శాం: సాహుకృష్ణా! అయ్యా! నాకు మందు అవసరంలేదు. తమరు బలవంత పెట్టవద్దు. సాహుకృష్ణా!

డాక్ట: మందక్కరలేకపోతే కొంచెం భోజనమైనా చెయ్యండి. శోషకువచ్చి నాడి చాల బలహీనంగా ఉన్నది.

శాం: నాకు భత్యం తీరిపోయింది. సాహుకృష్ణుడు రమ్మం టున్నాడు. ఉత్క్రమణసమయం ఆసన్నమైంది. తమరంతా కొంచెంసే పవతలనుండి నాయుడుగారిని ఒకపర్యాయం ఇక్కడికి దయచేయ మంటారా? సాహుకృష్ణా! సాహుకృష్ణా!

చౌ: ముంగిట కూర్చున్న కుమారుణ్ణి బిలిచి-శాంతమ్మగారు చాలా జబ్బుస్థితిలో ఉన్నది. నిన్ను చూడవలె నంటున్నది.

రామా: అదేమి! పొద్దున జబ్బేమీ కనపడలేదే! ఏమైనా ధారకం చేయించారా?

చౌ: ఆమె నీళ్లుగూడా వర్జించింది. వ్రతంపట్టి కూర్చున్నది. సాహుకృష్ణ ధ్యానం తప్ప రెండో ప్రసక్తి లేదు.

రామా: లేచి వస్తూ—సాహుకృష్ణు డెవరు?

చౌ: పిల్లవాడు పోయినప్పటినుంచీ సాహుకృష్ణా! అని ఒకే విధంగా అలవరిస్తున్నది. అ దేమైనా తిరుపుమరుపుమాటేమో!

రామా: వచ్చిచూచి—ముఖం తేటగానే ఉన్నది.

డాక్ట: చేతులో ఏమీ పట్టు లేదు. అదేమిచిత్రమో మాటలు క్షీణించ లేదు.

వెం: ఆమెగారు కోరినప్రకారం మన మంతా బయట ఉందాం. తమ్ముడూ! నిన్ను పిలిపించిం దెందుకో అడుగు.

తక్కినవా రంతా తలుపు దగ్గరదోసి బయటికి వెళ్లారు.

రామా: ఏమండీ, శాంతమ్మగారూ! మీకు ఒంట్లో ఎలాఉన్నది?

శాం: జబ్బేమీ లేదు. నాకు ప్రయాణసమయమైంది. తమరు అనుజ్ఞయిస్తే ఒక్క విషయం తమ చెవిలో వేసి లేవవలెనని ఉన్నా. అనుగ్రహిస్తారా?

రామా: తమ రంత ప్రాధేయపడ నవసరం లేదు. నిరభ్యంతరంగా తమరు చెప్పదలచింది చెప్పండి.

శాం: తమరు నాయందు ప్రసాదించి ఆ కుర్చీమీద కూర్చొని తమ దివ్యపాదపద్మాలు ఈ ముక్కాలిపీటమీద ఉంచండి.

రామా: అ దెందుకు?

శాం: అనుగ్రహించవలసిందని ప్రార్థన.

రామా: సరే పెట్టాను. ఇక చెప్పండి.

శాం: చివాలున కూర్చొని వెక్కి వెక్కి ఏడుస్తూ,-అయ్యా! నేను పాపిని, ద్రోహిని, మీకు మహాపకారం చేశాను. ఈ నిర్భాగ్యురాలికి తమబోటి మహాత్ముల సాంగత్యం ఎందుకు దక్కుతుందీ? నే నర్హురాలిని గాకపోయినా తమ పాదాలు యీ అపవిత్రురాలి పాపపుచేతులతో స్పృశించడానికి అనుజ్ఞ ఇయ్యండి.

రామా: (తనలో—గురుపుత్రురాలేమో) అదేమి అలా అంటారు? మీరు పాపాత్ము లెందుకవుతారు? మీ భక్తి చూస్తే నాకు ఆశ్చర్యం వేసింది.

శాం: సాహుకృష్ణా!—అయ్యా! మీ పవిత్రమైన పాదాలు నా చేతులు తగిలితే అపవిత్ర మౌతవని నాకు భయం. ఉత్తరు వీయండి.

రామా: తమరు కోరినట్టు చేయవచ్చు.

శాం: ఆహా! అనుగ్రహించారా! ఎంత అదృష్టవంతురాలిని. (అంటూ) నమస్కరించి కన్నీటికాల్వలతో పాదాలు తడుపుతూ కండ్లతో స్పృశిస్తూ,

శ్లో. వ్యత్యస్తపాద మవతంసిత బర్హిబర్హం
సాచీకృతానన నివేశిత వేణురంధ్రమ్,
తేజః పరం పరమకారుణికం పురస్తా
త్ప్రాణప్రయాణసమయే మమ సన్నిధత్తామ్.

అని ధ్యానం చేసింది.

రామా: శాంతమ్మగారూ! ఇదంతా నా కేమీ అర్థం కావటంలేదు.

శాంతమ్మగారు పాదాలమీద చేతు లుంచి తల యెత్తి మొగంవంక జూచి పెద్దపెట్టున ఏడ్చి "నేను కమలమ్మ" నన్నది.

రామా: ఆహా! అయ్యో నా కమలవా! సాహుకృష్ణుడు ని న్ననుగ్రహించునుగాక!

ఆ మాటలు చెవిలోవేసుకొని కమలమ్మ రామానాయుడి కాళ్ల మీద తల మోటించి పడిపోయింది. స్ఫోటకం పోసినా చెడక మనోహరంగా వీపున ప్రకాశిస్తున్న ఎర్రమచ్చ కనపడ్డది. రామానాయుడు కన్నీళ్లు విడిచాడు. కమలమ్మ మనసు సాహుకృష్ణ మయ మయింది. తాషాబండ్లూ, పీకెలు, నెమలికండ్లూ ప్రపంచమంతా నిండిపోయినవి. లోకమంతా దివ్యదిగంబరుడైన సాహుకృష్ణుని తేజోరూపమై ప్రకాశించింది.

"కీ. ఎత్తుకొందు రారా కృష్ణా—యదునందన వీరా"
అని సన్నగా పాడింది.

"అమ్మా! తాషాబం డెక్కవే ఊరికి బోదాం. అప్పగూడా మనదగ్గరకే వస్తాడులే," అన్నట్టు కమలమ్మకు వినబడ్డది. కమలమ్మ పాదాలమీదినుంచి లేవలేదు. రామానాయుడు నిశ్చేష్టుడై గూర్చు న్నాడు. కొంత సేపటికి కమలమ్మ చేతులు కాళ్ళకు చల్లగా తగిలి నవి. నిట్టూర్పు విడిచి లేవదీసి తక్కినవారిని పిలిచాడు.

చౌ: ఏమి! ఏమంటున్నది?

రామా: పరమపదించింది. కర్మలన్నీ సక్రమంగా జరిపించండి.

వెం: ఎవరో తపోభంగమై కర్మశేషం అనుభవించడానికి మన ఇంట్లో వచ్చిపడ్డదిగాని ఈమె సామాన్యురాలు గాదు.

## మూడవ భాగము

### 1. నిజమయిన వివాహము

అప్పాదాసుకు ఉద్యోగం పోయినతరువాత జీవనం జరగడం కష్టమై రామదాసు కూలికి పోవడం ప్రారంభించాడు. పెద్దపిల్లవాడు వ్యవసాయానికి అక్కరకువచ్చినానికె రామదాసు పొలం పోవడం మధ్యమైంది. సంగదాసు పోయిన తరువాత బొత్తిగా మానివేశాడు. పొలమూ, గొడ్లూ కలిసివచ్చి ఓపినంత పాడీ, పంటా పుష్కలంగా ఉండడంచేత అనువైన భోజనం చేయడమేకాకుండా మేచారాల కలవాటుపడ్డాడు. అదివరకైనా యెన్నడూ కష్టపుభోజనం చేసినవాడు కాడు. ఉన్నదాంట్లోనే మాలక్ష్మి, తక్కినవాండ్లసంగతి ఎట్లా ఉన్నా, రామదాసుకైనా కడుపునిండా పెట్టాలెనని ప్రయత్నం చేసింది. కాని మాలక్ష్మికి వరుసగా మూడుపూటలు అన్నం మిగల్లేదని తెలిసి ఉన్న అన్నం తలాకాస్తా ఒక్కమాటే వడ్డించేటట్టు చేసి తనభాగానికి వచ్చిందిమాత్రమే తాను దినేవాడు. వృద్ధాప్యానికి ఉపవాసాలు తోడై మనిషి బొత్తిగా క్షీణించి శల్యావశిష్టంగా ఉన్నాడు. అప్పాదాసుకు పని పోయినతర్వాత అర్ధాన్నంకూడా దొరకడం కష్టమైనది. అప్పాదాసు స్వంతస్కూలు పెట్టినా దానివల్లనేమీ కసరు జారడంలేదు. జీతం ఇవ్వమని గట్టిగా అడగంగనే మునసబూ, చౌదరయ్యా ఎక్కలుపెట్టి పిల్లలను స్కూలుకు రాకుండా చేస్తున్నారు. పోయినవాండ్లు పోగా మిగిలినవాండ్లైనా సాధ్యమైనంతవరకు కుటుంబం చెదరకుండా ఒక్కచోట ఉంచవలెననే యోచనతో అప్పాదాసుకు ఉద్యోగం దొరికేవరకూ మంగళాపురంలోనే ఏదోవిధంగా కాలయాపన చేయడానికి నిశ్చయించి చేతికందిన పనికి అందరూ పోవలసిం దని ఇంట్లో అందరికీ చెప్పాడు. "కులవృత్తికి సాటి లేదు గువ్వలచెన్నా!" అన్నాడుగనుకనూ, మాలక్ష్మికి తనకూ బయటికి పోకుండా పని దొరుకుతుంది గనుకనూ నేతపని చేయడానికి నిశ్చయించి పైన వేలగట్టి ఉన్న పూర్వోత్తరపు మగ్గం కిందికి దింపి ఊళ్లో సుబ్బిసెట్టి ఇంటికి బోయి "నూలు ఇచ్చి కూలికి

గుడ్డలు నేయిస్తావా" అని అడిగాడు. సుబ్బిసెట్టి పెదవి విరిచి చేతి కంటిన చింతపండు గీకి అడకు అంటిస్తూ,

సు : ఇప్పుడు నేతగుడ్డలు కట్టేవాడెవడు? వాటికోసం అడిగే దిక్కే లేదు. నాదగ్గర నిలవవున్న గుడ్డలు మొన్న గుంటూరు పోయి సగం లుగసానాకు పోకడపెట్టుకొని వచ్చాను.

రా : అయితే నాకేదైనా జీవనాధారం చూపండి. కష్ట కాలం వచ్చింది. మీరు చెప్పినపని నమ్మకంగా చేస్తా.

సు : అయితే విను. గుంటూరులో గుడ్డలవర్తకుడు గుడ్డలు అమ్మకం నిమిత్తం పంపిస్తాను, ఎవరినైనా బెట్టి ప్రతి పల్లెటూరిలోకీ పంపించ మన్నాడు. నీవు తిరిగి అమ్మేటట్టయితే సరుకు తెస్తాను. నీకు మోకాలు నొప్పికాంవాల్నే!

రా : నాకు దరిద్రం రాంగానే అన్ని రోగాలూ పోయినవి. జాడ్యాలను భాగ్యవంతులు పోషించగలరుగాని మాబోటి బీదవాం డ్లెట్లా పోషిస్తారు? "సర్వే గుణాః కాంచన మాశ్రయంతే" అన్నం దుకు రోగాలుకూడా కాంచనాన్ని ఆశ్రయించుకొనే ఉంటవి.

సు : ఇప్పుడు దరువు తీశావు. దూది చాలావరకు అమ్ముడు పోయింది. నాకీ బేరం తగ్గేమాట చెప్పుదూ!

రా : నీది వరహాల బొజ్జ. బేరాలకూ, భోగాలకూ దగ్గర చుట్టరికం. ఇప్పుడు మనిషిని ఖడ్డీపారి కందెన పెట్టితే గాలు తిరుగు తున్నట్లు తిరుగుతున్నా.

సు : నీవు సదానందుడవు. నీకు వచ్చిన చిక్కులు మాబోటి వాండ్లకు వస్తే మంచం పట్టేవాళ్ళం. వారంలో కొత్తసరుకు వస్తుంది. రెండు వందల రూపాయల సరుకు మాత్రం నిలవ ఉన్నది. దీనితో రేపు ప్రొద్దునే బేరం ప్రారంభించు. ఖర్చులు పోగా లాభం చెరి సగం చూసుకుందాం.

రా : సద్గురూ! ఈ కాలానికి నీవు తారక మైనావు. రేపు పొద్దునే బయలుదేరుతాను. నాకు గంటం, తాటాకులూ ఇప్పిస్తే అమ్మకం వ్రాసి మీకు లెక్క చూపిస్తుంటాను. తర్వాత లెక్కలో కట్టుకుందురుగాని మానెడు గింజలు దయచేయిస్తే ఈపూట గడుపు కుంటాం.

సు: మా నెడుగింజలతో యేమవుతుంది? ఒక రూపాయివి కొల్చుకో. యీ రూపాయి దారిబత్తానికి నీ దగ్గర ఉంచు. అమ్మినపైకంమాత్రం ముద్దరసుద్దిగా నాకు వొప్పగించి నీకు రావలసింది నీవు తీసుకో.

రా: ఆవిషయంలో మీకు సందేహం వద్దు. పైకం యావత్తూ అగ్రాన ఆనపెట్టి మీకు వొప్పజెప్పుతుంటా. మీరే లెక్కచూసి నాకు రావలవుంటే యిస్తురుగాని.

సుబ్బిసెట్టి సరుకు బైటికి దెచ్చి జాపితా వ్రాసి రశీదుతీసుకొని దాసుకు ఒప్పజెప్పాడు. రామదాసు ఉత్తరీయంలో గింజలు కొలిపించుకొని వాటిని కుటుంబం రెండురోజులు కడుపార భుజించ వచ్చు నని ఆనందపడుతూ గుడ్డలమూట తలమీద పెట్టుకొని జాముపొద్దెక్కేటప్పటికి యింటికి వచ్చాడు. అప్పాదాసు ఉదయమే బడికి పోయి భాగ్యవంతులపిల్లలను కొందరిని జీతాలు తెమ్మని యింటికి బంపాడు. ఒకరెడ్డి తనకొడుకు గత నాలుగునెలలు చదువుకున్నందుకు పావలా తెచ్చి చేతిలోబెట్టి జీతాలిచ్చేకాడికి నీ మాలబడిలోకి రావడ మెందుకని గుముకుతూ పలకా పుస్తకాలూ తీసుకొని పిల్లవాడిని వెంటబెట్టుకుని కేకలు వేసుకుంటూ వెళ్లిపోయి నాడు. కూలీలపిల్లలుమాత్రం అప్పాదాసుబడిలోనే చదువుతూ తృణమో, కణమో యథాశక్తిగా ఇస్తూనే ఉన్నారు గాని వారి జీతం అంతా కలిసి నెలకు నాలుగు రూపాయలకు మించడంలేదు. పిల్లలను అన్నానికి వదలి యింటికి బోయేవరకు ఆలస్య మవుతుం దని వొక పిల్లవాడిని కోమటింటికి పంపి పావలాకు జొన్నలు తెప్పించి యింటికి పంపాడు. జొన్నలు వట్టిబుర్రలు. మాలక్ష్మి రోటబోసి దంచంగనే పొడుంగావడంచేత అన్నం వండడానికి వీలుగాదని పిండిగొట్టి సంకటి చేసింది. యింతలోకి రామదాసు అంగలువేస్తూ వచ్చి రెండు మాటలూ నట్టింట దింపేవరకు అందరికీ ఆనందమైనది.

మా: (యెగా దిగా చూచి) యెక్కడివివి?

రా: యీ గుడ్డలు ఊళ్లల్లో అమ్మడానికి మారుబేరంకోసం సుబ్బిసెట్టిచ్చాడు. దారిఖర్చులకు ఒకరూపాయి రొఖ్ఖం, ఒక రూపాయి గింజలూ తరువాత లెక్కలో కట్టుకుంటా నని అరువిచ్చాడు.

మా: ఏమిా! భగవంతుడి చిత్రచర్యలు! నీవు ఈ గుడ్డల మూటలు నెత్తిన వేసుకొని ఊరూరా దిరగడం, అమ్మకరావడ మూనా? డెబ్బైఖర్యాపడి జరుగుతున్నది, వాతనొప్పులతో ఎన్ని ఊళ్లు తిరుగుతావు?

రా: యెంత పిచ్చిదానవు! పని చేసుకుంటే తప్పేమున్నది? స్థితిగతులు మారినప్పుడు కాలాన్ని అనుసరించి పోక తప్పదు. ఈ స్థితిలోగూడా చెడుదార్లు తొక్కకుండా న్యాయాన పోతుంటే గౌరవం యెప్పటికీ చెడదు. మంచిస్థితిలో ఉన్నప్పుడు మార్గచ్యుతి లేకుండా వర్తించడంకంటే దారిద్ర్యంలో ఉండి ధర్మంలో చరించడమే వాసి. ధనికులకంటే దరిద్రులకే ధర్మాచరణం సులభసాధ్యమని పెద్దలు చెప్తారు. భగవంతుడు ప్రత్యక్షమై తపస్సుకు మెచ్చి వస్తువాహనాలిస్తానంటే వొల్లక కొందరు ఋషులు దారిద్ర్యాన్నే కోరుకొన్నారు. భగవత్సాన్నిధ్యం పొందడానికి దారిద్ర్యమే దగ్గరిత్రోవ. అకు నలిపినప్పుడే సువాసన బయలుదేరుతుంది. కష్టంవల్లనే పురుషునికి సద్గుణాలలవడతవి; కీర్తి ప్రకాశిస్తుంది. కష్టములే భగవంతుడు మెచ్చినవారికిచ్చువరాలు. కాని వానిని త్రోసిపుచ్చక ఉపయోగపర్చుకొనడమే మనకర్తవ్యం. ఒకరివద్దిలో ఉండి నౌకరీ చెయ్యడంకంటె యిటువంటి స్వతంత్ర వ్యాపారంవల్ల జీవించడమే యెక్కువ గౌరవం. ఓపిక ఉన్నంతవరకు తిరిగి అమ్ముకొని సాధారణంగా సాయంత్రానికి యింటికి చేరవచ్చు. యీ విధంగా కొంతకాలం రోజులు దొర్లిస్తే తరువాత చూచుకుందాం.

మా: మగ్గం యేకులరాట్నం పెట్టుకుంటే యింట్లో ఆడ వాండ్లకుగూడా పని ఉంటుంది. జోతి యేకులు వడికితే నేను పడుగు చెయ్యవచ్చు. ఇంట్లో పనికికూడా భంగ ముండదు.

రా: ఆమాటే యోచిస్తే సుబ్బిసెట్టి యిప్పుడు నేతగుడ్డలు ఖర్చు లేవన్నాడు. నూలు వడికిమాత్రం యేమి చేసుకుంటాం?

మా: పనిలేకుండా కూర్చుంటే నాకూ కష్టంగానే ఉన్నది. జోతిగూడా యేదైనా పనికి పోవాలంటున్నది.

రా: నా బేరంసంగతి యేదో తేలనియ్యి. నీ విప్పుడేమి కూలి చేస్తావు? పిల్లవాడిని బెట్టుకొని యింట్లో యేదోపని చేస్తుండు. జోతి మాటేమిటి? ఈ భారం వదిలించుకుంటే మంచిది.

మా : అప్పడి పెండ్లో?

రా: యిప్పుడు వాడిపెండ్లి కేమితొందర వచ్చింది! పరియాయితీన వాడికి నౌకరీ కుదిరినతరువాత చూసుకుందాం.

మా: జోతికి తగినసంబంధం యిప్పటిస్థితిలో యెక్కడ దొరుకుతుంది? దాని కిప్పటి కా ధోరణే లేదు. అప్పుడు చేసుకుంటా డేమో కనుక్కుంటావా? వాడి తల్లిగూడా దాన్ని చేసుకోవ్వాలె నని మోజుపడుతుండేది.

రా: ఒక యింట్లో పెరిగి "ఏమిరా" అనుకుంటూ చనువుగా ఉండడంచేత ఉభయులకూ వొద్దిక కుదురుతుందని తోచదు. వాడివద్గిర కావ్యాలు చెప్పుకుంటున్నా ఒకతరగతిలో చదువుకుండే పిల్లల మోస్తరుగా ఉంటారుగాని గురు శిష్య సంబంధంకూడా ఉన్నట్టు కనబడదు. అయినా జోతితో నీవు హెచ్చరించి చూడు.

జామున్నర పొద్దెక్కింది. అంతా భోజనం చేశారు. రామదాసు నిద్రపోయినాడు. దాసు మళ్ళీ స్కూలుకు పోయి పెందరాడే యింటికి వచ్చాడు.

జోతి: బావా! యీరోజు పాఠం నా కప్పుడే వచ్చింది. పాండురంగ మాహాత్మ్యం ఈరోజు ఆఖరుపాఠం. దీనితో పంచ కావ్యాలూ ముగుస్తవి. యీరోజు ఊరగొండమీది జారుబండ మీదికి పోయి పాఠం ఒప్పజెప్పుతా.

ఇద్దరూ పుస్తకాలు తీసుకొని జారుబండకు పోయి యీ రెండలో కూర్చున్నారు. చల్లనిగాలి తోలుతున్నది.

అ: జోతీ యిప్పటికి చాలాగ్రంథాలు చూచావు. ఎవరి కవిత్వం నీవు ఉత్తమమైం దనుకుంటావు?

జో: దాసూ! యిది చాలా కఠినప్రశ్న. ఆంధ్రమాత మ్రదసోపేతాలైన చూత, నారంగ, పనస, శర్కరకేళీ, దాడిమ, అనాస, నారికేళ, సీతాఫలములు ఫలించి తనయనుంగుపుత్రుల కెట్లు వివిధ రుచులూ నేర్పిందో, అటులనే పెక్కురు కవితల్లజులం గని నవరసభరితమును, బహుభావసంయుతమునూ, సహస్రాలంకార భూషితమునూ అయిన వాఙ్మయప్రపంచాన్ని సృష్టించి ఆంధ్రులను రసికాగ్రగణ్యులను చేసింది. ఆంధ్రవాఙ్మయరోదసిని సప్తవర్ణములం

బాలుపొందే సప్తాశ్వంబులం బూన్చిన రథం బెక్కి దివ్యప్రభలతో వెలిగే సహస్రకిరణుంబోలి కవిబ్రహ్మ ప్రకాశిస్తున్నాడు. పోతన రాకాసుధాకరుడు. తక్కిన కవిసార్వభౌములు నైజతేజంబుతో పెనురిక్కలవలె మిరుమిట్లు గొలుపుతున్నారు. పేర్లుపెట్టి వర్ణించడం అపచార మని మానాను.

అ: జోతీ! హఠాత్తుగా కవితారసం గురిపించావు. నీకు విద్యాగురువు నైనందుకు ధన్యుణ్ణి, నాకు గురుదక్షిణ యేమిస్తావు?

జో: నీవు కోరిం దిస్తాను.

అ: నీ హృదయం—(అని మెల్లగా జారవిడిచి తలవంచుకున్నాడు.)

జో: ప్రకంపితురాలై—అంతకంటె యెక్కువ అడగవుగదా?

అ: (కొంతధైర్యంతో) అడగను.

జో: (నిదానంగా) అయితే అది ఇదివరకే నీది.

అ: నేను నిన్ను ప్రేమించకపోతేనో?

జో: ఆప్రశ్న నాకవసరంలేదు. ఆ సంగతి తెలుసుకోవడానికికూడా ప్రయత్నించను. నిర్గుణబ్రహ్మాన్ని ప్రేమించినట్టు నిన్ను ప్రేమిస్తాను.

అ: నీవు నా బంగారురాధవు. నా శ్రీకృష్ణుడవుకూడా నీవే. రాధ కృష్ణుని ప్రేమించినట్టు నిన్ను ప్రేమిస్తాను. మోక్షప్రదాయినివి. నీవే నా ముక్తికాంతవు.

జో: (ఆనందపరవశురా లయి బాష్పధార లోలికి కపోలముల ప్రవహింప చేతులు సాచి) నీవు నా మోహనకృష్ణుడవు. నేను చిన్నిగోపికను. ఆబాల్యం నామనస్సు నీయందే లగ్నమయి ఉన్నది. నీవూ గోపికవై సహవాసకత్తెవై నాతో ఆడుకున్నావు. షికారుగా ఊరగొం డెక్కాం. రాళ్లమీద వొత్తిడిగొన్న నా పాదాలు నీ హస్తకమలాలతో వొత్తావు. నీ పాదకమలాలు నా హృదయకమలంలో ధరిస్తూనేఉన్నా. నీ వెప్పుడూ నా కానందదాయకుడవే. నీమీద నాకు ప్రేమ క్రొత్తగా అంకురించలేదు. నా హృదయంలో బీజరూపంగా ఉండి యెప్పుడు మొలకెత్తి తీగెలు వేసి అల్లుకొన్నదో తెలియదు. యిప్పుడు రెండూ పెనుసుకొని బలపడ్డవి.

అ: (అడ్డంవచ్చి—) ప్రేమ కొత్తగా పుట్టదు. శృంగార రసస్వరూపిణియగు రాధామాత చరాచరములయిన సర్వభూతముల యందూ త్రిమూర్తులలోనూ అంతర్యామియై వర్తిస్తున్నది. ఆ జగన్మోహనరూపం నీలో నాకు ప్రత్యక్షంగా కనుపడుతున్నది. నీద్వారా రాధతో సంధానం నాకు గల్గింది. నీవే నా రాధవు.

జో: ఐహిక ప్రేమ ఆముష్మిక ప్రేమకు మూలవేరు. ఐహిక ప్రేమవాహిని నాధారంచేసుకొని ఆముష్మిక ప్రేమామృత సముద్రంలో చేరవచ్చు.

అ: ప్రేమే ఐహికాముష్మికాలకు సంబంధకారకురాలు. సంబంధమూ అదే.

జో: ప్రేమవినా యిహమే లేదు.

అ: ప్రేమవినా ఆముష్మికమూ లేదు.

సాయంకాలమైంది. నీడలు పొడుగై వేనివో గుర్తుపట్టడానికి వీలులేకుండా ఉన్నవి. సృష్టి దీర్ఘశ్రమ చాలించి విశ్రమించ బోతున్నది. ఆకసం రక్తకమలాకరంవలె యెర్రవారింది. కమల మిత్రుడు చాందినీవెండీ, కడానిబంగారూ కలిపి కరిగి ముద్దచేసినట్టు కళకళకాంతులతో చిత్రవర్ణసముద్రంలో తేలి అతిరయమున కాల గతికి లోనై అంతర్ధాన మవుతున్నాడు. సప్తవర్ణములు అతిచమత్కా రంతో పాల్లుకలిసి లక్షలకొలది మిశ్రవర్ణములై బింబాన్ని చుట్టుకొని ఉన్నవి. అస్తమయసమయ మాసన్నమైనకొలదీ క్షణాని కొక్క నూత్నరంగం ప్రదర్శించబడుతున్నది. ఒకక్షణంలో ద్రవరూపమున చలించుతున్న కాంతిపిండము ముప్పాతికై సగమై కొంతవడికి వీసమై మరుగైంది. దానిస్థానం ఒకవన్నె యెర్రదా శతిశయించి వూదా రంగు గుమిగూని ఆక్రమించుకొన్నది. నభోమణిని పోగొట్టుకొన్న యెర్రచేత ఆకస మింకా జేవురించేఉన్నది. సంకీర్ణవర్ణము లింకనూ వూదారంగు నావరించుకొని చిత్రదృశ్యముల జూపుతున్నవి. రంగా లత్యంతత్వరితంగా మారుతున్నవి. ఒకవన్నె నీలిమ అతిశయించింది. కొంతసేపు జోతీ అప్పాదాసులు నిశ్శబ్దంగా విభ్రాంతిపడి చూచారు. ఆశ్చర్య మతిశయించినప్పుడెల్లా ఒక రొకరి మొగములవంక చూచి నేత్రకాంతులతో సంతసాన్ని వెలి బుచ్చారు. అనిర్వాచ్యములైన రంగులరంగముల రామణీయకము

ననుభవించుతూ కూర్చున్నారు. అంధకారపుజవనిక క్రమక్రమంగా మందమై దృశ్యముల అస్పష్టం చేసి కడకు మరుగుపరిచింది. రంగస్థలం పడమరనుండి తూర్పుకు మారింది. పాల్కడలిపట్టియైన జగన్నాటకసూత్రధారుడు పైకి జరుగుతున్నాడు. బ్రహ్మాండ భాండ మంతా వెన్నెలపాలతో నిండింది. సమస్తచరాచర భూతసంతతీ అమృతపు వెల్లువలో మునిగి తేలుతున్నది. చందమామ వెన్నముద్దవలె తేలి ఆడుతున్నది. వెన్న కుదపలు కట్టినట్లు రిక్కగమి బ్రహ్మాండ మావరించిఉన్నది. అద్భుతమైన ఈ సృష్టివైభవమును జోతీ అప్పాదాసులు హృదయాల చూరగొంటూ కొంతవడి కూర్చుండి మెల్లగా దిగడం ప్రారంభించారు. జోతి అప్పాదాసుచేతిపై మొగ్గి మెల్లగా అడుగులు పెట్టుతున్నది. ఉభయులసాన్నిధ్యం అన్యోన్య మానందదాయకమైంది. ఇరువురికీ ముచ్చ ట్లెక్కువైనవి. ఇతరులకు చప్పగా వుండే కథ లన్నీ వారి కింపుగొల్పుతున్నవి. రెండుఫర్లాంగులదూరం కబుర్లు చెప్పుకుంటూ ఇంటికి వచ్చేటప్పటికి గంటసేపైంది.

జో : అమ్మా! ఏమిచేస్తున్నావు?

మా : అన్నం వండుతున్నా. ఎక్కడికి పోయినావే ఇదివరదాకాను?

జో : ఆడుకోపోయినా.

మా : ఏమాటలే యింత పొద్దు పోయిందాకాను?

జో : మాట్లాటలు. బావా నేనూ గుంటిమీదికి పోయినాం. పాఠం చెప్పించుకొని వస్తున్నా. యీరోజుతో పాఠం పూర్తైయింది.

మా : ఇక చదువు పూర్తి అయినట్టేనా?

జో : పూర్తెక్కడికి? పాఠాలు చెప్పించుకోవడం పూర్తి అయినట్టే.

మా : నీచదువు బ్రహ్మప్రళయం అయిపోయింది. ఇప్పటికి గట్టున పడ్డాం. ఇక్కడ కూర్చుందువుగాని రా.

జో : ఇదుగో వచ్చా.

మా : యెన్నిగుర్రాలమీద వచ్చావు?

జో : జోడుగుర్రాలమీద. చెప్పరాధూ?

మా : కూర్చో.

జో: ఊఁ—చెప్పు.

మా: నే నొక్కమా టడుగుతా చెప్పుతావా?

జో: రెండడిగినా చెప్పుతా.

మా: నీవు పెండ్లెప్పుడు చేసుకుంటావు?

జో: మగ డేడే?

మా: ఎంత సిగ్గుమాలినదానవే!

జో: పెళ్ళికొడుకు లేనిదే పెం డ్లెట్లా చేసుకోమంటావే?

మా: ఉంటే చేసుకుంటావా?

జో: నీకు అన్నలూ తమ్ములూ ఎవరైనా ఉన్నారా? మీ నాయ నున్నా సరే. నీ పుట్టింటివా ళ్లెవరైనా చేసుకుంటా. మీ వంగసం మంచిది. నన్ను కూర్చోపెట్టి పని చేయాలే. అప్పు డప్పుడు ఎత్తుకొని తిరగాలే.

మా: నాకు పుట్టింటివా ళ్లెవరూ లేరమ్మా; ఉన్నా నీమోస్తరు గయ్యాళితో వాండ్లు నిభాయించలేరు.

జో: నేను గయ్యాళినిటే?

మా: గయ్యాళిన్నర. వచ్చేవాణ్ణి వేధిస్తావు.

జో: అయితే నా కెవడూ రావద్దు.

మా: అసలే మానుకుంటావా?

జో: నాకు పెళ్లే వద్దు.

మా: ఎగతాళిమాటల కేమిగాని అప్పాదాసును పెళ్ళి చేసుకుంటావా?

జో: ఛా.

మా: ఛా యేమిటే, నీకు పాఠాలు చెపుతుంటేను.

జో: దానికి బదులా?

మా: అతను మంచి బుద్ధిమంతుడు.

జో: అతనికి పెట్టింది అతనే తింటాడు.

మా: అతని కంచాని కెగబడి సగం నీవే తింటావు, ఎంగిలని అనకుండా.

జో: అతని ఎంగిలి రుచిగా ఉంటుంది. కాని నేను పెండ్లి మాత్రం చేసుకోను.

మా: అతడు వద్దా? ఎవరినీ చేసుకోవా?

జో: నాకు పెండ్లే వద్దు.

ఇంతలోకి రామదాసు లోపలికి వచ్చాడు. జోతి దొడ్లోకి వెళ్ళిపోయింది.

రా: ఏ మంటున్నది?

మా: మీ ఇంట్లో అందరికీ తలావొక రకం వేదాన్తం.

రా: మంచిదేగా.

మా: మంచిదే. దానికి పెండ్లే అక్కరలేదట.

రా: దాని యిష్టపూర్తిగా అక్కరలేకపోతే పోనీ.

మా: పోనియ్యాక ఇదివరకు ఎవరిని పట్టుకున్నాం? మీ తిరుమాళిగెలో మీ శిశ్రూషవల్ల అప్పయ్యకుకూడా పట్టిందేమో కనుక్కో!

రా: మావాండ్లు తెలివితక్కువవాం డ్లెవరూ కారు. ఏదో ఒక కొత్త పంథా. అన్నానికి లేతాం. పిల్లవా డన్నం దిన్నాడా?

మా: ఆఁ. ఆయనపోరు చల్లార్చి పడుకోబెట్టా; తక్కినవా రంతా రండి.

మాలక్ష్మి మూడు పళ్లేలు తెచ్చిపెట్టి వడ్డన ప్రారంభించింది. జోతి తన పళ్లెం అప్పాదాసు పక్కకు లాక్కొని కూర్చున్నది.

రా: నీకు అన్నం వేరే తీసుకున్నావా?

మా: మిగులుతుందిలే.

రా: ముందు తీసిఉంచు. మే మంతా ఘోడుఘోడు మంటున్నాం.

మా: సరే కానియ్యండి.

రా: బక్కనీ ళ్లున్నవా!

మా: నిన్నటినుంచీ సానంవారికి తొక్కు కడుగుతున్నా. వారు మంచివే పోస్తున్నారు. చిక్కనివే ఉన్నవి.

జో: బావా! ఇదిగో ముద్ద. బాగా "ఆ" అను.

అ: చదువు ప్రారంభిస్తున్నావా! పెట్టు. ఆహా! ఎంత రుచిగా ఉన్నది!

జో: ఆ గుజ్జు నాకు దే.

గుజ్జ్ జోతి నోట్లో పెట్టి తన వేళ్లను అప్రయత్నంగా తన పెదవుల కంటించుకున్నాడు. అదీ ఇదీ ఇతరులు గమనించలేదు.

మా: జోతీ! మీరు చిన్నపిల్లలా! ఒకరి ఎంగిలి ఒకరు తినడానికి?

జో: మేము పెద్దవాళ్ళమటే? నాకు బదులుముద్ద పెట్టవే మబ్బాయ్?

అ: గుజ్జు పెట్టలేదా?

జో: దానితో సరిపుచ్చుదా మనుకున్నావా? పెట్టు.

అప్పాదాసు జోతి నోటిలో ముద్ద పెట్టాడు. ఉభయులకూ ఆనందం గలిగింది.

రా: అప్పడూ! నీకు పెళ్లీడు వచ్చిందికదా! నీ అభిప్రాయ మేమి?

జో: మన ఇంట్లో అందరికీ పెండ్లి పిచ్చెత్తింది.

రా: చెప్పవేమి?

అ: నాకప్పుడే పెళ్లీడా?

రా: నీవు త్వరలో పెళ్ళి చేసుకోవడం నా అభిప్రాయం.

అ: నాకు పెళ్ళి చేసుకోవలెనని లేదు.

రా: అభిలాష కలిగినప్పుడు భార్యా ఎట్లా వస్తుంది?

అ: ఆ కోరికే కలుగుతుందని తోచదు.

రా: వివాహం ధర్మార్థ కామ మోక్షా లనే చతుర్విధము లైన పురుషార్థాలను సాధించడానికి అవసరమై ఉన్నది. పురుషుడు విధిగా వివాహం చేసుకొనితీరవలయును.

అ: ఈ పురుషార్థాలు పుష్పకం వంటివి. వీటిలో అన్నీ ఇమిడి ఉంటవి. వివాహంవల్ల సమస్త లాభాలు సాధించవచ్చుననేది కేవల అర్థవాదం. ప్రేమ మోక్షసాధనం గనుక మోక్షం సంపాదించినవానికి అన్నీ ఉన్నట్టే లెక్క. మోక్షసాధనమైన ప్రేమ భార్యమీద తప్పక కుదురుతుం దనడానికి సాధ్యం కాదు. ఒక స్త్రీయందు దట్టి ప్రేమ కుదిరినా ఆమెతో వివాహం అవసరమని నాకు తోచదు.

రా: నీవు చెప్పినదాంట్లోనుంచి అనేక ప్రశ్నలు బయలుదేరుతున్నవి. వివాహం సంతానాపేక్షను పురస్కరించుకొని ఉంటుందా? ప్రేమకూ వివాహానికీ సంబంధ మెంతవరకున్నది?

అ: యీ రెండు ప్రశ్నలతో అర్థం యేవత్తూ తేలుతుంది. వాటికి వివరంగా జవాబు చెప్పు.

రా: ప్రేమకూ వివాహానికీ సంబంధ నిర్ధారణ చేయడం కష్టం. ప్రేమ కలుగకుండానే వివాహమూ, కేవల పశుధర్మాన్ననుసరించి సంతానమూ కలుగవచ్చు. మనుష్యేతరసృష్టిలో కేవల పశు ధర్మంవల్ల సంతానం కలుగుతుంది. ఒకవిధమైన కామంకూడా ఉంటుం దని చెప్పవచ్చు. మనుష్యులలో పితాపుత్రాదిసంబంధాలు గలిగి నిర్ధారణకొరకు వివాహ మేర్పరచారు. సంగమం కేవలకామ పూర్తికే కాక సంతానప్రాప్తికై కూడానూ. కామమూ, తన్ని వారణార్థం భోగమూ సంతానోద్దేశంతోనే యేర్పరచబడ్డవి.

అ: కొందరు స్త్రీపురుషులకు సంతానాపేక్ష లేకపోతేనో?

రా: లేనట్టయితే కేవలకామపూర్తికే భోగించవలసి ఉంటుంది.

అ: పశువులు భోగించునప్పుడు సంతానాపేక్ష ఉన్నదా?

రా: సంతానం కలిగినప్పుడు ప్రేమిస్తవి కాని భోగించే టప్పుడు సంతానదృష్టి లేకపోవచ్చు. సృష్టిక్రమాన్నిపట్టి చూస్తే సంతానోద్దేశ్యంతోనే కామం సృష్టించబడ్డదని చెప్పవచ్చు.

అ: కనుకనే ప్రేమ లేకనే కామమూ, వివాహమూ, భోగమూ, సంతానమూ కలుగవచ్చు. వీటికి ప్రేమ చేరినా చేర వచ్చును. యివి లేకనే ప్రేమా ఉండవచ్చును. పై జెప్పిన లాభాలు కోరకనే నాయకీనాయకులకు ప్రేమ ఉండవచ్చు. గోపికలు శ్రీకృష్ణుని ఆ ప్రకారమే ప్రేమించారు. ప్రేమకు సంగమం ప్రతి బంధకం కాదు. సహాయకారి కావచ్చును. కాని అవసరమని చెప్పడానికి వీలులేదు. ప్రేమ వీటిని పవిత్రం చేస్తుంది. యివి లేకపోతే ప్రేమ శుద్ధమైన భావరూపకంగా ఉంటుంది.

రా: బిడ్డలను కని పెంచి ప్రేమించుట ఆత్మోపలబ్ధికి మార్గం గాదా?

అ: పున్నామనరకాదులవిషయం అటుండనిచ్చి పుత్రులను ప్రేమించి ప్రేమస్వరూపుని చేరవచ్చు. అటులనే నాయకీనాయ కులనూ, అన్యోన్యం ప్రేమించి ఆత్మోత్తేజమును పొందుతారు.

వాండ్లోరులయందు రాధాకృష్ణులను గుర్తింపగలిగిరేని ఐహికాముష్మికభేదములు వారికి నశించి భూతలస్వర్గమును అనుభవిస్తారు. యీ ప్రేమకు కామోపభోగాదులతో అవసరం లేదు.

రా: నీవు చెప్పేది వాస్తవం. ఇక నీ స్వవిషయమై యేమి నిర్ధారణ చేసుకున్నావు?

అ: "ఇక ప్రేమించి వివాహం చేసుకోవలెనా? వివాహం చేసుకున్నతరువాత ప్రేమించవలెనా?" అనేది స్వల్పవిషయం. వివాహం చేసుకోనివాండ్లను ప్రేమించడానికి నీ కేమధికార మున్నదని కొందరు ప్రగల్భంగా ప్రశ్నిస్తారు. దీనికి ప్రతిగా ప్రేమించని వారిని వివాహం చేసికోవడానికి నీ కే మధికారం ఉన్నదని మరి కొందరు వాదిస్తారు. కాని ప్రేమించడం, వివాహం చేసుకోవడం రెండూ ఒకటే. ఊరేగింపూ, తాళిగట్టడం మొదలైనవన్నీ ప్రేమ బంధానికి బయటిగుర్తులు. సాక్ష్యంకోసం ఉద్దేశించబడ్డవి. పుత్తు లౌరసు లనడాని కాధారం. కాని బాహ్యచిహ్నాలన్నీ చాలావరకు తప్పుసాక్ష్యాలుగానే పరిణమిస్తవి. ప్రేమబంధ మేర్పడకముందే సాక్ష్యం సృష్టిస్తున్నారు. యీ సాక్ష్యం పుట్టినతర్వాత దానననుసరించి ప్రేమబంధం పుట్టుతుందని కొందరి వాదన. అది మరింత హాస్యాస్పదం. కాకతాళీయన్యాయంగా తాళిగట్టినదంపతులకు ప్రేమ గలుగవచ్చు. కాని అది విశేషవిధి.

ఇక నా స్వవిషయాన్ని గూర్చి చెప్పవలసిఉన్నది. విశేషం లేదు. నేను వివాహం చేసుకోదలచలేదు.

రా: (సందేహిస్తూ) నీ వెవరినైనా ప్రేమిస్తున్నావా?

అ: నేను ప్రేమించినా బాహ్యసాక్ష్యంతో పని లేదు. కనుక యితరులు తెలుసుకోవలసిన అవసరం లేదు.

రా: మజ్జిగ పొయ్యి.

మా: (మజ్జిగ పోస్తూ) జోతికీ పెళ్లవసరం లేదట.

రా: నా కర్థమైంది.

మా: నీ మామూలుపద్ధతే అంతగా?

రా: బలవంత పెట్టమంటావా?

మా: దేనికీ లేనిది దీని కెందుకు? కావలసింది కాకమానదు,

## 2. కోమటింట కన్నము

రామదాసు తెల్లవారుఝామున జాముప్రొద్దుండగా లేచి కాల్యములు తీర్చుకొని భోజనంచేసి పల్లెజేరానికి ప్రయాణమైనాడు. మాలక్ష్మి గుడ్డలమూట తలకెత్తి నిట్టూర్పు విడిచింది. రామదాసు ఉత్సాహంతో ప్రయాణమై పోయినాడు. ఊరగొండబోడు దాటి రామదాసు రయిలుకట్ట దాకొన్నాడు. కట్టసమీపంలో వాగుమీద కళంగి కట్టారు. దానిదగ్గరవున్న గుంటలో దాగి ముగ్గురు మనుష్యులు లేచి నిలువుమన్నారు. రామదాసు భయపడి మూట దింపాడు.

దొంగలు: మూట దింపావేమి? ఎత్తుకొని కందిచేలోకి రా.

రా: అయ్యా! మీరు నన్ను కొట్టవద్దు. యీ మూట నేనుయెత్తుకోలేను, కాస్త చేయి వెయ్యండి.

౧ వ దొంగ: ఇట్లా నా కెత్తరా! త్వరగాపోదాం. ముసలి వాణ్ణి పట్టకరా?

రా: మూట దీసుకున్నారుగా ఇంకా నే నెందుకు?

౨ వ దొంగ: అరవకుండా మాతో రా. నోరెత్తావా అంటే దెబ్బపడుతుంది.

రా: (వణుకుతూ దొంగలవెంట కందిచేలోకి పోయినాడు.)

౧ వ దొంగ: ఈగుడ్డ లెక్కడివి?

రా: సుబ్బిసెట్టివి. పల్లెటూళ్లల్లో అమ్ముకొని ఒకపావు మిగిలితే చెరొక ఛవలం తిందాం అనుకున్నాం. జడ్డిగంలోనే మిడత పాడిచింది. ఆ మహారాజును చూడడానికి మొగం చెల్లదు. పాపం, దయదలిచి నాకు బతుకుతెరువు చూపాడు. కాని ఇట్లా తటస్థించింది.

౧ వ దొంగ: ఊరికే వాగక నడువు. నీవి కావంటే వదులుతా రనుకొన్నావా?

౨ వ దొంగ: అమ్మబోతున్నావుగదా వీటి ఖరీ దెంత?

రా: జాబితాదాఖలాఖరీదు సుబ్బిసెట్టి వేసిఇచ్చాడు. నా జన్మలో ఆ బాకీ తీర్చలేను.

3 వ దొంగ: మేము ఇతరులదగ్గర కొనుక్కుంటే రెట్టింపు ఖరీదు గిటుతుంది. కనుక ఆ ఖరీదిస్తాం తీసుకొనిపో. ఊరికే తీసుకుంటే నీయేడుపు మాకు కొట్టేటట్లున్నది.

రా: అన్యాయం యెందుకు? వాటిఖరీదు రెండువందలు రూపాయ లిస్తేచాలు. అందులో నాకు ముప్పైరూపాయలు లాభం వస్తుంది. నా లాభంకూడా తగ్గించుకొనే ఇవ్వండి.

3 వ దొంగ: ఊరికే అరవక ఆ నాలుగువందల రూపాయల సంచీ తీసుకొనిపో.

రా: అయ్యో! మీచర్య చూస్తే ఆశ్చర్యంగా వుంది. మీ రెవరు?

దొంగలు: రాజాధిరాజు తక్కెళ్లజగ్గడుగారి వత్తాసులం.

రా: తెలియక అడుగుతాను. క్షమించండి. రాజాధిరాజైతే ఈ పనెందుకు?

3 వ దొంగ: రాజాధిరాజంటే దేవుడు. అసలు దేవుడు పరిపాలించడం చేతగాక ప్రపంచపద్ధతులన్నీ తారుమారుచేసి ఉక్కిరిబిక్కిరి లాడుతున్నాడు. డబ్బంతా కొందరు పోగుచేసుకొని బీదవాండ్లను బాధిస్తుంటే జగ్గడుగారు పాతదేవుణ్ణి తోసిరాజని సక్రమమైనపాలన ప్రారంభించారు. మారాజుపాలనలో బీదల బాధలు తొలగి అంతా అన్నదమ్ములవలె ఉంటారు. బీదవాండ్ల కెందరికైనా పని చూపిస్తాడు.

రా: మీరాజుగారు చూపించేప నిదేగా?

3 వ దొంగ: కొంతకాలంపాటిదే. భాగ్యవంతులు సరియైన మార్గానికి రాకపోతే కొంతకాలం ఈ యుద్ధం జరిపి సంపాదించిన ధనంతో బీదలకు వృత్తులేర్పరుస్తారు.

రా: ఇంతకంటె న్యాయమార్గం లేదా?

3 వ దొంగ—ప్రయోజనకరమైన న్యాయమార్గం మరొకటి లేదు. ఈమార్గమైనా న్యాయవిరుద్ధం కాదు.

రా: నేమాత్రం మీతో యేకీభవించను. మీరు సృష్టిక్రమమే మారుస్తామంటారు.

3 వ దొంగ: అది తప్పు. సృష్టిక్రమమే మేము కావలెనంటాం. మీ రవలంబించేది అస్వాభావికమైనపద్ధతి. అయినా ఆవాదన ఇప్పుడు తేలేది కాదు. నీవు వెళ్లు.

రా: ఇంకొక్కసంగతి. తక్కెళ్లజగ్గడుగారు కాలంచేశారు కామాలెనే?

3 వ దొంగ—అని మీ దేశంలో అనుకున్నారు. వారు యీ పదిసంవత్సరాలనుంచీ నైజాము దేశ మంతా కట్టుబాటు చేశారు. ఊరూరా మావత్తాసు లున్నారు. ఇప్పుడు తూర్పుకు యెగబాకుతున్నాం. నీవు వెళ్లు. ఊళ్లోకి పోయేవరకు మా పే రెక్కడా యెత్తవద్దు. ఇంకా సామాను తెస్తావా?

రా: నేను యిక రాను.

ముగ్గురుదొంగలూ వెళ్లిపోయినారు. రామదాసు కొత్త దొంగల పద్ధతులు విని ఆశ్చర్యపడ్డాడు. కాలాలు మారిపోతున్న వనుకున్నాడు. "గతకాలము మేలు వచ్చుకాలము కంటెన్" అని అన్నారుకాని అది యెంతవరకు వాస్తవమో చెప్పడానికి వీలులే దనుకున్నాడు. "యీ కాలపువాళ్లబుద్ధులు మంచివే కాని లోక విద్దూరంగా ఉన్నవి. ఆచరణలో పెట్టడం సాధ్య మవుతుందా? ఒకపర్యాయం భాగ్యవంతు లాస్తి పంచిపెట్టినా స్వల్పకాలంలో పరిస్థితులు మళ్లీ యథాస్థితికి రావా? బీదలు సోమరులై పనిపాటల విడిచి ఊరుకోరా? స్వశక్తినిబట్టి భాగ్యవంతులు గావడానికి ప్రతి వాడికీ అవకాశం ఉండడం న్యాయంగాని యీ దోపిడిపద్ధతులు సర్వ సామాన్యం అయితే కష్టపడి జీవించే వెర్రివాళ్లెవ రుంటారు? రాను రాను స్వయంకృషికంటే చౌర్యమే మేలని భావించే దుస్థితి దేశానికి పట్టబోతుందేమో" అని వితర్కించుకుంటూ ఇంటికి వచ్చాడు. అప్పటికింకా బాగా తెల్లవారలేదు. అప్పాదాసు లేచి మందిరం వైపుకు వెళ్లాడు. భోజనంలోగా రాడు. మాలక్ష్మి, జోతీ జొన్నలు తొక్కుతున్నారు. పిల్లవాడు నిద్దర లేవలేదు. చెల్లెలు సుబ్బలక్ష్మి తాలూకు మలీతపడ్డ యీనమోసింది. వెనుక జున్ను బాలకథంతా జ్ఞాపకం వచ్చింది. ఆమె మరణకారణం తలంపునకు వచ్చి పంచములదుస్థితి మూర్తీభవించినట్లు పొడగట్టింది. అప్పటి తన కాపురపుస్థితీ, ఇప్పటి హైన్యమూ తలచి ఒక్కక్షణం కించపడి మళ్లీ మనస్సు నిబ్బరించుకున్నాడు. ఇప్పుడు చేతికివచ్చిన నాల్గు వందల రూపాయలూ యేమిచేయవలెనో తెలియలేదు. యెక్కువ యివ్వబడిన రెండువందల రూపాయల్లో తన కేవిధమైన హక్కూ లేదని నిశ్చయించుకున్నాడు. తనభాగానికి క్రమప్రకారం రాదగిన

ముప్పదిరూపాయలలాభం తానేమీ శ్రమపడకనే రావడంచేత తా ననుభవించవచ్చునా అని సందేహపడుతున్నాడు. ఎక్కువ వచ్చినధనం యావత్తూ సుబ్బిసెట్టియొక్క మూలధనంవల్ల వచ్చినదే గనుక అతని కిచ్చివేయడమే న్యాయమనీ, తాను ముప్పై రూపాయలలాభం పొందడానికి యింతశ్రమపడవలసిందని నిర్ధారణ లేదుగనుక ఆ మొత్తంమాత్రం తీసుకోవచ్చుననీ నిశ్చయించుకున్నాడు. యింతలో మాలక్ష్మి, జోతీ తొక్కు తీసికొనివచ్చారు. వారికి యావత్తు సంగతులూ వినిపించి పైకంవిషయమై తననిశ్చయం తెలిపాడు. మాలక్ష్మి యింతపైకం యింట్లో భరించడం కష్టం, వెంటనే పోయి యిచ్చి రమ్మన్నది. మూట చంకనపెట్టి ఉత్తరీయం గప్పుకొని సుబ్బిసెట్టింటికి పోయినాడు. అతడు యెవరితోనో రహస్యంగా మాట్లాడుతున్నాడు.

రా: సుబ్బయ్యగారూ!

సు: నీవు కాసేపు వాకిట్లో నిలుచో—ఇక రావచ్చు. ఊరికి పోలేదా?

రా: కొంతలెక్క పోయినాను. గుడ్డలన్నీ అమ్ముకొనే వచ్చాను. మూలానికి రెట్టింపుపైగా లాభం వచ్చింది. ఇదిగో! మూట.

సు: (ఆనందపడుతూ) యేదో దేవత నీకు ప్రత్యక్షంలా గున్నది. యింకా గుడ్డలు కావలెనన్నదా?

రా: కావలెనన్నారుగాని నేను వాళ్లకు అమ్మదలచలేదు. వాళ్లు దొంగలు. దేవత గాదు. దేవుడిదొంగలుట.

సు: వా ళ్లెవరయితే మన కేమి? కొంటా మంటే అమ్ముదాం.

రా: క్రమమైన ధరకైతే ఆ మాటనుకోవచ్చు. డబ్బు మీదపడవేసిపోతే యేమనుకుంటావు?

సు: వాళ్లు గుడ్డలు లేక యిబ్బందిపడుతున్నారనీ, యేకాడికైనా కొనడానికి సిద్ధంగా ఉన్నారనీ అనుకొంటాను. యీ డబ్బు సంగ తెట్లా?

రా: మొదటనుకొన్నప్రకారం మీ లెక్క చెల్లుపెట్టుకొని నాకు రావలసింది యియ్యండి.

సు: ఇందులో నీవు కష్టపడ్డ దేమున్నది?

రా: నీవుమాత్రం చాలా కష్టపడ్డావు.

సు: డబ్బు పెట్టింది నేనుకదా! దొంగలు యెత్తుకొనిపోయి నట్టయితే నేను నష్టపడేవాణ్ణేనా? నీదగ్గర యెట్లా వసూలయ్యేదీ?

రా: అయితే యేమంటావు?

సు: పైరెండువందలలో వొక్కకానీ నీకు రాదు.

రా: దాంట్లో నాకు వొకదమ్మిడీకూడా వద్దు. యీ సంగతంతా నే చెప్పక గుట్టుచక్కంగా పైకం దాచుకొంటే నీ వేమి చేసేవాడవు?

సు: అటువంటివాడివి కావనే నమ్మి సరు కిచ్చా! ఇదివరకు లెక్కపోను మిగిలిన ఇవ్వవై యెన్మిదిరూపాయలకూ నీ కిష్టంవచ్చిన సరుకు తీసుకో.

రా: వొకబస్తా జొన్నలూ, వొక అరబస్తా బియ్యం ఇప్పించు. తక్కినదానికి వెచ్చం తీసుకుంటాను.

సు: వొకవందరూపాయలసరు కున్నది. పొద్దున్నే వేసుకొని పోతావా?

రా: ఇక గుడ్డలు వద్దు. చిల్లరసరు కిప్పించు.

సు: పదిరూపాయలకైతే మనిషిమో తవుతుంది. ఏమి లాభం వస్తుంది?

రా: సాయంత్రంలోగా అవి అమ్ముకుంటే చాలు. నా భాగానికి వొక అర్ధరూపాయి గిట్టకపోదు.

సు: పెద్ద లా ట్లేమీ రావడానికి వీలులేదు. చిల్లరన యెన్నాళ్లమ్మితే ముప్పైరూపాయలలాభం వస్తుంది!

రా: వచ్చినంతవరకే ఆయె. ఆశకు పోగూడదు.

సు: మీ కూలీలు వట్టిసోమారులు. రూపాయి చేతిలో కనబడితే అది ఖర్చయ్యేదాకా పని చెయ్యరు. నాకేమి పొట్ట జరక్కనా ఈ పాకులాడడం! వ్యవహారం చేస్తూఉండాలె. రేపు పొద్దుటికల్లా కొత్తరకం సరుకు తెప్పిస్తా. నీ మనస్సులో మలికితం యేమిటో చెప్పు. నింజలి పెట్టుకొని మాట్లాడితే వ్యవహారం సాగదు. కటాపిటీగా ఉన్న సంగతి చెప్పాలె. నీకు అన్నం తక్కువైం దని అడుగు. దానిమా టేదో చెపుతాను.

రా: ఆసందేహం నాకేమీ లేదు.

సు: అట్లా అంటే నే నొప్పుకోను. డబ్బు చేదాయేమి? పైలాభంలో నాలుగోవం తిస్తా, ఆలోచించుకో.

రా: ఇం కామాట తలపెట్టవద్దు. ఆ చిల్లరవస్తువులు దయ చెయ్యి. వళాసం వొక్కటిప్పించావంటే మోసకపోవడానికి వీలుగా ఉంటుంది.

సు: నోట శనివుంటే నే నేమి చేసేది? గింజలు కొలుచు కుంటావా?

రా: బియ్యం గొలువు, మెత్తుకొనిపోతా. జొన్నలు సాయంత్రం ఇత్తువుగాని.

రామదాసు బియ్యపుగోనె మెత్తుకపోయినాడు. ఇందాకటి కొత్తమనిషి చిరునవ్వుతో లోపలికి వచ్చి:

కొ-మ: సుబ్బయ్యగారూ! యేదో లాటు కొట్టారే-మీదయ్యా సామ్మి.

సు: ప్రాప్తం లేనిది ఉట్టినే ఎవరికైనా వస్తుందా? అయితే *వొక్క సంగతి. వేళ్లు వంచందీ వెన్న పూస రాదు.

కొ-మ: ఆమనిషి వట్టిచాదస్తుల్లా గున్నాడే? నే నైతే ఇటువంటివి పదిలాట్లు కొట్టి హాయిగా కూర్చుందును. తరువాత మన నడిగేవా డెవడు? పదేండ్లలో పెద్దసెట్టి నయ్యేవాణ్ణి.

సు: అయితే నీవు వెళ్లుతావా? యింకా రెండువందల రూపాయల సరుకుంది. నీ తావర మెక్కడనో తెలియకపోయెనే!

కొ-మ: సుబ్బయ్యా! వారంరోజులనుంచీ వస్తున్నాగదా! నాలో తభావతు యేమైనా కనిపెట్టావా? మంచిచెడ్డలు ముందుగా నీ కెట్లా తెలుస్తవి?

సు: మొదటిసారి పైలాభంలో నీకు భాగం లేదు. అతనితో పాటు రెండోసారినుంచీ నాలుగోవంతు లాభం యిస్తా. ఈతడవకు అతని మోస్తరుగా ముప్పైరూపాయిలు తీసుకో.

కొ-మ: నా కా షరతులు గిట్టవు. రెండోసారి లాభం వస్తుందని నిలుకేమున్నది? ఈసారిగూడా లాభం ఇయ్యవలసిందే, లేకపోతే నావల్ల కాదు.

సు: సరే, సరుకు తీసుకో. నాకు మొగమాట మెక్కువ. యెదుట గట్టిగా లే దనలేను.

కొ-మ: జాపితా తయారుచేయండి. రేపు తెల్లవారేవరకు సంచి తెచ్చి వప్పజెపుతా.

సు: (కూరికపాట్లుపడుతూ, జాబితా తయారుచేసి) మూట కట్టుకో, మళ్ళీరావడ మెందుకు? ఇకమీాద చీకట్లో వచ్చి పోతూవుండు.

కొ-మ: రాత్రి నిద్దర లేదా ఏమయ్యా?

సు: రాత్రి ఒంటిగంటకు నే పడుకోవడం. మే మిట్లా కష్ట పడుతాం, కూలివాండ్లు మూడబ్బు బెల్లప్పొడిగా కావాలంటారు.

కొ-మ: మా ఆడకూతురు పనే ముట్టుకోదు. అన్నం పొయిమీాద పెట్టడమే దానికి కష్టం. రాత్రింబవళ్లూ నిద్రపోతుంది.

సు: చూశావా, మా ఆడకూతురు ఇందాకటివరకూ మేలుకొనేఉన్నది.

కొ-మ: తెల్లవార్లూ యిట్లా నిద్దర్లు కాయకపోతే మంచి యినపపెట్టె తెప్పించరాదూ? మే మొక జమీాందారీవ్యవహారంలో నాలుగు యినపపెట్టెలు లేపేశాం. ఒక టిప్పిస్తా పుచ్చుకుంటావా?

సు: రాత్రిపూట చేరిపిస్తే పుచ్చుకుంటా. అక్కడికి నాశ్రమ తీరిపోతుంది.

కొ-మ: వచ్చే ఆదివారం నీ స్వంతబండి పంపితే తోలి పెట్టిస్తా. నూటయాభై రూపాయలపెట్టె డెబ్భయిఅయిదుకు తెగ్గొట్టుకో.

సు: యాభైంటికి పైన నేను పెట్టలేను. ఆ ప్రకారం పైసలు చేయించు.

కొ-మ: మళ్ళీ వస్తాగా. మా నాయకుడు వల్లగాదంటా డేమో? గట్టిమాట రేపు పొద్దున చెప్పుతా. మాట అంటే చెల్లించుకొనేటట్టుగా ఉండాలె.

సు: ఇక యెత్తుకో. నా దగ్గర మూడురూపాయలే నిలువ ఉన్నది. లెక్క మరచిపోయేవు. ఆనికె బాగుండదు.

కొ-మ: బాగుండక—తగవు లాడవచ్చునా? యెతుబారీ మీాద పోవలెగాని వీటితో అవుతుందటయ్యా?

కొత్తమనిషి మూటెత్తుకొని నిమిషంలో అంతర్ధానం అయి నాడు. మళ్లీ కనబడలేదు. మరుక్షణంనుంచి సుబ్బిసెట్టి కెందుకో అనుమానంగా ఉన్నది. పొరపాటు జరిగినందుకు పస్తాయించాడు. తాటిచెట్టంతవాడికి తలదన్నేవా డుంటా డని అనుకున్నాడు. ఆరోజు పగలంతా అదే ఆలాపనగా ఉన్నది. కొత్తమనిషి తిరిగి రావలసిన గడువు కొన్నిగంట లున్నా రాడని నిశ్చయం చేసుకున్నాడు. పట్ట లేక భార్యతోకూడా చెప్పాడు. మధ్యాహ్నం ఆమె దిగులుపడి అన్నం తినలేదు. గుడ్లలు కండ్లలో మెదిలినవి. గోరంచుదోవతి పెనిమిటి కట్టుకుంటానంటే యెందుకు వద్దంటినా పాడుదాన్ని అని విచారపడ్డది. జరిగినమోసం యెవరికీ చెప్పుకోలేదు. దొంగలలో షరీకు అయితే వాళ్లు మోసం చేసిపోయినా రని పోలీసులకు తెలిస్తే చిక్కులు వస్తవని భయపడ్డాడు. రామదాసు తెచ్చినలాభానికి యీ నష్టం సరిపోయిందని ఉభయులూ మనస్సు కుదుర్చుకున్నారు. రామదాసును అన్యాయంచేయకుండా కొంతభాగం అతనికికూడా ఇచ్చినట్టయితే ఈ మోసం జరిగే ఉండదని చంద్రమ్మ అన్నది. ఈ నష్టంకింద రామదాసు కిస్తానన్న జొన్నలబస్తా బిగబట్టుకోవలెనని మొదట అనుకున్నాడుగాని చంద్రమ్మ రామదాసుకు అక్రమం చేస్తే బెడిసికొడుతుందని భయపడడంచేత ఆ ఉద్దేశం వదులుకొన్నాడు. సాయంత్రం పల్లెబేరం కాంగనే దుకాణం మూసి ఉభయులూ భోజనంచేశారు. చంద్రమ్మ వెంటనే పడుకున్నది. సుబ్బిసెట్టి కొంతసేపు రామదాసుచరిత్రా, మరికొంతసేపు కన్యకాపురాణం రాత్రి రెండుఝాములుదాకా చదువుకున్నాడు. ములరాచు పాలెంలో కుక్క లరుస్తున్నవి. నడివీధిలో రెండుకుక్కలు యేడవడం మొదలుపెట్టినవి. కొండమీద గుడ్లగూబలు అరుస్తున్న శబ్దం వినబడ్డది. దొడ్లో అలికిడి అయినట్టుగా ఉంటే సుబ్బిసెట్టి లాంతరు తీసుకొని దొడ్లోకి పోయినాడు. లాంతరుకు మూడువైపులా అద్దాలు పగిలిపోవడంచేత దీపం నిలవలేదు. దొడ్డితలుపుగొళ్లెం కదిలించి చూచి నాగవాసంలో పుల్ల దోపాడు. మూడువైపులా యిండ్లు ఉండడంవల్ల యిల్లు పెట్టెవలె ఉన్నది. ఉత్తరం వీధితల. నీలిమం దమ్మకంబాపతు పదివేలరూపాయలు యింట్లో నిలవ ఉండటంచేత మనిషి కేమీ తోచడంలేదు. రూపాయికంటే వడ్డీ

తక్కువ వచ్చినా ప్రస్తుతం వడ్డీ కిచ్చివేయడమే మే లనుకున్నాడు. తగినాసాము లెవ్వరా అని యోచించాడుగాని స్ఫురించలేదు. చంద్రమ్మకు సరిగా నిద్రపట్టలేదు. గుడ్డలు యెత్తుకొని పోయినట్టూ, పోలీసులు వచ్చినట్టూ ఆలాపనగా ఉన్నది. ఒంటిగం టయ్యేవరకు లేచి కూర్చున్నది. సుబ్బిసెట్టి పంచాదిలోకి పోయి పడుకున్నాడు. చంద్రమ్మ లేచి వచ్చి తూర్పింట్లో స్తంభాని కానుకొని దీపందగ్గర కూర్చున్నది. యెప్పుడైనా భయంచేత నోట మాట రాకపోతే శబ్దంచేసి పిలవడానికి ఒక ఓటి తప్పేలా, పగిలిన బొంగుకర్రా దగ్గర పెట్టుకున్నది. దీపం కాగడావలె వెలిగి చమురు పీలుస్తున్నదని కొడెంతదీపం చేసింది. కొంతసేపటికి కునికిపాట్లు వచ్చినవి. అవి పోవడానికి నిన్నటిసెనగపప్పు కాసిని నమిలి నీళ్లు తాగింది. కండ్ల మబ్బు పోలేదు. స్తంభానికి తల మోటించి పిల్లికూతలు పెడుతూ నిద్రపోయింది. యింటిసమీపంలో కుక్క ఒకమాటు మొరిగింది గాని దొంగలు దానికి బెల్లం, మాంసం లంచంపెట్టారు. ఒక దొంగ ముతరాచుపాలెంవైపున రాళ్లకుప్ప పేర్చుకొని కావలి గాస్తున్నాడు. ఇద్దరు రెండరుగులపక్కనా నక్కి రెండువైపులా కనిపెట్టిఉన్నారు. అరుగుమీద గడ్డలుపడ్డ చప్పిడి వినబడకుండా గోనెగుడ్డలు మెత్తగా పరిచి కన్నగాడు మొదటియిటికె తీశాడు. యిటికె బెందడుతో కట్టడంచేత ఒక్కటి రాంగనే తక్కినవాటిని అచ్చులవలె వొల్చి పట్టమీద పెడుతున్నాడు. కన్నానికి అడ్డం రాకుండా రెండవవాడు యిటికెలన్నీ అరుగుకిందికి దింపాడు. కన్నం పూర్తి అయింది. ఒకడు కన్నంలోగుండా కాళ్లుచాచి లోపలికి ప్రవేశించాడు. తూర్పింటి తలుపుదగ్గరకు పోయి దానిమీద రెండు చిన్నదెబ్బలు కొట్టాడు. చంద్రమ్మకు మెలుకువ రాలేదు. తూర్పింట్లోకి పోయి వీధితలుపు గొళ్లెందీసి చేరవేసిఉంచాడు. మరిద్దరు లోపలికి ప్రవేశించారు. దీపం పడకటింట్లోకి తీసుకొనిపోయి వంకెనున్న తాళపుచేతులు తీసుకొని భోషాణం తెరిచేవరకు దాంట్లో ఒక పెద్ద చందూకా ఉన్నది. చందూకానిండా నగ లున్నవి. అది ఒకడినెత్తిన పెట్టంగనే వాడు వాకిట్లో ఇంకొకడికి అందించాడు. వా డది యెత్తుకొని సంకేతస్థలానికి వెళ్లాడు. భోషాణం పక్కన నేల తట్టిచూస్తే బొతకుమన్నది. కత్తితో

నూటువేసి పైపెళ్ల లేవదీస్తే రూపాయల బిందెలమీద సిబ్బులు మూసిఉన్నవి. అవి ఒకడు వాకిట్లోకి అందించి వచ్చాడు. ఇంకొక కావటిపెట్టె భోషాణంలో ఉంటే యెత్తుకొని అంతా బయలుదేరారు. చంద్రమ్మ ఇంకా కునుకుతూనే ఉంది. వీధిలో ఒక కుక్క కవ్వించి మొరుగుతున్నట్టు సుబ్బిసెట్టికి వినబడ్డది. అతడు లేచి తూర్పింట్లోకి వచ్చి చూస్తే దీపం లేదు. దీపం మలిగిందేమే అని అడిగాడు. వీధితలుపు ఓరవాకిలిగా తీసిఉన్నది.

సు: ఏమేవ్! నీతోడబుట్టినవాళ్లు వచ్చినట్టున్నారు.

చం: నీతోడబుట్టినవాండ్లు వచ్చారేమో!

సు: దీప మేది! వీధితలుపు తీసిఉన్నది.

చం: 'పడమటింట్లో కెట్లాపోయింది? నే నిక్కడే పెట్టానే? యింకేమున్నది, కొంప పోయిం'దని అరిచిందిగాని పైకి వినబడ లేదు. ఇంకా యేమో చెప్పబోయింది. నోట మాటరాలేదు. కర్ర తీసుకొని తప్పేల వాయించబోతే చేతులు తడబడ్డవి. దెబ్బ తగలలేదు. రెండునిమిషాలు కొట్టినతరువాత నాలుగుదెబ్బలు వినబడ్డవి.

సు: నే లేచేఉన్నా. యెందుకు తప్పేల కొడతావు? (అంటూ నిప్పుపుల్లగీచాడు. పుల్లారంగా పుల్లగీస్తూ) గదిలోకి పోయి దీపం తీసుకొనిరా.

చం: వాళ్లందులో ఉన్నారేమో? నీవుకూడా రా.

సు: దాని కిద్దరు కావలెనా? ముందు తలుపుమీద కొట్టు.

చంద్రమ్మ: ఇశ్శో! ఇశ్శో! అని తలుపుమీద కొట్టింది. ఏమీ చప్పిడిలేదు.

సు: కర్రతో తలుపు నెట్టు.

చం: లోపలివాళ్లకు దారిదేగా?

సు: అటు దారిచేసుకోకుండా ఉన్నారా? ఇద్దరం లోపలికి పోదాం పద.

ఇద్దరూ మెల్లగా లోపలికి అడుగులు పెట్టారు. యెవరూ లేరు. గోడకన్నం, నేలకన్నంమాత్రం కనబడ్డవి. భోషాణం చూస్తే నగలపెట్టె లేదు. చంద్రమ్మ గుండెలు బాదుకొన్నది.

చం: యిం కేమున్నది? అంతా గుండం వేశారు.

సు: మన రాతేమైనా తీసుకొనిపోయినారా?

చం: మనకు మిగిలింది రాత ఒక్కటే. తక్కిన దంతా పోయింద్రి.

సు: పిచ్చిదానా! అదొక్కటి బాగుంటే చాలు. మూడు రోజులలో పోయిందంతా సంపాయిస్తాను. నీవు తొందరపడి అందరితో వెలితిగా మాట్లాడవద్దు. మనం ఇవ్వవలసినవాళ్లు రేపే వచ్చి కూర్చుంటారు.

ఈసందడికి ఇరుగుపొరుగువా ళ్లంతా గలభాగా పోగై నారు. కన్నం పరీక్షిస్తున్నారు. కన్నంవేయడంలో గొప్ప పని తనం చూపించాడని గంగాధరు డన్నాడు. ఇతడు లాలూచీ అయివుంటాడని కొందరు చెవులో ఊదుకొన్నారు. "వెన్నెట్లో దొంగలు పడ్డా రేమయ్యా తమాషాగా" అని ఖరింబీ అన్నది.

ఖ: నీవు నిద్రపోయేదానవు కాదుకదా! యెట్లా జరిగిందబ్బా యింతపని!

చం: కాలం ముసించుకొనివచ్చేవరకు అన్నీ వ్రానగూడుతవి.

గం: సొక్కుపొడి చల్లుతారట. అది మీద పడంగానే మత్తు వస్తుందట.

ఖ: సుబ్బయ్యా! యేమైనా పోయిందా?

సు: ప్రాప్తం దీరింది పోయింది, తీరంది ఉంది.

గం: ప్రాప్తం యేమాత్రం దీరింది?

సు: ఇంట్లో యేమీ లే దన్నా!

గం: ఇంట్లో యేమీ లేనిది దొంగలు పడినానికెనా పడక మునుపా?

సు: నీ దంతా వేళాకోళం!

మునసబు: సుబ్బిసెట్టీ! నగలేమైనా పోయినవా?

సు: యేమీ పోలేదండి. దొంగలు వచ్చారు, పోయినారు. మేము వెంటనే లేచాం. వ్యవధానం యేదీ?

ము: యేమీ పోలే దని వాఙ్మూలం ఇయ్యి.

సు: ఇంకా వాఙ్మూలం యెందుకు? చెప్పేగా వ్రాసుకోండి.

ము : నీదస్కతు కావలె.

సు : పోయిందిపోంగా ఈ బెడదంతా యెందుకండీ మాకు?

ము : ఇప్పుడేమీ పోలేదంటివే?

సు : ఇప్పుడుమటుకు పోయినవని చెప్పానా?

ము : సరే. దస్కతు పెట్టు.

సు : ఊఁ. సరేనా? పోలీసులట్టాలు నే పడలేను.

ము : కేసు కమ్మా చేతువుగాని—

అంటూ వెళ్లిపోయినాడు. ఇంతలో కోమటివెంకాయి వచ్చి,

వెం : మునసబుతో నీకు తగాదా ఎందుకురా? బెదిరిస్తూ పోతున్నాడు. వచ్చినకర్మానికి తోడు పైగా యి దెందుకు? ఏమన్నా పోయిందా?

సు : ఏమేమి ఉన్నదక్కా ఇంట్లో? రావడం చూశామా? పోవడం చూశామా? ఏమి తీసుకపోయిందీ ఎట్లా చెప్పగలం?

వెం : అంతే నన్నావూ? నే పోయివస్తా. చంద్రమ్మా! దిగులు పడబోకు.

గం : దొంగలు లోపలికి వచ్చారా సుబ్బయ్యా?

సు : మాకు లోపల ఎవరూ కనపడలేదు. బయటివాండ్లు బయటనే పోయినారు. వాళ్లకు కూలికూడా గిట్టినట్టు లేదు. పడుకోండయ్యా పోయి! ఎంతసేపని మేలుకుంటారు?

అంతా వెళ్ళిపోయినారు. కన్నానికి పాత తలుపుచెక్క లడ్డం పెట్టి తలుపు వేసి ఇంట్లోకి వెళ్ళారు.

తెల్లవారేవరకు ఊరి పిల్లలూ, పెద్దలూ సుబ్బిసెట్టి ఇంటి చుట్టూ చేరారు. సత్తెనపల్లినుండి పోలీసు సూపరెండెంటు, డిప్యూటీ కలెక్టరు వగైరా ఉద్యోగస్థులు, కొండవీటికొండకు పోవలెనని వస్తూ తెల్లవారేవరకు మంగళాపురం వచ్చారు. రాత్రి సుబ్బిసెట్టి సామ్మేమీ పోలేదని వాఙ్మూల మిచ్చినా మునస బది నమోనామీద వ్రాయ లేదు. ఉద్యోగస్థులు దడబడగా రావడంతోనే పెద్ద ఉద్యోగులు తన సొమ్ము పట్టి ఇప్పిస్తారేమో అని ఆశతో మునసబును లోగట్టుకొని పూర్వపు వాఙ్మూలం తొలగించి ఇరవై వేల రూపాయల ఆస్తి పోయి నట్లు నిజమైన వాఙ్మూలం ఇచ్చాడు. ఈ కేసు పూర్తిగా విచారించి పత్తా తీయవలసిందని ఇన్‌స్పెక్టరుకు ఖండితమైన ఉత్తరువు లిచ్చి

భోజనం అయినతర్వాత ఉద్యోగస్థు లందరూ బయలుదేరారు. వీరిలో డజన్ మంది పోలీసుజవాన్లు తక్కెళ్ళ జగ్గడి తాలూకు ఒక గుంపు తుమ్మలపాలెం సమీపంలో కొండవండలలో ఆడవాండ్లతో సహా దిగిఉన్నారని తెలిసి రెండు పార్టీలుగా బయలుదేరి గుంపును బట్టుకోవలెనని ఏర్పాట్లు జరిగినవి. డిప్టీసూపరిండెంటు డజన్ పోలీసులతో బయలుదేరి యనమదల రస్తాను తెల్లవారేవరకు వచ్చేటట్టు ఉత్తరువు లయినవి. రాత్రులు దొంగతనం చేసి తెల్లవారేవరకు దొంగ లంతా కొండలోయలలో జేరి నిద్రపోతుంటా రనే నిశ్చయంతో బయలుదేరారు. సారా దుకాణాలకు పోగూడదనీ, ఊళ్లలో బోగం వాళ్లతో సంబంధాలు పెట్టుకోగూడదనీ జగ్గడు నిబంధనలు చేయడం చేత పోలీసులకు ఆచూకీ చెప్పేవా ళ్లెవ్వరూ కనబడలేదు. సత్తెనపల్లి నుంచి వచ్చే పార్టీ కోటదగ్గరనుంచి కొండెక్కి లోయలోకి దిగవలెననీ, గుంటూరుపార్టీ లోయలోకి క్రిందినుంచి ఎక్కవలెననీ ఏర్పాటు. సూపరిండెంటు జగ్గడిని పట్టుకోవలెనని ఉత్సాహపడుతున్నాడు. దొంగలగుంపు ఎంత పెద్దదో పోలీసువారికి తెలియదు. చుట్టుపట్ల గ్రామోద్యోగులు తాముకూడా వస్తామని పోలీసువారితో చెప్పారు గాని జనం ఎక్కువ అయితే అల్లరై తమ జాడలు ముందుగా గుంపుకు తెలుస్తవనీ, ఈ వచ్చేవాళ్ళలో కొందరు గుంపుతో లాలూచీ అయిఉండవచ్చుననీ సందేహించి ఎవండ్లనూ రానియ్యలేదు. పోలీసుల జాడలు యావత్తూ కొండపీటి మునసబువల్ల గుంపుకు పూర్తిగా తెలిసినవి. సత్తెనపల్లి పార్టీ వచ్చే జాడ లన్నీ కనిపెట్టి కురవదారిపక్కన నక్కి ఉన్నారు. తుపాకులు, కత్తులతోసహా ఇటు వచ్చిన దొంగలపార్టీ యాభై మందికి మించుతారు. పోలీసుపార్టీ కురవదగ్గరకు వచ్చేవరకు ఇంకా చీకటి ఉన్నది. పోలీసులు తమమీద తుపాకులు కాల్చడానికి అవకాశం లేకుండా యాభై మందీ పేమ్కబ్జులతో గుంపుమీదను పడి పట్టుకొన్నారు. సూపరిండెంటూ, డిప్టీ కలెక్టరూ సహా ౧౮ మందిని చొక్కాలు తీసివేయించి చెట్ల మొదళ్ళకు కట్టి తుపాకులు ఊడదీసుకుని యనమదల వైపుకు బయలుదేరారు. యనమదల పోలీసుపార్టీకి నాయకుడుగా ఉన్న అయ్యాంగారు దొంగలు భయపడడంకోసం ముందుగా అదురుదెబ్బలు కాల్పించాడు. అందువల్ల పోలీసువారి మందుసామాను ఖర్చు కావడమే

కాకుండా జాడలు వెల్లడియైనవి. పోలీసులు తేపా తుపాకులు కాలు స్తుండడంచేత వారిమీద పోయి పడితే సన్నీ లుపయోగిస్తారేమో నని దూరంనుంచే అరవై తుపాకులను బారుచేసి ఒక్క-పర్యాయం పోలీసులమీద కాల్చేవరకు కొందరికి బలమైన గాయాలు తగిలినవి. సూపరిండెంటు అయ్యంగారు పోలీసులను కాల్చవద్దని ఉత్తరువు చేసి "మేము లోబడ్డాం. మనుష్యులను కాల్చవ"ద్దని కేకలు వేశాడు. గుంపు నాయకుడైన చెంచు రామానాయకుడు మీరందరూ తుపాకులు చప్పుడయ్యేటట్టుగా విసిరి దూరంగా పారవేసి బోర్ల పడుకో వలసిందని ఉత్తరువు చేశాడు. పోలీసులు ఆ ప్రకారమే జరిగించారు. రామానాయకుడు విచ్చుకత్తులు గల అయిదుగురు అంగరక్షకులతో ముందుకు వచ్చి "శరణాగతరక్షక బిరుదాంకిత రాజాధిరాజ తక్కెళ్ల జగన్నాథంగారి ఆజ్ఞానుసారంగా అభయమిస్తున్నాను. మీరు లేచి వెళ్ళిపోం" డని గంభీరంగా ఉత్తరిచ్చాడు. అంతట అయ్యంగారూ, తక్కిన పోలీసులూ లేచి బయటబడ్డారు. అంతట రామానాయకుడి సైనికు లందరూ ఎవరిపీలువెంబడి వారు యీ సాయంత్రమే వెళ్ళిపో వలసిందనీ, సంకేతస్థలం చేరవలసిందనీ, సాయంత్రంవరకూ ఎవరూ గుంపుగా ఉండగూడదనీ ఉత్తరువు చేయడంతో ఆ గుంపు యావత్తూ తుపాకులు సంకేతస్థలంలో పాతివేసి చెదిరిపోయింది.

## 3. దొంగల కోవలు

జిల్లాసూపరిండెంటునూ, సిబ్బందినీ జగ్గడిగుంపు పట్టుకొని చెట్లకు కట్టివేసి పోయిం దని కొండవీటి గ్రామస్థులకు తెలిసి కావలి వాండ్లనూ, ఊరి జనాన్నీ తోడుచేసుకొని తగినన్నివస్త్రాలతో కురవదారిన బోయి బందీలను కనిపెట్టి విడిపించి పైక గుడ్డలిచ్చి మెల్లిగా నడిపించుకొని రెండుజాము లయ్యేటప్పటికి ఊళ్లోకి తెచ్చి మజ్జన భోజనాదులు చేయించారు. డిప్యూటీసూపరిండెంటు అయ్యాంగారు, తానూ సిబ్బందీ దొంగలతో హోరాహోరీ పోట్లాడామనీ, దొంగలగుంపు అతిపెద్దది కావడంచేత మెళుకువతో తన సిబ్బందిని రక్షించుకొని సగౌరవంగా వచ్చామనీ, తగినంత సిబ్బంది వత్తాసిగా ఉంటే యావత్తుగుంపునూ పట్టుకుంటాననీ జిల్లాకలెక్టరు ఫీల్డుగారికి వ్రాశాడు, సూపరిండెంటుగారిని కట్టివేశారని కబురు రావడంతోనే

రా: ఆయనకు ఉత్తర్వు లెయ్యడానికి అధికారం ఉన్నదా?

పోలీసులు: అధికారం లేకపోతే నేమి? ఆయన ఏది చేయదలచుకున్నా కాదనేవాండ్లు ఉండరు. ఒకరికి తెలియవలసిన అవసరం లేదు.

రా: వీలైతే తమరు కలెక్టరుగారిద్వారా కొద్దిగా ఏర్పాటు చేయించండి. కాకపోతే మా రెక్కలే ఉన్నవి.

వెం: సాయశక్తులా ప్రయత్నం చేస్తాను. ఇక నే నుంటా. అప్పడిభారం మీది.

వెంకటయ్య వెనుకకు తగ్గేడు. మధ్యాహ్నం రెండుగంటలు కావచ్చింది. "రైలు తప్పిపోతుందేమో కాలు సాగనియ్యం" డని పోలీసులు అన్నారు. మాలక్ష్మి పిల్లవాడిని చంకమార్చుకుంటూ యెత్తుకొని నడుస్తున్నది. పిల్లవాడికి అగ్గిచేత బిక్కమొగం పడ్డది. జోతికి నడవడం ఉత్సాహంగా ఉన్నది. మాలక్ష్మి కొంతసేపటికి తిప్పుకొని:

మా: ఇంకా ఎంతదూరము నడవాలె?

పో: ఎన్నడూ రైలెక్కలేదా?

రా: దాని కేమిపని రైళ్లతో? ఈకాలానికి నెత్తిన చెంగు వేసుకొని బయలుదేరిందిగాని.

మా: అమ్మాయీ! వీడిని కాస్త చంకను వేసుకో. నాకు బొత్తిగా జారిపోతున్నాడు.

రా: ఆమె నడిస్తే చాలులే. ఇట్లా నా బుజాన కూర్చోపెట్టు.

రా: అయ్యా, సార్జంటుగారూ! మా కక్కడేమైన ఇల్లుంటుందా?

పో: అక్కడ అన్నివసతులూ ఉంటవి. నీవు దొంగతనాలు మాని ఒళ్లువంచి పనిచేసుకుంటే ఏలోపమూ ఉండదు.

రా: చిత్తం. అక్కడున్నవాళ్లుగూడా చోరీలు చేస్తూనే ఉంటారులే!

సా: ఉన్నమాట కేమిగాని అడపా దడపా ఇదివరకు చేస్తూనే ఉండేవారు. ఈపోలుగాడు వచ్చినతర్వాత నిక్కచ్చిగా ప్రతిరోజూ

చేయిస్తూనే ఉన్నాడు. సెటిల్మెంటులో కొందరు సంతానులు చేరేరంటారు. బెజవాడ పొట్టున లేచిపోతూ ఉన్నది.

రా: ఇదా సెటిల్మెంటంటే! కూలి దొరుకుతుం దంటిరే, పని చేసుకొనే వాళ్లకు?

సా: రోజూ యింతమందికి కూలెక్కడ దొరుకుతుంది? వరికోతలై నూర్పిళ్లుకూడా పూర్తి అయినవి. మిరపలూ, పత్తీ ఒక నెలకుపైగాగాని ఆరంభం చెయ్యరు. అటుతరువాత దొంగతనమే జీవనం.

రా: పోంగనే మాకు భోజన మెట్లా? ఒక్కరోజు బత్తెంమాత్రం మాదగ్గర ఉన్నది.

సా: రైలుకట్టవెంబడి రోడ్డు వేస్తున్నారు. మట్టిపని ఉన్న దనుకుంటాను. మీకు పనిముట్లు ఉంటే సరే, లేకపోతే సర్కారు వారు మీకిచ్చి మీకూలీలోనుంచి బిగపట్టుకుంటారు.

రా: ఆ మట్టిపని అయిపోతే పనిముట్లు మా కెందుకు?

సా: పనిముట్లు చేతిలో ఉంటేనేగా ఎప్పటికైనా పనికివస్తవి. నాలుగు రకాల పనిము ట్లుంటే పని తియ్యకుండా దొరుకుతుంది.

మా: ఆడవాండ్ల కేమిపని ఇస్తారు?

సా: మగవాళ్లు మట్టి తవ్వుతుంటే ఆడవాళ్లు మోస్తారు. మీరు తల్లీ బిడ్డా కలిసి ఆరణాలకు మోసుకోవచ్చు.

రా: నైమధం చేతపట్టుకొన్నప్పుడు ఎంత చాకచక్యం చూపావో తట్ట పట్టుకున్నప్పుడూ అంత చురుకుతనం చూపించాలె.

జో: ఓ! నే బాగా మోస్తా.

రా: (సంతోషంతో) నాబిడ్డలను ఏపనిలో బెట్టినా సురకత్తులే! రంగడికికూడా రెక్కలు వస్తే మాకు చింత ఉండదు. సార్జంటుగారూ! దగ్గరలో మాపిల్లవాడికి బడేమైనా ఉంటుందా?

సా: సెటిల్మెంటులో లేదు. చేరువలోనే తాడేపల్లిలో ఉన్నదిగాని, మాలపిల్లలను రానియ్యరేమో!

రా: అయితే జోతి చెప్పాలసిందే. రెండక్షరా లతికితే యెక్కడైనా బతుకుతెరువు చూసుకుంటాడు. అక్షరంమీద బతకవచ్చు.

మా: నీ వింత చదువుకున్నందుకు అక్షరంమీద బతుకు దెరువు కుదిరిందా?

రా: అదంతా ప్రాప్తంలే. యెల్లకాలం యిట్లాగే ఉంటుందా? దారిన మిట్టలూ లేక, పల్లాలూ లేక యేకరాసిన పోవడం యెవరికీ సాధ్యంకాదు.

మా: కాలం మారినకొద్దీ మనపని తీసికట్టుగా ఉందికాని వేసికట్టుగా లేదు.

రా: యేస్థితు లెట్లా మారినా రాశికి కలిమిలేములు కావడి కుండలే! సుఖదుఃఖాలు యెప్పుడూ పులగంపెట్టే కాని కలగలపులు లేకుండా సుఖం ఉండనేరదు. అదిగాక కష్టాలు లేని సుఖాలకు రుచి తక్కువ.

మా: ఆమాట నిజమే. మన కాపురం మూడుపూవులు, ఆరుకాయలుగా ఉన్నప్పుడు చెట్టంటిబిడ్డ చావలేదా? యెన్ని కష్టాలు వస్తే మన కేమి? సంగన్న ఉంటే చాలడా? తోచక అనుకోవడమేకాని కష్టసుఖాలను యెప్పుడూ లంకే. ఒకటి విడిచి ఒకటి ఉండలేదు.

రైలుస్టేషనుకు వచ్చారు. పౌలు యెదురుగా వచ్చి రామదాసును కౌగలించుకొని:

పౌలు: మీా రిది కష్టంగా యెంచుకోవద్దు. దేవుని సమీాపానికే వస్తున్నారు.

రామదాసు: (వెడిగెలగా నిలుచొని) దేవు డింకా ఎంత దూరములో ఉన్నాడు?

పౌ: సత్యమతాన్ని సమీాపిస్తున్నారని నా యభిప్రాయం.

రా: సత్యమతానికి నే నెప్పుడూ సమీాపంలోనే ఉన్నా. సత్య మని తోస్తే స్వీకరించడానికి యెప్పుడూ వెనుదీయను.

పో: యిదిగో, రామదాసూ! నీవు మతంలో కలిశావా అంటే అన్నిచిక్కులూ తీరుతవి. పౌలుగారు మీా కేలోపం లేకుండా చేస్తారు.

పౌ: వారియిష్టప్రకారం పోయేవాడినే; కాని వ్యతిరేకించే వాణ్ణి కాదు. జోతీ! ఆబండమీాద కుంర్చో. అయ్యా! మీా రిట్లా

కూర్చోండి. సార్జంటుగారూ, మీరు టిక్కెట్లు తెప్పించండి. గంట గొట్టి శానాసేపైంది. వీరు పారిపొయ్యేవారు కారులెండి. సందేహించ నక్కరలేదు. రామదాసుగారూ! నాకూ తలిదండ్రు లెవరూ లేరు. పాదిరీగారే పెంచి విద్యాబుద్ధులు చెప్పించారు.

రా: విద్య చెప్పించారూ?

పౌ: అవును. చెప్పించారు. యింత నవుకరీకూడా ఇప్పించారు. మర్యాదగా యింతడబ్బు దొరుకుతున్నది.

రా: డబ్బు సంపాదిస్తున్నారనే వింటూవున్నా.

పౌ: వింటున్నారుగద! యింతడబ్బు వస్తున్నదనే మాటే కాని, అనుభవించేవాళ్లు లేరు. అంతా బ్యాంకులో నిలువచేస్తున్నా. యెవరి కిది ప్రాప్తమున్నదో? మీ కుటుంబములో నన్ను వొకణ్ణిగా భావించుకొని నా కింత అన్నం వండిపెడితే నాకు పూటా చెయి కాల్చుకోవడం తప్పిపోతుంది. మీకు కష్టం లేకుండా సంసారం జరపగలను.

రా: మాతంటాలు మేము పడతాం. మీ కెందుకు లేనిపోనిశ్రమ?

పౌ: నాకు శ్రమేమున్నది? మీబోటిపెద్దలు దొంగలకోసం వేసిన గుడిసెల్లో ఉండగలరా? నా కొక పెద్దయిల్లిచ్చారు. వొక గదిలో నే నున్నా. మరొక గదిలో పనిచేసేమనిషి పడుకుంటుంది. తక్కిన దంతా ఖాళే. పరాఖత్తుగా మీ రుండవచ్చు. అదేమని అడిగేవాళ్లు లేరు. దొరగారికి మస్తరుగుమాస్తా కావలసిఉన్నాడు. ఎవరికీ యీయకుండా అట్టేపెట్టిఉంచా.

మా: జీత మే మిస్తారు?

పౌ: ప్రస్తుతం పదిరూపాయ లిస్తారు. త్వరలో పన్నెండు చేయిస్తా. దొరగారి అనుగ్రహం సంపాదిస్తే యెంతసహాయమైనా చేస్తారు.

రా: క్రైస్తవులు కానివారి కిస్తారా?

పౌ: మీరు క్రైస్తవులు కారా? మీది క్రీస్తుయొక్క జీవితం వంటిదే! పేరు మార్చుకోవడం తప్ప యేమార్పూ అవసరం లేదు. వెంటనే దొంగల జాపితాలోనుంచి తీసివేయించి ఉద్యోగస్థుణ్ణిగా యేర్పాటుచేయిస్తా.

రా : దానికి కలెక్టరుగారిఉత్తరువు కావాలంటే!

పో : అ దెంతలోది! దొరగారు నిమిషంలో చేయిస్తారు.

రా : చేర్పించడానికి అధికార మున్నప్పుడు తీసివేయించ డానికిమాత్రముండదా?

పో : అక్రమంగా యెవరినీ చేర్పించరు. యిక్కడికి వచ్చిన వాళ్లను చాలామందిని దొరగారు బాగుచేశారు. అమ్మా! మీరిద్దరూ కూర్చోండి. యెంతసేపని నిలుచుంటారు? అబ్బాయీ! నీవు కూర్చో.

మాలక్ష్మి : యెందుకులేండి.

పో : నాకథ మధ్య చాలించాను. నాకు లక్షణంగా జీవించడానికి అవకాశమున్నా 'నా' అనే దిక్కు లేకుండా ఉన్నాను. నా మేనమామ ఉంటూవుండేవాడు; ఈమధ్యనే కాలం చేశాడు. ఆయన మూడుమూర్తులూ మీరే. మిమ్ములను చూచి నప్పుడల్లా ఆయన జ్ఞాపకం వస్తాడు. మిమ్ములను మంగళాపురంలో తటాలున చూడంగనే "మామా" అనేమాట పెదవులదాకా వచ్చింది. అజ్ఞానులను "మామా" అని పిలిస్తే దొరగారు కోపపడ తారేమో అని ఆచుకొని ఊరుకున్నా. ఎప్పుడైనా మరుపు చొప్పున మాటజారి మిమ్ములను "మామా" అని పిలిస్తే కోపపడ కండేమి!

రా : పొరపాటుగా పిలిస్తే కోప మెందుకులెండి. మాకు ఒకరోజుకు మాత్రమే భత్య మున్నది. వెంటనే కూలి దొరుకు తుందా?

పో : అయ్యా, మీరు నన్ను కొత్తవాణ్ణిగా భావిస్తున్నారు. మీకు సాధ్యమైనంతవరకు త్వరలో నౌకరీ కుదిర్చేభారం నాది. అందాకా మీరు నా ఇంట్లో ఉండి మీరంతా భోజనంచేసి నా కింత పెట్టండి. నేను చుట్టంవస్తే మొఖమొఖాలు చూచుకుండేరకం కాదు. ఎవ్వరైనా రావడమే సంతోషం. చుట్టాలకోసం ముఖం వాచివున్నా. దూరపువాళ్లైనా చుట్టాలంటూ వస్తే చాలు నని పిస్తుంది. మీబోటిసధర్ములు వస్తే మాగృహం పవిత్ర మవుతుంది.

రా : మీరు బంధుప్రియులే కావచ్చును, కాని అంతల పొంతలవాళ్లు పొరుగిళ్లమీదికి వచ్చి తిష్ఠవేయడం క్రమం గాదు.

భాగ్యవంతు లిళ్లకు బీదవాళ్లం చుట్టాలమని అంగలారుస్తూ రావడం సాధారణమే. మీ సెటిలుమెంటులులోకి వచ్చేవాండ్లు చాలామంది మీకు కులచుట్టాలే అయివుంటారు. ఎవరికని మీరు సత్రాలు కడతారు? తమకు వీలైతే కాస్త తేలికైనపని రేపుఉదయం చూపిస్తే ఎల్లుండి ఆకటికి వస్తుంది. మీకు అభిమానం ఉన్నందుకు ఆమాత్రం దయచేయించండి.

పౌ: తమరు నామీద ఏదో ఆగ్రహం వహించారు. మీ మనస్సులో ఏదో కళంకు ఉండబట్టే అరవిడిచి మాట్లాడడంకూడా లేదు. క్రమంగా నాసంగతి తెలుసుకుంటారు. ఇప్పుడు పని అగ్గవగా దొరకడంలేదు. నూరు నుగ్గబెట్టయినా రేపే పని కుదురుస్తా. ప్రారంభంలో కొంచెం కష్టపుపని చేయవలసివుంటుంది. తేలిక పనులన్నీ అంతా ఆకట్టుకున్నారు. బావిత వ్వేపనీ, రోడ్డుపోసేపనీమాత్రం ఖాళీగావున్నవి. తేలికైనదేమీ దొరక్కపోతే వాటికే పోదురుగాని; మీకు తోచినంతపని చెయ్యండి; కూలి పూర్తిగానే వేయిస్తాను.

గా: అట్లా వేయించనక్కరలేదు. ఇంకొకరినోటికాడి అన్నం మా కెందుకు? చేసినంతవరకే ఇప్పించండి. కాకులనుకొట్టి గద్దలకు వేయడం న్యాయంగాదు. నష్టం ఈరోజు ఒకరివంతైతే రేపు మావంతే కావచ్చు.

పౌ: మీరు కేవలం సత్యకాలపుమనుష్యులు. మీసాంగత్యం వల్ల క్రమంగా మేమూ సన్మార్గానికి వస్తాం. తమ రాగ్రహించక మమ్ములను దగ్గరకు రాబట్టి బుద్ధినేర్పండి. ఈపూట మాయింట్లో ఇంత ఉదకం పుచ్చుకోండి. కాదంటూరా, ఎప్పటికి ప్రాప్తమో అప్పటివరకూ కనిపెట్టుకొని ఉంటాను. అదుగో! చెక్క వంగింది, లోపలికి పదండి. అత్తగారూ! రండి.

మాలక్ష్మి మొగము చిట్లించుకొని బయలుదేరింది.

పౌ: అబ్బాయి! ఇటురా అమ్మ! జనం తొక్కుతారు, నాచెయి పట్టుకో!

మా: నాచంకను ఉంటాడులెండి.

పౌ: ఏమోయ్ బావా! తరిపిదూడాలె తేపా చంకకు ఎక్కుతావు? నీయీడువాండ్లు బాగా పరిగెత్తవద్దూ?

అంతా రైలెక్కారు. రామదాసును పౌలు చెయిపట్టి ఎక్కించాడు.

సా: (రహస్యంగా) ఏమి పౌలు! ఉచ్చులు తెగపన్నుతున్నావు? పిట్ట చిక్కేనా?

పౌ: ముసలికోడి అనుమానం కట్టింది. ఎంతభోకొట్టినా దూరంగానే ఉంటున్నది.

## 10. క్రైస్తవులయింట్లో అజ్ఞానులు

అంతా తాడేపల్లిస్టేషన్లో దిగారు. సందెచీకటి కావడంచేత కన్ను పొడుచుకున్నా కనబడడంలేదు. పౌలు ఎద్దుబండిని మాట్లాడి అందరినీ ఎక్కమన్నాడు. రామదాసు వద్దని నెల పొడవంగనే బయలుదేరుదా మన్నాడు. పోలీసులు తమను సెటిల్మెంటులో దింపి తిరిగీ తాడేపల్లి భోజనానికి వచ్చేవరకు భోజనం దొరకదని బతిమిలాడుకుంటే నలుగురూ బండెక్కారు. అరగంటలో పౌలు కాపురండుండే పెంకుటింటిదగ్గరకు వచ్చారు. పోలీసులు దస్కతు తీసుకొని వెళ్లిపోయినారు.

రా: మమ్మును మాగుడిసెలదగ్గరకు తీసుకొనిపోండి.

పౌ: మిమ్ములను ఏగుడిసెలో ఉంచేదీ దొరగారు నిర్ధారణ చేయవలసి ఉంటుంది. ఆయన ఇప్పుడు రారు.

రా: ఇతరులు ఈరైలుకు వస్తే ఏమి చేస్తారు?

పౌ: సాధారణంగా అంతా పగలే వస్తారు. గుడిసె ఏర్పాటు చేస్తే బాగుచేసుకొని అందులో ఉంటారు.

రా: మమ్మును ఇప్పుడే తేవడానికి కారణ మేమి?

పౌ: అది పోలీసులపొరపాటు. నేను మా ఊరు పోయి వస్తుంటే స్టేషనుదగ్గర కనబడబట్టి మీ కీ యేర్పాట్లు చేయగలిగాను. ఖండితంగా పోలీసులు మాకు రేపు ఉదయం స్వాధీనపర్చవలసి ఉంటుంది. ఈ రాత్రంతా కాపలాచేయడం కష్టమని వాండ్లు నామీదతోసి పోయినారు. మీ యిష్టం ఉంటే మాయింట్లో తినండి. లేకుంటే వేరే వంట చేసుకోండి.

రా: ఈరాత్రి మీరు కష్టపడి వంట చేయించడంకంటే మేమే పొయిమీద పెట్టుకుంటాం.

పౌ: మాయింట్లో తయారుగానే ఉన్నది. మాబంధువులను ఈరైలుకు తీసుకొనిరావడానికి వెళ్లాను. ఈరోజు వాండ్లు రాలేదు. వాండ్లకోసం చేసివున్న వంటే మీకు ప్రాప్తముంటే భోజనం చెయ్యండి. లేకపోతే పొద్దున ఎవరికో పారవేస్తాం.

రా: మీకు బంధువులు లేరంటిరే?

పౌ: వేరుకమనుష్యులు సెటిలుమెంటులో చేర్పించి సహాయం చెయ్యమని ఒక్కమోయినను పీకిస్తుంటే వెళ్లాను. ఇంకా వారం రోజులదాకా వాండ్లు రావడానికి వీలైందిగాదు.

రా: ఈరాత్రికి మీయింట్లోనే ఒదుగుతాం.

పౌ: పస్తు పడుకుంటారా?

రా: వంట చేసుకుంటాం.

పౌ: అంతవరకైనా అనుగ్రహించారు సంతోషమే! కట్టెలూ, నీళ్లూ, ఇతరవస్తువులూ ఆగదిలో ఉన్నవి తీసుకోండి. కులస్థులు వచ్చారు గనుక హాజరుగా ఉన్నవంట భోజనం చెయ్యమన్నాను. మీచిత్తంవచ్చినట్లు కానియ్యండి.

మా: వారంత బలవంతపెడుతుంటే కాదనడం మూర్ఖపు పట్టుగా ఉంటుందేమో! ఏమంటావు?

పౌ: వారు ఎట్లా సెలవిచ్చినా సంతోషమే. మూర్ఖపుపట్టు అనేమాత్రపువాణ్ణి గాను. అనుగ్రహించి మాయింట్లో భోజనం చెయ్యండని ప్రాధేయపడవలసిన వాణ్ణేకాని వారి నాక్షేపించడానికి నా కర్హత లేదు.

రా: సరే, మీయింట్లోనే భోజనం కానియ్యండి.

పౌ: అమ్మయ్య! ఇప్పటికి మామగారిమనస్సు కుదిరింది. జానమ్మా! అన్నం వడ్డించు.

జా: (మొగం మాడ్చుకొని) అందరినీ ఒక్కమారే లెమ్మను. తలా ఒకమాటు వస్తే నే తిరగలేను.

రా: ఆమెవరు?

పౌ: ఆమె బంధువురాలే. పోషించేవారు లేక నాకన్నం వండిపెట్టుతూ ఉన్నది.

రా: ఎవరూ లేరా ఆమెకు?

పౌ: భర్త ఈర్ష్యనే కాలంచేశాడు. బంధువు లెవ్వరూ చేరనియ్యడంలేదు. ఈకాలంలో బంధువులను ఆదరించేవా రెవరు?

జా: ఊళ్లోవాళ్ల గోలంతా మీ కెందుకయ్యా? తిని మీదారిన మీరు పోక!

రా: మంచిమాట చెప్పావు. లేవండర్రా ఒక్కమాటు!

జో: నా కాకలి గాలేదు. అన్నం వద్దు.

జా: ఈమెను మళ్లీ ఒకజాము సాగదియ్యాలెగాఁవాలె. ఈమేనా రేపు కాబోయే దొరసాని?

రా: అదేమిటి ఆమె అట్లా అంటుంది?

పౌ: ఆవిడెకు పిచ్చిలెండి. ఆమాటలు మీరు పాటించవద్దు.

జా: నాకు పిచ్చి నీకు మదం. వచ్చేవాళ్లు త్వరగా రండి.

జో: నాకు ఖండితంగా వద్దు.

తక్కినముగ్గురూ మిగలా అన్నందుకు లేచారు. ముండ్లమీద కూర్చునట్టు కూర్చొని మెంగిలిపడి వారికి చూపించినగదిలో పడుకున్నారు. జానమ్మ తెల్లవార్లూ సణుగుతూనే ఉన్నది. పౌలు మెదలకుండా తన గదిలో పడుకున్నాడు.

రా: ఇంట్లో సరాగం బాగానేఉన్నది.

మా: ఉంచుకున్న మని మనుకుంటాను. ఎప్పుడూ ముసముస లాడుతూనే ఉంటుంది.

రా: పైపోటీ వచ్చిం దని ఆమె తగాదా.

మా: యిక్కడినుంచి పొద్దునే లేవడం మంచిది. ఎక్కడికి బోయినా బాధలు అంత మయ్యేటట్టు లేవు.

రా: సద్గురుడే ఉన్నాడు.

మామూలుగా రామదాసు చీకటితో లేచి రామస్మరణ చేశాడు. జానమ్మ క్రైస్తవులయింట్లో అజ్ఞానులదేవతలను కొలవ గూడదని కేకలువేసింది. రామదాసు మనస్సులో ధ్యానం చేసుకొని కాల్యాలు తీర్చుకొని పౌలుతో మాట్లాడవలెనని యింట్లోకి వచ్చాడు. ఆయన యింకా లేవలేదు. జోతి "పిల్లనీళ్లుపెట్టి మొఖం కడుక్కో" నని కూర్చున్నది. రాత్రి దాహంకూడా తాగలేదు. పిల్లవాడు అన్నమని జానమ్మయెదుట అడిగాడు. జోతి అడగగూడ

దని సౌంజ్ఞ చేసింది. జానమ్మ మిత్రిచూపులు చూస్తూ మీ రీపూట యిక్కడ ఉంటే మీకు వంటచేసేనవుకర్లు లేరన్నది. మాలక్ష్మి విని ఊరుకున్నది.

జా : బెల్లంకొట్టినరాయివలె పలకవేం! యిక్కడనుంచి కదిలేటట్టు లేదే!

మా : మే మొక్కనిమిషం ఉండమమ్మా మీయింట్లో. ఆయన లేవడంకోసం చూస్తూఉన్నాం.

జా : మీరు చూస్తుంటేనేకాని ఆయన లేవడా యేమి! రోజూ లేస్తూనే ఉన్నాడు. ఆగుడిసెలదగ్గరకు పోయి కూర్చోండి. లేవంగానే వస్తాడు.

రా : మమ్ములను ఉంచేది వాటిలోనేనా?

జా : అవే మీమేడలు సిద్ధంచేసిపెట్టారు. దొంగముండా కొడుకులు ఊళ్లో కొంపలు దోచేదీనీ, గుంపులుగా యిక్కడ చేరేదీని. యెక్కడికి పోయినా ఊళ్లోవాండ్లకొంపలకే వెసరు!

రా : మారోజులు మేము గడుపుకొని పొయ్యేవాండ్లమేకాని మావల్ల యెవరికీ యేబాధా వద్దు.

జా : మాటలు తులసివుండలు వ్రాడిపడలవి. వెంట వొక దొమ్మరిసానిని దెచ్చావు.

రా : నీతో మా కేమీ పోటీ లేదు. నీ కడ్డం రాము.

జా : నాకేమి అడ్డం! యీ సన్న్యాసి కాకపోతే యింకొకడు! దొరతో సంగతు లన్నీ చెప్పి లేచి చక్కాపోతా.

రా : మీసంగతి ఆయనకు తెలియదా?

జా : వంటచేసేవాండ్లకు యేమిసంగతు లుంటవి? దొంగా మనిషివంటివాడే.

రా : సరే. మేము వెళ్లుతున్నాం. ఆయన లేవంగనే మేము అక్కడ కూర్చున్నామని చెప్పు.

పా : (ఒక అరగంటకు లేచి) రాత్రి వచ్చినవాండ్లు లేచారా?

జా : వాండ్లకు నీయింట్లో ఉండడం కంపరమెత్తినట్టుగా ఉంది. ఆ చిచింద్రీ యీ యింట్లో ఒక్కనిమిషం ఉండ నని కూర్చున్నది. ఆయన నిద్ర లేచినతర్వాత చెప్పిపోవడం మర్యాదాగా

ఉంటుం దని బ్రతిమెలాడితే సాగదీసినకొద్దీ బిగిసి ఆ గుడిసెలదగ్గర కూర్చున్నారు.

పా : నీమాటలు నిజమేనా ?

జా : నా కేమీ హారాలు వెయ్యవద్దు. పోయి కనుక్కో !

పా : నీ ల్లిటదే. అల్లరిమనిషివిగద. నీ మర్యాదా దక్కించుకోవు, యెదటివాండ్ల మర్యాదా దక్కనియ్యవు. చేసిన దానివి అయితివి. మాటా చెడగొట్టుకొంటివి.

జా : వీండ్ల మెహమాను నా కేమీ అవసరంలేదు. వారిని గృహప్రవేశం చేయించి రా. యిక్కడికి వాండ్లు మళ్లీ అడుగు పెటితే నే వోర్చను.

పా : (గుడిసెలదగ్గరకు పోయి) యేమండీ మామగారూ! యెండలో చలిగాచుకుంటున్నారా ?

రా : ఖులాసాగా ఉంటే కూర్చున్నాం. మా కొకకుటీరం చూపిస్తారా ?

పా : మీ కిష్టంవచ్చిన కుండలు యేరుకోండి. ఉన్నవాట్లోకి యీ గుడిసే మెరుగు. యెండ కడ్డంగాని వానకు గావు. కప్పంతా వూలిపోయింది. మామరదలకు అలకడం చేతౌనా ? నేనైనా సహాయం చేస్తా.

రా : మా కేదోపని చెప్పిస్తే వెళ్లుతాం.

పా : అంతా పనికి వెళ్లిపోయినారు. యీపూటకు వేళ తప్పింది. దొరగారు వచ్చి పని నిర్ధారణచేయాలె. తొమ్మిదింటికి వస్తారు. యీలోగా మీరు నాస్తా గానియ్యండి. మధ్యాహ్నంనుండి పనులకు పోదురుగాని.

మాలక్ష్మి పోయి అమర్చి నీళ్ళు తెచ్చేవరకు జోతి పుల్ల లేరుకొని వచ్చింది. రామదాసు చుట్టుపట్ల చెత్తాచెదారం పోగుచేసి గుడిసెమీద కప్పు లేచిపోయినచోట వెంటిదోపి కొప్పుమీద రాయి పెట్టాడు. మాలక్ష్మి యిల్లు శుభ్రంచేసి అన్నం పొయిమీద బెట్టింది. దొర వచ్చేవేళైందని అన్నం కళిపెల్లాడంగనే దింపి ఆవురుకే తల్లా కాస్తా తిన్నారు.

రా : పౌలుగారూ! ఆ మేడెవరిది?

పౌ : అది దొరగారు కాపుర ముండేది.

రా : యీతోటలోవి రెండూ యెవరివి?

పౌ : ఒకటి సెటిల్మెంటు ఆసుపత్రి. రెండోది డాక్టరుగారుండేది.

రా : ఈ సెటిల్మెంటు పెట్టి ఎన్నాళ్లైంది?

పౌ : ఇప్పటికి షుమారు అయిదుసంవత్సరాలైంది. గవర్నరుగారూ, రాఘవేంద్రరావుపంతులుగారూ దీనివిషయమై చాలా కృషిచేశారు. రక్షకసైన్యంలో చేరిన బొంబాయిగవర్నరుగారు దీనికి పునాది. చాలా సెటిల్మెంట్లు రక్షకసైన్యంవారే ఆక్రమించుకొన్నారు. మా మిషన్‌వారుకూడా చాలా శ్రమపడి దీనిమేనేజిమెంటు సంపాదించారు. మా దొరగారిమాటంటే కలక్టరుగారు జవదాటరు.

రా : మీ మిషనువారు శ్రమపడడానికి ఇందులో వారికేమి లాభం?

పౌ : వారి కేమీ లాభం లేదు. ఇంకా వారే డబ్బు ఖర్చుపెడతారు. ప్రభువయిన ఏసుక్రీస్తువుయొక్క రాజ్యం స్థాపించడమే వారి యుద్దేశ్యం.

రా : ఈ గుడిసెలలో ఎన్నికుటుంబా లుండవచ్చు?

పౌ : అయిదువందల కుటుంబా లుండవచ్చు. మొదట చాలాభాగం నిండిపోయింది. కొందరు యుద్ధంలో చేరితే వాండ్ల కుటుంబాలను వదిలివేశారు. కొందరు జ్ఞానమతం పుచ్చుకొని మంచివాళ్లైతే దొరగారు శిఫారసుచేసి వదిలిపెట్టించారు. ఇప్పుడు మిగిలినవి గరిపోయిన గింజల్లు. కొరుకుడూ మింగుడూకూడా పడవు. అదుగో దొరగారు వస్తున్నారు. సలాం చెయ్యి.

రా : సలామండి!

బ్రౌన్ : సలాం! వచ్చినావా రామదాసూ? నీవు చాలా తెలివిగలవాడవు. తప్పుమార్గంలో ఉన్నావు. ఇల్లు ఏరుకున్నావా? పౌలుగారు మీకు బంధువులు గాంవాలె.

రా : కులచుట్టాలండి. మా కేమైనా పని దయచేయిస్తారా ఇవ్వాళ?

బ్రౌన్ : ఏమైనా పని ఉన్నదా?

పౌ : రెడ్డిగారికుంట తవ్వడం ప్రారంభం చెయ్యాలె. ఇంకొక చిన్న జట్టును వీండ్లకు జత చేస్తే ఒబ్బిడిగా తవ్వుకుంటారు. దొంగదాసరి పుల్లప్ప పనికి పొమ్మంటే పోలేదు. ఇంట్లోనే ఉన్నాడు. తమరు చెప్పి అతనికుటుంబాన్ని వీండ్లతో జత చేయించండి.

బ్రౌన్ : పిల్చుకొనిరా పుల్లప్పను! అతడు ఎప్పుడూ తొందర చేస్తూనే ఉంటాడు.

పుల్లప్ప (వచ్చి) : అయ్యా! ఎందుకో పిలిపించారట.

బ్రౌన్ : సలాం!

పు : మాకు సలామెందుకు లెండి, చెప్పండి.

బ్రౌన్ : వీరూ మీరూ గలిసి రెడ్డిగారికుంట తవ్వండి.

పు : నే దవ్వను. లోకంలో ఎక్కడపట్టినా కుంట తవ్వకానికి గజానికి రెండణాలవంతున సాధారణంగా ఇస్తున్నారు. పౌలు కమీషన్‌కొట్టి అణాకానీకి కుదిర్చాడు. అందులో మేము గజానికి కానీ కమీషన్ ఇయ్యాలె. ఈపనివల్ల మాకు కడుపు నిండదు. పస్తైనా ఉంటాంగాని నీళ్లకూలికి నేను పనిచెయ్యను. తనకు కమీష నియ్యనన్నా నని నన్ను కట్టపనికి పంపకుండా నిలిపివేశాడు.

పౌ : ఇవ్వన్నీ శుద్ధ అబద్ధాలు. ఇతడు రాత్రులు గుడిసె విడిచి బయటికి పోతున్నా డని నాకు అనుమానంవేసి కాపలా చేయిస్తున్నా. ఎటూ అశాడక ఈ పన్నాగం ఎత్తాడు.

పు : నీకు భాగం పంచిస్తే రాత్రులు పోవడం తప్పు లేదు. నీయిష్టం వచ్చినన్ని కావించు.

బ్రౌన్ : అయితే నీ వాపనికి పోనంటావు?

పు : నే పోను. న్యాయం మీ రెందుకు విచారించరు?

బ్రౌన్ : ఈబేరం నే దగ్గరవుండి ఏర్పాటు చేసిందే.

పు : పౌలూ, రెడ్డీ ముందుగా మాట్లాడుకొని మీ దగ్గరకు వచ్చారా లేదా?

బ్రౌన్ : పని లేకపోతే మీరు కష్టపడతా రని పౌలు రెడ్డిని బలవంతపెట్టి పని కల్పించాడు.

పు : అదంతా నటన. రెడ్డికి చేలో కుంటవసరం. తోటల్ల కోసం వేవిలి ఉంచాడు.

బ్రౌన్ : రామదాసూ! నీవు వెళ్ళు.

రా : మేము కట్టపొయ్యడానికి వెళ్ళుతాం. కాకపోయినా కుంటపని మా ఒక్కళ్ళవల్లా కాదు.

బ్రౌన్ : ఆరంభించి చేస్తుండండి. తొందరగా ముగించవలెనని నిలుకు లేదు.

రా : అడుగులోనే హంసపాదా? రావడంతోనే పైపోటీ నా కిష్టం లేదు.

పౌ : పుల్లప్ప అందరిబుద్ధులూ చెడగొట్టుతున్నాడండీ.

పు : ఆ రామదాసంత సత్యవంతులను దెచ్చి నీవు చెడగొట్టకుంటే చాలు. నీవు చేసే కేపుమారీ లన్నీ నేను చూస్తూనేఉన్నా.

బ్రౌన్ : నీ వెంత కాలంనుంచి ఇక్కడ ఉన్నా మంచిబుద్ధి పట్టుపడ లేదు.

పు : పట్టుపడుతుంది. పోయినదొర జ్ఞానస్నానం అని నీళ్లలో ముంచి కొందరిని వదిలిపెట్టించాడు. వాళ్లు బైటికి పోయి సత్తుగా దోస్తున్నారు. కావాలంటే నాకూ మంచిబుద్ధి పట్టుపడేదే. ఇంకా వెరుస్తున్నా.

బ్రౌన్ : రెడ్డిపని మిగలా ఒప్పుకున్నందుకు పెద్దమనిషిచేత మాట రాకుండా కొద్దిగా నష్టమైనా పని పూర్తిచేయడం మంచిది.

పు : రెడ్డి మహా పెద్దమనిషే. ఈ సెటిలుమెంటు దోచే దాంట్లో సగంసొమ్ము అతడు కొంటాడు. ఏదో కాస్త కుంటపని అడ్డం పెట్టుకొని పౌలుతో మాట్లాడడానికి వస్తుంటాడు. అతనికి బైట కుంటతవ్వేవాండ్లు దొరక్కకాదు. అతడింట్లో బంగారం తియ్యకుండా కరుగుతుంటారు. ఇప్పుడు వెళ్లి సోదా చెయ్యండి, మొన్న నూతక్కిలో పోయిననగలు కరుగుతుంటారో లేదో. ఇంతకుముందే పౌలుదగ్గరనుంచి తీసుకొనిపోయినాడు.

బ్రౌన్ : పోలీసులకు కబు రంపగూడదా?

పు : కబు రెందుకు? ఒకడు దగ్గిర ఉండి కరిగిస్తుంటాడు. వాండ్లుమటుకు యీపౌలును నమ్ముతారా?

బ్రౌన్ : రామదాసును మధ్యాహ్నంనుంచి కట్టపనికి పంపు. నీవు బుద్ధిమంతుడవుగా ఉంటే త్వరలో విడిచిపెట్టుమని శిఫారసు చేస్తా.

పు: త్వరగా మతంలో గలువు. అదే బుద్ధంటే. నన్ను కూడా కట్టపనికి పంపించండి.

పౌ: అక్కడివాండ్లనుకూడా చెడగొడతాడు.

బ్రౌన్: ఈరోజు వీరిద్దరినీ కలిపి పంపు. రామదాసుకు పనిముట్లు లేవుగాఁవాలె. గడ్డపారా, సెలగపారా, తట్టలూ ఇచ్చి దస్కతు పెట్టించుకో. వాటిఖరీదు రూపాయిన్నర. రోజుకు అణా వంతున కూలిలో పట్టుకొంటాం.

పుల్లప్ప, తల్లీ, భార్యా రామదాసుగుడిసెదగ్గరకు వచ్చి వాండ్లను వెంటబెట్టుకొని బయలుదేరారు. రామదాసు గడ్డపార బుజాన బెట్టుకొని పనితో సమానమైనది ఏదీ లేదంటూ బయలుదేరాడు. అతడిఉత్సాహంవల్ల జోతి సెలగపార దీసుకొని చిరునవ్వుతో బయలుదేరింది. రామదాసు కూలికి పోతుంటే మాలక్ష్మి కళ్లనీళ్ళు గుక్కుకొని తట్ట చేతబట్టుకొన్నది. రంగడు ఉత్సాహంతో రెండోతట్ట నెత్తిన బెట్టుకొని నాతో రండని అందరికంటే ముందు నడిచాడు. పనిచేసేచోటు గుడిసెలకు ఫర్లాంగుదూరంలో ఉన్నది. పౌలు వచ్చి కలుసుకున్నాడు.

## 11. చింత చచ్చినా పులుసు చావలేదు

కూలీ లంతా అన్నాలు తిని పొద్దు వాటాలంగనే తిరిగీ పనికి ప్రారంభిస్తున్నారు. పౌలు రావడంచూచి కంట్రాక్టరు కుమారుడైన సోమసుందరం కట్టదగ్గరకు వచ్చాడు.

పౌ: చిన్నకంట్రాక్టరుగారూ! ఈ రోజు ముగ్గురు కొత్త కూలీలను మీకు తెచ్చాను.

సోమ: మీకు తెచ్చానంటే నాకు అర్థంకాలేదు. నాదాకా రానిచ్చేటట్టు కనపడ దంటున్నారే.

రామదాసూ, మాలక్ష్మి తెల్లబోయినారు.

పౌ: మీ రెప్పుడూ సరసమే! మీనాయనగారు వస్తారా యీవేళ?

సో: రారు, నేను యీరాత్రి తాడేపల్లిలోనే ఉంటా, లాభించేనా?

పా : "వేగిరింప నదియు విషమ మగును" అన్నాడు. చిన్నప్పుడు చదవలా ?

సో : "ఆలస్యా దమృతం విష" మనికూడా ఇంకొకడన్నాడు.

పా : కనుక నే నడిమిదారిన పోతుండాల్లే. పుల్లప్పా! నీవు పోయి తవ్వు. వీళ్ళ ముగ్గురికీ కట్టకు దగ్గరగా ప్రతిపెట్టించు. నేకూడా సహాయం చేస్తా. కాయకష్టం చేస్తే ఆరోగ్యమట.

సో : ఎందుకైనా మంచిదే. నీవు సాయపడి వాళ్ళకు పని తగ్గిస్తే వారు చేయకుండానే నేను కూలిస్తా.

పా : ఇక్కడ ప్రతి ప్రారంభించండి. గడ్డపారిటు తేండి చెపుతా.

సో : పాతచుట్టాలా, కొత్తచుట్టాలేనా ?

రా : నే నిక్కడ సమీపంలో పెట్టుకోను. నలుగురూ తవ్వేచోటనే తవ్వుతా.

సో : పౌలూ! నీ వప్పుడే బెదరగొట్టావు. నీకు ఎక్కడాలేని ఆత్రం. ఈ ముసలాతడికి మొగకూలి పడదు. మూడణాలే బాగా పనిచేస్తే. వీ రేమాత్రం పని చేస్తారో చూడాలె.

రా : పరీక్షించి మాపనికి తగినట్టే ఈయండి.

రామదాసు పెడిగెలగా ప్రతిపెట్టి బెడ్డలు విరవడం ప్రారంభించాడు. మాలక్ష్మి తట్టలోకి సెలగపారతో ఎత్తింది. జోతి తలమీద పమిటకొంగు చుట్టచుట్టుకొని మోయడం ప్రారంభించిది. ఒక్కగజం తవ్వారు. పొద్దునతిన్న ఉడుకూ బెడుకూ అరిగిపోయింది. చేతులు చచ్చుపడ్డవి. రామదాసు తవ్వుతుంటే నూటు దిగడంలేదు. జోతి తాను గడ్డపార తీసికొని తట్ట తండ్రికిచ్చింది. గబగబ వేసింది గాని తడవకు ఒకచోట పడుతున్నవి. క్రమంగా అలవాటైంది. రెండు ఇండెలు పెట్టి అరగజం తవ్వారు. జోతికి చేతులు మంట పుట్టినవి. ఒళ్ళు అలసిపోయింది. మాలక్ష్మి గడ్డపార తీసుకొని సెలగపార జోతి కిచ్చింది. ప్రతి ఎక్కి దిగడంలో రామదాసుకు నడుం కలుక్కుమన్నది. తట్ట జోతి కిచ్చి కూర్చొని సెలగపారతో మట్టి ఎత్తడం ప్రారంభించాడు. కొంచెంసేపటికి సెలగపార వీలుగాక దోసిటితో మట్టి ఎత్తుతున్నాడు. ఆసాంతానికి ౧౺ గజాలు ప్రతి

నిలవతవ్వారు. పుల్లప్పకుటుంబం మూడు గజాలు తవ్వింది. రోజుకు మూడణాలకూలి ప్రకారం ఒంటిపూటకు రామదాసు కుటుంబానికి నాలుగుఅణాలన్నర రావలసివున్నది. వాండ్లు చేసినపని సగమే.

సో : అవసరమైనవాండ్లకు ఇప్పుడే బట్వాడా చేస్తాను. రామదాసుకు క్రమంగా రావలసింది బేడాకానైనా పావలాఅర్ధణా ఇచ్చివేస్తాను.

రా : నా కక్కర లేదు. రావలసినంతే ఇయ్యండి.

సో : చింత చచ్చినా పులుసు చావలేదు. కానీ వాలంటరీకింద పోతే బేడే రావలసింది,

రా : వాలంటరు ఇక్కడకూడా ఉన్నదా?

సో : మూడులోకాలా గుమాస్తాపేచీ ఉండకతప్పదు.

పు : వాలంటరు తగ్గిస్తే మీరు తీసుకోవద్దు. మేము తీసుకోకుండా వారం రోజులనుంచి తిరగబడి యావత్తూ వసూలు చేసుకుంటున్నాం.

రా : బీదకూటికి బిక్కదేవు డని ఇందులో తిపిరీ ఎందుకు? ఆ కానీకూడా దయచెయ్యండి.

పో : ఇచ్చివెయ్యి.

సో : ఊఁ పో. తక్కినవాండ్లు ఇటు రండి. లెక్కప్రకారం ముట్టిందా? రేపు ఆరువందలకూలీలపని లేదు. ఒక వందమందితో పని ముగించుకొంటాం.

అంతా ఇండ్లకు బయలుదేరారు. సెటిలుమెంటుకు వచ్చేవరకు యేను కూకుతున్నది. రామదాసుకు నడుముకలక బలమై చాప వేసుకొని నట్టింట పడుకున్నాడు. జోతికి చేతులు బొబ్బలుపొక్కి ఒళ్ళుపులికతగిలింది. మాలక్ష్మి వెచ్చంకొనడానికి షాపుకు పోయింది.

వర్తకుడు : ఏమి మహాలక్ష్మి! నీకూతురిని మాఅన్నకు ఇయ్యరాదూ? అంతకంటె ఎక్కువమనువు తెస్తావా?

మా : మీఅన్న ఎవరు?

వర్త : పౌలు మా చిన్నాయనకొడుకు. అతనికి బాగా సంపాదన ఉన్నది. ప్రతిదాంట్లోను రసిమి బాగాతీస్తాడు. ఈ షాపుకూడా అతనిదే. నామకా నా పేరుతో ఉన్నదిగాని, నా దెంత ఒక పీసపాలు!

మా : ఎవరికి వ్రాసిపెట్టివుంటే వాండ్లకు అవుతుంది. ఇప్పటి మాస్థితి పెళ్ళిసంబరం అనుభవించేటట్టుగా లేదు. ఒక దీపపుబుడ్డీనీ, దానితో నూనె ఇయ్యండి.

వ : వత్తితోకూడా ఒక అణా. ఇంకేమి గావాలె?

మా : ఈ అణాకు ఉప్పూ, మిరపకాయా, చింతపండూ, కట్టెలూ ఇయ్యి.

వ : అన్నీ టోకుబేరాలు మొదలు పెట్టావు.

మా : నేనూ అన్ని బేరాలూ చేసినదానినే! ఇప్పటికి ఇట్లా అయింది.

మాలక్ష్మి ఇంటికి వచ్చి కృష్ణకు పోయి రెండుకడవలు నీళ్ళు తెచ్చి మిగిలివున్న బియ్యాం పొయిమీదబెట్టి రామదాసుకు నడుములు పిసుకుతూ కూర్చున్నది.

రా : అప్పుడు ఇంటిదగ్గర ఎంత అలవటిస్తున్నాడో!

మా : ఇప్పటికి పది పన్నెండేండ్లనుంచి అన్నం పెట్టా. ఈ కాలానికి ఎడమైనాడు. అన్న మమురుతున్నదో లేనేలేదో.

రా : ఆపెట్టినవాండ్లు వాణ్ణికూడా కలిపైనా పెట్టకపోయిరి. ఏకలో తాగుతూ అంతా ఒకచోటనే పడిఉందుము. అమ్మా! నిద్ర పోతున్నావా?

మా : ఒళ్ళు అలిసి పడుకున్నది. జోతీ! కాస్త పుల్లలు ఎగసన దోయ్యమ్మా!

జో : నే లేవలేనే. ఒళ్ళంతా విరగ్గొట్టినట్టు నొప్పులుగా ఉన్నది. ఒళ్ళు వెచ్చగా ఉన్నదేమో చూడు.

రా : బడలిక చేత ; ఒక కుండెడు నీళ్లు కాచు. మసిలేనీళ్ళ స్నానం చేస్తే తగ్గుతుంది.

మా : పుల్ల లేవి? ఒక కానీవి తెస్తే అన్నం ఉడికేందుకే అస్తూబిస్తూగా ఉన్నవి.

రా : అమ్మా! జోతీ! నే లేచి రాలేనుగాని నా పక్కలో వచ్చి పడుకో. తమ్ముడేమిచేస్తున్నాడు?

జో : తమ్ముడు నిద్రపోతున్నాడు.

రా : అయ్యో! అన్నం దినకుండా నిద్రపోతున్నాడా? పక్కేమన్నా వేశావా?

జో: అమ్మ కాళ్లు చేడుకోక సగం పక్క వేసి సగం కప్పా. తల నాదుగా ఉన్నదని పడుకున్నాడు.

మా: ఈ నీళ్లు పళ్ళే వాడికి. రొంప పట్టింది. మధ్యాహ్నం నుంచి కుస్కూ కుస్కూ మంటున్నాడు.

రా: ఇట్లా నా పొట్ట కానుకొని కూర్చో—(తలమీద చెయి పెట్టి నిమురుతూ) మా పిచ్చితల్లి కెన్ని కష్టాలు వచ్చినవమ్మా!

జో: (తండ్రిముఖంలో ముఖం పెట్టి యేడ్చి)—అయ్యా! నా కష్టా లొక లెక్కా? వేళపట్టున ఇంత అన్నం తిని కృష్ణా రామా అనుకుంటూ పడుకోవలసిన రోజుల్లో నీ కీ స్థితి తటస్థించింది. ఎందుకు మే మింతమందిమి పుట్టి? అంతా పండితులమే, పెద్దతనంలో అక్కరకు రానివాళ్లం.

రా: అమ్మా! నా గర్భవాసాన పుట్టబట్టి మీ కిన్నితిప్పలు వచ్చినవి. మీ రెంత ప్రయోజకులైనా, నాది ఆఖరురోజులలో నిర్ధనజాతకం.

మా: అందరికీ ఒక్క వ్రాత ఉండబట్టే అందరు దరిద్రులమూ ఒక్కచోట చేరాం. ఇంతమందిలో ఒక్కరిది మంచిగీత కాకూడదూ!

రా: ఈ భాగ్యాలకూ దరిద్రాలకూ ఏమిగాని ధర్మం మనం తప్పకుండా ఉండవలె. "స్వధర్మే నిధనం శ్రేయః" అని భగవంతుడు చెప్పాడు. మానం పోతే ప్రాణం ఎందుకు?

జో: నీ గర్భవాసాన జన్మించినవాండ్లకు ధర్మచ్యుతి ఎప్పుడూ ఉండదు. ఆ సందేహం నీవు పెట్టుకోవద్దు.

అమ్మా! నేను నడుము పిసుకుతా. నీవు పొయిదగ్గరకు పో.

రా: అన్నంలో కేమైనా ఉన్నదా?

మా: వీధిలో రో లున్నది. చింతపండు కారం నూరుకొని వస్తా.

రా: నీళ్ళు జలుబుచేస్తవంటున్నావుగా కారములో వెల్లిపాయ వేసి నూరు. ఉన్నదా?

మా: ఆ. గంజి వంచాగాని ఒక్కరవ్వ దాళి మంట తగ్గించు. యిగటారేలోగా నే వస్తా.

జో : అయ్యో ! ఒక్క కారంతో నీ వన్నం ఎట్లా తింటావే ?

రా : పిచ్చిదానా ! ఆ కారంకూడా లేనివాండ్లు ఈ సెటిల్మెంటులో ఎంత రున్నారో విచారించు. గంజిలోకి ఉప్పంటె ఘనం అనుకునేవాండ్లు అనేకమంది ఉన్నారు. మనం ఈ సెటిల్మెంటులో ఉండే చాలామందికంటె యిప్పటికి మంచిస్థితిలోనే ఉన్నాం. మనకు నిన్న టిబియ్యం ఉండబట్టి సరిపోయింది కాని అన్నిటికి ఆ బేడే అయితే గంజి తాగమా ?

మా : (కారం నూరుకొని వచ్చి) రేపు పని లే దని జనం అంతా లబ్బట్లాడుతున్నారు. మన కేమైనా పని దొరికేనా ?

జో : దొరికితే నీవు చేస్తావా ? అయ్య అడ్డం పడ్డాడుగదా !

రా : తెల్లవారేవరకు అన్ని నొప్పులూ సర్దుకుంటవి. నీ చేతులు చూతాం దీపం తీసుకొనిరా ?

జో : ఇప్పుడు నా చేతు లెందుకులే.

రా : ఎందుకులే అంటున్నావు, పెద్దబొబ్బలు పోయినవా ఏమి ?

మా : (దీపం దెచ్చి) వోసి నీకడుపుడకా ! ఎంతబొబ్బలు పోయినవే ! రేపు నీవు చేతులు కదల్చగలవా ?

జో : ఇంతమాత్రానికేనా ? అంతగా అయితే తట్టలు మోస్తా.

రా : అంతా అన్నానికి ఒక్కమాటే లేవండి. బాబును లేపు. చన్నీళ్ళుపెట్టి కండ్లు తుడువు. కారపుముద్దలు నాలుగు తింటే జలుబు హరిస్తుంది.

మాలక్ష్మి అందరికీ అన్నం వడ్డించింది. పొద్దుననంగా అన్నం దినడంచేత అందరికీ ఆకలి కరకరలాడుతున్నది. వడ్డించే దే ఆలస్యంగా అందరూ భోజనం చేశారు. జోతి రోజతున్నది.

రా : పొడుగూనా కారంఅన్నం తింటే కడుపులో మంట పుడుతుంది. చివరకు కాస్తన్నం ఉంచుకొని నీళ్లలో పిసికి తాగండి. దానితో చల్లపడుతుంది. కొంచెం ఉప్పు వేసుకోవాలె. ఉన్నదా ?

మా : తెచ్చింది కాస్తా పచ్చట్లోనే వేశా.

రా : ఉప్పు లేకపోతే తియ్యంగా ఉంటుంది, తాగండి.

అంతా సర్కారువారిచ్చిన చాపలు వేసుకొని పడుకొన్నారు. మాలక్ష్మి మాట్లాడుతూనే నిద్రపోయింది. అందరూ నిద్రానందంలో మునిగి తేలుతున్నారు.

## 12. సెటిల్‌మెంట్లు క్రీస్తుదేవాలయాలు

జోతి బడలికచేత పక్కవాల్చంగనే కనుమొరిగినా కొంత విశ్రాంతి కల్గిన తరువాత మెళుకువ వచ్చింది. పగటిసంగతు లన్నీ జ్ఞాపకానికి వచ్చి మనస్సు చింతాసముద్రంలో మునిగిపోయింది. కంట్రాక్టరూ పౌలూ జరిగించినసంభాషణ మనస్సుకు దుర్భరమై తోచింది. ముందింకా యేమిదుర్మార్గాలకు తలపడతారో నని భయం కలిగింది. తా నేదైనా సాహసకార్యం చేసుకుంటే వృద్ధాప్యములో ముసలివాండ్లు నిరాధారు లవుతారేమోనని సంకోచించింది. తనకష్టపుజన్మ వీండ్లదుష్టతలంపులకు అవకాశ మిచ్చింది గదా అని ఖేదపడ్డది. ముసలివాండ్లు ప్రస్తుతం పడేకష్టాలకు తానే కారకురా లని తపించింది. యింకా నావల్ల వీండ్లకు యెన్నికష్టాలు రాబోతున్నవో, తా నొక్కనిమిషం కన్నుమూసుకుంటే ముసలివాండ్లబాధలన్నీ విరగడై సుఖపడతారని నిశ్చయపరుచుకున్నది. "నేను అపకీర్తి తెస్తానేమో అని అయ్యకు అనుమానంకూడా తోచింది. యెందు కీజన్మ? యిక సందేహానికే అవకాశం లేదు. వీండ్లకష్టాలు అంత మొందింతా" మని దృఢం చేసుకొని లేచి కూర్చున్నది. రామదాసు త్రుళ్లిపడి లేచాడు. జోతినేత్రాలు జ్యోతులవలె వెలుగుతున్నవి. ముఖం తీండ్రిస్తున్నది. సర్వాంగాలూ బిగుసుకొనిపోయినవి. పమిట కంఠానికి చుట్టుకొంటున్నది.

రా: అమ్మా యేమే! అఘాయిత్యానికి తలపడ్డావు?

అని నడుమునొప్పికూడా మరిచి లేచిపోయి పట్టుకున్నాడు. యింతలోకే మాలక్ష్మి లేచి గడగడలాడుతూ దగ్గరకు వచ్చింది.

మా: యేమైనా పీడకల వచ్చిందేమో!

రా: లేదు, యథార్థం.

జో: లోకానికి బాధకరమైన యీజీవితాన్ని అంతం చేస్తా.

రా: వృద్ధాప్యంలో యీపత్నుల కాధారమై కడతేరుస్తా వనుకుంటిమిగదే అమ్మా! అక్కరకువచ్చిన యిద్దరుపిల్లలూ చెరొక దారీ అయిపోయిరి.

యీమాటలు జోతిహృదయాగ్నికి వారుణాస్త్రమై తాకినవి.

జో: యీకష్టా లన్నీ మీకు నావల్లనే వచ్చినవి. యింకా ముందు చాలావస్తవి.

రా: పిచ్చితల్లీ! కష్టాలు యెవళ్లకర్మచేత వాండ్లకు వస్త వమ్మా! యీ మార్గాన మమ్ములను పత్నులను చేయడంతప్ప మా కష్టాలు పోగొట్టగలవా? యీ సాహసానికి నీ కంత కారణ మేమి వచ్చినది?

జో: అందరికీ గౌరవభంగమే.

రా: నేను కుటుంబకర్తను. నీగౌరవాన్ని కాపాడవలసిన భారం నామీద ఉన్నది. నాగొంతులో ఊపిరున్నంతవరకు నీ కగౌరవం కలుగదు. నేను నీగౌరవం కాపాడలేని వ్యర్థుడనైతే నీవు ఆత్మహత్య చేసుకోవచ్చు. నీ కగౌరవం గలగడానికి ముందు నాశిరసు నేల బడవలె. ఆ వరస నీవు తప్పించగూడదు. తప్పిస్తే నా కపకీర్తి. నేను అప్రయోజకుడనని నీవు తలచి ముందుగా సాహసం చేస్తే నీమర్యాద కాపాడలేని నా జీవితం వ్యర్థమని నీవెంటనే వచ్చితీరుతా.

మా: నీవు పోతే మే మెందుకే అమ్మా!

జో: అయ్యో! నన్ను వదిలిపెట్టవే!

రా: నేను నీగౌరవం కాపాడదగినస్థితిలో ఉండగా నాఘటం నేల బడందీ సాహసకార్యం చేసుకోనని నీవు వాగ్దత్త మియ్యి.

జో: యిచ్చా.

రా: యీ జరుగుచున్నచర్యలవల్ల నాకు తలగొట్టినట్టుగా లే దనుకున్నావా? రేపు మనఊరినుంచి యెవరైనా రానేవస్తారు. నాయుడుగారిసలహా తీసుకొని తర్వాతపని జరిగింతాం.

జో: అబ్బా! మిమ్ములనెంత ఆయాసపెట్టానరా. పడు కోండి, నేనూ పడుకొంటా.

మా: మా కాయాస మేముంది? యిప్పటి కదృష్ట వంతులమే.

అందరూ పడుకున్నారు. జ్యోతి అప్పాదాసు విగ్రహాన్ని మననం చేసి ఆనందమయకోశములో నిలిపి సుషుప్తి చెందింది. తెల్లవారే వరకూ లేవలేదు. తెల్లవార్లూ ఎవళ్ళో గుడిసెవాకిటిదగ్గరకు వచ్చి తొంగిచూచి పోతున్నారు. రెండుసార్లు పిలిచారుగూడాను. తేపా లేపడంచేత నిద్ర చెడి మళ్లి నిద్రపట్టలేదు. మాలక్ష్మి మసులుతూనే పడుకున్నది. తెల్లవారుజాముకు కాస్త కూరుకుపట్టింది. మళ్ళీ ఒకడు వచ్చి పిలిచాడు. నిద్రమబ్బున రామదాసు పలకలేదు. చేలాంతరు వెలుతురు గదిలోకి ప్రసరించింది. "ఎవ రింట్లో?" అని కేక వినబడ్డది. రామదాసు లేచి కండ్లు నలుచుకుంటూ బైటికి వచ్చాడు.

రా: ఎవరయ్యా తమరు?

ఒకడు: వారు ఇనస్పెక్టరుగారు. నేను ఫారాజవానును.

రా: తెల్లవార్లూ "ఆలీజ్ హే" ల్లని కేకవేస్తూ ఉండేవారు తమరేనా?

జ: ఫారా మారుతుంటుంది.

ఇ: ముసలివాడా! ఇంగ్లీషు చదువుకున్నావా?

రా: అయ్యా! లేదండీ.

ఇ: ఆలీజు హే ల్లంటే ఏమిటి?

రా: నాకు తెలియదండీ.

ఇ: అంతా నరక మని అర్థం.

రా: సెటిల్మెంటువరకేనండీ నరకం.

ఇ: "ఆలీజు వెల్లం"టాము. అంతా క్షేమ మని దాని కర్థం.

రా: ఆత్మార్థానికి సరిపోయిందండీ. స్వర్గ నరకాలు రెండూ తుచ్ఛములే. రెండూ అస్థిరములే గనుక ఒకదర్జావే!

ఇ: అసాధ్యుడవులా గున్నావే! పిలిస్తే పలకలేదేమి?

రా: ఇప్పుడే కునికానండి. నిద్రమబ్బున తమ పిలుపు వినబడలేదు.

ఇ: ఇప్పుడు నిద్రపట్టడ మేమి? తెల్లవార్లూ ఎక్కడికైనా పోయివచ్చావా?

రా: తమ కెరుకలేందీ ఎట్లా పోతాం? తెల్లవార్లూ కాపలా చేస్తుంటిరికదా!

ఇ: ఉన్నవాళ్ళకు కాపలాగాని, లేచిపోయినవాళ్లకు ఏమి చేస్తాం.

రా: అందరికీ తమరే అండ. అయ్యా! మా కేమైనా పని చిక్కునా?

ఇ: పౌలుగారిని ఆశ్రయిస్తే అన్నిపనులూ మీావే. లేకపోతే ఏవీగావు.

రా: అంతే నంటూరు. తమరు పెద్దసరదార్లుగదా! న్యాయ పాలనం చెయ్యలేరూ.

జ: అప్పుడే సాడీలు ప్రారంభించావూ?

ఇ: దీంట్లో చాడీ ఏముందోయ్? నే నేమీా చెయ్యలేను. మేము నో రెత్తితే దొర నొక్కుతాడు. కనుక అంతా ఒకదారిన పోతున్నాం. పౌలు నీ కల్లుడౌతా డంటున్నారే. ఇక నీ కేమి కొదవ?

రా: అటువంటి దురాశలు అతనిని పెట్టుకోవద్దని చెప్పండి. అందని పండ్లకు ఎందుకు అర్రులు చాచడం? తీపుచేటు.

ఇ: కుక్కాశ గుండ్రాతితో తీర్చావే. మహా ముదుస్తున్నాడులే రెండురోజులనుంచి. జవానూ! చెప్పవోయ్ అతడితోటి. అక్కడికి బులుపు అణుగుతుంది.

పోలీసులు వెళ్ళారు. రామదాసు బహిర్భూమికి బయలుదేరు తున్నాడు. పుల్లప్ప వాకిట్లోకి ఎదురుగా వచ్చి,

పు: అయ్యా! దణ్ణమండి.

రా: రామార్పణం. ఏమి, పొద్దున్నే వచ్చావు పుల్లయ్యా!

పు: పౌలుగాడు చేసిన మోసం చూశారా? మీాకూ మాకూ కట్టపని లేకుండా చేశాడు. కావలిస్తే కుంటపనికి పోవాలట. లేకపోతే కొలనుకొండ రాళ్ళు కొట్టబొమ్మన్నాడు. దాంట్లో లావైన మొనగాడికే పావలా కూలి గిట్టదు.

రా: కొండదగ్గర చేసే ప నేమిటి?

పు: నేల తవ్వి గోడలకు రాళ్లు దియ్యాలె. కంకరనేల గడ్డపారకు మారు మసులుతుంది. లేకపోతే ముక్కరాయి గొట్టాలె. మీాకు సుత్తె లున్నవా?

రా: ఈ రెంట్లో ఏది సులువు?

పు: కాస్త ముక్కరాతిపనే నయం.

రా: ముక్కరాతిలో కూలి యేమాత్రం గిట్టేను?

పు: మీ రేమి కొట్టగలరు? పొద్దాకా రెక్కలు విరుచుకుంటే మా ముగ్గురికీ అర్థరూపాయి గిట్టేది. మీ ముగ్గురికీ ఆరణాలు పడితే మంచి రేటే.

రా: అన్నట్టు మాకు సుత్తెలు లేవుగా.

పు: మా ముసలిది ఇవ్వాళ లేవలే. మే మిద్దరమూ రాళ్లే తీస్తాం. కావలసిఉంటే మా మూడుసుత్తెలూ తీసుకోండి.

రా: పిల్లకు చేతులు బొబ్బలుపోయినవి. సుత్తె పట్టలేదు. ఇక మేమిద్దరమే తంటాలుపడాలె. పుల్లయ్యా! పదిరూపాయల వస్తుఉన్నది మాదగ్గర. అది పోకడ పెట్టేప్రయత్నం చేస్తావా?

పు: అమ్ముకొని ఎన్నాళ్లు తింటావు? ఏదో ఒకదారి చూసుకోవాలెగాని.

రా: ప్రస్తుతం ఏమిచెయ్యను? ఇక్కడిస్థితిగతులకు పనపడితే తరువాత ఆలోచించుకుందాం. అదిగాక మావాండ్లు యీవేళ రావాలె. సామానుబండి వస్తుంది. నెలసరిన పైకంగూడా పంపే ఏర్పాటు జరుగుతున్నది.

పు: నీనగ నాదగ్గర కుదువపెట్టు. నాలుగురూపాయిలిప్పిస్తా. పైకం రాంగనే విడిపించుకోందువుగాని.

రా: ఇది మాపూర్వార్జితపుఉంగరం. శౌరీమెత్తు ఉంటుంది. దీనిమీద నీఇష్టంవచ్చినంత ఇయ్యి.

పు: మీరు బయటికి పోయివచ్చేవరకు పైకం తెస్తా పదండి.

రా: నే నీ కృష్ణలో స్నానంచేసి రావచ్చునా?

పు: త్వరగా రావాలె. బోధకు అందుకోకపోతే మాట వస్తుంది.

రా: క్రీస్తుబోధగూడా జరుగుతుందా ఏమి?

పు: రోజూ మందు పోసినట్టు పోస్తారు. నే నెగబెట్టదలచుకొన్నా, మీ రేమంటారు?

రా: నీవు పైకం తీసుకురా. మళ్లీవచ్చి మాట్లాడతా.

రామదాసు కృష్ణలో స్నానంచేసి ఇంటికి వచ్చేవరకు పుల్లప్ప పైకం దీసుకొనివచ్చి చేతిలో బెట్టాడు. రూపాయిలశబ్దం విని మాలత్మి వాకిట్లోకి వచ్చింది.

రా: ఇది రహస్యమా వెల్లడిపనేనా?

పు: ఇందులో ఏమీ రహస్యం లేదు. మన స్వంతడబ్బు పెట్టుకొని మనం భోజనం చెయ్యవచ్చు.

రా: కలక్టరుగారిఉత్తరువు కావాలె నంటున్నారే!

పు: పూర్వం ఆ రూ లుండేది. ఇప్పుడు పైకం మనం తెప్పించుకొని భోజనం చెయ్యవచ్చు.

మా: అట్లాగా! ఈపైక మెక్కడిది?

రా: ఉంగరం పెట్టి తెప్పించా. మనం పైకం రాంగనే విడిపించుకొందాం.

మా: అయ్యో! ఉంగరం ఎందుకు పెట్టావు? మీఅయ్య దాన్ని వదలవద్దని చెప్పెగదా. పుల్లయ్యా! దానికిబదులు నాతీగె ఉంచుకోలేవూ? దానికంటే ఎక్కువఖరీదే.

పు: నా కేదైతే నేమి! మీ కనుమానంగా ఉంటే అదే ఇయ్యండి.

రంగడు: అమ్మా! నాకు బువ్వే!

మా: జోతీ! వీడికి అన్నం పెట్టమ్మా! ఆనికె మనం తిందాం.

జోతి: అయ్యో! అన్నపుకుం డేదీ?

మా: ఏమైంది? నే నిక్కడనే పెట్టానే రాత్రి. కుక్క ఎత్తుకొని పోయినదేమో?

పు: కుక్కలు కాదులెండి. రాత్రి అన్నంలేక ఎవళ్లో ఎరుకలవాండ్లు ఎత్తుకొనిపోయివుంటారు. పోలీసులకు రిపోర్టు చేయండి.

రా. ఛెశ్! కడుపాత్రాన ఎవరో కక్కుర్తిపడ్డారు. వాడే చెడ్డాడులే. జోతీ! పట్టెఅన్నంకూడా లేనివాండ్లున్నారని తెలిసిందా?

మా: ఒకరాత్రివేళ కడుపు మండిందిగావాలె, వచ్చి చోరబడ్డారు.

పు: బియ్యంగాని అన్నంగాని ఏమీ నిలవవుంచవద్దు. ఏపూట కాపూట తెచ్చుకోండి. మాబోటివాండ్లయిండ్లల్లోకి

రావడానికి భయపడతారు. మీరు నిద్దర పోతున్నారుగాఁవాలె. అందినంతవరకు ఒడుపుకొని చక్కాపోయినారు. నయమే, మెల్లో చెయ్యి పెట్టలే!

రా: పదిరూపాయిలు తెచ్చుకొన్నా గుండె నిమ్మళంగా జీవించే ఆస్కారం లేదను!

పు: అదుగో గంట కొడుతున్నారు. బంగాళాదగ్గరకు బోధకు పదండి.

రా: ఎవరు బోధించేది?

పు: దొర ఇంగ్లీషులో చెపితే పోలు చేతులు తిప్పుకుంటూ తెలుగున చెపుతాడు.

జోతి: నే రాను. బియ్యం దెచ్చి అన్నం వండుతా.

పు: బోధయ్యేవరకూ పాపు తియ్యరు.

మా: అన్నం తినంది పని కెట్లా పోతాం?

రా: ఇవ్వాళిటికి వట్టిదే! బండి ఈపూట వస్తే మధ్యాహ్నం నుంచి పనికి పోదాం.

పు: మధ్యాహ్నం పోలీసులు కొండదగ్గరకు తీసుకొనిపోరు. అది దూరం.

రా: అయితే రెండుపూటలా సెలవే! బోధకు పోదాం పదండి.

జో: నే రాను. అబ్బాయీ, నేనూ ఇంటిదగ్గర ఉంటాం.

పు: నే నడిగినమాట ఏమిచేశారు? రేపటినుంచీ నే రాదలుచుకో లేదు.

రా: అక్కడసందర్భం ఈవాళ చూచివత్తాం. తక్కిన వాండ్లతోకూడా హెచ్చరించు, పోమనేవాండ్లు ఉంటారేమో!

పు: మాదొంగదాసరిగూడెం యావత్తూ నే వద్దంటే నిలిచి పోయేదే. ఎరుకలవాండ్లది వేలంవెర్రి. ఎటుదిరిగితే అటే. దొమ్మరులనూ, ఏనాదులనూ, ద్వారపూడి పచ్చపువాండ్లనూ కనుక్కుంటా. దార్వపూడివాండ్లు నిలవవచ్చు. వాండ్లకూ కంటు గానే ఉంది. కలిచేటిలోకూడా వాండ్లు దొరను గొట్టారని కొందరిని ఇక్కడికి దోశారు.

రా: అక్కడ ఆరాగా రానివాండ్ల లెక్క తేలుస్తారా?

పు: అదేమీ లేదు. కొంతజనం వస్తే చాలు. బొత్తిగా రాకపోతే పోలీసులను బంపి పిలిపిస్తారు.

రా: పోలీసుల కేమిసంబంధం?

పు: వాండ్లూ మన దొంగ లేగదూ! మనలోనుంచి ఏరి పోలీసు ఉద్యోగా లేర్పాటుచేశారు.

రా: వాండ్లకు జీతమా?

పు: జీతం లేకేమి! నెలకు పదిహేనురూపాయి లిస్తారు. వీండ్లే కొందరు ముఠాలుగట్టి దోయిస్తారు.

రా: వాండ్లంతా ఇక్కడికి మనవలె వచ్చినవాండ్లేనా?

పు: యాభై మంది పోలీసులలో నల్భై యెనిమిదిమంది అటువంటివాండ్లే. రోజు కొకరిని పనిలోనుంచి తొలిగిస్తుంటారు.

రా: ఎందుకూ?

పు: వాం డ్లూరుకుంటారా, గ్రంథసాంగులు? వాండ్లమీద కాస్త అనుమానం కలగంగనే బుట్ట కింద పెట్టిస్తారు. అదుగో రెండోగంట కొట్టారు, పదండి.

మా: నేనూ రాను. వాడు చెపితే యేమిటి వినేది?

రా: మనం పోదాము రా, పుల్లప్పా! తమాషా చూచి వత్తాం.

ఇద్దరూ వెళ్ళి జనంలో కూర్చున్నారు. జన మంతా మూడు వందలమంది ఉంటారు. బ్రౌన్సనుగారూ, భార్యా వచ్చి కుర్చీలమీద కూర్చున్నారు. పక్కన పౌలు నిలువబడి ఏసు రక్షకు డని కీర్తన పాడాడు. తరువాత బ్రౌన్సనుగారు లేచి ప్రసంగం ఇంగ్లీషులో చేస్తుంటే పౌలు తెనుగులోకి మార్చి చెప్పాడు. జనం అయిదు నిమిషాలు విని తరువాత మాట్లాడుకోవడం ప్రారంభించారు. ఉపన్యాసం అయిన తరువాత పౌలు "మీలో ఎవరైనా ఏసును స్వీకరించేవాం డ్లున్నారా?" అని అడిగాడు.

రా: లేచి, నే నేమైనా చెప్పవచ్చునా?

బ్రౌన్: ఇతరమతములనుగురించి చెప్పగూడదు.

రా: సందేహాలు అడగవచ్చునా?

బ్రౌన్: అడగండి. త్వరగా ముగించవలె.

రా: ఈసెటిల్ మెంటు గవర్నమెంటువారు పెట్టించినదిగదా; మే మంతా హిందువులం, మమ్ములను ఇక్కడికి నిర్బంధంగా తెచ్చి ఉంచి క్రైస్తవమతం మాకు బోధించడం క్రమమా? హిందువులకు హిందూమతం బోధించడం న్యాయంగాదా?

బ్రౌన్: మీ హిందువులను తమమతం బోధించకుండా ఎవరు వద్దన్నారు?

రా: నే జెప్పుతా నంటే వద్దంటిరే!

బ్రౌన్: వీండ్లంతా హిందువులా? హిందూమతం వీండ్ల కేమాత్రం దెలుసు?

రా: మీ దేశంలో కూలీలకు క్రైస్తవమతం ఏమాత్రం దెలుసు? పెద్దవాండ్లకే అంతంతమాత్రమే!

బ్రౌన్: మా కూలీలలో క్రీస్తుపేరు విననివాం డ్లరుదు.

రా: ఈ కూర్చున్న మాల, మాదిగ, ఎరుకల, ఏనాదులలో రామకృష్ణులకు సంబంధించి పేర్లు ఎన్నివందల కున్నవో కనుక్కోండి. వీండ్లలో శిఖలేనివాం డ్లెవరైనా ఉన్నారా?

బ్రౌన్: మీరు మాబోధ వినవలసిం దని సర్కారువారి బలవంతం లేదు. ఇష్టం ఉన్నవాండ్లే వినవచ్చు.

రా: అట్లయితే నా ఆక్షేపణ లేదు. రేపటినుంచీ వినదల్చు కున్నవాండ్లకు హిందూమతం నేను బోధిస్తాను. మీకుకూడా ఇష్టం ఉంటే వినవచ్చు.

భార్య: దొరగారు ప్రశ్న లడిగితే జవాబులు చెప్పగలవా?

రా: వారికి ధైర్యం ఉంటే అడగమనండీ!

పు: క్రీస్తుమతం వినడానికి ఇష్టం లేనివాండ్లు ఇక్కడికి రా నవసరం లేదట. అటువంటివాండ్లు లేచి పదండి.

జన మంతా లేచి కేకలువేస్తూ అందరూ తమ గుడిసెలకు వెళ్ళిపోయినారు.

బ్రౌన్: రామదాసును యిక్కడికి తీసుకొనిరావడం తప్పయిందే.

పౌ: ఇత డెక్కడున్నా తప్పే. పుల్లప్ప వొకడు యితనికి తోడైనాడు. గోల మొదలుపెట్టారు.

బ్రౌన్ : నిన్న తేలికయినపని యియ్యడం మన పొరపాటు.

పౌ : ఈరోజు మట్టిపనికి యితరులను పొమ్మన్నాను. రామదాసూ, పుల్లప్పా కుంటపనికో, రాళ్లుకొట్టడానికో పోవలసివుంటుంది.

బ్రౌన్ : సరే పంపు. దానితో అన్నీ అణుగుతవి. ఇతనికి డబ్బిచ్చేవాం డ్లెవరైనా ఉన్నారా? అన్నిసంగతులూ ఆలోచించి తగినమార్గం వెతుకు. పుల్లప్పకూడా మనకు అడ్డమే వస్తున్నాడు.

పౌ : అన్నిసంగతులూ యోచిస్తాను.

బ్రౌన్ : అతనికూతురువిషయం యేమైంది? జతపడితే అన్ని చిక్కులూ వదులును. ప్రయత్నం చేయరాదా?

పౌ : సులభంగా వంగేటట్టు లేదు. యేదో బెట్టసూత్రం ఆలోచిస్తేనేకాని తేలదు.

బ్రౌన్ : పో యీవేళకు. యేసంగతీ ఆలోచించు.

పౌలు గుడిసెలదగ్గరకు బోయి నవ్వుమొగంతో,

పౌ : మామగారూ! మతం అంటే మీ కెంతపట్టుదలండీ! మీ కున్నంత పట్టుదల నా కుంటే బాగుండు ననిపిస్తుంది. భోజనం అయిందా?

రా : వంట అవుతున్నది.

పౌ : పనికి వేళ కందలేరే. జనం బయలుదేరుతున్నారు. రాత్రే వంట చేయించకపోయినారా?

రా : అన్నం మిగిలితే రాత్రి వస్తున్నవాండ్ల కిచ్చివేశాం. అదిగాక రాత్రి అన్నం అక్కడికి కట్టుకొనిపోయేటందుకు బాగుండదు. రేపటినుంచీ పెందరాళే వంట చేసుకుంటాం. ప్రార్థనకు రానవసరం లేదుగనుక భోజనం త్వరగానే కావచ్చు.

పౌ : ప్రార్థనసంగతి తమతో తరువాత మనవిచేస్తా. కాని పనికి బోవడం విషయంలో యే మాలోచించారు?

రా : యీపూట అందుకోలేను. మధ్యాహ్నానికి వస్తా.

ఊ : మిమ్ములను తీసుకొనిపోవడానికి జవా నుండడు. కొలను కొండ రాతిపనికి పోవాలె. యెంతప్రయత్నం చేసినా మట్టిపని మీకు యేర్పాటుచెయ్యడానికి వీలుపడ్డది కాదు. ప్రతిదానికీ అంత పట్టుదలెందుకు? కుంటప నెత్తుకోండి.

రా: నేను నలుగురుపోయే దారిన పోవలసినవాడినిగాని కేటించి పనిచేయడం నావల్లగాదు. రాతిపనికే పోతా.

పౌ: రాతిపనికి మధ్యాహ్నంనుంచీ పోవడానికి వీలుండదు.

రా: లేకపోతే పోనియ్యండి.

పౌ: మరి మీకు భోజనం?

రా: దేవుడే ఉన్నాడు.

పౌ: దేవుడు అన్నం తెచ్చిపెడతాడా?

రా: నమ్మితే తప్పకుండా పెడతాడు. కాకపోతే "దేవుడా! ప్రతిరోజూ మాకు రొట్టె పెట్టు!" అని మీరు ప్రొద్దున యెందుకు ప్రార్థించారు?

పౌ: మామగారూ! యెప్పుడూ పెడసరంగానే మాట్లాడు తారుగదా!

రా: ఈకాసేపటిలో మామగారూ అని రెండుమా ట్లన్నారు. మూడవమాటంటే తగినశాస్తి చేస్తా!

పౌ: తెల్లబోయి—అబ్బా! మీది యెంత కఠినవాక్యమండీ! దొరగారిమీది కోపం నామీదికి దొర్లింది. మీ రంతతీక్ష్ణంగా మాట్లాడితే నేను సహించలేను.

రా: యీనాటకా లన్నీ నాకు తెలుసు. కాని మీరు నాతో మర్యాదగా మాట్లాడండి. మళ్లీ యింకొకమాటు నాచేత చెప్పించుకోవద్దు.

పౌ: రుద్రులైనారే! మీపనిసంగ తడగవచ్చునా? పనికి పోయే యేర్పాటేమి?

రా: దానికి జవాబు అదివరకే చెప్పా. వంకపెట్టుకొని నాతో మాట్లాడవద్దు.

పౌ: ఈసంజాయిషీ అంతా దొరగారికి నే జెప్పాలె. ఆయన నన్ను వేధిస్తాడు.

రా: భోజనం లేకపోతే వా రేర్పాటు చేస్తారా?

పౌ: యేదైనా పని చూపిస్తారు.

రా: రాత్రి పస్తున్నవాం డ్లందరికీ ఆయన యేమిపని చూపించాడు?

పౌ: పని చేయకపోతే మే మేమిచేస్తాం?

రా: బయట యిచ్చేకూలి యిప్పిస్తారా? పొద్దుగూకులూ పని చేసినా వొచ్చేకూలి వొంటిపూటభోజనానికే చాలదు. అర్థాన్నంతో యెంతకాలం పనిచేస్తారు?

పౌ: డబ్బు వారిచేతినుంచి పెట్టమంటారా?

రా: కడుపునిండేకూలి యిప్పించలేనివాండ్లు వీండ్లనందరినీ యెందుకు పోగుచేశారు!

పౌ: ఊళ్లో దోస్తుంటే ఇక్కడ బెట్టారు.

రా: ఇక్కడ మీరు చేయిస్తున్న దేమిటి? మీ దొరగారు వీండ్లందరికీ భోజనం ఎట్లా జరుగుతున్నదని మిమ్ముల నడిగితే చేతనైన వాండ్లు కన్నాలువేసి బతుకుతున్నా రని చెప్పండి.

పౌ: అయితే మీ కీ రోజు ప నక్కర లేదా?

రా: మధ్యాహ్నానికి అక్కర ఉంది.

పౌ: అట్లా వీలు లేదు.

రా: లేకపోతే పోనియ్యండి.

పౌ: ఈ సంగతులే దొరగారితో చెపుతా.

రా: నిరభ్యంతరంగా చెప్పవచ్చు. ఇంతకంటె ఎక్కువ చెప్పవద్దు.

పౌ: పాదిరీ మీమీద ఇదివరకే కోపంగా ఉన్నాడు.

రా: ఎందుకో, వారి తాత తండ్రులను సంహరించానా?

పౌ: ఎందుకైనాగానీ, క్రోధాలు మరీ పెంచుకోవడం అవుతుంది. పెద్దవాండ్లతో జగడం పనికిరాదు.

రా: ఇంతకంటే న న్నేమి చేస్తారు? నేనూ చిగురువరకూ చూడదలచుకొనే ఉన్నా.

పౌ: మీరు పంగనామాలు పెట్టడానికి వీలు లేదు. ఇవన్నీ నే నంటున్నా ననుకోకండి.

రా: ఎవ రన్నా ఇబ్బంది లేదు. నేను పెట్టేతీరుతా!

ఇంతలో పుల్లప్ప వచ్చి,

పు: మా జనమంతా నామాలు పెట్టుకుంటారు. నామం దొరక్కపోతే ఏ తెల్లమట్టయినా రాచుకుంటారు.

పౌ: ఇట్లా అల్లరిచేస్తే మీరే కష్టపడతారు.

పు: మమ్మును కష్టపెట్టి మీరు పూరాపడ్డప్పటికి చూస్తాను,

పా: కొడతావా?

పు: నీ వేమిచేస్తావు?

పా: న్యాయప్రకారం శిక్ష వేయిస్తాం.

పు: నీవు చేసే పనులకు నేనూ అంతే చేయిస్తా. నీకంటె నేను ఎక్కువ నేరాలు చేయడంలేదు.

రా: మనకు దౌర్జన్యం వద్దు. న్యాయప్రకారం పోదాం.

పా: సరే కానియ్యండి.

పాలు వెళ్ళిపోయినాడు.

## 13. మతసమ్మెలు

రామదాసూ, పుల్లప్పా మాట్లాడుతూ గుడిసెదగ్గరకు వచ్చి నిలవబడ్డారు. వంట చేస్తున్న మహాలక్ష్మి వాకిట్లోకి వచ్చి,

మా: పుల్లన్నా! షాపులో యేది కొనబోయినా పెట్టు ధరలుగా ఉన్నవి. ధరలు రెట్టింపు అయితే యెంతకాలం కొనగలం? ఉండవల్లి పోయి కొనుక్కోకూడదా?

పు: వల్లగాదు. ఆ షాపు ఈ పాలుగాడే పెట్టించాడు. దొరకు వాడు చెప్పినంత కద్దు. షాపువల్ల తనకు నష్టమనీ, తాను పెట్టడానికి ఇష్టం లేదనీ నటించి షాపు పెట్టమని దొరచేత బలవంత పెట్టించుకున్నాడు. బయటివాళ్లెవరైనా పల్లెబేరానికి అనేకులు రావడానికి సిద్ధంగా ఉన్నారు. వాళ్లు దొంగలతో షరీకు అవుతారని దొరను భయపెట్టాడు. బయటివాళ్ల నెవ్వరినీ ఈ చాయల రానివ్వడు. "మే మంతా ఒక్కమాటు యే ఆదివారమో పోయి కొనుక్కుంటాం, మాతో పోలీసులను పంప" మంటే, అది వల్లగాదన్నాడు.

మా: మాకు డబ్బు పంపే ఏర్పాటు జరిగితే రొక్కం తీసుకునేదానికంటే సరుకే తెమ్మంటే బాగుండును.

పు: అది మీరు ఒక్కరే పెట్టుకుంటే నెగ్గలేరు. యెరుకల గూడెపువాళ్లు ఒక్కరాత్రి దులుపుకొని చక్కాపోతారు. దానికన్నీ కట్టుబాట్లు చేసుకోవాలె.

రా: ఈ పోలీసు లంతా ఏమౌతారు?

పు: వాళ్లూ ఉంటారు ఒకమూల. దొంగలు పోయినతరువాత వచ్చి అందరినీ అదలాయిస్తారు. అమావాస్యరోజులలో పెద్ద లాట్లు వచ్చేచోట్ల బాతినీ చిక్కితే కొందరు పోలీసులుకూడా ఫారా ఇతర్లకు ఒప్పజెప్పి దొంగతనం స్వయంగా నడిపిస్తారు.

రా: దొంగలంతా వాళ్ల వెంటనే ఉంటే ఇక్కడ ఇంకా ఫారా ఎందుకు?

పు: ఆ సమయంలో బయటివాళ్లు వచ్చి తనిఖీ చేస్తే కుళ్ళు అంతా బయటబడుతుంది.

రా: దానికి అధికారులు పూనుకోవాలె.

పు: అధికారులు న్యాయం చేయదలచుకుంటే ఈ సెటిల్మెంటు ఇట్లా ఎందుకుంటుంది? దానికొక మొనగాడున్నాడు తాడేపల్లిలో. మునసబుతమ్ముడే. రామిరెడ్డని, బలేహోషుమీదున్నాడు. దొంగలు బయటికి బోయేరోజున మనవల్ల బాతినీ కనుక్కొని రెండువందల జనంతో వచ్చి కమ్ముతాడట.

రా: దొంగలు ఏరోజు పోయేదీ మనకు దాఖలా ఏముంటుంది?

పు: రాత్రి బయటికి పోయేరోజున వాండ్లు సాధారణంగా పగలు బయటికి పోరు. రహస్యాలోచనలుకూడా ఎక్కువే అవుతవి. నాలుగురోజులనుంచి రామిరెడ్డి రాత్రి రెండుజాములప్పుడు దొంగలు బయలుదేరినసంగతి కనుక్కొనిపోవడానికి మనిషిని పంపిస్తున్నాడు. నేను మాగుడిసెవెనుకఉన్న కటకటాలదగ్గరకు పోయి చెప్పివస్తా.

రా: ఇన్స్పెక్టరుయిల్లు మీయింటిదగ్గర కావాలెనే! నీవు మాట్లాడడానికి వీలవుతుందా? ఆయన మంచివాడంటారు.

పు: ఆయన ఒక అరవంధం. మంచివాడని పేరు. ఏమి మంచి? కామంచి. సమర్థతలేని మంచితనమెందుకు? మంచివాడంటే వ్యర్థుడని అర్థం. పోలుగాడిని చూస్తే ఈయనకు భయం. చోరీసొత్తులో వాడు దయవచ్చి ఇచ్చినంత తీసుకొని ఊరుకుంటాడు.

రా: అశక్తమూ, దుర్జనత్వమూ రెండూ ఉన్నవన్నమాట.

పు: రేపు సమ్మెకట్టించడం నిశ్చయమేనా? మీరందరూ కలిసివస్తే సరే. లేకపోతే నేనైనా మానివేస్తా. మీరు మనమతం బోధిస్తారా? పొద్దున అక్కడ బోధనసమయానికి ఇక్కడ పోటీ దుకాణం పెడదాం.

రా: మన మెవ్వరం బోధకు పోకపోతే నిర్బంధించడానికి వీలులేదు. మతంలో మనం కలవకపోయినా వినేవాళ్లయినా లేకపోతే ఈ సెటిల్మెంటే తీసివేస్తారు. ఇవి సగం అందుకు బెట్టినవే!

పు: బోధకు పోకపోతే పాదిరీలు సెటిల్మెంటు తీసివేస్తా రని అందరకూ బాగా బోధిస్తా. నలుగురినీ ఒకరేవుకు తేవడానికి ఏదన్నా ఉచ్చిలి పుట్టించాలె. వీళ్లంతా చెట్టుకొకరూ పుట్టకొకరూ పుట్టి వచ్చినవాండ్లు. వీళ్లందరినీ ఒక రేవుకు దేవడం సామాన్యమా!

రా: అవును బాగానే ఉన్నది. వెనుక భూము లిస్తామని మిమ్మును ఇక్కడికి తీసుకొనివచ్చారుగదా, ఎవరికైనా ఇచ్చారా?

పు: మంచివాళ్ల కిస్తారట. మంచివా ళ్లంటే యుద్ధంలోకి పోయేవాళ్లూ, మతంలో కలిసేవాండ్లూను.

రా: కొన్ని సెటిల్మెంట్లల్లో ఇతరులకుకూడా ఇచ్చారటే?

పు: దాని కెంతో గడబిడ చేస్తే ఇచ్చారు. ఇక్కడ నలుగురినీ కూడగట్టేతల కనబడలేదు. మీరు వచ్చారుగనుక మాకు ఆలనా పాలనా గలగాలె.

రా: మతబోధకుతోడు భూముల సంగతికూడా కలిపి బోధించు. మూడవది బడికూడా ఇక్కడ పెట్టించి చేతిపనులు నేర్పించమని అడుగుదాం. మనకు జీవనమైనా కలుగుతుంది. ఏమీ లేకుండా ఈపోలీసులమీదా, దొరలబంగాళాలమీదా డబ్బు వృథా చేయడ మెందుకు?

పు: ఈమూడూ ముప్పిరిన బెట్టామా అంటే పెనుసు కుంటుంది. మనిషి బీరుపోకుండా సమ్మెలో చేరుతాడు.

రా: ఇక్కడ సెటిల్మెంటే పనికిరా దందాం. చుట్టూ వ్యవసాయానికి లాయకైన బంజ రున్నచోట బెట్టాలెగాని ఈపరశు రామక్షేత్రంలో మన మెందుకు? కొన్నిసంవత్సరాలల్లో సెటిల్మెం ట్లన్నీ ఊళ్లయ్యేట ట్లుండాలె.

పు: అడవులలో మంచి కండగలభూము లున్నవి. ఈ జిల్లాలో వందల సెటిల్మెంట్లు పెట్టవచ్చు. మొదట భూము లిస్తా మని అల్లించి బెల్లించి తెచ్చి మాకు భూము లియ్యంది వెళ్లిపోతా మంటే తుపాకులుపెట్టి కాల్పించే స్థితిలోకి వచ్చారు.

రా: ఈ సెటిల్మెంటులో భూము లిస్తామంటే మనవాళ్లెట్లా నమ్మివచ్చారు?

పు: అసలు మనది పిచ్చిజనం. భూము లిస్తామంటే ఆశ పడ్డారు. పెడతామంటే ఆశ ఎవరికైనా ఉండేదే. ఆలోచనపడడానికి నలుగురం ఒకచోటినుంచి వచ్చామా? దొరికినచోటనల్లా పట్టుకున్నారు.

రా: ఈ కారణాలన్నీ వాళ్లమనసు కెక్కించు. సంగతులు పూర్తిగా తెలియంది ముందుగానే సమ్మెకడితే మనయిద్దరినీ ఇంకొక చోటికి తోసివేస్తారు. ఉద్దేశాలు వెల్లడైతే అంతా నిలుస్తారు. ఈ పోలీసులనుకూడా మనం కొందరిని చేర్చుకోవాలె.

పు: పై కారణా లన్నీ ఎక్కజెప్పితే బుట్టలు మర్నాడు పారవేస్తారు. భూములసంగతి పెడితే అంతా చేరేవాండ్లే. మూడు రోజులకు ఒకమాటు పోయే ఈ ఉద్యోగాలమీద ఎవండ్లకూ ఆశ లేదు. చూస్తుండండీ! కిరస్తానీలుగూడా మనలో చేర్తారు!

రా: ముందు పోలీసువాండ్లతో మాట్లాడవద్దు. గుంపుపెద్ద లంగీకరిస్తారా, సగంపని అయినట్టే! వాండ్లద్వారా జనాన్ని స్వాధీనం చెయ్యి.

పు: అది పద్ధతి కాదు. జనానికి నచ్చజెప్పితే పెద్దలు వద్దన్నా మానరు. తమ పెద్దరికం నిలుపుకోడానికి జనులతోపాటే వాళూ వస్తారు. పనికి పోవడానికి జనం అంతా పోగవుతున్నారు. చాలా భాగం కొండకే వస్తుంది. ఇవ్వేళ ఒకమాటు అందరికీ ఒలిగలుపుతా. మథనపడుతుంటారు. రేపు ఆదివారం అంతా ఇండ్లదగ్గరనే ఉంటారు. రెండోవుగ్గ బోధించినతరువాత, చాలామందిని రేపే కట్టులో చేర్చ వచ్చు.

రా: యావత్తూ రహస్యంగా జరగనియ్యి. అంగీకరిస్తే ఏవిధంగా పోవలసిందీ ఆలోచించుకుందాం.

పుల్లప్ప వెళ్ళాడు. రామదాసు లోపలికి వచ్చి "వంట అయిందా?" అన్నాడు.

మా: అయింది. పప్పు ఎనపడమే ఆలస్యం. ఎనగలవడంలేదు.

రా: అప్పుచేసి పప్పుకూడు, తిందా మనుకున్నావా?

మా : ఒకరోజుకే బయటపడతా వెందుకూ? రంగడు పప్పని ఏడుస్తుంటే "గోచి కంటె గొప్ప దరిద్రమా" అని ఇవ్వాళ వేశా!

రా : అమ్మాయికూడా పప్పు కావలె నన్నదా?

జో : నే ననలే దయ్యా! నామీదికి వస్తున్నావు.

రా : నీవు మంచిదానవమ్మా!

మా : ఏమిమంచో! చేతిబొబ్బలు నీరుపోసి సలుపుతున్నవట. ఒక్కపూట పనికే మూలబడ్డది.

రా : నాలుగురోజులు అలవాటైందాకానే ఇబ్బంది. తరువాత నలుగురితోపాటు మనమూనూ. చేతులు కాస్త గట్టిపడాలె.

మా : సమ్మెలు కట్టిస్తున్నావని మనను ఇంకెక్కడికైనా మారుస్తారేమో!

రా : మార్చనీ! ఇది మన పూర్వార్జితమా? అది కాక పోతుందా? నీళ్ళరుణ మున్న చోటికి పోతాం.

అంతా భోజనాలు చేశారు. ద్వాదశపుండ్రాలూ పెట్టి రామదాసు చాపమీద కూర్చున్నాడు. బ్రౌన్‌సన్‌గారి నవుకరు వచ్చి, "దొర మిమ్ములను పిలుస్తున్నాడు. ఎక్కడిదో బండి వచ్చింది."

మా : మనఊరిదే అయి ఉంటుంది.

రా : వెంకటయ్యగారు వస్తానని చెప్పినతరువాత తప్పుతారా?

రం : అయ్యా! నేకూడా వస్తా.

న : దొరగారు పిలువమన్నది నిన్నొక్కణ్ణే! ఆ పిచ్చి బొట్లన్నీ ఏమిటి? దొరగారు చూస్తే కర్ర తీసుకొని వెంటబడతారు.

రా : అయితే ఏమిచెయ్యమంటావు?

న : ఆ పట్టెలు కడిగివెయ్యి. లేకపోతే దొరగారే కడిగిస్తారు!

రా : ఆయనే కడిగిస్తే నాకిక్కడ శ్రమ ఎందుకు? ఎట్లా కడిగిస్తారో చూతాం పద.

నవుకరు రామదాసును తీసుకొని బ్రౌన్‌సన్‌గారి పంచాదిలో నిలువబెట్టాడు. ఇంతలో రామానాయుడూ, వెంకటయ్యా, జీతగాడూ అక్కడికి వచ్చారు.

వెం : రామదాసూ! నీ మన సెప్పుడైనా ఖేదపడుతుందా?

రా : స్త్రీలకు మానభంగం కలిగినప్పుడు తప్ప నా మనసు మరెప్పుడు ఖేదపడదు. (అని తీక్షణంగా చూచాడు.)

వెం: నీ కష్టా లింతటితో అంత్యం కాలేదా!

రా: అవుతవని తోచదు.

(ఇంతలో బ్రౌన్‌సన్‌గారి భార్య వచ్చి)—జార్జ్! ఈ పిచ్చి వేషం చూశావా? ఏమి టా పీడమొగం?

బ్రౌన్: నీ వదంతా తుడిచివెయ్యి.

రా: మీ నవుకరు మీరే తుడిపిస్తారని చెప్పాడే. అయినా చూతా మని వచ్చా!

బ్రౌన్: ఎందు కట్లా పూసుకొన్నావు?

రా: దానికి సవాలక్ష గ్రంథ మున్నది. మీ కంత సులభంగా బోధపడదు.

బ్రౌన్: నాకు తెలియదా? అది మీ జాతిభేదాలను తెలియపర్చే గుర్తు.

రా: కాదు, అన్నిజాతులూ పెట్టుకోవచ్చు.

బ్రౌన్: దాని పేరు కాస్టుమార్కు కాదా?

రా: కాదు. దాని పేరు బొట్టు. దానికి ఆత్మార్థం చాలా ఉంది.

బ్రౌన్: దొరసానిగారు అసహ్యాపడుతున్నారు, తుడిచివెయ్యి.

రా: మీకు అక్షేపణ లేదుగదా?

బ్రౌన్: నే నటువంటివి లెక్క చెయ్యను. దొరసానిగారు కోపపడుతున్నారు.

రా: ఆమె కెందువల్ల అయిష్టం?

భా: ఏమి టా వికారరూపం!

రా: కొత్తవన్నీ వికారంగానే కనబడతవి. మాకు పరిపాటి అయిపోయింది. మీరు మంచి వనుకునే ఆచారాలు మాకూ కొన్ని అసహ్యంగానే కనబడతవి.

భా: వీడు అధికప్రసంగిలా గున్నాడు. ఆనందం! తుడిచి వెయ్యి!

గా: ఇది నేర మవుతుంది. దొరసానిగారికీ, నీకూకూడా శిక్ష జరుగుతుంది. ఆలోచించుకొని మరీపనిచెయ్యి!

ఆనందం సందేహించేవరకు 'నీవు భయపడితే నేను తుడుస్తా' నని దొర మీదికి వచ్చాడు.

వెంకటయ్య: (కఱ్ఱ పైకెత్తి) - నిలు వక్కడ, బొట్టంటు కున్నావంటే దెబ్బ పయిన బడుతుంది. జాగ్రత్త!

బ్రౌ: (వెనుకకు తగ్గి) - నీ వెందుకు వస్తావు?

వెం: నీ వెందుకు వచ్చావు?

బ్రౌన్: దొరసానిగారు ఆబొట్టు చూసి సహించలేరు.

వెం: నీవు చేసే దుర్మార్గం చూసి నే సహించలేను.

రా: మనం వ్యవహారప్రకారం పనిచేసుకుందాం, మీఉభయులూ శాంతించండి.

వెం: వ్యవహారంతో నాకేమీ పనిలేదు. కావలసివుంటే ఆయననే జరుపుకోమను.

బ్రౌన్: ఆనందం! వీళ్లను బయటికి తరుము.

వెం: రండి, మీఇద్దరినీ చుట్టబెడతా. ఆయనను చూచేటందుకు ఉత్తరు విచ్చావు. చూచికాని వెళ్లం!

బ్రౌన్: త్వరగా చూచి వెళ్లండి.

వెం: అట్లా దారికి రండి.

రా: అయ్యా! మీరు నాకోసం ఎంత శ్రమపడుతున్నారు!

రా-నా: ఈరాక్షసమధ్యంలో లోకంకోసం మీరుపడ్డే శ్రమలో మాశ్రమ ఎన్నోవంతు? మేము పాత్రసామానూ, మంచాలూ, గుడ్డలూ తెచ్చాం. ఇంకా ఏమయినా కావలెనా?

రా: అప్పడివాళ్లు ఎట్లా ఉన్నది? మీతో రాలేదేమి?

రా-నా: నిమ్మళంగానే ఉన్నది. ప్రస్తుతం ప్రయాణం చెయ్యడం కూడదంటే అతనితో చెప్పకుండానే వచ్చాం. భోజనం మనింటిదగ్గర జేసి మందిరంలో పడుకుంటున్నాడు.

రా: మందిరం సాగుతున్నదా?

రా-నా: శేషయ్యకొడుకును పంతులుగా ఏర్పాటుచేశాం. అప్పాదాసు గ్రంథాలయము చూస్తూ పైక్లాసులకు చెపుతుంటాడు.

రా: రామన్న చురుకయినకుర్రవాడే! తండ్రి చిక్కులలో ఉన్నప్పుడు కుటుంబానికి ఆధార మయినాడు.

వెం: ఈ యిరవయిరూపాయిలూ దగ్గర ఉంచుకో. కూలికి బోవడం పెట్టుకోబోకు. ఈతడవ వచ్చినప్పుడు మళ్లీ ఇస్తాను. డబ్బువిషయమై ఏమీ చిక్కులు పడవద్దు.

రా: మీకు నమస్కారం చెయ్యడం తప్ప ఏమి ప్రత్యుప కారంచెయ్యగలను?

వెం: మాధర్మం మేము నేరవేస్తున్నాం. దానికి ప్రత్యుప కారం అవసరంలేదు.

రా: ప్రత్యుపకారంమాట ఎత్తడమే తప్పు.

బ్రౌన్: డబ్బు నాచేతి కియ్యండి. వృథాగా ఖర్చుచేస్తారు.

వెం: ఆయనదగ్గర ఉంచుకోవచ్చునులే.

బ్రౌన్: కూడ దని కాదు. వృథా ఖర్చవుతుందని.

వెం: అట్లా చేసేవాడుగాదు. ఆయనదగ్గరనే ఉండనియ్యండి.

రా-నా: నారాయణరావుగారితో మాట్లాడాను. స్వంత డబ్బు ఖర్చుపెట్టుకోడానికి ఎవరిఉత్తరువూ అవసరం లేదుట. మిమ్మును సెటిల్‌మెంటులోనుంచి తొలిగించేసంగతి కలెక్టరుగారితో మాట్లాడుతా నన్నాడు. వర్తనవిషయమై ఒప్పించవచ్చు. జామీను కేసులు ప్రారంభమైనప్పటినుంచీ చోరీలు చిత్తవత్తుగా జరుగుచుండ డంచేత వారంరోజులు ఆగి మాట్లాడడం మంచి దన్నాడు. మిమ్ము లను సులభంగానే వదిలిపెట్టవచ్చునని అంటాడు. భగవదనుగ్రహం ఎట్లా ఉన్నదో!

రా: యెట్లయినా నా కొరకే! ఈ పౌలు పిల్లవిషయంలో దురాగతం చేసేట ట్టున్నాడు.

రా-నా: అంటే?

బ్రౌన్: మీ యిష్టంవస్తే వివాహంచేసుకుంటాడు. కాదంటే మానుకుంటాడు. దాంట్లో దురాగత మే మున్నది?

రా: క్రమంగా తెలుస్తుంది.

వెం: అటువంటివి జరగడానికి గుండె లున్నవా?

బ్రౌన్: ఇస్తే వివాహం చేసుకుందా మని తప్ప వేరేవుద్దేశ మతని కుండదు.

రా: సరే తెలుస్తుంది. సెటిల్‌మెంటుయొక్క స్థితిగతులు చాలా అన్యాయంగా ఉన్నవి. మనము బయట వినే సంగతుల కంటె యెక్కువ దుర్నయాలు జరుగుతున్నవి. నింద యావత్తూ నివాసులమీద పెట్టడానికి వీలులేదు. సంగతులు యావత్తూ క్రమంగా అవే బయటబడుతవి. ఇన్నాళ్లు దుర్నయాలు

జరుగుతుండడానికి మనవాండ్ల అలసత్వమే కారణం. ఈ సెటిల్ మెంట్లవల్ల దేశానికి మహోపకారం జరగబోతుంది. స్వరాజ్యం వస్తేనేకాని మన దేశకష్టాలు తీరవని సంగడు చెపుతుండేమాట వాస్తవం. సేనలోకి మనుష్యులను చేర్చుకొనడానికీ, క్రైస్తవమతం వ్యాపింపజేయడానికీతప్ప ఈ సెటిల్ మెంట్లవల్ల యితరప్రయోజనం లేదు. స్వరాజ్యం వచ్చినతరువాత పద్ధతులన్నీ మార్చి వీటిని గ్రామాలుగా చేయవలసిఉంటుంది. ప్రస్తుత మివి ఉన్నస్థలాలు యిందుకు పనికిరావు.

బ్రౌన్ : మీ కిచ్చినకాలం ముగిసింది. ఇక వెళ్లవలసింది.

రా : ఈ సెటిల్ మెంట్లేర్పరచడంలో ప్రభుత్వము వారికి చేదోడైన రాఘవేంద్రరావుగారు తిరిగీ వీటివంక చూడడంలేదు. దేశనాయకులు తమ దృష్టిని వీటిమీదికి తిప్పడం అవసరం. ఒక మాట సత్యం.

బ్రౌన్ : ఇక మీరు వెళ్లండి.

రా-నా : ఇంకా అయిదునిమిషాలగడుఉన్నది. గడియారం చూస్తూనేఉన్నా.

వెం : చేత తీసివేసేది కాదుగాని నీదుఃఖం మేమూ కొంత భరిస్తూనేఉన్నాం. నీ వీవతుగా ఉండడం చూచి యింటికి పోవడానికి కాళ్లాడడంలేదు.

రా : ఎక్కడ ఉన్నా మీ అనుగ్రహంవల్ల ఖులా సాగానే ఉంటాం. వీరి నిర్బంధములవల్ల నాదేహానికి పారతంత్ర్యం గలిగిందిగాని ఆత్మ సర్వస్వతంత్రంగానే ఉన్నది.

వెం : నీకు భగవత్పారతంత్ర్యందప్ప యితరపారతంత్ర్యం లేదు.

రా-నా : భగవంతుడిలో అక్రమం గనబడితే ఆయనను గూడా ధిక్కరిస్తా వనుకుంటాను.

రా : అయ్యో! నా కొక గొప్పవిషయం బోధించారే. మీమాటలవల్ల వెంకటదాసు నా దృష్టిలో యిప్పుడాకాశమెత్తు పెరిగాడు.

రా-నా : రామదాసు యెదట ఉంటే జ్ఞానవర్షం కురుస్తూనే ఉంటుంది. ఇక మేం వెళ్లుతాం.

రా: చిత్తం. కాసేపు మంగళాపురం చూపించారు.

వెంకటయ్యా, నాయుడూ, జీతగాడూ వెళ్లుతున్నారు. ఒకరి నొకరు పలకరించుకోలేదు. సెటిల్‌మెంటు ఆవరణపు వాకిలి దగ్గరకు పోయేవరకు వెంకటయ్యకు భ్రమవచ్చి నుచ్చిళ్లు ప్రారంభ మయినవి. రామానాయుడు పట్టుకొని కొంచెంసేపు నిలిపి,

రా-నా: అన్నా! కాస్త కూర్చో.

వెం: తిప్పుతున్నదిలే! పద. ఈమహాయోగికి యెందుకు వచ్చిన వీకష్టాలంటాను! మనోవాక్కాయకర్మలా హింసావర్జితుడే!

రా-నా: ఆప్రశ్న కాయనే జవాబుచెప్పాలె. ప్రారబ్ధం అనుభవించక తప్పదు. కాని యెన్నికష్టాలు వచ్చినా ఆయనకు ఆత్మ తేజానికే తోడుపడుతున్నవి. వాటికింద ఆయన మణిగిపోవడంలేదు. అన్నీ వరప్రసాదా లవుతున్నవి. ఇనుము జిరకాక కాచి నీళ్లలో ముంచితేనేకాని కరుకెక్కదు.

వెం: సాధారణపుజనులు దుఃఖభారంకింద కుంగిపోతారు.

రా-నా: ఆయన ఆత్మ వంగేదీకాదు, కుంగేదీకాదు. పెచ్చు యెండినకొద్దీ విత్తనానికి బిగివి చిక్కినట్టు శరీరం కృశించినకొద్దీ తాయన ఆత్మకు బిగి వెక్కుతున్నది. జన్మ లెత్తడంయొక్క ప్రయోజన మంతేకదా!

వెం: జన్మవల్ల ప్రతివానికీ లాభ మున్నదన్నమాటేనా?

రా-నా: కొద్దోగొప్పో ఉండక తీరదు. పండి జారినకాయలకూ, రాలిన పూబిందెలకూ తారతమ్యం ఉంటుంది.

వెం: మనిషి బొత్తిగా తడపై పోయినాడు.

రా-నా: ముఖంలో తెజ మెక్కువయింది. తీగ తిరగబారంగనే గడ్డకు బలమెక్కినట్టు వొంటిలో జవంతా ఆత్మలో గడ్డగడుతుంది.

వెం: మరణంవల్ల పంచభూతాలూ పంచత్వం పొందడం గాకుండా దేహమంతా ఆవరించివుండే ఆత్మశక్తికూడా జన్మలో సంపాదించబడ్డ కర్మఫల మంతా మూటగట్టుకొని స్వస్థానం చేరుతుంది.

రా-నా: దేహంలో పంచభూతాలను పట్టివుంచిన ఆత్మశక్తి సళ్లువిడవంగనే అవి చతికిలబడి ఫ్రూరుకుంటవి. మరణంవల్ల నిజంగా జరిగేది పమ్మత్వంగాని పంచత్వంగాదు.

వెం : మరణ మంటే పండినపంట కయిలుచేసుకోవడం. పనిదీరిన, చెత్తను వేరుపరచి, పంటను అనుభవానికి తెచ్చు కోవడమే. బాగా పండితే సంచితంగూడా వృద్ధి అవుతుంది.

రా : ఆ పంటలో పాపమూ పుణ్యమూ కలిసేవుంటవి.

వెం : వడ్లల్లో సంకులు లేకుండావుంటవా?

జీతగాడు బండి గట్టాడు. అంతా తాడేపల్లిలో భోజనంచేసి ఊరికి బోయినారు.

## 14. నా సృష్టి

నాయుడు వగైరాలు వెళ్లిపోంగనే రామదాను సామాను ఇంటికి మోసుకుంటున్నాడు. భార్య ఎదురుగా వచ్చి అందుకున్నది. కొంతసేపటికి బ్రౌన్ననుగారి భార్య వచ్చి,

భా : నీవు ఇక్కడినుంచి త్వరగా వెళ్లిపో. నీ ముఖం తెల్లగా అసహ్యం వేస్తున్నది.

రా : సామాను తీసుకున్నతరువాత ఒక్క నిమిష ముండను. ఇదుగో చూడండీ! ఒళ్ళంతా తెల్లగా ఉంటే అసహ్యం లేనిది నా ముఖంమీాది కాస్త తెలు పేమిచేసింది?

భా : జార్జ్! వీడి కావరం చూడు!

బ్రౌన్ : నీవు లోపలికి రా. వాడు "నీ వెం" తని ఎదిరించే స్థితిలో ఉన్నాడు. కావలసిన పని పోలు చేస్తాడు. నీవు ఓపిక పెట్టుకో.

రామదాసు ఇంటికిబోయి చాపమీాద గూర్చున్నాడు. జోతి తండ్రి మోకాటిమీాద గడ్డం ఆనించి ఆనందంగా తండ్రి మొగం చూస్తున్నది.

మా : సంగతు లేమో వరసగా జెప్పు. అప్పడి ఒంట్లో ఎట్లా ఉంది.

రా : ఒంట్లో నిమ్మళంగానే ఉన్నదిగాని వైద్యులు ప్రయాణం చేయవద్దన్నారుట. అంటే బాగా కులాసా లేదని అర్థం. మనను ఇక్కడినుంచి విడిపించడానికి ప్రయత్నిస్తారుట.

మా : మన మెప్పటికయినా మంగళాపురం చూడడం తట స్థించేనా?

రా: మనం వచ్చి నాలుగురోజులు కాలేదే!

జో: కాలవ్యవధికంటె పోలేమనే నిరాశే ఎక్కువ బెంగ పుట్టిస్తుంది.

మా: 'ఎప్పటికైనా పోలేకపోతామా' అనే ఆశ ఉంటే రోజులు లెక్కపెట్టుకుంటూ కాలం గడపవచ్చు. ఆశ కోసులు దాటిస్తుంది.

రా: కాకపోతేమట్టుకు ఇప్పు డక్కడ మించిపోయే దేమి ఉన్నది?

మా: రోజూ మన కొండరాళ్లవంక చూడడం, అలవాటైన వీధులలో నడవడం, మనసు కలిసినవాండ్లతో మాట్లాడడం, ఆఖరుకు పగవాండ్లవైనా పాత మొగాలు చూస్తుండడంకంటే భాగ్యభోగ్యాలు ఎక్కువ ఆకర్షిస్తవా? నేను ముప్పైయేండ్లనుంచీ ఒక్క కవ్వంతో చిలికా. రోజూ మసెలమీదినుంచి కవ్వం దింపడానికి నే పట్టుకుండే చోట అరవడిపడ్డది. నా మనసులోమాత్రం కవ్వం అరవడిగట్టదా!

రా: సన్యసించి అడవులలో కూర్చున్నవాండ్లకు కూడా 'నే కూర్చుండే చెట్టూ' 'నా చుట్టుపట్ల అల్లుకున్న తీగా' అని మమకార మేర్పడుతుందట!

జో: భగవంతుడికి 'నా సృష్టి' అనే మమకార ముండదా!

రా: మమకారం మనుష్యులకు బంధమైతే ఆయనకుమాత్రం కాదా?

మా: మనతో సంబంధం లేని భగవంతుడితో మనకుమాత్రం సంబంధం యెట్లా ఉంటుంది?

జో: మనను ప్రేమించనిదే నిర్గుణబ్రహ్మమైనా మనం ప్రేమించవలసిన స్వభావమూ ధర్మమూ గూడాను.

మా: ఆయనకు మన విషయమై ఏధర్మం లేకపోతే మన కాయన విషయమై ధర్మా లేముంటవి! ధర్మా లెప్పుడూ అన్యోన్యాశ్రయాలే! ప్రేమించడం మన స్వభావ మని నీ వన్నందుకు ప్రేమించే స్వభావం ఆయనకు లేనిదే మన కెక్కడనుంచి వస్తుంది? ప్రేమ ఎప్పుడూ అన్యోన్యమే!

జో: ఎదుటివారిలో లేకపోయినా ప్రేమ ప్రేమను పుట్టిస్తుంది.

రా: రెండూ ప్రేమించే స్వభావం కలిగినవైతే.

మా : కాకపోతే ప్రేమించడానికే వీలులేదు. అయినా ఈ వాదా లన్నీ నా కెందుకు? షాపుకు బోయి సామాను కొనక్కరావాలె. పనికి పోవలసివస్తుందేమోనని సాయంత్రానికి తేలేదు. ఇంట్లో పెట్టి పోవడానికి భయంగా! వాకిలి కేమయినా అడ్డ మేర్పరిస్తే బాగుండు.

రా : తడికె కుక్కల కడ్డంగాని మనుష్యుల కడ్డమా? సత్తె యుగంలో వాకిండ్లకు తలుపు లుండేవికావట.

మా : దొంగలు రాకపోతే మనమూ తీసే ఉంచవచ్చు.

రా : వెంకటయ్యగారు ఇరవై రూపాయి లిచ్చారు. ఇవి ఎవరిదగ్గర దాచను?

మా : నా తీగె విడిపించుకుని మిగిలినవి మన ముగ్గురిదగ్గరా తలా అయిదురూపాయిలు ఉంచుకుందాం. మిగిలిన రూపాయి పెట్టి సామగ్రి తెస్తా. మనం ఒకరం ఇంటిదగ్గర ఉంటూ, ఇద్దరం పనికి పోతే బాగుండు. కాస్త కోనగావలి లేకపోతే బాగుండదు.

రా : మీ ఇద్దరూ రోజుమార్చి రోజు ఇంటిదగ్గర ఉండి వంట చేయండి. నాతో ఒకరు పనికి రండి.

జో : "అయ్యె కెత్తరా కోళ్లగం" పని నీవు రోజూ పనికి బో!

రా . నాకు వంటచేయడంకంటె కూలికి పోవడమే సులువు. అదిగాక నే లేకండా మీ రంతదూరం పోవడం నా కిష్టంలేదు.

జో ఇంట్లో ఒంటరిగా ఉండడంమటుకు మంచిదా?

రా : ఇక్కడ పరవాలేదు. సామానుకు నే బోయివస్తా. నీళ్లకు నీవు పో.

## 15. కన్నీళ్లలో కాలు జారేను

కూలికి బోయినవాం డ్లందరూ ఇండ్లకు వస్తున్నారు. ప్రొద్దున కొందరు గంజితాగి పోయినవాండ్లు. మరికొందరు చద్దన్నం తిన్న వాండ్లు. కొంతమంది వట్టినే పోయినారు. మధ్యాహ్నం ఎవరికీ అన్నం లేదు. పొద్దుగూకులూ పనిచేసి ఆకలికి ప్రాణాలు వెసబోయి ఉన్నవి. అప్పుడు జొన్నలు దంచి వండుకోవడానికి ఓపికలేక అందరూ బియ్యమే తెచ్చుకున్నారు. వాండ్లకు జొన్నన్నం తింటే

దిండుగా ఉంటుంది. కాని అప్పసం వరిమెతుకులు తినడంచేత మనుష్యులు ఊలపోతున్నారు. పాయిలోకి చిన్నకట్టలుగట్టి తుత్తురుపుల్ల లమ్ముతారు. అవి ఎన్ని గాల్చినా బుస్సున పోతవిగాని జొన్నన్నం ఉడుకైనా పట్టదు. ఆటి కాలే గట్టిపుల్లలు ఉంటేనేకాని ఉడకదు. సగం వంటచెరుకు లేకనే జొన్నలు మానుకున్నారు. అందరూ భత్యాలు తెచ్చుకొని అన్నం కాంగనే నిప్పులమీద నీళ్లు చల్లినట్టు తలకాస్తా తిన్నారు. అన్నం తిన్నతరువాత గుంపుల నాయకులను పోగుచేసుకొని పుల్లప్ప రామదాసు యింటికి వచ్చాడు.

పు: రామదాసూగారూ! గుంపుల నాయకు లంతా వచ్చారు. మీరు చెప్పిన ప్రకారం పోవడానికి సిద్ధంగా ఉన్నారు. మీతో మాట్లాడవలెనని వాండ్లకు కోరిక. మీభోజన మైందా?

మా: వంట అయింది. మాట్లాడడం పొద్దుపోయేటట్టయితే తర్వాగా తినే కూర్చోవచ్చు.

పు: పొద్దుపోయేవరకు కూర్చోవడానికి వీలేలేదు ఎనిమిది గంటలకు గస్తీ ప్రారంభం అవుతుంది. ఆపైన ఎవరిగూట్లో వాండ్లుదూరక తప్పదు.

రా: బయట సంచరించే గుంపులు దప్ప!

పు: వాండ్లు దొరలే అయిరి. మనమాట లన్నీ ఒకగంటలో ముగించాలె. ఇతడు దొమ్మరగూడానికి నాయుకుడు. పదిమందిగల కుటుంబం. ఇంటిదగ్గర వ్యవసాయం, ఒకవంద సన్నజీవాలూ ఉన్నవాడు. ఇక్కడికి చేర్చడంచేత అవన్నీ అమ్ముకొని ఆడబ్బు కడుక్కొని తింటున్నాడు. ఇంకొకయేడాదికి సెట్టి మిగులుతాడు. తరువాత ఈగుంపు ఎట్లా బతకాలెనో తెలియదు.

రా: ఇప్పుడు కూలి చేయడంలేదా?

పు: ఈపదిమందిలోనూ ఏడుగురు ఒళ్లు దాచుకోకుండా పని చేసేవాండ్లు. వీండ్లకు వారపుమొత్తంమీత వచ్చేకూలి మూడు రోజులకు చాలీచాలీగా సరిపోతుంది. తక్కిననాలుగురోజులకూ యింటిదగ్గరనుంచి తెచ్చుకుని తినాలె.

రా: నీ పేరు!

దొమ్మర నాయకుడు: రాము డంటారండీ.

రా; నీవు వచ్చి ఎన్నాళ్లయింది?

రాముడు: మేము వచ్చి నాలుగేండ్లకు పైన అయింది. మాగోడు ఇంకా శానా ఉంది. ముందు మేము ఇంటిదగ్గర కమ్మగా పాడి తాగినవాండ్లం. ఇక్కడికి వచ్చినప్పటినుంచీ తెల్లనీళ్ల మొగమైన చూడలేదు. మాపిల్లలఘోష ఎవరికి తగలవలసినదో తెలియదు.

రా: ఆయ నెవరు?

పు: అతను ఎరుకల కిష్టడు.

కి: అయ్యా! మాయెరుకలగుంపు వందగడప ఉన్నది.

పు: వాళ్లగుడిసెలకు మటుకు గడపలు లేవు.

కి: ఉండవయ్యా నీదంతా చమత్కారం! మా దరిద్రానికి తోడు ప్రతివాండ్లకూ గుంపెడుపిల్లలు. రెక్కలు విరుచుకొని పని చేస్తాం. మా కిచ్చేకూలి ఒంటిపూటకు చాలదు. కూలి దొరకని రోజులలో మేము పొట్టనాయగట్టుకొని పడుకున్నా పిల్లలు పస్తుపడుకుండడం చూడలేక జాలిగుండెగలవాండ్లంతా సంచారాలు మొదలు పెట్టారు. నాబోటి కటికిగుండెలవాండ్లం ఇంకా వటిస్తూనే ఉన్నాం. నేను ముగ్గురిపెట్టు బరువులు మోస్తా. ఇద్దరిపెట్టు తింటా. నేనుగనక గడ్డపార తీసుకుంటే రాయి వణకాలె!

పు: రాములవారు బాణం తీసుకుంటే సముద్రం వణికినట్టు.

రా: పుల్లప్పా! ఈకథలన్నీ ఎప్పుడు చదువుకున్నావోయ్?

పు: అయ్యా! నేను ఒకఅందాన చెడ్డనా?

రా: బాగుంది, నీకథ గానీ!

కి: నిత్యం నావల్ల పని దీసుకుని పావలాడబ్బులిచ్చేనాథుణ్ణి చూపించండి. నేను నీలిమోపులు గుత్తకు మోసుకొని ముబ్బడి కూలి సంపాయించేవాణ్ణి. నేను చోరీ ఇదివరకు చేసినట్టుగాని, ఇప్పుడు చేస్తున్నట్టుగాని ఒక్కరిచేత అనిపించండి. ఎరుకలవాడినై పుట్టినందుకు ఇక్కడ దొంగలగూడెంలో తగుదునంటూ పెత్తనం చేస్తున్నా. ఇంటిదగ్గర చక్కగా జీవించేవాడిని ఇక్కడబెట్టి చంపుతున్నారు. నేనేగనుక దొంగతనాలు సాగిస్తే ఊళ్లూ ఊళ్లూ కూడా ఆగవు. ఇంకా పస్తాయిస్తున్నా.

రా: ఇక్కడింత కూలి తక్కువ గిట్టడానికి కారణమేమి?

కి: ఇక్కడ ఇంతమందిజనానికి ఏమిపని ఉన్నది? మామూలంగా చుట్టుపట్లఊళ్లలో కాపురంవుండే కూలీలకు జీవనం పోయింది. వాండ్లు దొంగజాతులలో చేరినవాండ్లు కారుగనుక బయటవుండే దొంగతనాలు ప్రారంభించారు. సమీప గ్రామాలలో ఎవరూ ఇప్పుడు కూలి సరిగా ఇవ్వరు. వీండ్లంతా ఇక్కడ తేరగా వచ్చి పడ్డారని పోలును లోగట్టుకొని వాండ్ల యిష్టంవచ్చినట్టు గుత్తకేర్పాటు చేసుకుంటారు. అందులో ఈ కొత్తదొరగారు వచ్చిన తరువాత కూలీల్లనోట మట్టే! పోలు బ్యాంకులు నింపుతున్నాడు!

పు: మమ్ములను అసలు మోసంచేసి తీసుకొనివచ్చారు. కర్నూలుజిల్లాలో ఒక డిప్యూటీకలక్టరు, 'మే మంతా రాము' అని తిరగబడితే మా ఆడవాండ్ల నందరినీ 'అమ్మా, అప్పా' అని మంచి మాటలాడి మెహమానుపొందేటందుకు స్వంతకర్చుతో గాజులు తొడిగించి, చీరలు కొనిపెట్టి తోడబుట్టినవాడిమో స్తరుగా వాండ్లను లాలించి ఒప్పించాడు. మా మగవాండ్లతో కోరుకున్న భూము లిస్తామనీ, సర్కారువారు దయదల్చి మా దరిద్రవిచ్చిత్తి చేయడానికి పూనుకున్నారనీ చంకబిడ్డల జారదీసేమాటలతో మాదాసరిగూడేలను లేవదీశాడు. ఆయనమాటలు నమ్మి మాకున్న పొలాల్లూ, ఇండ్లూ, చరాస్తీ అమ్ముకొని ఇక్కడ సేద్యాలు వెలిగింతా మని వచ్చాం. ద్వారపూడి పచ్చపువాండ్లకుకూడా ఉచ్చులు అట్లాగే తగిలించారు. సెటిల్‌మెంటులో అడుగు పెట్టాం, పస్తులు ప్రారంభమైనవి. చేతిలో మెల్లాఉన్నవాండ్లు వచ్చినంతవరకు ఖర్చుపెట్టుకొని తిన్నారు. ఆ కాస్తా అయిపోంగనే లగ్గల కెక్కారు. మా పోరణచడానికి దక్షిణాదికాఫీతోటలకు పట్టించారు. ఆ కొండనిండా నీళ్లు కాలుపెట్టే వరకు జలగలు పట్టుకుండేవి. మా ఒంట రక్తమాంసాలుంటేగా! తరిపిచూడవలె కాసేపు గుంజి ఊరుకుండేవి. జనానికి రోగాలు మోపై చాలామంది నశించారు. రోజూ పీనుగలు వెళ్లుతున్నా తోటలదొరలు ఏడ్చే పెండ్లాలనూ, బిడ్డలనూ పనులు చేయమని వేధించేవాండ్లు. 'ఎట్లాగైనా తేనేమి. చావడాని'కని గుండె రాయిచేసుకొని యావన్మందిమీ "జా: పరమేశ్వరా" అని చెప్పకుండా లేచాం.

రా: ఎక్కడికి?

పు: ఏలేందుకు లేవుగాని, ఎత్తుకతినేందుకు ఊళ్లు చాలా ఉన్నవి. తిడితే తప్పుగాని, తిరుచుకుంటే తప్పులేదు. బిడార్లు లేపేవరకు తోటలదొరలు తుపాకులు దీసుకుని మావెంటబడ్డారు. మేము రాళ్లు దీసుకొని వానరయుద్ధం ప్రారంభించేవరకు దొరయ్యలు ఎల్లోఎల్లు! వాండ్లేం ఊరుకున్నారా? కలక్టరును రిజర్వుపోలీసులను బంపమని అడిగారు. ఆయ నెవరో మంచివాడట. వాండ్ల ఇష్టం వచ్చిన సెటిలుమెంట్లకు పంపవలసిం దని ఆర్డరు వేశాడట.

రా: చాలా గొప్పవరమే!

పు: అప్పటి కట్లాగే అనుకున్నాం. దిక్కుదోచక తలా ఒక సెటిల్మెంటుపేరు చెప్పాం. పెనంమీదనుంచి మంగలంలోకి దూకినట్లైంది. ఇక్కడ దూకడానికికూడా వీలులేదు. కొలను కొండంతా ఈనాం అయి మాపాలబడ్డది. మేము వాటికీ లొంగం, అవి మాకూ లోబడవు. కొండరాళ్లూ మేము ద్వంద్వయుద్ధం చేస్తున్నాం. ఇదివరకు దొంగతనం ఎరగనివాండ్లుకూడా కొందరు. . .

ద్వారపూడినాయకుడు రాఘవులు: ఆసంగతి ఇప్పు డెందుకోయ్, పెద్దమనుష్యులతో?

పు: ఏమి చెపితే? తల తుంపుతారా? పాలించేవాడు వచ్చి నప్పుడు యావత్తుసంగతులూ చెప్పవలసిందే.

రాఘు: ఇప్పు డేమిచేయవలెనని నీ యభిప్రాయం? నీవు ఏమి చెయ్యమంటే అది చేస్తాం. తిరుగు లేదు.

యానాది సుబ్బడు: తెగదెంచుకొని పారిపోదా మని!

రా: ఎక్కడికి పోతారు?

సు: గడిదాటి పొమ్మంటే పోతాం.

రా: పోలీసులు అందరినీ పట్టుకవస్తే సెటిల్మెంటు చట్టంకింద తలా ఒక సంవత్సరం వొడ్డుతారు.

పు: మొదట ఖైదంటే కాస్త వెరిచాం. యిప్పు డాచలి తీరింది. ఈసెటిల్మెంటుధర్మాన అందరికీ కొత్త తీరింది. రాజుగారి రొట్టెలు చాలాభాగం రుచిచూచాం. మేమూ దాసంగాలలో ధప్పళాలు కొట్టినవాండ్లమే!

రాముడు: కాళ్లకట్టతాడు కోశారు. అంత్యానికి వచ్చింది. నీతినియమాలు విడిచాం. కూడు లేక యెంత కాల మని మాడుతాం? "జైలుకు పోతే నామోషీ" అన్నమాట పోయింది.

రా: అయ్యో! అన్యాయం! అదేమి?

పు: సెటిల్మెంటుకాంపౌండు దాటితే నేరం. మొదటిసారి ఆరునెలలూ, రెండోసారి సంవత్సరం, ఆపైన అంతస్తులుగా శిక్ష పొడిగిస్తారు. నీతికి భంగంలేని పనులన్నీ నేరాలుగా జేసి జైళ్లు చూపించారు. చాలాభాగం తెల్లకుళాయీల మల్లా నల్లకుళాయీల మైనాం. ఆవరణపుగీత దాటినందుకు దొంగలమని శాశ్వతపు పట్టా లిచ్చారు. నల్లకుళాయీలవెంట యెర్రకుళాయీలను తగిలించారు. జవానులను వెంటబెట్టుకొని జమీందారుసెకలు వెళ్లబోస్తున్నాం. ఇప్పు డెక్కడికి దేలామంటే, యేదో వొకవొంక పెట్టుకొని ఖైదుకు పోవడం. ఆరునెలలు పోయిరావడంతో జైలు సౌకర్యాలు తెలుస్తవి. వేళ కింతన్నం, కట్టుకోను చల్లాడం, కప్పుకోను కంబడి, గచ్చుటిండ్లు. అక్కడ మా ఒక్కకిటికీ కుండే యినుపసామాను గొప్పవాండ్ల మేడలకు సరిపుచ్చవచ్చు! నిద్ర లేవడానికి మేలుకొలుపులు, తూర్యరవాలు. రాజదండం చేత పట్టుకొని యెప్పుడూ వెంట జవాను, వందలుదినే డాక్టర్లు, అడిగేవ్వూ మా వైభోగం! చుట్టూ కోటగోడ. రాజలాంఛనాలు పుట్టిపడుతుంటవి. మా ఆడవాండ్లకుకూడా యిదేమో స్తరు ప్రత్యేక యేర్పాట్లు ఉంటవి. నవాబుగారి జనానాకంటెకూడా యెక్కువ ఖాయిదా. మేము సెటిల్మెంటు వచ్చి నాలుగేండ్లయింది. మా ఆడవాళ్లకు గుడ్డ కొనిపెట్టినపాపాన పోలేదు. ఒకపూట అయినా అన్నంపెట్టలేనివాండ్లకి గుడ్డ లేమిస్తాం? సగం ఈ మానభంగం సహించలేకనే ఖైదుకు పోతున్నాం. ఖైదులో ఆడవాండ్లకు వొళ్ళునిండేగుడ్డయినా యిస్తారు.

రా: ఈ సెటిల్మెంటుచట్టంవల్ల జనంలో ఆత్మగౌరవమూ, నీతిగౌరవమూ చంపా అన్నమాట.

దాసరినాయకుడు కేశవులు: పుల్లప్పా! నీ వాగరా! అయ్యో! నే నిప్పుడు తొంబై యోపడిలో ఉన్నా. మా అయ్య కాలంచేసి యిప్పటికి అరవై సంవత్సరాలైంది. ఆయన చావంగనే

నాకు ఇరవై అయిదో సంవత్సరం వెళ్ళుజాత కులపెద్దను చేశారు. డెబ్భైయేండ్లనుంచీ మా కులచరిత్ర బాగా యెరుగుదును. చాలా మందిమి వ్యవసాయదారులుగా వుండేవాండ్లం. రానురాను ముప్పాతికవంతుకు కూలి జీవనమైంది. యిప్పటి కిరవై యేండ్ల క్రిందట నాలుగు కులాలతో పాటుతప్ప మావాండ్లలో విశేష దొంగతనం లేదు. యీనడుమ కొంచెం సంఖ్య హెచ్చినమాట్ల వాస్తవమే. దానికి కారణం కూలి దొరకకపోవడమే. యిప్పటికీ నలుగురితో పాటు మర్యాదగా జీవించేవాళ్ళు సగానికి యెక్కువగా వున్నారు. మాకు సర్కారువారు దొంగలజాతి అని పేరు పెట్టారు. వైష్ణవదాసకులమల్లా దొంగదాసరులమైనాం. మాబైసు బయట బడ్డది. నేనూ నాకొడుకూ వేళ కెవరైనా వస్తే గుక్కెడు గంగపోసే స్థితిలోనే యిప్పటికీ వున్నాం. నాబిడ్డ పొద్దుగూకితే గడపదాటి యెరుగడు. దొంగదాసరులమని ఈ సెటిల్మెంటులోకి తెచ్చారు. ఇక మమ్మును పెద్దమని షనేవాడు యెవడూ వుండడుకదా? మే మిప్పుడు కొత్తగా దొంగతనం చేసి పేరు చెడగొట్టుకొనేది లేదు. బిరుదు యేద్రోహమూ చేయకుండానే సంపాయించుకున్నాం. ఇక మంచివాండ్లం కాబోయేది లేదు. సత్యంగా వుంటే మనకు వొరిగే దేమున్నది? రాత్రిళ్ళు కన్నాలకు బయలుదేరుతానని మాపిల్లవాడు నన్ను రోజూ గోడాడుతున్నాడు. మెర్రపిల్లవాండ్లను ఆడవేషాలకు పిలిచినట్లు బక్కపలచగా వుండడం చేత కన్నంలో దూరడానికి బాగా పనికివస్తాడని పోలుగారు పిలుస్తున్నారు. పొమ్మంటావా, వద్దా?

రా : వ్రతం యెలాగూ చెడ్డది. సుఖ మెందుకు దక్కించుకో గూడందటావు? యితరమార్గాలు ఆలోచించుకుంటున్నాంగా.

కే : సరే ఆలోచించు.

రా : నిర్భయంగా జైళ్ళకు పోవడానికి తయారైతే అన్ని పనులూ చక్కపడతవి.

కే : అంతేకదా నీకు కావలసింది? మేము యింకొకందు కైనా జైలుకు పోవడానికి సిద్ధంగా వున్నాం. ఇప్పుడు జైలుకు పోవడం సులభమే. సర్కారువారు చాలా సదుపాయం చేశారు.

ఈ ఆవరణందాటి అవతల అడుగుపెడితే జైలుప్రాప్తే. దూరం గూడా పోనవసరం లేదు.

రా: ఈ సెటిల్మెంట్లన్నీ కిరస్తానీమతాలు. మనం ప్రార్థనకు పోకపోతే యీ పాదిరీలు మన కొక సలాం పెట్టి లేచిపోతారు. దున్నడానికి వీలైనచోట సెంటిల్మెంటు పెట్టి అక్కడుండమంటే మన ముండడం, లేకపోతే మనదారి మనం చూచుకోవడం. పారిపోతే పోలీసులను పెట్టి కాలిపిస్తా మంటారు. దానికేమి చెపుతారు?

పు: దానికీ మనం తయారుకావలసిందే. ఎంతమంది ఆడవాండ్లనూ, పిల్లలనూ కాలుస్తారో చూత్తాం!

రా: చావుకు వెరుస్తామని కాదు. ముందుగా కన్ను పొయ్యేటంత కాటుక పెట్టుకోవడ మెందుకు? రేపుపొద్దున యావత్తు మందిమీ ప్రార్థనకు పోవడం మానివేత్తాం. దానిమీద కదలిక పుడుతుంది. మనబాధలు యావత్తూ తెలుపుకుందాం. ప్రయోజనం లేకపోతుందీ, యీ కాంపౌండుబయట బిడారులు దింపుదాం. గవర్నమెంటువారు మెదలకుండా వుంటారూ, ఎవరిదారిన వాండ్లం పోదాం. వృథాగా చంపితే చంపనియ్యండి. మనం దౌర్జన్యానికి దిగవద్దు.

దా, కే: బాగానే వుంది. మొండివాడు రాజుకంటే బలవంతుడు.

రా: ఇక అందరినీ ఖైదుకు పొమ్మంటే అందువల్ల మనకు నామోషి లేదు. అన్నవస్త్రాలిచ్చేదాత లుంటే చేతనైనంతవరకు వొక అతుకు అతుకుత్తూ లక్షణంగా అందరం అక్కడనే వుందాం. అక్కడిసంగతులు యావత్తూ యిందాకా మన పుల్లప్ప వర్ణించాడు. దొంగది, సగం ప్రభువంశ అనేది వాస్తవంగానే వున్నది. 'హరిః ఓం' అని రేపుపొద్దున ప్రార్థనకు పోవడం మానివేత్తాం. మీఅందరికీ అంగీకారమేనా?

కే: ఇంకా రెండోమాటా?

రా: యింకొకసంగతి! మనకు యావత్తుసంగతులూ బోధపడ్డవి. నన్నుగాని మీగుంపునాయకులనుగాని ఖైదులోకి పంపితే

వెంటనే కొత్తవాళ్లను నాయకులుగా యేర్పరుచుకుండేదీ, రంగం సాగిస్తుండేదీనీ. తెంపులేకుండా యీపని జరగాలె.

క్రి: మంచిమాటే!

రా: మనలోనుంచి ఎవరైనా చీలిపోయి లోబడ్డా తక్కిన వాళ్లు లెక్క చేయగూడదు.

రాఘు: కొసకోళ్లు లేకుండా వుంటవీ? నిల్చినవే లెక్క!

రా: సరి.

గస్తీ ప్రారంభించేసమయమైంది. పోలీసులు తిర్గాడుతున్నారు. కులపెద్దలంతా లేచి తమగూడేలకు బోయినారు. పౌలు యేదో ఆలోచన జరుగుతున్నదని పసికట్టాడు. సంగతి ఫలానా అని తెలియలేదు. దొరగారితో యోచించి ప్రార్థనకు రాకుండా సమ్మెకట్టుతున్నారని అనుకున్నాడు. పౌలు "మతవిమర్శం యీ జనానికి పట్టవచ్చిందా! చివరకు యేమీ జరగ"దన్నాడు. 'మాలలు కొందరు చేరినా మనము మెదలకుండా వూరుకుంటే అదే సమసిపోతుం' దని పాదిరీగా రన్నారు. అంత వృథయులూ వెళ్లిపోయినారు. రామదాసు భోజనానికి లేచాడు. అందరూ అన్నం ముందు కూర్చున్నారు.

జో: అయ్యో! నీ కెక్కడివోపికే, రెండుగంటలనుంచీ వాండ్లతో సతమత మవుతున్నావు?

మా: యెక్కడికి పోయినా వూరుకునేఘటం కాదు. యేదో వొకరచ్చ జరుగుతుండాలె.

రా: వూరుకోదలుచుకుంటే యిందాకా రావడ మెందుకు! దేనితోనూ సంబంధం లే దనుకుంటే యింటిదగ్గిరనే వుందుం. సంగతులన్నీ విన్నారుకదా! మీకేమితోస్తున్నది?

జో: లోకమంతా ఆనందమయం అనుకున్నాను. యిప్పుడు దుఃఖమయమని తోస్తున్నది.

రా: అయితే రెండోమెట్టుకు వొచ్చావు. రెంటికీ సమన్వయం కుదిరితే సత్యంలో నిలుస్తావు.

మా: మొదటిమెట్టు సుఖమా, దుఃఖమా!

రా: యెటు ప్రారంభమైనా ఒకటే. మూడవమెట్టు యెక్కినవాండ్లు ధన్యులు.

మా: నేను సుఖం దాటి దుఃఖములో వున్నా.

రా: కన్నీళ్లలో కాలు జారేను, జాగ్రత్త!

## 16. రెండు బృందావనాలు

తెల్లవారంగనే మామూలుప్రకారం జనమంతా లేచారుగాని అలబల మంతగా లేదు. ఉన్నవాండ్లు మధ్యాహ్నం కట్టుకపోయే టందుకు అన్నం వండుకుంటున్నారు. ప్రార్థనకు మొదటిగంట కొట్టంగనే పుల్లప్ప రామదాసుదగ్గరకు వచ్చి,

పు: నలుగురినీ పోగుచేసి మంచిమాటలు యేమైనా చెప్పతారా? యేదో శాస్త తదంగం జరుపుతుంటే జనం అంతా యిక్కడనే పోగుపడివుంటారు.

రా: వాండ్లు యేయెత్తుకు వచ్చేదీ చూచి అవసరమైతే మనం సాయంత్రం పెట్టుకుందాం. యీ సమయంలో ప్రతిరోజూ కృష్ణకుబోయి స్నానం చేసేటందుకు వుపయోగింతాం. ప్రతిరోజూ స్నానంచేసే అలవాటు మనం నేర్చుకోవాలె. కొల్లలుగా దగ్గర నీళ్ళు వున్నప్పుడు మనం తప్పకుండా స్నానం చేయ్యాల్సిందే.

పు: అట్లయితే జనం చద్దన్నం దినకముందే స్నానం చేతాం. రేపటినుంచీ ప్రారంభించవచ్చు.

రా: రెండోగంట కొడుతున్నారు. మనం పోకపోతే పెద్దవాండ్లను పిలిపిస్తారేమో?

పు: అక్కడికి మనకేమి పని? యిక్కడికే రమ్మనమందాం.

రా: యెట్లైనా సరేకాని మనం వాళ్ళకండ్లం యేవిధమైనమాటా యియ్యవద్దు. నలుగురితోనూ మాట్లాడందే జవాబు చెప్పడానికి వీలులేదందాం. మనం నలుగురం సంప్రతించుకొనే యేసంగతీ చెప్పవచ్చు. ఈ సంగతి నాయకులందరితోను చెప్పు.

పు: ఒంటరిగా పిలిస్తే పోయి యీమాట చెప్పమంటారు.

రా : పోతే తప్పేమున్నది ? నమ్మె 'ప్రస్తుతం బోధకు రా' మనేగా ! నీవు మాయింటికి పో.

సాధారణంగా రెండోగంట కొడుతుండగనే జనం చేరబారు తుండేవాండ్లు. పాదిరీగారు దుస్తులు వేసుకొని కిందికివచ్చి భోజనం చేస్తున్నారు. జనం రాకపోవడంచేత దొరగారితో చెపుదామని పౌలు వచ్చి తొంగిచూచి అన్నం తింటున్నారని వెను కకుబోయి పంచాదిలో నిలువబడ్డాడు. దొరగారు కాఫీతాగి వచ్చి,

బ్రౌన్ : పౌలూ ! యెవరూ రాలేదా ?

పౌ : ఒక్క పురుగుగూడా రాలేదు. కుట్ర జరుగుతున్న దని తమ కప్పుడే మనవిచేశానుగా !

బ్రౌన్ : వారికి దేవునిమతం అక్కరలేకపోతే ఈ సెటి ల్మెంటు తీసివేయింతాం.

పౌ : అయ్యా ! తొందరపడకూడదు. రామదాసూ, పుల్లప్పా చేసేపనికి అందరినీ శిక్షించడం బాగుండదు. ఒకరిద్దరి దుర్మార్గంవల్ల అందరినీ సత్యమతానికి దూరంచేయడం న్యాయమా ?

బ్రౌన్ : నాయకులను నలుగురినీ పిలిచి మాట్లాడుదామా ?

పౌ : బెట్టు తక్కువని నా అభిప్రాయం. ఇప్పటి బిగువు మీాద పిలిస్తే రాపంటారేమో ! యినస్పెక్టరుగారు కేసుపెట్టడానికి వొప్పుకున్నారు. ఆ రెండు కుటుంబాలనూ పనికి పంపకుండా వుంచివేసి తక్కినవాండ్లనందరినీ కొలనుకొండ పంపివేస్తా. ఇంత మందిలో అరెస్టుచేయడంకూడా కష్టం. అడవిజనం తిరగబడితే అపాయం. మధ్యాహ్నం రైలుమీాద దెక్కించి, గుంటూరుకు తీసుకొనిపోవచ్చు.

బ్రౌన్ : సాక్షు లున్నారా ?

పౌ : ఒప్పుకొన్న నలుగురు పోలీసులనూ యిక్కడ ఫారా వుంచుతా. జనులలో నాకు ముఖ్యమయినవాండ్లను హెచ్చరించి చూస్తే తమవల్ల కాదన్నారు. తమరు సాక్ష్యంగా వుంటే పకడ్బుగా వుంటుంది.

బ్రౌన్ : ఎబ్బే ! నే రావడం వెలితిపని. తాడేపల్లిపోయి రెడ్డిని తీసుకొనిరా. నీతో కలిపి ఆర్గురు సరిపోతారు. తక్కిన జనాన్ని యిక్కడ వుండకుండా చూడు.

పా: ఒకరిద్దరు జబ్బువాండ్లు మిగిలివున్నా కొండదగ్గర మస్తరు వేయిస్తా. రెడ్డిని ఇక్కడికి తీసికొనిరానా?

బ్రౌన్: నాదగ్గర కెందుకు? తప్పకుండా రైలుకు రమ్మను. సాక్షులంతా బాజరులో వుంటే విచారణ వెంటనే ప్రారంభం అవుతుంది. మంగళాపురం తెలియకుండా చూడు. వాండ్లు వచ్చి విడిపించుకొని పోతారేమో?

పా: ఇక అది వట్టిమాట. కేసు పెట్టినతర్వాత కలెక్టరుగారు విడిపించరు. డిప్టీకలెక్టరుగారు కేసువిచారణలో యేమి చేస్తారో? తమ రెరుగుదురుగాఁవాలెనే!

బ్రౌన్: యిప్పుడు శివయ్యగారు వచ్చారుగదా! నాకు ముఖ్యుడే! సాక్ష్యం కనీసం రేపైనా విచారణ జరిగేటట్టు చూడండి. మనయిన్స్పెక్టరుతో నే మాట్లాడవలసివుంటుందా?

పా: కేసు పెట్టడానికి వొప్పుకున్నాడుగాని తప్సీళ్లల్లో మెలికలు పెడుతున్నాడు. తమరు పిలిపించి కేసులో పోలుసలహా ప్రకారం పోతే బాగుంటుందనిమాత్రం అనండి. లోతుకు బోవద్దు.

బ్రౌన్: నీపనిమీద నీ వుండు. నే పిలిపించి చెపుతా. ఈ ఉత్తరం సాయంత్రం యింటికి పోయి డిప్యూటీకలెక్టరుగారికి యియ్యి. తప్పక పని చక్కపడుతుంది. నీవు నోటిమాటలతో కూడా కేసుసంగతి చెప్పు.

పా: తమదర్శనం మళ్లీ గుంటూరునుంచి వచ్చే! వీళ్లను అరెస్టు చేశారని వినంగనే జనం అంతా దంగిపోతారు. మామూలు ప్రకారం ప్రార్థనకు వస్తారనుకుంటాను.

బ్రౌన్: రేపు నీవు పని పూర్తిచేసుకొని వస్తే మర్నాడు ప్రార్థనకు రమ్మందాం. శిక్ష లేశారని తెలిస్తేనేకాని బెదురు పుట్టదు. దానిమీద క్రమంగా మెత్తబడి లోబడతారు. పన్ని నెమ్మదిగా సాధించాలె.

పాలు పాదిరీయింటిదగ్గరనుంచి అతివేగంగా తాడేపల్లి పోతున్నాడు. ఆనందం సబుయిన్స్పెక్టరుయింటికి వచ్చి ఆయనను పాదిరీయింటికి తీసుకొనిపోయినాడు. పుల్లప్ప యావమనిషి. యావలు తీస్తూ శత్రుసంచారం కనిపెట్టివున్నాడు. యిన్స్పెక్టరుగారు

తిరిగీరావడం చూచి యెదురుగాబోయి దండంపెట్టి 'యేమి స్వామీ! మీరు దయగలప్రభువులు. వాండ్ల అక్రమాలకు లోబడి మాబోటి వాండ్లకు అన్యాయం చెయ్యకండి.'

యి: యేమిరా! నే నేమిచేసేది? పొట్టకూటికోసం మీవాండ్లు కన్నాలువేస్తుంటే మేమూ అందుకే మీకంటే యెక్కువ దుర్మార్గాలు చెయ్యవలసివస్తున్నది.

పు: అయ్యా! మీమాటలనుపట్టి చూస్తే మా కేదో అక్రమం జరిగేటట్టుగా వుందే!

యి: తినబోతూ రుచి అడగడం యెందుకు? ఒకగంటలో అంతా తెలుస్తుంది.

పు: అక్రమకేసు పెడతారుగాఁవాలె?

యి: అటువంటిదే చేస్తారు.

పు: నావొక్కడిమీదనేనా?

యి: పాపం! రామదాసుండక తప్పదు. దొర బైటికి వస్తాడేమో, నీవు వెళ్లు. మనం మాట్లాడుతుండగా చూస్తే లాలూచీ అయినా మంటాడు.

పుల్లప్ప: (రామదాసింటికి పోయి) అయ్యా! వ్యవహారం బెడిసిందే!

రా: నాకు అరికాళ్లు దురదగా వున్నవి. ప్రయాణం తగిలేటట్టుగా వున్నది.

పు: మనమీద కేసు పెట్టబోతున్నారని యిన్స్పెక్టరుగారు చెప్పారు. పోలు తాడేపల్లి పోతున్నాడు. ఒకగంటలో యావత్తు సంగతి తెలుస్తుందట. యేమి ఆలోచన?

రా: మన కేమి ఆలోచన వున్నది? వాండ్లపనిగనుక ఆలోచించుకుంటారు. మనం నిర్విచారంగా వుంటాం.

మా: మనం యేమితప్పు చేశామని కేసు పెడతారు?

రా: ఓసి పిచ్చిదానా! యిప్పుడు చెయ్యాలెనా? ఎప్పుడు చేసిందో? ఏమీలేకుండా యింతమంది పెద్దలకు బుద్ధిపుట్టి యీపనికి పూనుకుంటారు? వాండ్లు వూరికే నిమిత్తకారణం!

పు: వాండ్లు చేసేది కేవలకల్పనకదా! మనవుసురు తగలదా!

రా: తగల కేమి? వాండ్ల పూర్వజన్మదుష్కర్మే యీ రూపంగా పండి ఫలం యింకొకప్పుడు అనుభవిస్తారు. అనుభవానికి యీజన్మలోనే రావచ్చు.

పు: కేసు యేమని పెడతారో?

రా: కేసా? మనం తప్పించుకొని పోతున్నట్టూ, పట్టుకున్నట్టూ బనాయింపు చేస్తారు. పోరుగూరి మోతుబరిఆసామీ రెడ్డిగూడా సాక్ష్యమవుతాడు. నలుగురు పోలీసులుకూడా వున్నారు కదా! మనవాండ్లంతా పనికి పోవడంచేత మనకు సాక్ష్యంకూడా వుండదు. నడకయాపత్తా యింతే.

పు: పోతేమటుకు సాక్షులు యెట్లా చెప్పమంటే అట్లా చెపుతారు.

రా: పైగా అదొక టెందుకు? వాండ్ల పేర్లన్నీ మస్తరులో కెక్కతవి. వాండ్లసాక్ష్యంవల్ల మనకు ప్రయోజనం లేకపోగా వాండ్లుకూడా తప్పుసాక్ష్యంకింద యిరుక్కుంటారు.

పు: అయితే మనకు తప్పనట్టేనా?

రా: ఆహా, ఆరునెలలు శిసలే! నాకు చెక్కబిళ్లేగతి. నీకు సత్తుబిళ్లిస్తారు.

పు: మీా కేమో ఆటగా వుందేమయ్యా!

రా: దిగులుపడితే తప్పుతుందా? మన మంతా ఖైదుకు పోవడానికి తయారై ందేకా? నీవు వర్ణిస్తివికూడాను. మాలక్ష్మీ! మనకు యీసాయంత్రంనుంచీ రాజుగారి భోజనమే.

పు: మన ఆడవాండ్లనుకూడా చేర్చేరా?

మా: చేరిస్తే యేచిక్కూ లేకుండాపోను. చేర్చకపోతే (అని పడిపోయింది).

జోతి వచ్చి పట్టుకొని విసిరింది. రామదాసు చన్నీళ్లు దెచ్చి ముఖాన చిలకరించాడు. కాస్త తెప్పరిల్లి కండ్లుదెరిచి చూచి మళ్లీ దుఃఖం తెరగా వచ్చి జోతిచేతిలోకి వొరిగింది.

జో: (కొంగుతో విసురుతూ) అయ్యా! అమ్మ బతికేనా?

రా: ఏమీా పరవాలేదమ్మా! వూరికే భ్రమ వచ్చింది. వట్టిజాలిపేగులది!

మాలక్ష్మి: (కాస్త తిప్పుకొని) నీవు ఖైదులోకి పోయి మళ్లీ నాకు దక్కా!

రా: ఆ భయం నీకేమీవద్దు. యింకా పదేండ్లదాకా రాళ్లబాడిచినా నాకు చావు లేదు. నాకు జాతకం నా మేనమామ వ్రాశాడు. అక్షరం తప్పకుండా జరుగుతున్నది.

మా: నీకండ్లయెదుట పోయేభాగ్యం నాకు వున్నదా?

రా: నీవు అదృష్టవంతురాలవు. ముత్తైదువుగా వెళ్లిపోతావు.

మా: యిక నాకు కావలసిన దేమున్నది? పెద్దపిల్లవాణ్ణి చూచేనా?

రా: పెద్దపిల్లవాడిచేతిలో పోయేప్రాప్తం నాకు లేదు. రంగడికి ముందు మంచిరోజులు వస్తవి.

మా: యెంతవరకు ప్రాప్తమో అంత!

రా: నీవుకూడా ప్రయాణం కట్టు. పుల్లప్పా! మీవాళ్లను చేర్చకపోతే యెవరిద్వారానైనా మావూరికి కబురంపే వీలు చూడు. రే పెళ్లినా గుంటూరులో గుప్పుమనకమానదు. నాయుడుగారు వినంగానే పరుగెత్తుకొని రాగలరు. అన్నిటికీ ఆయనదే భారం. నాకు చింతవొక్కటే: అప్పుడీసంగతి వింటే చేతికి వచ్చేది అబద్ధం.

మా: నీవు లేచి కాస్త యెంగిలిపడు. యీ యోచన బాగానేవున్నది. అంతా భోజనానికి లెండి. పుల్లయ్యా! నీవు కూడా లేవరాదూ? మీయింట్లో హాజరుగా వున్నదో లేదో!

పు: వున్నది. పనికి పోదామని మధ్యాహ్నానికికూడ వండారు. మావాళ్లకు కబురుచెప్పి నేనూ తయారవుతాను.

రా: అమ్మా! జోతీ! నీవు నాదగ్గర అన్నానికి కూర్చుందువు గాని రా. వాండ్లు యేమికొంటెతనం చేస్తారో? మనను విడదీస్తారేమో? కలిపివుంచారా అదృష్టవంతులమే. రంగడూ! అమ్మ దగ్గర కూర్చో. జోతీ! నావంక చూడు. యెందుకేడుస్తావు? హృదయదౌర్బల్యం పనికిరాదు. ధైర్యంగా వుండు. తిను నే కలిపినముద్ద తిను. నాకు సంతానంవల్ల దుఃఖం సంభవించినా అగౌరవంమాత్రం కలుగలేదు. ఎక్కడ వున్నా హృదయానందం అనుభవించగలవు. యెబ్బే! యేడుస్తారూ, అట్లా? (అంటూ పమిటె పైకి లాగాడు.)

జో: మీరు నాకు మళ్లీ కనబడుతారా?

రా: అమ్మా! అది పెద్దప్రశ్న. ప్రస్తుతం మన కంతవిమయ మీావిచారంలో పనిలేకపోయినా యిదివరకు మనకు యెన్నిలక్షలు జన్మలు అయినవో తెలియదుగదా! యికముందు యెన్ని కావలసి వున్నవో! యెందరు తలిదండ్రులో, యెందరు భార్యాభర్తలో యెందరు పిల్లలో లెక్కించడం సాధ్య మవుతుందా?

జో: యీవిషయం నాకు చాలాకాలంనుంచి సందేహంగా వున్నది. నిన్నడగడానికి ప్రమేయం దొరకలేదు. 'యిదివరకు యెందరు తలిదండ్రులు, యెందరు భార్యాభర్తలు, యెందరు బిడ్డలు, యెందరు స్నేహితులు అయినారో! వీండ్లతో నా కేమిపని!' అనే సిద్ధాంతం ఆముష్మికప్రేమకు మూలమైన కుటుంబప్రేమను పూర్తిగా ఛేదిస్తున్నది.

రా: కుటుంబప్రేమ ఆముష్మికప్రేమకు మూలమా?

జో: పోనియ్యి. ఆముష్మికప్రేమే మూలం. ఆ అశ్వత్థం, ఆ న్యగ్రోధం అతిపరివ్యక్తమై కుటుంబప్రేమగా వికసించింది. వికసించిన ప్రేమకు వినాశ మెట్లా గలుగుతుంది! గుణపరిణామ సిద్ధాంతంయొక్క ప్రయోజనమే పోయిందే! తరు లతా గుల్మములు వికసించినట్లు ప్రేమ వికసించి పోతుందా!

రా: చరాచరములైన సకలభూతాలకు ఆ యా జన్మలలో సమకూరిన కర్మఫలం జన్మాంతరమందు సంచితములో చేరుతుంది.

జో: లేక, జీవునియందు జితించి సంస్కారరూపంగా వుంటుంది.

రా: అది వొక అభిప్రాయం.

జో: అట్లయితే కర్మసన్యాసంవలన మోక్ష మనే సిద్ధాంతం నాకు పనికిరాదు. కర్మరాహిత్య మనగా దుష్కర్మరాహిత్య మనే అర్థం. బహుజన్మలవలన దుష్కర్మరహితమై సుగుణరాశి కావడమే పరమావధి. ఈ ఊహ ప్రకారం సృష్టి మాయగాని, భ్రాంతిగాని కాదు. సుగుణముల బెంచడాని కేర్పడ్డ కర్మక్షేత్రం. ఆనందమే ఫలం. కష్టసుఖాల రెంటికీ ఆనందం పెంచడమే గమ్యస్థానం. యిహ పర లోకాలు రెండూ బృందావనాలే. రెంటియందూ ప్రేమే రాజ్యం చేస్తుంటుంది. వింటున్నావా?

రా : కానియ్యవే అమ్మ ! వినడానికి ఆనందంగా వున్నది.

జో : అవును ; పిల్లలమాటలు తల్లిదండ్రులకు ఆనందంగా వుంటవి. అనందంగా వుండకపోతేమట్టుకు పిల్లలు చెప్పకుండా వూరుకుంటారా ? విను.

రా : వింటూనేవున్నానే. నీవు చెప్పేసంగతులు వినడమే కాకుండా ఆలోచించవలసివస్తున్నది. అందువల్ల పరధ్యానంగా వున్నట్టు కనబడుతున్నా.

జో : యథార్థం యెట్లా వున్నా కోట్లకొలది తల్లిదండ్రులూ, భర్తలూ, భార్యలూ వుండడం నాకు అసహ్యంగా వున్నది. నేనొక మాట చెప్పనా ? నీవూ ఆకూర్చున్నఅమ్మా యెన్నిజన్మాలకైనా అయ్యా అమ్మలు కావడమే నాకిష్టం. నేను బిడ్డను కావడం మీకిష్ట మవునా, కాదా ?

రా : నాకు ముద్దుపెట్టవే అమ్మా !

జో : నే నంటే ఆ అమ్మకి యిష్టం కాదు కాంవాలె. బుద్ధి మ్మంతురాలుగా కూర్చున్నది.

మా : అమ్మా ! నాకు నోరు రావడంలేదే. (అని పెద్ద పెట్టున యేడ్చింది.)

జోతి తల్లిని కావలించుకొన్నది. యెందుకని వొకరి నొకరు అడగ లేదు.

రా : అమ్మా ! యింకా చెప్పు. మీవంటిపండితులు జన్మజన్మానా మాజోటి దరిద్రులకు పుట్టకపోతే భాగ్యవంతులకు బుట్టవలె నని కోరుకోరాదూ ?

జో : నేను మంచికర్మ చేస్తేకదా భాగ్యవంతులకు బిడ్డగా యింకొకజన్మలో పుట్టడం. అట్లయితే నామంచికర్మవల్ల నీవే కోటీశ్వరుడవై నీకే బిడ్డను కావలె నని కోరుకోవడం నాకు ఎక్కువ యిష్టం.

రా : వొప్పుకున్నా.

జో : తల్లి సగంవియ్యపురా లన్నారు. నీకు యింకొకరిని చేసుకోవలె నని వున్న దేమో చెప్పవే !

మా: అయ్యో! పిల్లా! యేమిపోకిళ్లు పోతావే! వొకపంట నవ్వా, వొకపంట యేడుపూగా వున్నది నాపని. మీ అయ్యకు యింకొకరిని చేసుకోవలెనని వున్నదేమో అడుగు.

రా: ముందు తన నడిగితే నన్ను చెప్పమనడం యెందుకు? అదంతా యెందుకుగాని యెప్పుడూ నీవు మాఅమ్మవుగా వుండ వలసిందే.

జో: అయితే జన్మ కొకరిని ప్రేమించడంకంటే బంధుజాలం యావత్తూ మారకుండా వుండి ప్రతివాడికీ పూర్వజ్ఞానం వుంటూవుంటే బాగుండదా?

రా: యీజన్మలో వొకరికి బిడ్డగా పుట్టినవాడు మళ్లీ అతనికే బిడ్డగా పుట్టిన ప్రయోజన మేమి?

జో: యింకొకడికి పుట్టినందువల్ల యెంత ప్రయోజనమో మళ్లీ ఆతల్లిదండ్రులకు బుట్టినా అంతేప్రయోజనం. సుగుణాలు వృద్ధి పరచుకొని, దుర్గుణాలు పోగొట్టుకోవడమే జన్మయొక్క పరమార్థం. కాబట్టి యిప్పటిబాంధవ్యాలు ప్రేమవృక్షం పెంపుచెందడానికి కారణ మవుతూ దుర్గుణాలు నశించి సుగుణపుంజములకు స్థానాలై నిత్యలీలా విభూతిలో పాల్గొంటూ బృందావనంలో వుండడం నీ కిష్టమేనా?

పోలీసులూ, పౌలూ, పుల్లప్పను బేడీలతో తీసుకొనివచ్చి మాలక్ష్మినీ, రామదాసునూ 'లేచి వాకిట్లోకి ర'మన్నారు. వాండ్లు మెదలకుండా బయటికి రాంగానే 'మీమీద క్రిమినల్ కేసు వచ్చింది. మిమ్ములను అరెస్టుచేసి గుంటూరు తీసుకొనిపోవడానికి వచ్చాం' అన్నారు.

రా: మామీద కేసు యేమని?

పో: అదంతా విచారణలో తెలుస్తుంది.

పు: అతిరాలా మీరు చెప్పినట్లే బనాయించారు.

రా: పిల్లలు మావెంట రావచ్చునా?

పో: నీకూతురు సెటిల్మెంటులెఖ్ఖ దాఖలా యిక్కడ నివాసురాలు. కనుక అదిరావడానికి వీలు లేదు. కాబట్టితే పిల్లవాడిని జైలులో మీతో వుంచుకోవచ్చు.

రా : మాతో పాటు వాడికి కారాగృహవాస మెందుకు? ఆయుష్యముంటే స్వతంత్రుడై బతుకుతాడు. మాలక్ష్మీ! చిక్కాం మనమిద్దరం చివరకు. సద్గురూ! నడువు!

పో : నీకు బేడీలు వెయ్యనియ్యి.

రా : వెయ్యండి.

పో : ఇక పదండి.

జోతి ఏడుస్తూ కావలించుకోవచ్చింది. పోలీసులు నెట్టారు.

జో : నన్ని అడవిలో వదలిపెట్టి పోతున్నావటే!

మా : భగవంతుడే రక్షకుడు.

రా : శ్రీకృష్ణుడు నిన్ను రక్షిస్తాడు. ఆతడే శరణాగతి.

మా : మా అమ్మా! జోతీ! రంగణ్ణి కాపాడు.

రం : అమ్మా! నే వుండను.

మా : పట్టుకో వాణ్ణి.

రా : అమ్మా! గౌరవం కాపాడుమని నీకు చెప్పనవసరం లేదు.

జో : చెప్పనవసరం లేదు. లేదు. లేనే లేదు.

పుల్లప్పభార్యా, తల్లీ రామదాసుగుడిసెదగ్గర ఆగారు. గోలపెట్టి యేడ్చే రంగణ్ణి జోతి పట్టుకొని నిలువబడ్డది.

పోలీసులూ, పౌలూ, ముద్దాయిలూ రైలుస్టేషనుకు పోయినారు. మూడుగంటలకు గుంటూరులో దిగి డిప్యూటీమేజస్ట్రేటు కోర్టుకు పోయినారు. సబుయిన్స్పెక్టరు, ముద్దాయీలు ఆరోజు మధ్యాహ్నం సెటిల్మెంటు విడిచి పారిపోయినారనీ, పోలీసువారికి తెలిసి పౌలుతో సహా ముద్దాయీల వెంటబడి తాడేపల్లి కాపురస్థుడు రామిరెడ్డి చేనిదగ్గర పట్టుకున్నామనీ, సి. టి. ఆక్టుక్రింద చార్జిషీటు దాఖలుచేసి ముద్దాయీలను హాజరుపెట్టారు.

మే : యెన్నిరోజులు రిమాండు కావాలె?

పు : మాకు జామీను యిప్పించండి.

మే : మీకు జామీనేమున్నది? యిదివరకే సెటిల్మెంటులో నిర్బంధంలో నే వుంటిరి.

యి : సాక్షులు యిప్పుడే హాజరుగా వున్నారు. ఈరోజే విచారించవచ్చు.

మే : ముద్దాయీలకు కష్టం లేకుండా సాక్షుల నందరినీ యినస్పెక్టరుగారు యిప్పుడే హాజరుపెట్టారు. కేసు తొందరగా ఫయిసలు అయితే మీకే మంచిది.

పు : ప్లీడరును పెట్టుకుంటాం. వాయిదా యిప్పించండి.

మే : మీ సెటిల్మెంటువాండ్లు ప్లీడరును పెట్టుకోగల భాగ్యవంతులా ?

కోర్టులో హాజరుగావున్న ఒకప్లీడరు - సెటిల్మెంటుచుట్టూ చోరీలు బలమైనవి. ఆ స్త్రీకోసేవాండ్లు వీళ్ల వెంట వచ్చివుండాలె. వాండ్లే అన్ని యేర్పాట్లుచేస్తారు.

పు : ఆ ఆస్తి మీప్లీడర్లకుకూడా కొంత చెందుతున్నదిగా !

మే : వీ డెవడో గడుసువాడండీ !

ప్లీ : యిదివర కెన్ని శిక్షలుపడ్డవో ?

మే : వీరు కోర్టులో హాజరుగా వున్నారుగా ! వీరిని పెట్టుకోరాదా ? కేసు యివ్వాళనే పరిష్కార మవుతుంది.

పు : అయ్యా ! వారు మాకు వద్దు. కొనితెచ్చుకోవడ మవుతుంది.

రా : వా రెవరో మే మెరగమండీ !

మే : రేపటికి తెచ్చుకోండి. వాయిదా వేస్తా.

ముద్దాయీలు : చిత్తం.

## 17. వానప్రస్థం

డిప్యూటీకలెక్టరాఫీసునుంచి ముగ్గురు ముద్దాయీలనూ సబుజయిలుకు తీసుకొనిపోతున్నారు. దారిలో యెవరైనా మంగళాపురపువాండ్లు కనబడతారేమోనని చూచాడు. యెవరూ కనబడ లేదు. లాయరుమేడదగ్గర నారాయణరావుగారి గుమాస్తా యెదురుపడితే పంతులుగారున్నారా అని అడిగాడు. అందుకు వారు "సత్తెనపల్లి క్రిమినల్ కేసునిమిత్తం వెళ్లారు. యెనిమిది గంటలరైలుకు రావలె. వస్తే ఉదయం తప్పకుండా పదిగంటలలోగా సబుజయిలుకు వచ్చేటట్టుచేస్తా" నని చెప్పేరు. ఆయనగారి

రాకపోతే యింకొకరిని యేర్పాటు చేయుమని చెప్పబోయినాడు గాని "అయిదు గంటలైనది, లిమిటేషను కాగితాలు దాఖలు చేయవలె" నని వెళ్లిపోయినాడు. రామదాసు జయిలులో అడుగు పెట్టేవరకు తాం తాం అని అయిదుగంటలు కొట్టారు. అందుకు సంతోషించి వార్డరును బతిమాలుకొని ఒకరూపాయి యిచ్చి కూలి మనిషిని యేర్పాటుచేసి మంగళాపురం కబురుపంపాడు. వార్డరుతో మాట్లాడవలెనని అప్పుడే సబుజయిలుకు వచ్చిన పౌలు అనుమానపడి కూలిమనిషి వెంబడే అతనియింటికి వెళ్లాడు.

పౌ: బెజవాడ పోవటానికి యెవరైనా మనిషి దొరుకుతాడా?

కూ: మంగళాపురం పోవడానికి యిప్పుడే కూలికి వొప్పుకొన్నా. యెనిమిది గంటలరైలుకు పోతున్నా.

పౌ: యేమాత్రంకూలి తీసుకుంటారు బెజవాడకు?

కూ: మంగళాపురానికి ఖర్చులతోసహా రూపాయికి వొప్పుకొన్నా.

పౌ: నాకు బెజవాడకు పొయ్యేమనిషి నేర్పరుచు, రెండు రూపాయిలిస్తా. పొద్దున యెనిమిదిగంటలకు రావచ్చు. ఖర్చులుపోను రూపాయిన్నర మిగులుతుంది.

కూ: అయ్యో! మిగలా వొప్పుకొంటినే. ఆం—యే మంటారు?

పౌ: పొద్దున యెనిమిదిగంటలకు సరాసరి రైలుమీదనే మంగళాపురం పోదువుగాని, రెండుకూలిభత్యాలూ నీకే దక్కుతవి. నావుత్తరం తీసికొనిపోవలసిన మనిషి స్టేషన్‌దగ్గర మార్వాడీ సత్రం లోనే వుంటాడు. పోయి అక్కడ పడుకో. తెల్లవారేవరకు అక్కడికి వస్తాడు. రాంగనే ఆయన కిచ్చి రైలుకు రా.

కూ: నాకు రైలు అందుతుందా?

పౌ: అంద కేమి? నాలుగుగళ్లపొద్దెక్కిగాని బండి బయలు దేరదు. తిరుగు జవాబు తెచ్చావా అంటే రూపాయి బహుమతి యిస్తా. నాది చాలా అవసరమైనపని. అన్నం దిని రైలుకు బయలుదేరు. నేను రైలుదాకావచ్చి యెక్కిస్తా.

కూ: సరే.

కూలిమనిషిని యేర్పాటు చేసుకొన్నతరువాత రామదాసుకు ధైర్యం వచ్చింది. అతనినీ, పుల్లప్పనూ, మరి నలుగురు యెరుకల వాండ్లనూ కలిపి వొకగదిలో వేశారు. మాలక్ష్మి నొక్కదానినీ వేరేగదిలో వేశారు. అందరికీ ముంతలూ, అన్నపుమల్లలూ యిచ్చారు. జొన్నన్నపుముద్దా, చప్పని పులుసుకూరా భోజనం పెట్టారు. పుల్లప్ప తినడం చూచి తన కిచ్చినపడి యావత్తూ తిన్నాడు. మాలక్ష్మి వొంటరిది గావడంచేత తినలేకపోయింది. లఘు గురు శంకల నివ ర్తికోసం రెండుమల్లలూ, పడుకోవడానికి కొబ్బరి నారచాపా, గొంగడీ ప్రతివాళ్లకూ యిచ్చారు. భోజనం కావడంతోటే కొట్లో పెట్టి తాళం వేశారు. ఖైదీలందరూ కాసేపు లోకాభిరామాయణాలు చెప్పుకొని చీకటిపడంగానే చుట్టలు ముట్టించారు. కొందరికి పొగాకు వార్డరే తెచ్చియిచ్చాడు. పుల్లప్ప బొడ్డులో దాచుకున్న కాసీపెట్టి వొక పొగాకుతుంపు కొనుక్కొని నోట్లో వేసుకున్నాడు. గది పొగతో నిండి రామదాసుకు కొరపోయింది. చుట్టలు గాల్చినతర్వాత కొందరు సంగీతాలు మొదలుపెట్టి బూతుపాటలు సాగించారు. ఒకడు తాను జేసిన దొంగతనాలన్నీ వర్ణిస్తున్నాడు. రామదాసుగదిలో వున్న యెరుకల వాండ్లు వొకరిపొగా కొకరు దొంగిలించుకొని కొట్టుకున్నారు. సంగీతాలు పూర్తి అయ్యేవరకు పదిగంటలయింది. మధ్య మధ్య పోలీసులు వచ్చి అదమాయించారు గాని వాళ్లమాట లెవ్వరూ లక్ష్యపెట్టలేదు. అందరూ వుచ్చమల్లలు నింపి క్రమక్రమంగా నిద్రపోయినారు. గది యెరుకలవాండ్ల వొంటికంపూ, మూత్రపు కంపూ, పొగకంపూ గలిసి రామదాసుకు దుస్సహమైంది. పుల్లప్ప మాత్రం తొమ్మిది గంటలకల్లా నిద్రపోయినాడు. "ఉత్తరం మంగళాపురం చేరివుంటుందేమో ? అప్పాదాసుకు యెట్లావున్నదో! జోతీ పిల్లవాడూ పస్తుపడుకున్నారేమో ? యింకా యేమిఅల్లరులు జరుగుతున్నవో ? సెటిల్మెంటులో జనం అంతా భయపడ్డారేమో!" అని కలగలుపులుగా ఆలోచనలు వస్తూవుంటే యోచించుకుంటూ ౧౨ గంటలవరకూ నిద్రపోలేదు. ఒంటిగంట వినబడ్డది. దోమలు కుట్టుతుంటే గొంగడి కప్పుకున్నాడు. ముఖాన కుట్టడం ప్రారంభించినవి. గొంగడి ముఖాన కప్పుకోవడానికి చాలలేదు. వత్తిగిలి

ముచుడుకొని పడుకుంటే చెమట ప్రారంభించింది. గొంగడి యెన్నాళ్లనుంచో యెంతమందో కప్పుకున్నారు. యెన్నడూ ఉతికిన పాపాన పోలేదు. నీళ్లలో ముంచితే వున్ని అంతా వూడిపోతుంది. రాలిపోతున్న బొచ్చు ఘాటుకంపుతో నోట్లో, ముక్కులో జొరబడుతున్నది. గది కెక్కడా గాలివచ్చేవైపు కిటికీలు లేవు, చేతుల కందకుండా కప్పుకు ఆనుకొనివున్న చిన్నకిటికీని జల్లెడ రేకుతో మూశారు. వాకిటిదగ్గరకు జవానువచ్చి లోపలెవరో మేలుకొన్న సడి విని గోడకురంధ్రం చేస్తున్నారేమో అని చేలాంతరు వెలుతురున పరీక్షించి అందరినీ లెక్కపెట్టుకున్నాడు. సర్కారుపడిప్రకారం కూరలో నువ్వులనూనె పోయడంచేత రామదాసుకు కడుపులో కళపెళ్లాడడం మొదలుపెట్టింది. నూనె తిరుగమోతలో వెయ్యవలసినా పచ్చినూనె పోశారు. బహిర్భూమికి పోవలసివచ్చి తన మల్లలు దేవులాడుకున్నాడు. మూత్రపుమల్లలో చెయిపడ్డది. దానిధర్మాన నీళ్లముంత బోర్లపడలేదు. పక్షాళనమైనతర్వాత మిగిలిననీళ్లు తాగడం యింకా అలవాటు కాలేదు. ఉక్కకు దప్పికై నిలువలేక ఆనీళ్లే తాగాడు. కక్కసుమల్ల యెత్తుగా వుండటంవల్ల. కూర్చోవడం కష్టమై నేలకు చేతులానించి వొంగున్నాడు. ప్రక్షాళనం చేసుకోబోతే మడుగుపడ్డది. అందరూ కడుక్కుంటే గది వరదగటుతుందేమో అనుకుంటే తక్కినవాళ్లు వట్టిముంతలే తెచ్చి లోపల బెట్టుకున్నట్టు జ్ఞాపకంవచ్చింది, యెవరినీ నీళ్లు తెచ్చుకోనియ్యలేదు. నీళ్లగంగాళం వొట్టిదికూడా అయింది. గదిలో వాసన వ్యాపించకుండా వొకమల్లమీద రెండవది మూత పెడదాం అనుకుంటే వొకటి చిన్నదై దూరిపోయింది. పెద్దది మూత పెడితే దొర్లి గది కశ్మలం అవుతుందేమో అని తెరిచేవుంచాడు. తెల్లవారుజాముకు దోమలపోరు కొంచె మణిగి కూరుకుపట్టింది. నాలుగుగంటలైంది. ఒకరితర్వాత ఒకరు అందరూ అనుమానం తీర్చుకోవడం ప్రారంభించారు. యెవరూ నీళ్లుపయోగించినట్టు కనపడలేదు. ౧౮ చిప్పలలోనుంచీ దుర్గంధం రేగింది. సార్జంటు ఉదయం అందరినీ లెక్కపెట్టుకోవడంకోసం వచ్చి ముక్కుకు గుడ్డ అడ్డం పెట్టుకొని చేలాంతరుపెట్టి అందరినీ వుండజూచుకొన్నాడు. లాంతరువెలుతురున ౨౦ మళ్ళ బరువుగల యినపతలుపు పుల్లప్ప

చేసినజైలువర్ణనను జ్ఞాపకానికి తెచ్చింది. గది పారజూశాడు. కడపరాళ్లు, సున్నంతో బిగించిన రాతిగోడలమీద ఉకుతనాబీలు, గుంటూరులో యేభాగ్యవంతునిభవనానికీ అంతచక్కగా అమర్చ లేదు. అవి చూచి రామదాసుకు సంతోషం కలుగలేదు. ఆరు గంటలు కొట్టంగనే తలుపులు దీసి అందరినీ బయటికి రమ్మన్నారు. అందరూ మూత్రపురీషపాత్రలు తీసుకొని బయలుదేరుతుంటే విచ్చు కత్తులూ, తుపాకులూ తీసుకొని జవానులు కాపలాకు వెంటవస్తు న్నారు. రామదాసుకు నవ్వువచ్చింది.

రా: అయ్యా! ఖజానాపెట్టెలకుకూడా యింత బందో బస్తుగా కాపలా చెయ్యరే! ఈమల్లలకు విచ్చుకత్తులఫారా లెందు కండీ?

పు: వాటికోసం కాదు. మనం పరుగెత్తిపోతామని భయం!

అందరూ పాకీదొడ్డిదగ్గర దింపారు. అందరినీ పాకీదొడ్లోకి పొమ్మన్నారు. రామదాసు "నేను ముంత తెచ్చుకోలేదు. బహి ర్భూమి కెట్లా పోవడం?" అన్నాడు. "మాలపోతుకు నీళ్లు కావలసి వచ్చిందా!" అని పోలీసువాడు తుపాకీమడిమెతో పొడవవచ్చాడు. ఒకయెరుకలవాడు "యీమాలనాయుడికి కొట్లోపడ్డా నీళ్లుకావలసి వచ్చిం" దని యెగతాళిచేశాడు. అందరూ పాకఆవరణంలోకి పోయినారు. లజ్జారహితులై పాకరిబుజాల కొకరు ఆనుకొని కూర్చున్నారు. రామదాసుకు మనసొప్పలేదు. ఊరక నిలువ బడ్డాడు. నీళ్లుకూడా లేకపోవడంచేత ఊరుకుందా మనుకున్నాడు. అందరూ "నాయుడుగారు. నిలుచున్నారే!" అని యెగతాళి చేశారు.

నాలుగైదునిమిషాలయింది. బయటనుంచి పోలీసులు "లెండి" అని వుత్తరువు చేశారు. అందరూ లేచి బయటికి వచ్చారు. "లోపలికి పోయి ముంతలూ, బువ్వమల్లలూ తెచ్చుకోను పదండి" అని వుత్తరు వయింది. అందరూ తెచ్చుకొని బొగ్గుపొడి పెట్టి కొందరు పండ్లు తోముకున్నారు. తలా ముంతెడునీళ్లిచ్చారు. రామదాసు బొగ్గునూరుకుండేవరకు గంజికి రమ్మన్నారు. మొగం కడుక్కుంటూ ఆలస్యం చేశాడని పోలీసువాడు తుపాకిమడి మెత్తాడు. నిన్నటి

పోటుకు గూడుమీదకట్టిన కదుం యింకా పోలేదు. లేచి నలుగురితో పరుగెత్తాడు. అందరూ గంజి పోయించుకొని తాగడానికి కూర్చున్నారు. రామదాసు నోటిలో వేసుకొన్న బొగ్గు పోవడంకోసం నోట్లో నీళ్లు పోసుకొని "దూరంగా పోయి వుమ్మివేసి రావచ్చునా?" అని పక్కన కూర్చున్న పుల్లప్ప నడిగాడు. లైను వదలగూడ దని అత డన్నాడు. అందువల్ల మెల్లగా వుమ్మివేసేవరకు పక్కనుంచి వార్డరు చూసి అన్నం దినేచోట గలీజు చేస్తున్నా వని ప్రహరించాడు. అందరితోపాటు గంజితాగడం ముగించడానికి త్వరగా తాగేవరకు కొరమారింది. అంతా మల్లలు కడుక్కొని మిగుల్చుకున్న నీళ్లు దీసికొని కొట్లల్లోకి నడిచారు. తాళాలువేసి పోలీసులు విశ్రాంతి తీసుకుంటున్నారు. పోలీసుహ్వాడావిడి అణిగినతరువాత రామదాసుకు స్వస్థచిత్తం గలిగింది. పుల్లప్ప ఖైదులో అనుభవం గలిగినవాడుగనుక వార్డరును పనివున్నవాడివలె పిలిచి "నారాయణ రావుగారు అనేప్లీడరుగారు వచ్చారా?" అని అడిగాడు.

వార్డరు: వారు యిప్పు డెందుకు వస్తారు. కేసు లుంటే మేజస్ట్రేటుగారు వచ్చినతరువాతగాని రారు.

రా: వారిని ప్లీడరుగా కుదుర్చుకోవలెనంటే యేమి చెయ్యాలె?

వా: వందరూపాయి లిట్లియ్యి, నే గుదిర్చి పెడతా.

రా: మీరు పంపినమనిషి వస్తేగా?

వా: మరి ప్లీడరు మాటలతో వస్తాడా?

రా: నారాయణరావుపంతులుగారు న న్నెరుగు. నే నీఅవస్థలో వున్నానంటే తప్పకుండా వస్తారు. అన్నిటికీ నేను సమర్పకం చెప్పుకుంటా.

వా: నేను బయటికి పోతే మీ రంతా పస్తుపడుకోవాలె. మీవాండ్లకు మనిషిని పంపించావుగదా. వాండ్లు వస్తే వాండ్లే మాట్లాడుతారు. లేకపోతే పెద్దమనుష్యుల నెందుకు శ్రమపెట్టడం? ఒకగంటలో రైలుకూడా వస్తుంది.

రామదాసు తన చాపమీద యేదో ఆలాపనగా కూర్చుని యేమీతోచక పడుకొని నిద్రపోయినాడు. రాత్రి నిద్రలేకపోవడం

చేత బాగా నిద్రపట్టింది. కొంతసేపటికి లేచి "రైలు వచ్చిందా?" అని అడిగాడు.

పు: యేరైలు?

రా: పడమటినుంచి యెనిమిదిగంటలకు వచ్చేరైలు.

పు: యీపాటికి బెజవాడ పోయివుంటుంది.

రా: నాకోసం యెవరూ రాలేదా?

యెరుకలవాండ్లు: గొప్ప ఉద్యోగస్థు లంతా "మాల నాయుడుగా రున్నారా?" అని అడిగితే వారు నిద్రపోతున్నారనీ, లేపడానికి వీలులేదనీ చెప్పాం. మళ్ళీవస్తామని వెళ్ళారు.

రా: యెందుకయ్యా అయినదానికీ, కానిదానికీ నన్ను మీరు యెద్దేవచేస్తారు?

యెరు: కాకపోతే మాలపోతుకు నీకీ పోకళ్ళేమిటి? యెవరో మహా నీకోసం వచ్చేటట్టు, వారు వచ్చారా? వీరు వచ్చారా అని పస్తైలు వేస్తుంటావు. అంతా నిన్నుజూచి బెమిసిపడుతున్నా రనుకున్నావా?

రామదాసుకు – నాయుడుగారు రావడం విషయమై ఆదుర్దాపోయి మనస్సు ఆత్మపరీక్షలో మగ్నమైంది. "యీ యెరుకలవాండ్లు నే నిక్కడికి వచ్చినప్పటినుంచీ అకారణంగా నామీద కంటుగా వున్నారు. నన్నుజూచి హేళనగా మాట్లాడుతారు. నిందాస్పదమైన విషయం నాలో యేదో వాండ్లకు కనబడుతున్నది. మహోద్యమాలతో నాకు సంబంధం వుండడంవల్ల తద్వారా పెద్ద వాండ్లతో నాకు పరిచయము గలుగుతున్నది. నేను నాస్థితిగతులను బట్టి వారిస్నేహానికి అనర్హుడనైనా, నాకు లభించిన ఉత్తమపురుష సాహచర్యంవల్ల నేను గర్వించి ఆగర్వాన్ని నామాటలలోనూ, చర్యలలోనూ నిశ్చయంగా కనపరుస్తుండబట్టే భగవంతుడు నన్ను బాగుచేయడంకోసం యెరుకలద్వారా యెరుక గలిగించాడు. ఇక నాయుడుగారు వచ్చేవిషయం నేను యోచించను. వా రెందుకు రావాలె? లేనిపోనిశ్రమ వారి కెందుకు? యింతవరకూ నా కాత్మ పారిశుద్ధ్యం రాలేదు. నేను కర్మ సాపేక్షకంగా చేస్తున్నాగాని సంగరహితుణ్ణి గాలేదు. నాతో జోతినీ, రంగణ్ణీ దేవుడు విడదీశాడు. నిస్సంగత్వం యింకా నాకు కుదరదా? ప్రపంచంలో నాకింకా

యేమి సంబంధం వున్నది ? అయితే సన్న్యాసానికి నే నర్హుడనా ? మాలక్ష్మి సెటిలుమెంటులో వుండక యిక్కడి కెందుకు వచ్చింది ? ఇంకా కొంత కాలం వానప్రస్థుణ్ణిగా ఉండవలసి వున్నదేమో ! గార్హస్థ్యానికీ, సన్న్యాసానికీ మధ్య ఒక మెట్టు ఉన్నది. ఈ మెట్టు దాటే రోజులు నా కింకా రాలేదు. కాని యీరోజునుంచీ వానప్రస్థుడనే. కారాగృహవాసం వనవాసానికి బదులుగా వచ్చింది. ఆహా ! భగవానుడా ! ఏమి నీ అద్భుతచర్య ! నీ బిడ్డల వర్తన ఎంత చక్కటిమార్గాల దిద్దుతావు ! పైకి ఆపదలమోస్తరుగా తెచ్చిపెట్టి వాటిని మహావరములుగా మారుస్తావు ".

రామదాసు ఈ అవస్థలో ఉండగా పుల్లప్ప ఎరుకలతో రామదాసుచరిత్ర చెప్పాడు. ఎరుకలవాండ్లు స్టూవర్టుపురం సెటిల్మెంటులో ఉండేవాండ్లు. తప్పించుకొనిపోయిన ఆరునెలలకు కర్నూలు జిల్లా నల్లమలలలో తక్కెళ్ల జగ్గడిగుంపుతో జేరి చోరీలుచేస్తూ పట్టుబడ్డారు. నేరాలు చేసినట్టు సాక్ష్యం గుదరక సెటిల్మెంటులోనుంచి తప్పించుకుని పోయినందుకు విచారణ జరుగుతున్నది. వాండ్లు రెండు నెలలనుంచీ రిమాండులో ఉన్నారు. ఇప్పటికీ విచారణ పూర్తి కాలేదు. ఈ ఏడుగురిలో నాయకుడు జగ్గడిని స్వయంగా ఎరిగినవాడు. వాడి చర్యలన్నీ రెండునెలలనుంచీ ఖైదీలకూ, పోలీసులకూ వర్ణించి చెప్పుతున్నాడు. వాడికి తోచిన సంగతులు చెప్పడంతప్ప జగ్గడినిగురించి ఇతరు లడిగిన ప్రశ్నలకు జవాబు చెప్పడు. ఎంతసేపూ అతణ్ణి పొగడడం తప్ప జాడాలు తనకు తెలియవంటాడు. రామదాసు దిగువతరగతులకోసం పనిచేసేవాడనీ, సెటిల్మెంటు వాస్తవ్యుల కష్టాలు నివారించడంకోసం పనిచేస్తూ ఖైదుపాలైనాడనీ తెలిసి ఎరుకలు తమ రాయనను వ్యాఖ్యానం చేసినందుకు చింతపడ్డారు. పదిగంట లయింది. భోజనంకోసం గంట కొట్టారు. రామదాసు ఇంకా తనధోరణిలోనే ఉన్నాడు.

పు : రామదాసుగారూ ! భోజనానికి వేళయింది.

రా : అట్లాగా, లేతాం. ఏదో పరధ్యానంగా ఉన్నా.

ఎరు : (సాగిలపడి)—సామీ ! తెలియక తప్పుచేశాం. ఈ తప్పు గాయి సామీ ! (అని చెంపలు వేసుకొంటున్నారు.)

రా : నాయనా! మీ రేమీ తప్పు చేయలేదే? మీరు నాకు గురువులు. మీరు నమస్కారం చేయగూడదు.

ఎ : సామీ! ఈతప్పు కాచానంటేనే లేస్తాం. లేకపోతే బువ్వలేకుండా ఎన్నాళ్ళయినా ఇట్లాగే వటిస్తాం.

వార్డరూ పోలీసులూ వచ్చి తలుపు తీశారు. ఈ దృశ్యం చూచి విభ్రాంతిపడిపోయినారు. రామదాసు తెల్లపోయి గాబరా పడుతున్నాడు.

వార్డరు : ఏమిటిది?

పు : ఆ మహానుభావుణ్ణి హేళనచేసి తప్పు తెలుసుకొని పశ్చాత్తాపపడి తప్పు గాచమని వేడుకొంటున్నారు.

వార్డరు : చూడూ వాండ్ల మోటుభక్తి! ఈయన ఎవరు?

పు : మంగళాపురం. రామదాసుగా రని, మహాజ్ఞాని.

వార్డరు : సంగదాసుతండ్రా ఏమి?

పు : అదేమో నాకు తెలియదు.

వా : అడుగు. ఆయనా దుఃఖపడుతున్నారే!

పు : వాండ్ల పశ్చాత్తాపం చూసి ఆయనకూ ఆశ్చర్యం వేసింది. ఆకన్నీళ్లు ఆనందంచేత. అయ్యా! రామదాసుగారూ! సంగదాసుగారుట మీకు బంధువుడా?

రా : ఏదో! మా గర్భవాసాన జన్మించాడు. దానికి మా యోగ్యతేమీ కారణంగాదు.

వా : అయ్యా! మా జైలు పవిత్రమైంది. మళ్లీ రామదాసుగారే ఖైదులో బడ్డారు. మాతప్పులు క్షమించండి. మాకు గూడా తమ రాకవలన తరణోపాయం గలిగింది.

రా : అయ్యా! తమ మంచితనంచేత ఆమాట లంటున్నారు. నాయందంత యోగ్యత లేదు. మీరు లేవండమ్మా, మీవల్ల నాకు మహోపకారం గలిగింది.

వా : వాండ్లపట్టే పట్టు. మోటుభక్తిలో అంత బలమున్నది. క్షమించా ననండి.

రా : లెండమ్మా! మీరు చేసినతప్పే లేదు.

ఎ : (చెంపలు వేసుకుంటూ యేడుస్తూ) చేశాం సామీ! అపచారం చేశాం సామీ!

రా: ఆహా! యేమి వాండ్ల పశ్చాత్తాపం! అటువంటి నిష్కల్మషబుద్ధి నా కుండరాదూ? మీరంతా రామా అనుకోండి మీ తప్పులన్నీ పోతవి.

ఎ: రామ! రామ! చాలు సామీ! మంత్రం దయచేశారు.

రా: (పరవశుడై)

కీర్తన

అంతా రామమయం యీజగ-మంతా రామమయం
అంతరంగమున ఆత్మారాముఁ డ-నంతరూపముల వింతలు సలుపగ॥ అం.

(అంటూ నృత్యంచేశాడు)

పోలీసులూ, వార్డరూ, పుల్లప్పా, యెరుకలూ పరవశులై అంతా నృత్యం చేశారు. జైలు రామనామంతో ప్రతిధ్వనించింది.

రా: అయ్యా! మనకు వేళవుతున్నది. ఎవరిపని వారు చూసుకోండి. ఒక్క-క్షణం ఆలస్యం చేయవద్దు.

వా: అయ్యా! నాయుడుగారు వచ్చినట్టు లేదే! రైలు వచ్చి చాలాసేపయింది. కనుక్కోని మళ్ళీ మనిషిని పంపనా?

రా: అవసరం లేదు. వారితో ఇప్పు డేమీ పని లేదు.

వా: ప్లీడరును ఏర్పాటు చేస్తాం.

రా: అవన్నీ డబ్బుతో జరగవలసిన వ్యవహారాలు. అవసరం లేదు.

వా: ఏదోవొకవిధంగా ఏర్పాటుచేస్తే సరిగా! నారాయణ రావు పంతులుగారు తమసంగతి వింటే ఏమీ అవసరంలేకుండా వస్తారు.

రా: వద్దు. వారితో ఈ విషయంకూడా చెప్పవద్దు. కారాగృహవాస మంటే ఎవరూ తప్పించ లేరు. లేకపోతే ఎవరూ అవసరం లేదు.

ముగ్గురు ముద్దాయీలనూ వెంటనే వార్డరు స్నానం చేయించి పూటకూలింటినుంచి భోజనం తెప్పించిపెట్టాడు. రామదాసు అక్కరలేదన్నా వార్డరు వినలేదు. భోజనం కాంగనే పదకొండు గంట లయ్యేసరికి ముగ్గురినీ కోర్టులో హాజరు పెట్టారు. పోలు సాక్షు లను తయారుచేసుకుని కోర్టుకు హాజరైనాడు. క్రిందటిరాత్రి పోలు

ఉత్తరం దీసికొనిపోయి మేజస్ట్రేటుగారికి చూపించినందువల్ల ఆయన కోర్టుకు వచ్చినవెంటనే మొదట ఈ కేసే ఎత్తుకున్నాడు.

మేజ : ప్లీడరుగారు ఏరీ?

పు : లేరండీ. కుదిర్చేవాం డ్లెవరూ లేకపోయినారు.

పోలు : లేకేమండి! చోరీసొత్తులు కొనేవాండ్లు వచ్చారు. కొందరికి కబురుకూడా పంపించుకున్నాడు. కోర్టువారికి అనుమానంగా ఉంటుందని ఎవరూ లేనట్టు నటిస్తున్నాడు.

కోర్టు : అంతమాత్రానికే మేము మోసపోతామా?

రా : కోర్టువారిని మోసం చేయడానికి నే ప్రయత్నించను. న్యాయం చేయవలసిం దని మిమ్మును తక్తుమీద కూర్చోబెట్టారు. న్యాయం చెయ్యండి.

కోర్టు : చాలా అతిశయంగా మాట్లాడుతున్నావే. నీ కింకా ప్లీడ ర్లెందుకు? ఆరి తేరినట్లే కనబడుతుంది.

పు : తమ చిత్తం వచ్చినట్టు కానియ్యండి. అవతల దొర గారు అన్యాయానికి తలపడి కూర్చున్నాడు. దానిమీద మామాట లేమి అనుతవి?

కోర్టు : నోరు ముయ్యి! నిన్ను ప్రాసిక్యూషన్ చేయిస్తా, మళ్ళీ మాట్లాడితే. సెటిల్మెంటొకటి అడ్డం పెట్టుకొని లూటీలు కొట్టడం అనుకున్నావా? ఇన్‌స్పెక్టరుగారూ! సాక్ష్యం పెట్టండి.

పోలును మొదటిసాక్షిగా విచారించారు. ముద్దాయిలు తప్పించుకొని పోతున్నారని తెలిసి పోయి పట్టుకున్నామని చెప్పాడు.

కో : సవాళ్లు వేసుకోండి.

పు : మేము ఎంతదూరం పోయినతరువాత మీకు తెలిసింది?

పో : ఒక ఫర్లాంగు పోయినారు.

పు : అంతదూరం ఎట్లా వచ్చి మమ్మును కలుసుకోగలిగారు?

పో : ముసలివాడు పరుగెత్తలేకపోయినాడు. వాణ్ణి ముందు పట్టుకున్నాం. తరువాత పగ్గంమేర దూరంలో మట్టిమేరువ పోసి ఉంటే ఎక్కి జారిపడ్డావు. మా కేకలు విని రెడ్డి వచ్చి కిందబడ్డ నిన్ను పట్టుకున్నాడు.

పు : ఇదంతా వట్టి కల్పనండీ!

కో : అవునులే కానియ్యి.

పు : నా భార్యా, తల్లీ మీ సెటిలుమెంటులో ఇప్పటికీ ఉన్నారా ?

పౌ : ఉన్నారు.

పు : నేను వాండ్లను వదిలిపెట్టి ఎట్లా పోతున్నాను ?

కోర్టు : ఆసంగతి అతని కెట్లా తెలుసు ?

పు : అసలు నేను ఎందుకు వదిలిపెట్టిపోతానండీ ?

పౌ : అయ్యా! వీడు సోదారకం. వీడు వదిలితే, కూలి చేసుకొని నిమ్మళంగా బతుకుదామని వాండ్ల ఉద్దేశం. వీడు పోయినాడని వాండ్లెవరూ విచారపడడంలేదు.

పు : రామదాసుగారు తనకూతురిని నీ కియ్యమంటే వల్లగాదన్నాడుగాదూ ?

కోర్టు : ఆసంగతి అత నడుగుతాడులే! ఇంకా ఏమైనా ఉన్నవా ?

పు : లేవు.

కోర్టు : రెండవముద్దాయీ! నీ వేమైనా అడుగుతావా ?

రా : అడిగి ఏమి ప్రయోజనం ? నా కేమీ ప్రశ్నలు లేవు.

కోర్టు : పై ప్రశ్నకు జవాబు చెప్పు.

పౌ : నే నడగనూలేదు. ఆయన ఇవ్వననునూలేదు.

కోర్టు : మూడోముద్దాయీ! నీ వేమైనా అడుగుతావా ?

మాలక్ష్మి : నాకు తెలియదు.

కోర్టు : రెండోముద్దాయీ! పౌలు నిన్ను నీకూతురు నియ్యమని అడిగాడా ?

రా : నన్ను ప్రత్యక్షంగా అడగలేదు.

తక్కిన సాక్షులు చాలాభాగం ఇంతే చెప్పారు. ఒక కానిస్టేబిలు సవాళ్ళకు మొదటిసాక్షి చెప్పిన జవాబులు ముందుగా పరుగెత్తిపోయి తక్కినవాండ్లకు నేర్పివచ్చాడు. పరస్పరభేదాలు అంతగా కనబడలేదు.

కోర్టు : సాక్ష్యం విన్నారుగదా, ఏమి చెప్పుకుంటారు !

ము : కేసు కల్పించారండి.

కోర్టు : ఎందువల్ల ?

ము : విరోధం.

కో: ఏమి విరోధం?

ము: పౌలు చెప్పిన మాటకు ఎగ రిస్తామని.

కో: మీమీద నేరం చేసినట్లు మోపుదలచేశాను. ఏమి చెపుతారు?

ము: ఇందాకా చెప్పినవే,

కో: సాక్షు లున్నారా?

ము: దేనికి?

కో: మీ వాదం ఋజువుచేసుకోవడానికి.

ము: లేరు.

కో: (తీర్పు వెంటనే వ్రాసి) ఒకటోముద్దాయి పుల్లప్పకు ఒకసంవత్సరం, రెండు మూడు ముద్దాయీలకు చెరి ఆరునెలలూ కఠినశిక్ష విధించాను. తీసికొనిపొండి.

ముగ్గురు ముద్దాయిలనూ సబుజైలుకు తీసుకొనిపోయినారు. మరురోజు ఉదయమే నిడదవోలు జిల్లాజైలుకు తీసుకొనిపోవడానికి ముగ్గురినీ ఎనిమిదిగంటలకు బయలుదేరే బెజవాడబండికి తీసుకొని వచ్చారు.

## 18. రాగమా రోగమా?

తాలూకా జయిలువార్డరు రామదాసుకు శిక్ష పడ్డదని తెలియడంతోటే దుఃఖించి రామానాయుడు రాకపోవడానికి కారణం కనుక్కోవలెనని కూలివాడి ఇంటిదగ్గర విచారిస్తే వాడా రాత్రి జబ్బుచేసి మంగళాపురం పోలేదనీ, పగలు పన్నెండుగంటలకు పోయినాడనీ తెలిసింది. సంగతి తెలియంగనే రామానాయుడూ, వెంకటయ్యా, అప్పాదాసూ, ఇతర కూలీనాయకులూ రాత్రి ఎనిమిదిగంటలబండికి గుంటూరు పోవడానికి బయలుదేరారు. కోటమ్మ మొదలైనవాళ్ళు "మహానుభావుడు దూరంగా బోతున్నాడు. దర్శనం అయినా చేసుకొనివత్తా" మని బయలుదేరారు. గుంటూరు వచ్చి వార్డరును కనుక్కుంటే ఉదయం బెజవాడబండికి తీసుకొనిపోతారని చెప్పాడు. జనం అంతా రాత్రి తాలూకా ఆఫీసుకు ఎదురుగా రోడ్డుమీద "మహాత్మాగాంధీకీ జయ్! రామదాసుకూ జయ్!" అంటూ పడుకొని ముద్దాయీలను రైలుకు తీసుకొనిపోయేటందుకు బయటికి

దీయంగనే గుమిగూడి వాళ్ళ వెంబడే రైలుస్టేషనుకు బోయినారు. రామదాసుతో అప్పాదాసునూ రామానాయుడూ వెంకటయ్యలనూ మాత్రం మాట్లాడనిచ్చారు. రామదాసు తాను సెటిల్మెంటులో ప్రవేశించినప్పటినుంచి అప్పటివరకూ జరిగిన సంగతులు యావత్తూ తెలియబరచాడు.

వెంకటయ్య : మీరు చేసిన ప్రయత్నాలూ, ఈ పర్యవసానం మీ జీవితానికి కిరీట మని భావిస్తాను.

రా-నా : ఈ కష్టాలు మీ ఆత్మోపలబ్ధికి తోడ్పడుత వను కుంటాను.

వెం : అప్పీలువల్ల ఏమైనా ప్రయోజనం ఉంటుందా ?

రా : ఏమీ ఉండదు. మా తరఫు సాక్ష్యం లేదు. వాండ్ల తరఫున వచ్చినవాండ్లు బాగా తయారై చెప్పారు. సవాళ్ళుకూడా విశేషం అడగలేదు.

వెం : ఇప్పుడు మేము చేయవలసిన దేమి ?

రా : జోతి కషాయం జరగడం నిశ్చయం. వెంటనే పిల్లల నిద్దరినీ అక్కడనుంచి తొలిగించే సదుపాయం చూడండి. అప్పడి ఆరోగ్యం ఎట్లా ఉన్నది ?

వెం : (నవ్వుతూ) అప్పడికి రోగమైందీ, రాగమైందీ తెలియ లేదు.

అప్పడు : ('హా, హా' అని నవ్వి) తత్సంబంధమే!

రా : నాయుడుగారూ! పిల్లలను ముగ్గురినీ కాపాడేభారం మీదే.

అ : యిక్కడ నే ఉండను. ఏటివొడ్డున ఇల్లు కట్టుకుంటా.

"నీకు నీవారు లేరు, నాకు నావారు లేరు
ఏటివొడ్డున ఇల్లు కడదం పదరా."

మామా! పదం బాగుందా ?

రా : సద్గురూ! నీ దయ ఎట్లా ఉన్నదో ?

రా-నా : పిల్లలు స్వాధీనపడడానికి కలెక్టరుదగ్గర పిటీషన్ పెట్టించుతా. అది ఫయిసలు అయ్యేవరకు కొన్నాళ్ళు పట్టవచ్చు. పీలైతే తీర్పు చెప్పేవరకూ మైనర్లను కోర్టువారి స్వాధీనంలో ఉంచు

కొనేటట్లు కోరుతాం. అందాకా ఎవరినైనా జతచేసి దాసును తాడేపల్లిలో ఉంచుదామని చూస్తున్నా.

అ : ఏటివొడ్డున యిల్లు కట్టుకుంటా. ఏమి మామయ్యా?

రా : ఏదో చూడండి. నావల్ల అయ్యే దేమున్నది?

వెం : నీవు ఆశీర్వదిస్తే అన్నీ నెరవేరుతవి.

అంతా రైలుస్టేషన్‌దగ్గరకు వచ్చారు. జనాన్ని లోపలికి రానియ్యలేదు. జనం పెండెం నెట్టుకొని లోపలికి రావలెనని చూశారు. రామదాసు నిలిచి అందరిదగ్గరా సెలవుపుచ్చుకున్నాడు. కోటమ్మ మేరువమీద నిలబడి "రామదాసూ! నేను నిలుస్తా" నన్నది.

రా : కోటమ్మగారా! నమస్కారం. ఈయేడు అయ్యగారి ఆరాధనకు నే నుండనుగదా! (అని కేకవేసి చెప్పాడు.)

జనం అంతా ఆగిపోయింది. రైలు కదిలే వేళ అవుతున్నదని పోలీసులు తొందరించి బండిలో ఎక్కించారు. నాయుడూ, దాసూ, వెంకటయ్యా అలవాలు తిరిగి లోపలికి వచ్చారు. రైలు కదిలే సమయం అయింది.

రా-నా : ఏమమ్మా మహాలక్ష్మీ! ఏమి చెప్పుతావు?

మా : ఆ పిల్లవాణ్ణి చూస్తే గుండె దరించుకొనిపోతున్నది. మళ్ళీ మనలోకంలో పడేనా?

అ : ఊఁహూ. నాకీ లోకంతో పని లేదు. వెళ్ళుతా; ఇదే సెలవు.

వెం : పరవాలేదు. మహాలక్ష్మీ! పిల్లల నిద్దరినీ తీసుకొని వచ్చి అందరినీ ఒకచోట ఉంచుతాం.

అ : పిల్లలను తెస్తారు, నే చూస్తా.

మా : ఏమిపరవో! మహాలోకంలో ఉన్నాడు.

వెం : నే మందిప్పిస్తాగా!

అ : రాగానికా? రోగానికా? ('అహహ' అని నవ్వాడు.)

వెం : పైక మేమైనా అవసర ముంటుందా?

పు : లోపలికి పైకం తీసుకొనిపోనియ్యరు. నేను వ్రాసిన చిరునామాకు పదిరూపాయలు పంపండి. ఆయనకు అన్నివసతులూ నే కుదురుస్తా.

రా : అవన్నీ మీా రేమీా పెట్టుకోవద్దు.

రైలు కదులుతున్నది. రామానాయుడు నమస్కరించాడు.

రా-మా : అమ్మా! ఎంతపని చేశారు!

రామానాయుడు తల వంచుకున్నాడు. కన్నీళ్లు ధారలై నేల మీాద పడ్డవి. వెంకటయ్య ముఖంమీాద గుడ్డపెట్టుకొని "ముసలి వాడిని ఖైదులోకి పంపి మే మంతా హాయిగా ఉన్నా" మని పిల్ల వాడివలె ఏడ్చాడు. రైలు వంతెన దాటింది. వెంకటయ్య ఇంకా రైలువంక చూస్తూనేవున్నాడు. కనుచూపందేవరకూ చూచాడు.

వెం : తమ్ముడూ! మొన్న మనం చూచినప్పటికంటె రామ దాసు ముఖంలో కళ ఎక్కువ కాలేదా?

రా-నా : చాలా తేడా ఉన్నది. ఇందాకా కోటమ్మగారు కూడా ఆమాటే అన్నారు. మనిషికి వైరాగ్యంకూడా ఏర్పడ్డది.

వెం : ఇక ముందు జరగవలసిన పని ఏమి?

రా-నా : నేను కోర్టుపని చూస్తా. నీవు ఉండవల్లి దాసును తీసుకొని వెళ్ళు. తొందరపడవద్దు. నీవూ, దాసూ వచ్చినట్టు జోతికి వెంటనే తెలియపరచు.

వెం : వీరదాసు కొడుకును దాసుతో ఉంచివస్తా. అన్నమైనా వండిపెడతాడు.

రా-నా : ఎరికలపూడి పంపుదామా?

వెం : జోతిని చూస్తూవుంటే కొంతధోరణి తగ్గుతుం దను కుంటాను. ఒంటరిగా ఉండడంచేత మరీ మనస్సు చలిస్తుంది. అయినా కోర్టువ్యవహార మేమిటో తేలితేగ[illegible]!

రా-నా : మీారు అన్నం దిని వచ్చి రై లెక్కండి. నే ఊళ్లోకి పోతా!

రామానాయుడు మొకాయెకిన నారాయణరావుగారి ఇంటికి వెళ్లాడు. వారు లోపల ఫలహారంచేస్తూ పంచాదిలో అకుచెప్పుల చప్పుడు విని యెవరో కనుక్కొని రమ్మనమని వంటవాడిని పంపించారు. వారు ఫలానా అని తెలిసి,

నా : నాయుడుగారూ! ముఖమార్జన మైందా? లోపలికి రండి.

రా—నా. (చెప్పులు బైట విడిచి హాలులోకి వచ్చి) నమస్కార మండి.

నా : వారికి ఫలహారం తీసుకురావయ్యా! ఏమి పొద్దున్నే వచ్చారు?

రా—నా : రామదాసు కథంతా ఇట్లా ఇట్లా జరిగింది. మాకూ రాత్రివరకూ తెలియలేదు. తమరుకూడా ఊళ్లో లేరట. ఇప్పుడే ఏలూరు రైలుకు ఎక్కించి వచ్చాం.

నా : అయ్యో! నాకు తెలియనేలేదే! దర్శనం అయినా చేసేవాణ్ణి. అప్పీలు దాఖలుచేతామా?

రా—నా : కేసంతా అపస్మారకం అయిపోయింది. అప్పీలు దాఖలు చేసికూడా ప్రయోజనం లేదని ఇప్పుడే బెంచిగుమాస్తాగారు చెప్పారు. అయినా నకళ్ళకు దరఖాస్తు చేయించండి. ఇప్పుడా ఇద్దరు పిల్లలను స్వాధీనపర్చుకునే మార్గం చూడాలె. లేకపోతే జ్యోతి ప్రాణత్యాగం చేసుకుంటుంది. పౌలు చాలా దుర్మార్గుడు. పాదిరీకి వాడు చెప్పినంత.

నా : మనం ఇక్కడ పని చేస్తుందాం, అక్కడికి ఒకరిని పంపితే పిల్లలకూ ధైర్యంగా ఉంటుంది. వాడూ పెచ్చరిల్లడు. దాపున మనుష్యు లున్నారంటే కాస్త బెరుకుంటుంది.

రా—నా : మా అన్నా, దాసూ ఇప్పుడు రైలుకు వెళ్ళు తున్నారు. మనిషిని తోడిచ్చి ఉండవల్లిలో దాసును ఉంచి వస్తాడు. అదిగాక ఆరోగ్యం సరిగా లేదు. మనసు కొంచెం ఈ చిక్కుల మూలంగనే చలించింది.

నా : అయ్యో పాపం! చూడండి. మీ వెంకటయ్యగారు పంచమోద్యమంలో పూర్తిగా ప్రవేశించారటే? వారు మీఅంత ఉత్సాహంగా ఉన్నారట నాకు ఆశ్చర్యం వేసింది.

రా—నా : అతడిది మొదటినుంచీ స్వాపైన మనసు. మంచి ఉత్సాహం, కార్యనిర్వహణాశక్తి, రెండూ ఉన్నవి. కూలీఉద్యమం తప్ప పంచమోద్యమాన్ని గురించి నే నేమీ అంటించుకోవడంలేదు. ఆపని యావత్తూ వెంకటయ్యే యీడుతున్నాడు. సంగమందిరానికి సంబంధంగా దిగువజాతులకు కర్మవిద్యాలయం పెట్టించవలెనని విశ్వ ప్రయత్నం చేస్తున్నాడు.

నా : రెండు లక్షలుంటే మంచి విశ్వవిద్యాలయం పెట్టించ వచ్చు.

రా-నా : చాలదు. నాలుగువందలమంది విద్యార్థులకు వసతి గృహం పెడితే అయిదు లక్షలు కావలసివుంటుంది. ఆ మొత్తం మా ఆస్తివల్లనే వస్తుంది. ఇంకా మూడులక్షలయితే నే వేసుకున్న అంచనాకు సరిపోతుంది. ఆ విద్యాలయ మేర్పడితే పంచములలో మంచిమార్పు గలిగించవచ్చు. చాలామంది మర్యాదగా జీవించ డానికి వృత్తివిద్యల నేర్పించవచ్చు.

నారాయణరావుగారు యోచిస్తూ ఊరుకున్నారు.

రా-నా : తమ రేదో యోచిస్తున్నారే!

నా : ఏమీ లేదు. నాకు దిగ్భ్రమ గలిగింది 'నే వినేది కలా? వాస్తవమా?' అన్నట్టుగా ఉన్నది.

రా-నా : ఏడులక్షలతో పని పూర్తి అవుతుందని నా నమ్మకం. ఒకలక్ష వృత్తులు అభివృద్ధిచేయడానికి మూలధనంక్రింద ఉంచితే లోపంలేకుండా చాలాపని సాగవచ్చు. పైకం రాదనే భయం నాకు లేదు. తగినవాండ్లు పూనుకుంటే ఎంత ద్రవ్యమయినా పోగవుతుంది. కార్మికోద్యమం ముందు ఏస్థితిలోకి వస్తుందో నాకు తెలియదు. గోదావరీ, కృష్ణాజిల్లాలలోగూడా ముఖ్యమయిన అన్ని గ్రామాలలో సంఘా లేర్పడ్డవి. తక్కెళ్ల జగ్గడి ఉద్యమాన్ని వంక పెట్టుకొని ప్రభుత్వంవారు కార్మికసంఘాలను నిర్మూలం చేయవలె నని చూస్తున్నారు.

నా : స్వరాజ్యం రానిదే ఏ ఉద్యమాలూ సాగవు. ఈమోస్తరుగా ప్రభుత్వము సాగితే మన దేశములో బోల్‌షెవిజం వ్యాపిస్తుం దని నా అనుమానం.

రా-నా : సంతానోద్యమం బోల్‌షెవిజానికి వామశాఖని నా అభిప్రాయం. తమ రన్నట్లు స్వరాజ్యం మన చేతుల్లోకి వస్తే బీదల ఆర్థికస్థితి బాగుచేస్తే సంతానోద్యమాన్ని ఆపవచ్చు. శిక్షలు వేసీ, సెటిల్‌మెంట్లు పెట్టీ దీన్ని అణచడం వట్టిమాట.

నా : తమరు వాస్తవం గ్రహించారు. స్వరాజ్యం వచ్చే ప్రయత్నం అంతా చేదాం. గాంధిగారి ఉద్యమంలో నాకు బాగా నమ్మకం కుదరక అజ్ఞాయిస్తున్నా ఇంతవరకూ "ఈ తొట్టిస్నానపు

చికిత్సవల్ల ఈ దీర్ఘరోగం కుదరవచ్చిందా?" అనుకొన్నాను గాని మన తత్వానికి ఈ మందు బాగా పట్టింది. ఈ రామదాసుపిటీషనే ఆఖరుది. ఇక కొత్తకేసులు పట్టను. పాతవికూడా సాధ్యమయి నంతవరకు వదులుకొంటూ. నాతో ఇంకా కొంతమందికూడా వదులుతారు.

రా-నా : కానియ్యండి. మా కార్మికసంఘాలన్నీ మీ ఖద్దరుపని చేస్తున్నవి. కలెక్టరుకు నామీద సగంకంటు అదే! వెంకట్రావుగారు మా తాలూకాబోర్డు ప్రెసిడెంటుపని వదులుకుంటే నన్ను తీసుకోవలసిందని సిరస్తాదారుగారిద్వారా అడిగించారు. అంగీక రించి, 'అన్నిస్కూళ్లల్లో ఖద్దరు పెట్టింతామా' అని ఆలోచించాను గాని కాంగ్రెసుకు వ్యతిరేకంగా బోవడం మంచిదిగాదని మా వెంకటయ్య వద్దన్నాడు. అంతటితో సంతుష్టపించుకున్నాం. తమ కీరోజు ఏకోర్టులో పని ఉన్నది?

నా : నా కేసులు వాయిదా పడేవే. మీ వ్యవహారంలోనే ఈ రోజంతా ఉంటా.

రా-నా : మన వ్యవహార మనండి. తమరు ఇతరులు రాక పూర్వమే సావకాశంగా పిటీషను తయారుచేస్తే తరువాత ఇతర పనులు చూసుకోవచ్చు.

నా : ఇక్కడనే కూర్చుందాం. ఆఫీ సింకా తీసినట్టు లేదు. చెప్పండి. పిటీషను ఎవరిచేత దాఖలుచేయింతాం?

రా-నా : అప్పాదాసుచేత చేయింతాం. ఇంట్లో ఉండేవాడు, మేనత్తకొడుకూను.

నా : అతని కిప్పుడు మనసు బాగా లేదంటిరే? కుర్రవాణ్ణి గార్డియన్‌గా బెడితే, కలెక్టరుగా రాక్షేపిస్తారు.

రా-నా : మా ఊళ్లో వాండ్లకు బంధువు లెవరూ లేరు. నే ఉండమంటే ఉంటా.

నా : మీకంటే వాండ్లకు అప్తులు లేకపోయినా కులభేదంవల్ల పనికిరారంటారు. అప్పాదాసుకు పిల్లవాడిని స్వాధీనపరుస్తారుగాని అతడెంత మంచివాడైనా ఆ అమ్మాయిని స్వాధీనపరచమని చెప్పడం నాకే భావ్యంగా లేదు.

రా-నా : అయితే గడబిడ్డకపు వ్యవహార మైందే! ఎవరూ దొరకకపోతే కలెక్టరు ఏమిచేస్తాడు?

నా : ఏమి చేయగలడు? ఇదివరకు పాదిరే చూస్తున్నాడు. కనుక తనవల్ల కాదంటేతప్ప ఆయన స్వాధీనంలోనే ఉంచుతారు. పిల్లవాణ్ణిగూడా అప్పుడగ్గరనే ఉండనియ్యమంటారు.

రా-నా : ఇదేదో ప్రాణాంతకానికే వచ్చింది.

నా : ఏమి అలా అంటారు? సంగతి పూర్తిగా చెప్పండి.

రా-నా : ఇంకొకరహస్య మున్నది. అప్పాదాసూ, జ్యోతీ ఒకరి నొకరు ప్రేమిస్తారు.

నా : సరే, పెండ్లి చేసుకుంటా మనమనండి. తత్క్షణం వదిలి పెట్టిస్తా.

రా-నా : అది సాధ్యంగాదు. పెండ్లి చేసుకోరు. చేసుకుంటా మని పైకికూడా అనరు. ఆ ప్రేమను భావనారూపంలోనే ఉంచ దలచుకొన్నారు.

నా : చిత్రంగానే ఉన్నది. మీ మాలపల్లి చిత్రకూటంగా ఉన్నదే! ఒకసంగతి చెప్పండి. ప్రేమ కేవల భావనారూపంగా ఉండడం సాధ్యమా?

రా-నా : సాకారునిగా ప్రేమించినా, నిరాకారునిగా ప్రేమించినా భావనారూపంగానేకదా దేవుణ్ణి ప్రేమించడం. భావనా రూపంగా మానవుల నేల ప్రేమించరాదు?

నా : ప్రేమించవచ్చు, సందేహం లేదు.

రా-నా : అయితే ఒకసంగతి యోచించి చెప్పండి. భార్యా భర్త లన్యోన్యం ప్రేమించారు. కొన్ని కారణాలచేత భార్య ప్రేమ సంచలిస్తుంది. కాని అత్యంతంగా పశ్చాత్తప్తురా లవుతుంది. వారిద్దరికీ భావనారూపంగా ప్రేమ సాధ్యమవుతుందా? లేక భర్త యొక్క ప్రేమే సంచలించి తరువాత అతనికి పశ్చాత్తాపం కలిగితే వారిద్దరికీ నిష్కల్మషమైన ప్రేమ కుదురుతుందా? భార్యాభర్తలలో ఒకరు తమ ప్రేమను విభజించడానికి సాధ్యమా?

నా : మీ రడిగిన అన్ని ప్రశ్నలకూ నాకు తోచినంతవరకు ఒక్కటే జవాబు. అసాధ్య మేమీ లేదు. భావనారూపంగా సాధ్య

మైతే దైహికంగాకూడా సాధ్యమే అవుతుంది. నా స్నేహితులు కొందరు భార్యాభర్తలు జాయింటుగా ప్రేమిస్తూ ఉండేవారట!

రా-నా : నేనేమో పెద్ద ప్రశ్న అనుకొని అడిగితే నిమిష ములో తేల్చివేశారే! ఫీజు ఇయ్యకుండా లాయరుగారిని సలహా లడిగితే ఇటువంటి జవాబులే వస్తవి.

నా : మరెందుకువచ్చిన ప్రశ్న లివి?

రా-నా : జోతీ అప్పాదాసులు తమ ప్రేమను భావనారూపం గానే ఉంచదలచుకొన్నారు. ఆమెను సెటిల్‌మెంటు పాదిరీదగ్గరి బోధకుడు పెండ్లి చేసుకోమని వేధిస్తున్నాడు. ఈ కేసు యావత్తూ రామదాసుగాని జోతిగాని ఆ సంబంధానికి ఒప్పుకోకపోవడంవల్లనే బనాయింపు చేయబడ్డది. ఈ సందర్భాలలో ఆ పిల్ల సెటిల్‌మెంటులో ఉంటే ఏమవుతుందో ఆలోచించండి.

నా : ఆత్మహత్య జరుగుతుంది.

రా-నా : ఈ సంగతులన్నీ పిటీషనులో వ్రాయడం వీలుగాదు.

నా : వ్రాయక తీరదు. కొంచెంసేపు తమరు నిదానించండి. పిటీషను తయారుచేస్తా.

రా-నా : అప్పాదాసునే గార్డియనుగా పెట్టుతున్నా. జోతీ అప్పాదాసుల కున్న ప్రేమనుగూర్చి ఉదాహరించవద్దు.

నా : సగం బలం పోతుంది.

రా-నా : దైవగతి ఎట్లా ఉన్నదో! మనము చేయగలది లేదు పయిగా అత డిక్కడ లేడు.

నా : అత డంగీకరించకపోవడం నిశ్చయమేనా?

రా-నా : సందేహం లేదు.

నా : అయితే మిమ్మునే గార్డియనుగా పెడతా.

రా-నా : కానీయండి.

అని బల్లమీది పుస్తకం తీసి చదువుకుంటూ కూర్చున్నాడు. ఏదో ఆలోచన పోయింది. తా నడిగిన ప్రశ్నలు అసమంజసంగా ఉన్న వనుకొన్నాడు. సంగతులు వీరికి తెలిసివుండునా? ఆమె కడపటి చరిత్ర లోకాని కేమి తెలుసు? మొదటిప్రశ్న తనకు వర్తిస్తుం దని అనుకోవడానికి అవకాశం లేదు. ఆ కథ ఎవరూ వినివుండక

పోవచ్చు. "అయినా నే నడిగింది అవకతవక ప్రశ్నే. నాలుక జారింది."

నా : అబ్బాయ్! ఏమిటిరా ఆ అల్లరి!

రా-నా : తమకు పిల్ల లెందరండీ?

నా : నలుగురు. తమకు పిల్ల లెందరండీ?

రా-నా : నాకు లేరండి!— (నా కుటుంబచరిత్ర వీరికి తెలియదు.)

నా : అన్నట్టు తమ ఆ స్తంతా ఉద్యమాని కిస్తున్నారుగాదూ? వెంకటయ్యగారికికూడా లేరా?

రా-నా : ఆయనకూ మగపిల్లలు లేరు. ఉభయులం పెంపుడు చేసుకోదలచలేదు. లాయర్లకు ఫీజు తగ్గించదలచుకొన్నాం. యే దత్తయినా తగవులు కోర్టుకు రాకుండా వున్నదా?

నా : సాధారణంగా దత్తతంటే తగాదా దత్తమే.

రా-నా : తగాదా లేని పెంపకమే లేదు.

నా : వ్రాశాను. తమరు భోజనం చేసివస్తే యీలోపుగా సాఫు వ్రాయిస్తాను. తరువాత దస్కతు చేతురుగాని. ఉభయులం కలిసే కలెక్టరాఫీసుకు వెళ్ళుదాం.

పదకొండుగంటలకు ఉభయులూ కలిసి కోర్టుకు వెళ్ళారు. నారాయణరావు పిటీషను చేతి కియ్యంగనే కలెక్టరుగారు చదువుకొని,

క : నారాయణరావుగారూ! గార్డియను ఈ సుందరుడేనా? యీ పిల్లను ఆయనకు వొప్పజెప్పడం క్షేమ మని మీ రంటారా?

నా : వీరిని చాలాకాలంనుంచి నే నెరుగుదును. అదిగాక ఆ పిల్లకు మేనత్త కుమారుడున్నాడు.

క : హిందువులలో మంచివరసే! సమవయస్కుడేనా? అతడికి వివాహ మయిందా?

నా : లేదు.

క : యింకెవరయినా వున్నారా?

నా : దగ్గరబంధువులు లేరు.

క : బ్రాహ్మనుగారిని నే నెరుగుదును. వారిదగ్గరనే ప్రస్తుతం వున్నారుగదా! యీ అమ్మాయిని అక్కడ వుంచడానికి మీ అభ్యంతర మేమి?

నా : ఆయన మతాంతరుడు కావడం మొదటి ఆక్షేపణ.

క : యింతవరకు ఆ మతాంతరుడేకదా వాండ్ల తలిదండ్రులకు గూడా శరణ్యమయినాడు.

నా : ఆయన శరణ్యమే యీ స్థితికి తెచ్చింది.

క : ఆవిషయమే డిప్యూటీమేజస్ట్రేటుగారు నిర్ధారణచేశారు. విచారించింది శివయ్యగారని మీకు తెలుసునా? బ్రాహ్మణులు, న్యాయస్థులు.

నా : పాదిరీకంటె యీ పిటీషనరు దూరస్థుడా, ఆ పిల్లకు!

క : యింతవరకు దూరస్థుడే. ఈ యౌవనుడికి ఆ పిల్లను స్వాధీనపరచడం నా కిష్టంలేదు.

రా-నా : బ్రౌన్సనుగారు నాకంటె పెద్దవారా?

క : వారిని స్వయంగా యెరుగుదును.

రా-నా : వారు తెల్లవారుగావడంవల్ల, క్రైస్తవులు గావడం వల్ల నాకంటే అధికులే!

క : నారాయణరావుగారూ! నీ క్లయంటు యిక యిటువంటి మాటలు మాట్లాడితే కోర్టు నవమానించినందుకు శిక్షిస్తా.

రా-నా : కానియ్యండి.

క : నారాయణరావుగారూ! బ్రౌన్సనుగారు గార్డియనుగా వుండడానికి మీ ఆక్షేపణేమి?

నా : ఆయనదగ్గరిబోధకుడు మంచివాడుగాడట.

క : ఆయనకింద అనేకమంది బోధకు లుంటారు. వాండ్లు మంచివాండ్లు కాకపోతే ఆయన అనర్హు డెట్లా అవుతాడు?

నా : యీ బోధకుడు వాండ్లమీద అధికారం చెలాయించే వాడు. ఆపిల్లను పెండ్లి చేసుకోవలెనని కోరుతున్నాడు.

క : పిల్ల కిష్టంలేని వివాహానికి బ్రౌన్ సనుగా రంగీకరిస్తారా!

నా : పౌలు బలవంతపెట్టి యిష్టం సంపాదించవచ్చు.

క : కేవలం సెటిల్మెంటుకు సూపరింటెండెంటుగా వుండడమే కాకుండా కోర్టుతరఫున మయినర్లకు గార్డియనుగా యేర్పరిస్తే తన ధర్మం నెరవేర్చి పిల్లలను కాపాడడా?

నా : యీ పిల్లవిషయంలో కాపాడలేడని నా అభిప్రాయం.

క : మీరు కారణాలు కనబరచలేదు.

రా-నా : పంతులుగారూ! తమరు వృథాగా యెందుకు వాదించడం?

నా : నే మాట్లాడుతున్నాగా, మీరు వూరుకోండి.

క : (బెంచిగుమాస్తాతో)—బ్రాహ్మనుగారు యీ పిటీషనులో ఉదహరించిన పిల్లలకు గార్డియనుగా ఉండడానికి వొప్పుకొంటారేమో స్వయంగా వచ్చి తెలియజెయ్యమను. సత్తెనపల్లి సబుయిన్స్పెక్టరు కింద వున్నాడేమో పిలువు. ఆయన మంగళాపురపు కార్మికసంఘాన్ని గురించి పంపిన రిపోర్టు యిటు దే.

ఇన్స్పెక్టరుగారు వచ్చారు.

క : కార్మికోద్యమానికి నాయకుడనీ, ఆచుట్టుపట్లసంఘాలు సంతానులకు ఆశ్రయమిస్తున్నవనీ మీరు తెలియబరచారు. ఇతనిని గురించేనా?

ఇ : చిత్తం.

క : ఈసంగతులనుగురించి సాక్ష్యం యెన్నిరోజులలో తేగలరు?

ఇ : ఒక క్రిమినల్ కేసులో ఆవూరి మునసబూ, ఒక పొరుగూరి ఆసామీ యీరోజు వాయిదాకు హాజరుగా ఉన్నారు. వారిద్దరూ యిందులో సాక్షులే. ఇప్పుడే విచారించవచ్చు. లేకపోతే తమరు వేసేవాయిదాకు పూచీఖత్తులు పుచ్చుకున్నాసరే. యీయన బలవంతుడు గనుక తిరగదీస్తారనికూడా అనుమానం.

క : ముద్దాయికి ఆక్షేపణ లేకపోతే యీరోజే విచారిస్తాను—(గుమాస్తాతో) – రిపోర్టును ఉదాహరిస్తూ రు. 1000 లకు ఆరు నెలలకు స్వంతజామీను యియ్యమని అతనికి యిప్పుడే నోటీసియ్యి.

నా : అంతతొందరేమి!

క : నోటీసు జారీచేసేపని క్లుప్తంగావడానికి.

రా-నా : నోటీసు చూచుకున్నట్టే! తమరు చెప్పేసంగతులు వింటూనేవున్నా.

క : నోటీసిచ్చి దస్కతుతీసుకో. అరగంటలో పిటీషనులు కాంగనేపిలుస్తా. ఇన్స్పెక్టరుగారూ! నోటీసిచ్చి ముద్దాయిని మీస్వాధీనంలో వుంచుకోండి.

ఇ : చిత్తం.

నా : ముద్దాయితో నేను మాట్లాడవచ్చునా?

క : మాట్లాడండి. హాజరులోవున్నారు గనుక వకాల్తు పుచ్చుకోండి.

నా : నే నిందాకటి పిటీషనే ఆఖరుదిగా పుచ్చుకొన్నాను. నాప్లీడరుపని ప్రస్తుతం ఆపివేశాను.

క : సహాయనిరాకరణం చేశారా? అయినా మీరు మాట్లాడడానికి వుత్తరువిచ్చాను. అరగంటలో పిలుస్తా. అవతలకు వెళ్లి మాట్లాడవచ్చు.

నా : చిత్తం. (అవతలికిబోయి)—వ్యవహారం పెడదిరిగింది.

రా–నా : సజావుగానే వున్నది. కానియ్యండి.

నా : ఇంకొకరిని ప్లీడరుగా యేర్పరచుకోండి. నే నిక వకాల్తు పట్టదలచ లేదు.

రా–నా : నాకు ప్లీడ రేవద్దు. వాదించుకోనని చెప్పివేస్తాను.

నా : ఖయిదుకు పోతారా ?

రా–నా : కార్మికోద్యమంలో పనిచెయ్యనని జామీ నియ్యమంటారా? నాజీవితమే దాని కర్పిస్తినిగదా!

నా : మిమ్ములను పట్టుకుంటే మీప్రాంతాలలో ఉద్యమం ఆగిపోతుందేమో ?

రా–నా : నూరు రెట్లెక్కువవుతుంది. కేసు పిలుస్తున్నారు.

క : నారాయణరావుగారూ! మీరు వకాల్తు పుచ్చుకోనట్టేనా?

నా : అంతే! మానుకున్నాను.

క : అతని పేరేమి?

గు : రామానాయుడు.

క : నోటీసు చూచుకున్నావా?

రా–నా : చూచుకున్నా.

క : ప్లీడరును తెచ్చుకుంటావా?

రా–నా : తెచ్చుకోను.

క : కార్మికోద్యమానికి నాయకుడవా?

రా–నా : అంతగౌరవం నాకులేదు. పనిమాత్రంచేస్తున్నా.

క : మీ సంఘాలు దొంగలకు సహాయం చేస్తున్నవా ?

రా–నా : నాకు తెలిసినంతవరకు చేయడంలేదని నా నమ్మకం.

క : ఏమని నీవాదం ?

రా-నా : నే వాదించుకోను.

క : సాక్ష్యం పిలువు !

ఇ : నేనే మొదటిసాక్షిని.

ప్రమాణంచేసి సాక్ష్యం చెప్పాడు. అన్నీ అబద్ధాలే.

క : సవాల్లు అడుగుతావా ?

రా-నా : అడగను.

ఈ ప్రకారంగానే యితరసాక్షుల విచారణా అయింది.

క : ఇంకా యేమయినా చెప్పుకుంటావా ?

రా-నా : ఏమీ లేదు.

క : సాక్షు లున్నారా ?

రా-నా : విచారించుకోను.

క : ప్రథమవు త్తరువు ఖాయపరిచాను. జామీ నియ్యి.

రా-నా : జామీ నియ్యను.

క : జామీ నిచ్చేవరకూ ఆరునెలలు విడిఖయిదులో వుంచేటట్టు ఉత్తరువుచేశాను, నిడదవోలు సెంట్రలుజయిలుకు పంపిస్తున్నా. ముద్దాయిని తీసుకొనిపొండి.

పోలీసులు రామానాయుడిని తాలూకాజెయిలుకు తీసుకొని పోయినారు.

## 19. సహగమనం

వెంకటయ్యా, అప్పాదాసూ, కమలాదాసూ యెనిమిదిగంటల బండికి బయలుదేరి తాడేపల్లిలో దిగి జరిగినవృత్తాంతం యావత్తూ జోతికి తెలియజేశారు. సెటిల్‌మెంటుకు కూతపెట్టుదూరంలో వుండవల్లి మాలపల్లికి ఆనుకొనివున్న చిన్నబంగాళా అద్దెకు తీసుకొని దానిలో ప్రవేశించి అక్కడ వంటచేసి రోజూ జోతికీ పిల్లవాడికీ పంపేటట్టు సూపరింటెండెంటు ఉత్తరువు పొందారు. తల్లిదండ్రులను పట్టుకొనిపోయినతరువాత జోతి ధైర్యం దెచ్చుకొని పిల్లవాణ్ణి వోదార్చి మధ్యాహ్నం తినగా మిగిలిన అన్నం ఇద్దరూ తిని పుల్లప్పయింట్లో పడుకున్నారు. సూపరింటెండెంటు భయంగా వుంటే తన బంగాళాదగ్గర పడుకోమన్నాడు గాని జోతి ఒప్పుకోలేదు. చీకటితో

లేచి పుల్లప్పయొక్క తల్లితో గలిసి స్నానాదికంనిమిత్తం కృష్ణ వైపుకు బోయి తెల్లవారేవరకు యింటికి వచ్చారు. కులపెద్దలు సభ చేసి కేసుపర్యవసానం తెలిసేవరకూ యేచర్యా తీసుకోకుండా నిలిపి వృద్ధులైన కుర్రవాండ్లను సమాధాన పరచి ప్రార్థనకు పోకుండా నిలిచిపోయినారు. పాదిరీ మామూలుగా గంటలుకొట్టించి యెవరూ రాకపోవడం చూచి సర్దుకొని వూరుకున్నాడు. కేసుపర్యవసానం తెలుసుకోవడంకోసం మరునాడు యెవరూ పనికిపోలేదు. పౌలు మరునాడుకూడా రాలేదు. సాయంత్రంబండికి పోలీసులు వచ్చి కేసుఫలితం చెప్పారు. పౌలు వచ్చినతరువాత ప్రార్థనకు రమ్మంటారేమో చూచి బలవంతపెడితే సమ్మె విస్తరింపజేతా మని కులపెద్దలు యోచించుకున్నారు. మరునాడు రామానాయుడి కేసు సంపూర్తి కాంగనే అతిసంతోషంతో జోతి తనకు దక్కినట్టుగానే భావించుకొని పిల్లలతరఫున గార్డియనుగా వుంటానని పాదిరీచేత ఒప్పించి ఆయన అంగీకారం వెంటనే కలక్టరుకు తెలియపరతా మని పౌలు వెంటనే బయలుదేరాడు. సెటిల్మెంటుకు రాంగనే రామదాసుయొక్కయు రామానాయుడుయొక్కయు కేసులపర్యవసానం అందరికీ శ్రుతపరచి పాదిరీదగ్గరకు బోయి సవిస్తరంగా సంగతులు చెప్పగానే ఆయన సంతోషించి—

బ్రౌన్సన్ : పౌలూ! రామదాసును యెన్నాళ్లకు గెలిచాం!

పౌలు : గెలిచామంటారు. అందులో నా ప్రయోజకత్వమే మున్నది? అంతా తమచలవే. తమరు తలచుకుంటే యేది నెరవేరదు? తమరు పంపిన చీటీముక్కను చూచుకొని డిప్టీకలక్టరు 'ఆల్ రైటు' అన్నారు.

బ్రౌ : యేమైనా అడిగారా?

పౌ : యేమైనా అడిగి కాస్తసందిస్తే కేసుసంగతి యావత్తూ చెపుదామనుకున్నా. ఏమీ అడక్కుండానే దొరగారికి సలాములు చెప్పమన్నారు. అంతట వచ్చా— నా — మనవి— ఒక్కటున్నది.

బ్రౌ : చెప్పు.

పౌ : పిల్లలకు మిమ్మునే గార్డియనుగా యేర్పరుస్తారు. తమరు సరేననడమే తరువాయి. తరువాత యీ బీదపౌలును మరచి పోతారేమో?

బ్రౌన్ : నాచేతనైన సహాయం చేస్తా. వ్యతిరేకంగా చెప్పే వాండ్లు యెవరూ వుండరుగనుక నీశక్తి వుపయోగించి పిల్ల ఒప్పుకునేటట్టు చేసుకో. మీావుభయులూ సమ్మతిస్తే యితరాటంకాలు యేమీా లేకుండా చేస్తా.

పౌ : పిల్ల ఒప్పుకుండేటట్టు కనబడదు.

బ్రౌన్ : దానికి నే నేమిచేసేది? నీసొమ్ము గాదని వూరుకో.

పౌ : గార్డియను తమరుగదా, తమ ఇష్టప్రకారం వివాహం చేయటానికి వీలు లేదా?

బ్రౌన్ : లేదు. పిల్లచేత తల యొగరవేయిస్తే అన్నీ చక్కబడుతవి. పుల్లప్ప ఇంట్లో ఇప్పుడు పడుకుంటున్నది. అతనితల్లి ఇంద్రజాలి. దానిద్వారా పనిచేయి.

పౌ : చిత్తం.

పౌలు పుల్లప్పఇంటివైపుకు బోయినాడు. జోతీ, పుల్లప్ప భార్యా ఎక్కడికో వెళ్లుతున్నారు. గుడిసె చాటు కాంగనే ఇంట్లోకి బోయి—

పౌ : అదెమ్మా! ఏమిచేస్తున్నావు?

ఆ : ఏమయ్యా ఇట్లా వచ్చారు? మామీాద కచ్చపట్టారెందుకు నాయనా? బీదవాండ్లం, ఎట్లా బతుకుతాం?

పౌ : మీా కేమీా ఇబ్బంది లేకుండా చేస్తా. ఈ అయిదు రూపాయిలూ పెట్టి ప్రస్తుతం గడుపుకోండి.

ఆ : (ఆనందంతో)—ఏమో పనిమీాద వచ్చావు?

పౌ : మనుమడు పెండ్లీ పేరంటం లేకుండా దిక్కుమాలిన పక్షిలా గున్నాడు. నీ మనుమరాలిని ఇప్పించి నన్ను ఒక ఇంటివాణ్ణి చెయ్యి. నీవు శాశ్వతముగా నాదగ్గర ఉండి ఇంట్లో పెత్తనం చేతువుగాని.

ఆ : ఏదో మాటసామెతగా ఈసంగతే వచ్చి 'పెండ్లి చేసుకోరాదా లచ్చనంగా!' అని అన్నా. ఏమీా సందుపెట్టలే.

పౌ : ఏవో పాదికలు వెయ్యాలె నీవు. నాకు స్వాధీనపరచావంటే నీకు మెళ్ళో గళ్లాపట్టెడ చేయించిపెడతా. నాకు బ్యాంకులో మూడువేలరూపాయి లున్నవి. ఇప్పుడు వెయ్యిరూపాయిల నగలు పెడతా. ఎట్లా ఒప్పిస్తావో.

ఆ: నే నీపూట మాట్లాడి సాయంత్రం ఒక చిట్కా చెపుతా రా. దానితో కుక్కపిల్లై నీవెంట తిరుగుతుంది. తరువాత పెండ్లి నీ ఇష్టంవుంటే చేసుకుందువుగాని.

పౌ: అనేక వ్యవహారాలు చూసినదానివి. ఏదో ఒక దారి చూపు.

ఆ: అదెంతపని? బాగా మబ్బు పడ్డతరువాత రా. ఏమి చెయ్యవలసిందీ చెపుతా.

పౌలు ఇంటికి బోయినాడు. కాని ఏమీ తోచలేదు. హిందూ దేవతలకు మొక్కుకున్నాడు. గదిలో పడుకొని నిద్రపోవాలె నని చూచాడు. నిద్ర పట్టలేదు. లేచి షికారు పోయినాడు. చిన్నప్పుడు నేర్చుకొన్న లిల్లాయపదాలు పాడాడు. అవైనతరువాత ఏసుకీర్తన లెత్తుకున్నాడు. అవి రుచిగా లేవు. ఒళ్లు తెలియక కొంచెంసేపు నిలువబడి జోతిని మననంచేసి నిట్టూర్పు విడిచి ఉన్మత్తుడై మచ్చరించిన ఆబోతువలె పొలాలమీద సంచరించాడు. తాపం తగ్గలేదు. సాయంత్రం అయింది. చల్లగాలి చింతనిప్పులమీద వడగాలి తోలి నట్టు తాపజ్వరాన్ని హెచ్చించింది. సంధి ప్రారంభమైంది, ఉన్మత్త ప్రలాపాలు ప్రారంభించాడు. "ఓ చెలియా! ఓ మగువా! ఓ లలనా! ఓ సకియా!—ఎంత క్రూరురాలవే! నా ప్రాణాన్ని నిలువునా తీస్తున్నావు. ఓ జోతీ! నీ అందం వెలిగిపోతున్నది. ఆహాహాహా! నా జోతి ఎంత మంచిదయ్యా!

నన్ను పెండ్లాడవే చెంచీతా!
నీకు బహుపుణ్యముంటాదె చెంచీతా!

నేను నరసింహస్వామిని, ఓ ముద్దు చెంచీతా, న న్నేలుకోవే! (అని సుద్దులరాగం తీశాడు)

అంతా మంచివాండ్లే! మాటలుమట్టుకు మంచివి. లాటులాటు కొట్టాడు. దావీదూ సలోమోనూ మహానుభావులు కారపోయి నారా? థూ!—మధ్య ఇవెందుకు?

ఎందుబోతివె, ఎందుబోతివె,
ఎందుబోతివె చెలియరో!

ఇదుగో! దొరికావు నాసామిరంగా! (అని పట్టుకోబోయి) ఏదీ—దుబికించి పోయిందే. ఆస్సి నాపలవపిల్లా! లేడిపిల్లాలె ఎగిసి పోయింది.

నేను తాళలేను యిగను
తాళలేనే భామా నేను తాళలేనే భామా!

(అని నాట్యం చేశాడు.) ఎవ్వరైనా ఒక చెలికత్తె ఉంటే బాగుండు. ఓ ఆదెమ్మచెలియా! నాకేదో మార్గం చూపించవమ్మా. లేకపోతే నే నీ కృష్ణలో పడతా, ఏదో త్వరగా తేల్చు. ఆలింగనానికి నీకు ఆరుకాసు లిప్పిస్తా. చూడుమరి. ఆపతిమొక్కలు గావు సుమా. వచ్చేదా? వేళయిందా? నీకు దణ్ణం పెడతా. నీ కాలు మొక్కతా. వాయిదా శానాదూరం వేసిందయ్యా దీనిసిగా గొయ్యా. మబ్బుపడవలెట! పగలైతే పనికిరాదుగాఁవాలె. ఏమి మబ్బుపడకపోతే కొంప మునిగిందా? యెవడు నా కడ్డం వచ్చేది? యిప్పుడేపోతా" అని లేచి పుల్లప్పయింటికి బోయి—

పౌ: అవ్వా!

ఆ: వచ్చావా మనవఁడా! వొప్పుకొనీ వొప్పుకోనట్టుగా వుంది. వొక్కటే మందు. నేనూ అదీ అయిదుగంటలకు కృష్ణ రేవుకు స్నానానికి వస్తాం. కొన్ని గుర్రాలు కళ్లెం పెట్టనియ్యవు. వొక్కమాటు యేదోవిధంగా స్వాధీనం చేసుకున్నావా తరువాత అన్నీ చక్కబడతవి. చలి దీరాలె. అర్థం అయిందా? యెవరు యిక్కడ నీకు అడ్డం వచ్చేది?

పౌ: తీసుకొని వస్తావా?

ఆ: నాదీ భారం. నామాట మరిచిపోయేవు.

పౌ: నాతో యిన్నిమాటలా? మనసు నచ్చిందా అంటే మెడ యిచ్చేదే.

ఆ: చీకటితో రావాలె. తెల్లవారితే వీలుగాదు.

పౌ: తెల్లవారుఝాముదాకానా? గొరుకొయ్యలు నెత్తి మీదికి రాంగనే లేచి గడిమికాస్తా.

పౌలు వెళ్ళిపోయినాడు. ఆదెమ్మ లోపలికి బోయింది. కోడలూ జోతీ యింకారాలేదు. అన్నం ఉడుకైనాపట్టలేదు. మాటలసందట్లు అన్నం పొయిమీద పెట్టినసంగతే మరిచిపోయింది,

మంటచల్లారి నిప్పు కరుగుపడ్డది. దీపం ముట్టింతామంటే నిప్పు పెట్టె కనబడలేదు. కుమ్ముదీసేవరకు నిగురుగప్పినరవ్వలుంటే చిదుగులువేసి వూది మంటచేసి దీపం ముట్టించింది. అన్నం వార్చి దింపేవరకు కోడలూ, జోతీ వచ్చారు.

రంగడు : అవ్వా! నాకన్నం.

ఆ : రాండి అన్నానికి, కమ్మనిపచ్చడి నూరా.

జోతి : రంగడూ మీరూ తినండి ; నా కాకలిగాలే దవ్వా!

ఆ : నీవు తినకపోతే మేమూ తినం.

కోడలు : మన కేమివారిగింది? యివ్వాళ వాళ్లబావతో మాట్లాడింది గనుక కడుపు నిండినట్లుగావుంది.

ఆ : బావెవరే!

కో : బావంటే యెరగవ్! మేనత్తకొడుకు. పోలిక లిద్దరివీ వొకటే!

ఆ : మనివి అడిగి మాట్లాడడానికివచ్చారా యేమి ?

కో : రేపు మనివి అడుగుతారట ; యివ్వాళ కటకటాల దగ్గరచూశాం. యింకెవరో అబ్బీనీ, వీండ్లబావా వచ్చారు. వొక్కరోజేకా అమ్మా! మా యింట్లో నీవు అన్నం తినేది! రేపటినుంచీ వండించి పంపిస్తామనే అనిరి.

ఆ : యెవరే ఆవచ్చినవాండ్లు? నిజమేనా వాండ్లు చెప్పిన మాటలు?

కో : వాండ్లబావ మాలవాడివలెవున్నాడా? దానికంటే గూడా నాజూకుగావున్నాడు. జవరమైన మనిషి. యేమి సంబర పడ్డాడే! నిన్ను జూచి. గంతులువేశాడు. తే అన్నానికి.

జో : మా అమ్మా, అయ్యా యెక్కడవున్నారో? అన్నం తిన్నారో? లేదో? కొడుతున్నారేమో అవ్వా! జైదులో ప్రతిపూటా అన్నం పెడతారా?

ఆ : ఓ. వేళయ్యేవరకు సంకటిముద్దలు తెచ్చి యిస్తారు. మావాడు మునుపు గుంటూరుజైలులో వుండగా చూచ్చా.

జో : మాఅమ్మ రెబ్బపాయవంటిమనిషి. ఒక పాళాన దసిలేది కాదు. కాని మాఅయ్య బాత్తిగా లుగచెడ్డాడు. మా అయ్యను నేను మళ్లీచూచేనా, అవ్వా?

ఆ ! చూడ కేమి ? ఆరునెల్లూ మూడునిమిషాలలో తిరిగి వస్తవి. అందరూ అన్నానికి లేవండి. నీవు లేవకపోతే నేనూ తిననుు.

కో : జోతి ! లే. పిల్లవాడు ఆకలిస్తున్నాడు, తిని పడుకుందాం. అంతా అన్నానికి కూర్చున్నారు. జోతి పట్టివేస్తునేతిన్నది.

ఆ : కష్టాలు మనుషులకు రాక మాకులకు వస్తవా ? వచ్చినప్పుడు ఓపిక పెట్టుకొని భరించాలె. ఒక్క పిల్లవాడిని వదిలిపెట్టుకుని యీ అభాపురిలో యెందుకున్నాం ? యిట్లాగే రోజులు తోసేది. భత్యం తీరంగనే యే చెట్టుకిందనో రాలిపోయేది.

జో : రేపు స్నానానికి పోవద్దా, అవ్వా ?

ఆ : అట్లాగే పోదాం. యింట్లో వుండి చేసేదేముందీ ! ప్రార్థనకు బోవడం లేదుకనుక విడిపనులైన్నా చక్క బెట్టుకోవచ్చు. యింతికూ ఆమహారాజు యీ సదుపాయం చేసిపోయినాడు. అదివరకు ప్రార్థనలోగా అన్నీ ముగించుకోవలసివుండె. ప్రతిదానికీ వురుకులూ పేరాలే.

జో : అక్కడికి స్నానానికిబోతే యెవరూ వద్దనరుకద ?

ఆ : నీమో స్తరుగా మంత్రాలు చదువుతూ స్నానం చేస్తే వద్దంటారేమో ! అంతవరకెందుకు ? అన్నీ చీకటితోనే ముగించుకుందాం. ఒక గడియముందుగా బోతేసరి.

జో : పెందరాళే లేపు. ఇక పడుకుందాం లెండి.

అంతా లేచి పహరావచ్చిపోగానే పడుకున్నారు. పోలీసులు గస్తీదిరుగుతున్నారు. పౌలు ఉన్మత్తభూతంవలె పుల్లప్ప వీధిన తెల్లవార్లూ తిరుగుతున్నాడు. రెండుగంటల కొకరిచొప్పున అయిదు పహరాలైనవి. ఆరవ పహరా ప్రారంభించంగానే యింటికి పోయి చక్కగా దుస్తులు వేసుకొని కృష్ణవైపుకు బయలుదేరి దారిపక్కవున్న కయ్యలో నక్కాడు. ఆదెమ్మ నాలుగుగంటలకే లేచి. పౌలు వెళ్లాడో లేదో చూతామని వాకిట్లోకి వచ్చింది. పౌలు జాడ కనబడలేదు. కాసేపు తారట్లాడి లోపలికిబోయి జోతిని లేపింది. జోతికి రాత్రి సరిగా నిద్రపట్టలేదు. తల్లిదండ్రులు జ్ఞాపకంవచ్చి చాలాసేపు అదే ఆలాపనగా ఉన్నది. అప్పాదాసు జ్ఞాపకం వచ్చాడు. తన మనస్సులో అచ్చుపడ్డరూపాన్ని సాయంత్రం

గనబడ్డ ముఖవైఖరితో తాబెళ్ళు వేసి చూచింది. రెండూ బింబ ప్రతిబింబంగా సరిపోయినవి. తెల్లవార్లూ ఆ రూపాన్ని మనసులో చిక్కబట్టుకొని ఆనందకెరటములలో హంసవలె ఉయ్యాలలూగుతూ పడుకున్నది. ఆదెమ్మ లేపేవరకు, నిర్మలసరస్సులో ప్రతిబింబించే చంద్రమండలం నీళ్ళు గదలంగనే చెదిరిపోయినట్లో స్తరుగా జ్యోతి హృదయసరస్సులో విహరిస్తున్న మనోహరరూపం చలించింది.

జో : అవ్వా! నన్నిప్పుడు కదిలించబోకూ! ఒక్క అర గడియలో లేస్తాను.

ఆ : రోజూ వేళకు స్నానంచేయడం మంచిది. అలవాటు తప్పించగూడదు. దబ్బున పోయివత్తాం లే.

జో : కాసేపు వుండు అవ్వా! యింకా చాలాపొద్దు వున్నది.

కో : మీ బావను కలగంటున్నావా? లేపినా ముసుగుదన్ని పడుకుంటున్నావు.

జో : అబ్బా! నన్ను నిద్దరపోనియ్యర్రా మీరు. అవ్వా! నీ కెంత పాప మనుకుంటున్నావు. పొద్దున్నే లేపావుగదా! పద వస్తా.

కో : పోనియ్యి, ఇంకా కాసేపు పడుకో.

జో : అవ్వ రాకాసిలాగు వెంటబడ్డది. ఒరే అబ్బాయి! లే పోదాం స్నానానికి.

ఆ : వాడి నెందుకు లేపుతావు చీకట్లో? ఎండలు బాగా ముదరనీయి.

జో : నీవుగూడా రారాదుటమ్మా, పొద్దెక్కినదాకా పడుకోకపోతే!

ఆ : దానికి చన్నీళ్లు పోసుకుంటే జబ్బు చేస్తుంది, పద.

ఉభయులూ బయలుదేరారు. గుడిసెలు దాటారు. ఆదెమ్మ దారిపక్కల చూస్తూ పోతున్నది. ఎందుకో భయపడుతున్నది. ముందు నడిచేదల్లా వెనుకకు దిగబడ్డది.

జో : ఏ మవ్వా! వెనుకబడ్డావు?

ఆ : ఆఁ. ఏమున్నది? నే ముసలిదాన్ని. నీవు పడుచుదానవు. పద, నీతో రాలేకపోతానుటలే. ఇప్పుడు దొంగలు వస్తే ఏమిచేస్తావే?

జో: ఇక్కడికి దొంగ లెవరువస్తారు?

ఆ: దొంగ లెవరు వస్తారా? ఎక్కడనుంచి రావాలె, ఉన్నవాం డ్లందరూ దొంగలైతే?

కయ్యదగ్గరకు వచ్చారు. మనిషి లేచి నిలబడ్డట్టుగా ఉన్నది. తెల్లంగా దుస్తు లున్నవి. దారివైపుకు వస్తున్నట్లున్నది. మగవాడి వలె ఉన్నాడు బాగా సమీపించాడు. దారిలోకి వచ్చి అడ్డంగా నిలువబడ్డాడు. జోతి తొలగిపోబోయింది. ఎటుతిరిగితే అటు వచ్చాడు.

జో: ఎవ రబ్బీ నీవు, అల్పానికి తలపడ్డట్టున్నావు?

పౌలు: నీ గులాపువాడిని. నీ వనుగ్రహించకపోతే నే జీవించను. ఎందుకు నన్నిట్లా బాధించడం? నా కేమి లోప మున్నది? నీకు లక్షణంగా జరుపుతా. ఈ సెటిలుమెంటువాండ్లంతా నీకు నౌకర్లై పనిచేస్తారు. నీకు అడుగులకు మడుగు లొత్తుతారు.

జో: తొలుగు దారి! నేను ఒంటరిగా ఉన్నా ననుకొన్నా వేమో? జాగ్రత్త! పిచ్చిమాటలు మాట్లాడవద్దు.

పౌ: నాకు జవాబు చెప్పి పో. నేను భరించలే—లే—ను. (అని చెయి పట్టుకున్నాడు.)

జో: ఛీ..న న్నంటుకోవద్దు (అని చెయ్యి విదిలించికొట్టి దారిప్రక్కన నిలువబడ్డది).

ఆ: యేమే! అట్లా మాట్లాడుతావు? నీదర్జాకు తగదా! నీ వేమి బంగారుబొమ్మవా?

జో: ఇవా నీవు చెప్పేమాటలు! చాలులే!

ఆ: యేమిటి చాలేది? అత డంత భంగపడుతుంటే! యింకా నీ అదృష్ట మనుకో. పట్టుకోవయ్యా? మహాశాణాతనం పోతుంది.

పౌలు వాటువేసి పట్టుకోబోయినాడు. జోతి 'కృష్ణా!' అంటూ కృష్ణవైపుకు పరుగెత్తింది! యిద్దరూ వెంటబడ్డారు. చెరొకవైపునా కమ్మారు. నీళ్లలోకిదిగింది. వాండ్లూ దిగారు. మోకాళ్ళలోతు నీళ్లలోకి బోయింది. వాండ్లిద్దరూ ఆగలేదు. 'ఓదాసూ! యెక్కడున్నావు? దబ్బున రా' అని కేక వేసింది. వాగ్రూపకమైన జవాబేమీ లేదు. అంతా దాసుమయమైంది.

యిద్దరూ యింకా దగ్గరకు వస్తున్నారు. పౌలు రెండు చేతులతోనూ వాడిసి పట్టుకోబోయినాడు. రాహువు పట్టు తప్పించుకొన్న చంద్రబింబంవలె చేతులనుంచి దూసుకొని పరుగెత్తింది. మళ్లీ కేకవేసింది. ఇతరులకు వినబడలేదు. కృష్ణ వడిగా వచ్చి లోపలికి లాక్కున్నది. కనబడకుండా కెరటములలో దాచుకొన్నది. బుడబుడశబ్దం వినబడ్డది. పౌలూ, ఆదెమ్మా ఆగి చూచారు. తప్పించవలెనని ప్రయత్నించారు. కాని తేలలేదు. ప్రవాహంవడికి నిలువలేక గట్టుకు వచ్చారు పదడుగులలో సుడిగుండమున్నది. జోతి గిరున తిరిగింది. ప్రవాహం గట్టుకు తోసింది. యిసుకతో మేటవేసింది. జోతి సగానికి పూడి కూర్చున్నది. పౌలు చూడలేదు. పరుగెత్తి యింట్లో దాక్కున్నాడు. పోలీసులకు తెలిస్తే పట్టుకొని కొట్లో పెడతారని భయపడ్డాడు. ఆదెమ్మ కోడలితో చెప్పింది. ఆమాటలు పిల్లవాడు విని కేకలువెయ్యడ్యం మొదలుపెట్టాడు. ఆదెమ్మ తానూ జోతీ స్నానానికి పోతే యెవరోవచ్చి జోతిని లాక్కొనిపోయినారని గోల పెట్టింది. సబుయిన్‌స్పెక్టరు వచ్చి దానిని ముందు అరెస్టుచేయించి నిజము చెప్పమని బలవంతపెడుతున్నాడు. కోడలు మని షెవరో చెప్పవలసిందని అత్తను బలవంతపెడుతున్నది. సెటిల్‌మెంటంతా గోలయింది. పౌలునుగూడా అరెస్టుచేయిస్తే నిజం బయటబడుతుందని కులపెద్దలంటున్నారు. అతడు ఉడాయించాడు. కృష్ణ వైపుకు పరుగెత్తాడు. యెటు పోయిందీ కనబడలేదు. పరారీ అయినాడని పోలీసులు రికార్డు చేశారు. ఆదెమ్మను వెంటబెట్టుకొని రేవువైపుకు బోయినారు. జవానులను నీళ్లలోదింపి కొంతవరకు వెతుకులాడించారు. కొందరు పరవగా బయలుదేరి కృష్ణగట్టున వెదుకుతున్నారు. తూర్పురేఖలు తెల్లబారినవి. ఇసుకలో యేదో కూర్చున్నట్టు కనబడ్డది. జోతేనని కేకలువేస్తూ పరుగెత్తారు. చుట్టూ యిసుకదీసి మెల్లగా బయటికిలాగి పడుకోబెట్టారు. పరీక్షించి చూచారు. శ్వాసాడించడానికి చేతులు లాగారు. నాడి పరీక్షించారు. ముక్కుదగ్గర వేలుపెట్టి చూచారు. పొట్టమీద చెయిపెట్టి మెల్లిగా అదుముతుంటే నీళ్లు బయటికి వస్తున్నవి.

చాలానీళ్లు పోయినవి, పొట్ట తీసింది. జోతిమాత్రం లేదు. అదివరకే పోయింది. గుడ్డగప్పి పడుకోబెట్టారు.

దొర వచ్చి చూచాడు. యిన్స్పెక్టరూ, ఆయనా కలిసి ఆదెమ్మను బంగాళాకు తీసుకొనిపోయినారు. వెంకటయ్యా, అప్పాదాసూకూడా వచ్చారు. దాసు శవందగ్గర పడుకున్నాడు. ఎవరు లెమ్మన్నా లేవలేదు. సూపరింటెండెంటు వాండ్లిద్దరినీ పిలిపించాడు. దాసు రాను పొమ్మని పూవులు గోసితెచ్చి జోతిని అలంకరిస్తున్నాడు. వెంకటయ్య దొరదగ్గరకు బోయినాడు. జనమంతా దూరంగా కూర్చున్నారు. అప్పాదాసు పూవులతో అలంకరించి పకపక నవ్వాడు.

" నీకూ నీవారు లేరు నాకూ నావారు లేరు
యేటివొడ్డున యిల్లు గడదాం పదరా. "

అని పాడుతూ గబాలుని యెత్తి బుజంమీద వేసుకున్నాడు. నీళ్లలోకి పరుగెత్తాడు. జనం వెంటబడ్డారు. చిక్కలేదు. ప్రవాహంలోకి పోయినాడు. వడిచేత కాలానలేదు. యీదగలవాండ్లవరూ లేకపోయినారు. యింకా పోతున్నాడు. కాళ్లకు పూనిక చిక్కలేదు. ఉభయులూ ప్రవాహానికి అడ్డంపడ్డారు. మునిగారు, తేలారు, కొట్టుకొనిపోతున్నారు. జనం కేకలువేసేవరకు వెంకటయ్యా, పోలీసులూ వచ్చారు. ఉభయులూ ఆలింగనంలోనే వున్నారు. పూవులు వాండ్లవెంబడే కొట్టుకొనిపోతున్నవి. ప్రవాహం వాండ్లను వొడ్డుకు నెడుతుందేమోనని జనం కట్టవెంబడి పరుగెత్తుతున్నారు. యీదగలవాండ్లు దిగి సత్తువకొద్దీ యీదుతున్నారు. ప్రవాహం వాండ్లకంటే వేగంగా పోతున్నది. జంట తేలిపోతూనేవున్నది. కొంతసేపటికి చూపుమేరకు దాటింది. చూపుల కందకపోయినతరువాత అంతా ఆగారు. దిగాలపడి శూన్యాన్ని చూస్తున్నారు.

కృష్ణ గునగునలాడుతూ సంగీతం పాడింది. ఇంకా పాడుతూనేవున్నది.

" మనిద్దరీమన సొక్కైతే మల్లెపూలాతెప్పగట్టి తెప్పమీదనే తేలిపోదం పదరా. " అని శబ్దిస్తున్నది.

## 20. కొరడాదెబ్బ

జోతీ అప్పాదాసులమరణం ఆంధ్రదేశంలో కల్లోలం కలిగించింది. పెద్ద శీర్షికలతో పత్రికలు రామదాసుకుటుంబంయొక్క చరిత్ర, రామానాయుడు కేసుయొక్క వివరాలు, రామదాసు కేసు యొక్క కల్పనాకథలు, సెటిల్మెంటులో వుండే కష్టాలూ విపులంగా ప్రకటించినవి. జోతీ అప్పాదాసుల ప్రేమయొక్క చిత్రచరిత్ర జనులలో విస్మయం కలిగించింది. పౌలు పరారీకావడంవల్ల అనుమానం యెక్కువఅయింది. పాదిరీ రామదాసు కేసుకూ, పౌలు దుర్వర్తనానికీ సంబంధం లేదని జనులను మభ్యపెట్టడానికి ప్రయత్నించాడు గాని సత్యం దాగలేదు. మతబోధవిషయమై రామదాసు సమ్మెకట్టించడంవల్ల పాదరీప్రోత్సాహంచేత రామదాసుకు జైలు ప్రాప్తి అయిందని జనులు నమ్మారు. పౌలుయొక్క దుష్ప్రవర్తనం, జోతీ అప్పాదాసుల ఘోరమరణం, సెటిల్మెంటువాసులలో కల్లోలం పుట్టించినవి. జనమంతా సెటిల్మెంటునింబధలను యెగర్రించి గుడిసెలు విడిచి ఆవరణంవెలుపల కృష్ణకట్టపొడుగునా నివాసమేర్పరుచుకున్నారు. మరణాలసంగతీ, సమ్మెలసంగతీ కలెక్టరుకు తీగెయివ్వంగనే ఆయన మూలబలంతో తాడేపల్లిస్టేషన్లో దిగాడు. కేసులను పూర్తిగా విచారించవలసిందని పోలీసువార్కి తాఖీదిచ్చి సెటిల్మెంటువాసులను వెంటనే గుడిసెలలో కాపురం వుండకపోతే తుపాకులతో కాల్పిస్తామని కలెక్టరుగారు బెదిరించారు. తాము పరుగెత్తిపోదలచుకోలేదనీ, తుపాకులతో కాల్చి చంపవచ్చుననీ, మూడురోజులలో తమకు తగినజీవనవసతి చూపించకపోతే లేచిపోతామనీ లిఖితపూర్వకంగా తెలియపరచారు. యీసంగతులు యితర సెటిల్మెంట్లలోకూడా కదలిక పుట్టించినవి. రాఘవేంద్రరావు పంతులుగారిచేత గవర్నమెంటువారు చట్టనిర్మాణసభలో సెటిల్మెంట్లు యెట్లా పనిచేస్తున్నవో విచారించి తెలియపర్చడానికి ఒకసంఘం యేర్పరచవలసిందని తీర్మానం పెట్టించారు. ప్రతినిధిసభ్యులలో చాలామంది 'సంఘాలేర్పరచడమంటే మాకర్థం తెలుసు. ఈ ఉద్రేక సమయంలో ప్రస్తుతపు అడావడి ఆపేకొరకే సంఘాలేర్పాటుచేసి అది అణిగిపోయినతర్వాత మెదలకుండా వూరుకోవడం అంతా

మెరిగినసంగతే. వెంటనే సెటిల్మెంటుకష్టాలకు తగినచికిత్స చేయ వలసిం'దని పట్టుపట్టాఁరు. గవర్నరుగారిసలహాతో పంతులుగారు మామూలుప్రకారం తమతీర్మానాన్ని ఉపసంహరించుకోబోయినారు. ప్రతినిధి సభ్యులు సెటిల్మెంటుసమస్య సక్రమంగా పరిష్కరించకపోతే తాము సభవిడిచి లేచిపోతామని బెదిరించారు. తర్వాత ఉభయులూ రాజీపడి ప్రస్తుతం ఉండవల్లి సెటిల్మెంటు తీసివేసి అక్కడివాండ్లందరికీ పల్నాటితాలూకాలో పూర్వం బేచిరాకుగా వుండి తర్వాత ఫారెస్టులో కల్పబడ్డభూములను దరఖాస్తులకిచ్చి ఊరుకట్టించడానికి వెంటనే యేర్పాటు చేయవలసిందనీ, తక్కిన సెటిల్మెంటుసంగతులు విచారించడానికి చట్టనిర్మాణసభవారు తమలో కొందరిని సంఘంగా యేర్పరచి వారు నివేదిక పంపేవరకూ కొత్తవారి నెవ్వరినీ సెటిల్మెంట్లలో చేర్చకూడదనీ రాజీ యేర్పరుచుకున్నారు. కొందరు ధనికులైన ప్రతినిధిసభ్యులు కొత్తవాళ్లను సెటిల్మెంట్లలో చేర్చకపోతే సంతానులపోరు అధిక మవుతుందని రాజీకి వొప్పుకోకపోయినా యెక్కువమంది అంగీకరించారు. కొత్తఊరికి రామదాసుపురం అని జనులు పేరుపెట్టారు.

వెంకటయ్య, జోతీ అప్పాదాసులమరణంవల్ల కుమిలిపోయి నాడు. రామానాయుడికేసుసంగతి ఆయన కింకా తెలియలేదు. పాదిరీ పిల్లవాడిని వెంకటయ్యతో పంపాడు. యేమి చెయ్యడానికీ తోచక గుంటూరువచ్చి రామానాయుడిప్రయత్నాలు శృంగభంగ మైనవని తెలుసుకున్నాడు. రామానాయుడు జైలులో బడ్డసంగతి తెలియంగనే వెంకటయ్యకు యెక్కడలేనిధైర్యమూ వచ్చింది. మనస్సుకు యేవిధమైన ఖేదం కలుగలేదు. సరాసరి రామానాయుడుతో మాట్లాడడానికి జైలుకు వెళ్లాడు. సూపరింటెండెంటు ఉత్తరువు పొంది లోపలికి పోయి—

వెం: తమ్ముడూ! చింతపడ్డావా!

రా-నా: నా కేవిధమైనచింతా లేదు. జోతీ అప్పాదాసుల మరణంతప్ప మరియేొకవిచారం లేదు. రామదాసూ, మాలక్ష్మీ యీదుఃఖ మెట్లా భరిస్తారో చెప్పలేను. రామదాసు లోకాతీతు డైనాడు. సుఖదుఃఖా లాయన కంటుకోవు. యింతవరకు జోతి

విషయం ప్రతిబంధకంగా వుండె. అదీ తీరిపోయింది. నన్నూ ఆజైలుకే పంపిస్తారనుకొంటాను.

వెం: అయితే మాట్లాడి ధైర్యము చెప్పు. పిల్లవాడి విషయంలో నా ఆడపిల్లలతోపాటు యేర్పాటు చేయవలసిందని నా అభిప్రాయం. నీవుద్దేశ్య మేమి?

రా-నా: సరళమైన నీవుద్దేశ్యాలతో నా కభిప్రాయభేదం యెట్లా కలుగుతుంది?

వెం: ఆసంగతి మాలక్ష్మితో చెప్పు. పిల్లవాణ్ణిప్పుడు మనయింటికి తీసుకొనిపోతున్నా. జతపడివస్తే నాలుగోపిల్లకు పెండ్లి చేసి అత్తవారింటికి పంపిస్తా. నా భారం తీరిపోతుంది. అదట్లా వుండనియ్యి. నీవు వచ్చేవరకు నే జేయవలసిం దేమి? నాకేమి సందేశం?

రా-నా: నే బయటికి వచ్చే ఆరునెలలలోగా స్వరాజ్యం వచ్చి తీరుతుంది. నారాయణరావుపంతులుగారి సలహా పుచ్చుకుంటూ తగిన ప్లాను వేయించి శాశ్విక కళాశాలాభవనాలు తయారు చేయించు. వసూళ్లు కురదలాలుంటే పూర్తి చేయించు. నేను జైలులో మరణించడం తటస్థిస్తే ఉద్యమానికి లోటు వస్తుందనే సందేహం లేదు. నాకంటె ఉత్సాహపరుడవు, సమర్థుడవు అయిన నీ చేతులలో పడ్డది. నిన్ను పొగిడాననుకోవద్దు. మనం అనుకున్న ప్రకారం జరిగించు.

వెం: నీవు చెప్పింది యావత్తు శిరసావహించి నెరవేరుస్తాను. ప్రతి నెలాఖరున యెంతపని జరిగించింది తెలియపరుస్తుంటా. ఇక్కడ నుంచి ప్రయాణ మెప్పుడు?

రా-నా: యింకా రెండు మూడు రోజులదాకా తీసుకొనిపోరు.

వెం: అక్కడ నీచే తేమైనా పని చేయిస్తారా?

రా-నా: విడిఖైదే. నాదుస్తు లుంచుకోవచ్చు. ఇక్కడికి నేను తెచ్చుకొన్న పడకగుడ్డలు మేజస్ట్రేటుగారికి చూపి వా రంగీకరించినవి నాకు పంపు. రెండుపాత్రలుగూడా అవసరం. ఆయన అంగీకరించనివి సెంట్రలుజైలు సూపరింటెండెంటుగారు చూచుకొని నా కిచ్చేటట్టు పంపితే ఆయన అంగీకరించవచ్చు.

వెం : ఫరవాలేదు. ఈయన అన్నీ అంగీకరిస్తాడనుకుంటా.

రా-నా : నాకు నమ్మకం లేదు. యితనికి భయం. దాస్యంలో వున్నవా డెప్పుడూ దేనికీ సాహసించలేడు. అయినా ప్రయత్నించి చూడు.



పోలీసు : అయ్యా! ఇక పదండి. మేజస్ట్రేటుగా రింతసే పెందు కుంచారంటారు. కావలసివుంటే సాయంత్రం వచ్చి మాట్లాడండి. యేర్పాటు చేస్తా.

వెం : తమ్ముడూ! నిన్ను ఖైదులో వుంచి నేను హాయిగా యింటికి వెళ్లుతున్నా. నేను నీతో యెందుకు రాకూడదు?

రా-నా : అన్నా! మనం రణరంగంలో వున్నాం. నేను గాయపడ్డాను. హాయిగా వుంటాను. బయటవుండి నీవే యెక్కువ మనస్సులో బాధపడుతావు. నీవుకూడావస్తే పని యెట్లా సాగాలె? నీవు పూర్తిచేయించకపోతే అంతా ఆయామా డవుతుంది. నే నిప్పుడు ఖైదులో పడకపోతే మనయేర్పాట్లు యీడికెకిందపడేవి. ఇది మనకొక కొరడాదెబ్బే. సమర్థుడవు నీవు బయటవుండి నేను ఇక్కడ వుండడమే మేలు.

వెం : తమ్ముడూ! నీతో పోలిస్తే నే నెంతవాణ్ణి!

రా-నా : ఆ విషయమై నీవు జబాబు చెప్పవద్దు. నిన్ను పొగడలేదు. నన్ను క్షమించి మరియొకవిషయ మెత్తుకో.

వెం : పంతులుగారిని మనవూ రొకమారు తీసుకొనిపోతే బాగుండు. ఇప్పుడు రమ్మంటే వస్తారా!

రా-నా : వారు పనికూడా ఆపుదల చేశారు. మన ఆలోచన లన్నీ చెప్పాను. ఉదయం చాలాసేపు మాట్లాడిపోయినారు. స్పష్టంగా చెప్పలేదుగాని ఆయనవల్ల మనకు యెక్కువసహాయం అవుతుం దనుకుంటాను. ప్లాను ఆయన అంగీకరించందే మొదలు పెట్టవద్దు.

వెం : అయితే యీరోజు ఆయనను తీసుకొనిపోతా. నీవు నిడదవోలు వెళ్లేలోగా మళ్ళీవస్తా.

రా-నా : అదంతా పెట్టుకోవద్దు. పోయి పని వెంటనే ప్రారంభించు.

వెం: ఇప్పటికింతే చూపు. పని సాగించి పదిహేనురోజులలో వచ్చి అన్ని సంగతులూ మాట్లాడుతా. కేవలం ఉత్తరాలవల్ల తేలదు. అక్కడనుంచే రాజమహేంద్రవరం పోయి కలప తెస్తా.

రా-నా: సరే కానియ్యి. యింతే నమస్కారములు.

పోలీసులు: అయ్యా! మేజస్ట్రేటుగారు వచ్చే వేళయింది. దయచేసి పదండి! (అంతట వెంకటయ్య వెళ్లిపోయినాడు.)

## 21. దాస్యం రుచిస్తే ముక్తిలేదు

వెంకటయ్య వెళ్ళిపోయినతర్వాత రామానాయుడు భోజనం చేసి నిశ్చింతగా పడుకున్నాడు. సంగదాసుహత్యా, కమలయొక్క చిత్రచర్యా, సాహూచౌదరయ్యల మరణం, జగ్గడిబందిపోట్లు, వెంకటయ్య ఉద్యమంలో కలియడం, రామదాసు వగైరాల కారాగృహప్రవేశం. జోతీ అప్పాదాసుల విచిత్రప్రయాణం, శ్రీకృష్ణ జన్మస్థానానికి తనయాత్రా, మొదలైనవన్నీ యేదో సర్వజ్ఞత్వం గల వ్యక్తి మహోద్దేశంతో నడుపుతున్నట్లు కనబడ్డది. ధర్మాధర్మాలు వొకదాని నొకటి జయించడానికి చేస్తున్న మహారణరంగంలో యివన్నీ అంతర్భాగాలైన స్వల్పకథలుగా తోచినవి. లోకచరిత్ర పారజూస్తే సత్పథం పొడుగూనా సత్పురుషుల రక్తసిక్తమయ్యే కనబడ్డది. ఇది మహాయాగం. యజ్ఞపురుషుడు యీ మహాహోమంలో తన్నొక యింధనంగా స్వీకరించినందుకు ఆనందపడ్డాడు. పావకుడు తనను అగ్నిపరీక్షకు లోబరచినందుకు ధన్యవాదంచేశాడు. తనయందు అజ్ఞానజన్యమైన అహంకారము నశించడానికి సాధనం చూపించినందుకు భగవంతుడికి కృతజ్ఞతాపూర్వక వందనాలు చేశాడు. ఒళ్లు జలదరించింది. లేచి కొబ్బరినారచాపమీదను కూర్చున్నాడు. "అశ్రాంతహరిభావనామోదచిత్తుడై యుద్ధతుడై పాడు నొక్కచోట" అన్నమోస్తరుగా నరసింహారావుగారిదగ్గర నేర్చుకున్న :

"భజో మధుర హరినామ నిరంతర్
భజో మధుర హరినామ్
హరిహై సుఖహై - హరిహై శాంతి - హరిహై
ప్రాణారామ్."

అనే కీర్తనను గొంతెత్తి అవ్యక్తమధురధ్వనితో పాడు తున్నాడు.

ప్లీడరు నారాయణరావు మళ్ళీ రామానాయుణ్ణి చూడడానికి వచ్చాడు. జైలులోకి అడుగు పెట్టంగనే భక్తిరసప్రవాహంయొక్క కెరటాలు యీడ్చికొడుతున్నవి. కొండలుకూడా ఆగేటట్టు లేదు. బండలు చెమర్చినవి. చెట్లు మోసులెత్తినవి. గాలి మందగమనముతో తూలుతున్నది. క్రిమికీటకాదులు సొమ్మసిల్లినవి. నారాయణరావు మునివేళ్ళమీద నడిచివచ్చి కమ్ములు పట్టుకొని నిలువబడి అద్భుతదృశ్యంలో ఐక్యమైపోయినాడు. గానం పూర్తి అయిపోయింది. రామానాయుడు కన్నీటికాల్వలలో వొప్పదోగుతున్నాడు. నిశ్శబ్దకుహరంలోనుండి వొక్కవాక్కు వినబడ్డది.

'శ్లో. సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః.'అని.

నారాయణరావు శిరస్సు వంచాడు. రామానాయుడికి సర్వం నారాయణమయం అయిపోయింది. ఇండ్లూ, వాకిండ్లూ, రాళ్లూ, పోలీసులూ, ఉద్యోగులూ, ఖైదీలూ నారాయణునియొక్క ప్రకారాంతరాలుగా కనబడ్డారు. "సహ నౌ భునక్తు" అను మహావాక్య ప్రకారం అన్యోన్యభోగ్యభోక్తృత్వసంబంధం నిరూపణమైంది. "ఏష సర్వస్వభూతో మే పరిష్వంగో హనుమతః." అను ప్రమాణ ప్రకారం సహభోజనం ప్రాప్తించింది. అన్నిలోకములకూ వ్యాపించిన యీ సత్రయాగం కొంతసేపటి కంతర్ధానం అయింది. రామానాయుడూ, నారాయణరావూ ముఖాముఖిగా నిలువబడ్డారు.

రా-నా : అయ్యా! నమస్కారం.

నా : తమరు నమస్కారం చేస్తున్నారా?

రా-నా : పెద్దలకు నమస్కారం చెయ్యడం ధర్మంగదా!

నా : తమకు వ్యతిరేకంగా జెప్పడంలేదు. ఆశీర్వాదంగా స్వీకరిస్తాను. ఇక్కడికి నేను పనివుండి వచ్చినా మీతోడిసాంగత్యం వల్ల నాజన్మసాఫల్యకారైన చూపు లభ్యం అయింది. సహభోజనం ప్రాప్తించింది. నాకంతే చాలు. ఈదినం వెంకటయ్యతో

మాట్లాడాను. మహాత్మాజీ చెప్పినప్రకారం స్వరాజ్యంరాక తప్పదు. నేను తిరిగీ ప్లీడరువృత్తిలో ప్రవేశింపవలెననే ఉద్దేశ్యం లేదు. స్వరాజ్యం వచ్చేవరకూ దేశస్వాతంత్ర్యానికై పనిచేయడానికి నిశ్చయించుకున్నాను. అటుపైని మీ మంగళాపురంలో ప్రవేశించి పంచమకార్మికోద్యమాలలో దేనిలోనైనా మీరు చూపినపని చేయడానికి సిద్ధంగా వున్నాను. తమతో మరివొకవిషయంగూడా మాట్లాడవలసివున్నది.

రా-నా: నేను యితరఉద్యమాలలో కొంత జోక్యం కలిగించుకొని తిరుగుతుండడంచేత ప్రత్యక్షంగా రాజకీయవ్యవహారాలలో ప్రవేశం కలిగించుకోలేదు. కార్మికసంఘాల నన్నిటినీ దేశ స్వాతంత్ర్యానికి పూర్తిగా పనిచేయవలసిందని ఖండితంగా చెప్పి వచ్చాను. సభికు లందరూ త్రాగుడు మానివేశారు. సంఘాలున్న అన్ని గ్రామాలల్లో సారాయిదుకాణాలు మూశారు. మూల మూలలవున్న రాటాల బూజంతా దులుపబడినది. గ్రామాలల్లో యెక్కడ చూచినా దూదేకులవాండ్ల కమానుల గుబదెబలూ— రాటాలయొక్క సంగీతం, విరివిగా వినబడుతున్నవి. యెక్కడ జూచినా మంతకనూలుగుడ్డలే. కార్మికసంఘా లన్నీ తమ సభ్యుల కుటుంబాలు ఖద్దరుబట్టలే ఉపయోగించాలెనని తీర్మానాలు చేసినవి. పట్టణాలకుకూడా యెగబ్రాకింది. పన్నుల విషయంలోకూడా పూర్తిగా తగు అవసరం వచ్చినప్పుడు పని జరుగుతుంది. అవసరం వస్తే ఖైదుకు పోవడానికి యెవరూ వెనుదీయరు. నేను ఖయిదుకు రావడంకూడా వారిని పురికొల్పుతుంది. స్వయంగా మీతో కలిసి పనిచేసేభాగ్యం నాకు లభించనందుకు చింతించుతున్నాను.

నా: అయ్యా! మీ రిదివరకు చేసిన పనంతా ఇప్పుడు రాజకీయోద్యమానికి పునాది. కార్మిక పంచమోద్యమాలు రెండూ వృద్ధిపొందినప్పుడే మనదేశంలో నిజమైన ప్రజాప్రభుత్వం ఏర్పడుతుంది. దిగువజాతులలో ప్రబోధం కలుగందే ధనిక ప్రభుత్వం ఉంటుందిగాని ప్రజాప్రభుత్వం ఉండదు. ఇప్పటి రాజకీయాందోళనానికీ, విదేశ ప్రభువులు ముందుగా ఖైదులోకి పంపించడానికీ తప్పకుండా మీరు అర్హత సంపాదించారు. మీరు చెమటవోడ్చి సంపాదించిన గౌరవమే కాని ఉత్రవుడియంగా వచ్చిందిగాదు. నేను మీతో

మాట్లాడదలచిన ఇంకొకవిషయంలో ధర్మవిరుద్ధంగా ఆ పనికి పూనుకున్నానేమో అని సందేహంగా ఉన్నది. కలెక్టరుగారు మీతో కొన్ని సంగతులు ముచ్చటించనున్నారు. మిగలా వచ్చానుగనుక చెప్పి పోదామని నిశ్చయించుకున్నాను.

రా-నా : దానికేమి! వినదగు నెవ్వరు చెప్పిన. వినుకోవడం సంగతి వేరు. సెలవియ్యండి.

నా : పొద్దున మీతో మాట్లాడి వెళ్ళినతర్వాత కలెక్టరు నాకు కబురంపించి మీ విషయమై మాట్లాడారు. వారు నాతో చెప్పిన సంగతులు వారికిగాను మీతో చెప్పుతున్నాను. అది నా అభిప్రాయంగా ఎంచవద్దు. మీరు జిల్లాలో చాలా పలుకుబడిగలవారని తెలిసిగాఁవాలె, మిమ్మును శిక్షించినందుకు పస్తాయిస్తున్నాడు.

రా-నా : తప్పని తోస్తే సవరించుకోవచ్చుగదా. మిగిలిందేమున్నది!

నా : అట్లా చేస్తాడా? లొంగితే గౌరవానికి లోప మనుకుంటాడు. మీ రేదో ఎదిరించి మాట్లాడారని చర్య జరిగించాడు. ప్రస్తుతం కార్మికోద్యమాన్ని గురించి పని చేయనని వాగ్దాన మిస్తే ఆర్డరు రద్దుచేయిస్తాడట.

రా-నా : గౌరవహానికోసం చూస్తున్నా డని నేను నమ్మను. కంపెనీప్రభుత్వం మారిపోయినా వర్తకసరళి మారలేదు. బేరానికి దిగాడు. పోనియ్యి గౌరవహానే అనుకుందాం. తనను ఎదిరించానను కుంటే క్షమాపణ కోరుతాను. కార్మికోద్యమంలో పనిచేయనని వాగ్దాన మెందుకు? అది నిర్ధారణ చేసుకోవడం నాపనిగాని తనది గాదు. ఎదిరించి మాట్లాడాననేది ఒక సాకు. అయినా ఒకసంగతి చెపుతాను. తమ అభిప్రాయానికి భిన్నంగా చెప్పగూడదని పాలక జాతుల కుండే అహంకారం. దానిని గర్హించడం మన విధి.

నా : స్వరాజ్యంకోసం పని చేస్తున్నాంగా. దానితో అన్నీ తేలుతవి. ఇప్పుడు మనం ప్రతిఘటించి చేసే దేమున్నది?

రా-నా : అది పొరపాటు. ధర్మ మెప్పుడూ అధర్మాన్ని ప్రతిఘటిస్తుండవలసిందే. అధర్మం ఒకప్పుడు గెలిచినట్టు కనబడ్డా ఆ గెలుపే ధర్మోద్యమానికి ఊపు ఇస్తుంది. ధర్మం గెలవక తప్పదు.

ధర్మపథాన పోరాటమే లేకపోతే ఎప్పటికీ జయం లేదు. పురుష ప్రయత్నం లేకుండా ధర్మం గెలుస్తుందని నే పూహకోను. స్వాతంత్ర్యాభిలాష చచ్చి దాస్యం రుచిస్తే జాతికిగాని, వ్యక్తికిగాని ఇక మోక్షం లేదు. బానిస ఎప్పుడూ తనమోక్షానికై కలహిస్తూ ఉండవలసిందే. ఎవడైనా భావదాస్యానికి వశుడైనతర్వాత జాతీయదాస్యం అసహ్యించుకొని జాతీయమోక్షానికి పోరాడగలడని నే నమ్మను. కాబట్టి ప్రతివాడూ దాస్యానికి పనపడగూడదు. వ్యక్తిమోక్షానికి పోరాడడం జాతీయదాస్యానికై చేసే పోరాటానికి అడ్డం వస్తే స్వార్థత్యాగం చెయ్యవచ్చు. అంతకుతప్ప దాస్యవిమోచనానికై పాటుపడకుండా ఉండడం మానవధర్మం కాదు. తాత్కాలికాపజయాలు ధర్మవిజయానికి మెట్లే అవుతవి. విఘ్నాలు వస్తవని సత్పురుషు లెవరూ ప్రయత్నాలు మానరు. "యత్నేకృతే యదివసిద్ధ్యతి కోఽత్రదోషః."

ఇంతలో కలెక్టరాఫీసు గుమాస్తా బైసికిలు వేసుకొని పరుగెత్తుకుంటూ వచ్చి "పంతులుగారూ! తమతో మాట" అన్నాడు.

నా : ఏ మంత తొందర?

గు : కలెక్టరుగారు తమతో మాట్లాడమని పంపారు. కాస్తయిటు దయచేయండి.

నా : ఇక చెప్పండి, ఫరవా లేదు.

గు : నాయుడుగారితో కలెక్టరుగారు చెప్పమన్న మాటలు చెప్పవద్దన్నాడు. ఆప్రకారం జరపడానికి వీలులేదట.

నా : ఏమి! ఇంతలోనే ఇంత మార్పు!

గు : అదంతా రహస్యంలెండి.

నా : చెప్పవయ్యా! అన్నీ రహస్యాలే.

గు : వాళ్ల ఉప్పూ పులుసూ తింటున్నాంగా ఇంకా.

నా : ఎవళ్లది? మీ కలెక్టరుగారు వాళ్లదేశాన్నుంచి ఉప్పు తెచ్చి మీకు పెట్టుతున్నారా?

గు : లేవడంలేదనుకోండి. చివరకు వాండ్లచేతిమీదుగా మాకు వస్తున్నదిగా.

నా : అదికూడా తప్పే. జవాను యెంచి నీచేతిలో పెడుతున్నాడు. కలెక్టరుకూ వాడే యిస్తాడు. కాబట్టి వాడు మీకు

ఉప్పూ పులుసూ పెడుతూవున్నట్టా? ప్రభుత్వంవారు ప్రజలతరఫున ధర్మకర్తలు. వారిస్తున్నా ప్రజలిస్తున్నట్టే. యిది ధర్మం.

గు : అధర్మ మేది ?

నా : ధర్మకర్త సొమ్ము నా దనడం. మీ రంతా ప్రజల నవుకర్లము గాము, ధర్మకర్తనవుకర్ల మనడం.

గు : మీకు నేను జవాబు చెప్పలేనండి. సంగతి యిది. నే చెప్పానని యెవరితోను అనవద్దు. యిప్పుడు కర్నూలునుంచి టెలిగ్రాం వచ్చింది. తక్కెళ్లజగ్గడు యీమంగళాపురపువాడట. అక్కడివాళ్లుకూడా కొందరు వాడితో మరీకై నట్టు తెలుస్తున్నదట. అందువల్ల యీమార్పు.

నా : సరే వెళ్లండి. రోగీ పాలే కోరాడు, వైద్యుడూ పాలే చెప్పాడు. నాయుడుగారూ! వింటున్నారా, సరాగం?

రా-నా : విన్నా. నాకూ చిత్రంగానే ఉన్నది. మా ఊరుంబాలేలలో తక్కెళ్లవా ళ్లెవరూ లేరు. జగ్గడని పేరుగలవాడు కూడా ఉన్నట్టు కనపడదు.

నా : అది మారుపేరేమో!

రా-నా : కావచ్చు. యీవిషయమై విశేషాలు తెలిస్తే నాకు కెబురంపండి. మరచిపోవద్దు.

నా : అట్లాగే. నే సెలవుపుచ్చుకుంటా.

రా-నా : చిత్తం.

## 22. వీరహనుమాన్

జగ్గడిచరిత్ర కొంతవరకు చెప్పి దిగవిడిచాం. తొందర పనుల వల్ల వెంటనే యెత్తుకొన వీలుగలుగనందుకు చదువరులు మన్నింతురు గాక! ఇంతవరకు బందిపోట్లు అనర్గళంగా సాగుతూనేవున్నవి. నల్లమల కీకారణ్యాలలో తావరమేర్పరచి పర్ణశాలలుకట్టి సంతానులభార్య లనూ, బొక్కసమునూ అక్కడ ఉంచారు. సైనికసంతానులు అక్కడే నివాసం. ఉత్తరాన పాపికొండలలోనూ, నెల్లూరిజిల్లాలో రాపూరికొండలలోనూ ఉపనాయకులు కొందరు నిలవరం ఏర్పరచుకొని తమ చుట్టుప్రదేశములలో బందిపోట్లు జరిపిస్తున్నారు. ప్రతిజిల్లాలో కూడా జిల్లానాయకులుండి వ్యవహారాలు నడిపిస్తారు. సంతానులను

నాయకులుగా నియమించకపూర్వం ఒకమాసంరోజులు నల్లమల అడవులలోవున్న సంతానపురంలో జగ్గడివల్ల ధర్మశిక్షను గ్రహించ వలసివుంటారు. జగ్గడి యోచనాబలం, నిర్మాణశక్తి, కార్యదక్షతా, ప్రజానురాగం అతని ఉద్యమానికి తోడై మద్రాసు, హైదరాబాదు, మైసూరురాజ్యములలోని అన్వేషకశాఖవారి తెలివితేటలను బేలుపుచ్చి నిరాఘాటంగా బందిపోట్లను సాగిస్తున్నవి. దేహంలో ప్రాణం ఇక్కడ వున్నది, ఇక్కడ లేదని నిర్ణయించడానికి వీలు లేని మోస్తరుగా జగ్గడు యెక్కడవున్నా అంతటా అత డున్నట్లే పనిజరగడంచేత అతని స్థిరవాసం యేదో నిర్ణయించడానికి మూడు ప్రభుత్వాలకూ సాధ్యం కాలేదు. ఉత్తర హిందూస్థానంలో సుప్రసిద్ధ అన్వేషకశాఖాధికారి దివాన్‌బహదూర్ రామసింగు, జి. సి. ఐ ఇ. గారిని మూడుప్రభుత్వాలవారూ అధిపతినిగా నియమించి కర్నూలు సూపరింటెండెంటును సహాయంగా యిచ్చారు. రామసింగు తాంతియాభిల్లును పట్టినవాళ్లలో మొనగాడు. చంద్రయ్యపితూరీలో పనిచేయవలసిందని మదరాసుప్రభుత్వంవారు కోరితే తాను రానవసరం లేదని కొన్నివుపాయాలు సూచిస్తే వాటి ననుసరించి సుప్రసిద్ధుడైన వొక ఆంగ్లగూఢచారి అతనిగుంపును పట్టుకొన్నాడు. రామసింగు పత్రికలలో జగ్గడిచిత్రవిచిత్ర చర్యలు చదివాడు. మద్రాసుప్రభుత్వంవా రతని సలహా కోరారు. జగ్గడి బుద్ధి తన కందలేదనీ, స్వయంగా సంచారంచేసి స్థలవిమర్శనచేయందే సలహా చెప్పలేననీ, తన్ను నియమిస్తే సంతోషంగా పనిచేస్తాననీ, తెలియపరచాడు. ఇండియాప్రభుత్వంవారు ఆయనను వెంటనే సర్వాధికారంతో నియమించారు. కర్నూలుజిల్లా సూపరింటెండెంటు స్పెన్సరుగారు బర్హంపురంలో వచ్చి కలుసుకున్నారు.

స్పె : సింగ్జీ! సలాం.

రామ : సలాం, మిష్టర్ స్పెన్సర్ !

స్పె : యిక మనం చేయవలసినపనేమి ?

రామ : జగ్గడి నివాస మేదని మీ రనుకుంటారు ?

స్పె : పాపికొండలలో నివాస మేర్పరచుకొని వాడు విశేషంగా రైలు ప్రయాణం చేస్తుంటాడని నమ్మకం.

రామ: యెవరికన్నా కనబడ్డాడా?

స్పె: లేదు.

రామ: ఈ రెండుసిద్ధాంతాలూ సరియైనవి కావు. బందిపోటు నాయకులు సాధారణంగా ప్రయాణంచెయ్యరు. ప్రధానస్థానంలో ఉండి యావత్తుచర్యా నడుపుతుంటారు. ఇంత సమర్థుడైన నాయకుడికి తగినసహాయకారు లుండుండాలె. పాపికొండలలో సహాయకుడుమాత్రమే ఉంటాడు. రెండవది యీకొండ మూలగా వున్నది. అన్నిభాగాలకూ అందికలో లేదు. అయినా వైఖరిచూచి చెపుతాను.

స్పె: కొండ వందమైళ్లపొడుగున వ్యాపించివుంది.

రామ: నాకు ఆంధ్రదేశములోనికొండ లన్నిటిప్లానూ వేసి చూపండి. తర్వాత అవసరమైనభాగాలు చూతాం.

స్పె: యిది మాస్టరు.

రామ: పాపికొండలలో యీభాగంలో అడవు లేమాత్ర ముంటవి? అక్కడ వైశాల్య మేమాత్రం?

స్పె: ఈకొండలలో వెడల్పు విశేష ముండదు.

రామ: అయితే ఈకొండలలో ఉండడు.

స్పె: యివి రాపూరికొండలు.

రామ: అక్కడ లేడు. నల్లమల అడవులవైఖరి యెట్లా వుంది?

స్పె: కొండలచుట్టూ పెద్ద కీకారణ్యం ఉంటుంది.

రామ: యీభాగంలో కొండ లెన్నివరుస లున్నవి?

స్పె: నాలుగైదువరుస లున్నవి, అడ్డంగాకూడా కొన్ని కొండ లున్నవి.

రామ: నీటివసతుందా?

స్పె: దొనలూ, చెరువులూ కావలసినన్ని ఉన్నవి.

రామ: యింకా యేజిల్లాలో పెద్దకొండ లున్నవి?

స్పె: కడపలోవి షుమారైనవి.

రామ: అక్కడ లేడు. బ్రిటిషురాజ్యంలో ఉంటే 'నల్లమలలో ఉంటాడు, యీభాగంలోవుండాలె. దానిని ముట్టడింతాం. మనతాబేదారు లెవరికీ యీసంగతులు తెలియగూడదు. ఇంకొక

సంగతి. వాండ్ల ఆడవాండ్లజాడ లేమైనా కనబడ్డవా? యిండ్లకు వస్తూపోతూవుంటారా?

స్పె: భోగంవాండ్లిండ్లకు రారు. ఉంపుడుకత్తె లెవరికీ లేరు. సొంతయిండ్లకు వస్తుండవచ్చు. అదైనా తక్కువే.

రామ: వాండ్లభార్యలు తప్పకుండా నల్లమలఅడవులలో ఉంటారు. మనకు పదివేలసైన్యం కావాలె. నాలుగుభాగాలు చేసి కమ్ముకొని రావాలె. నేను యిటుపోయేభాగంతో ఉంటాను. మద్రాసుకు టెలిగ్రాం పంపించండి. అయిదురోజులలో యావత్తు సైన్యమూ రావాలె. తరువాత ఒకవారంలో యావత్తు ముగించాలె. నల్లమలలో లేకపోతే నైజాంలో ఉన్నట్టే లెక్క.

స్పె: అతడు ఒకవేళ తప్పించుకొన్నా ఆడవాళ్లు చిక్కితే మనం గెల్చినట్టే. అయితే వాండ్లను అతిజాగ్రత్తతో కాపాడుతుంటాడు. ఆడవాండ్లు చిక్కడం కష్టం.

రామ: అయితే నాభాగంలో మూడువేలసైన్యం ఉంచండి.

స్పెన్సరుగారు వెంటనే మదరాసుకు టెలిగ్రాం యిచ్చారు. గవర్నరుగారు మైసూరుకూ, హైదరాబాదుకూ తంతి పంపారు. మదరాసునుండి ఆరువేలసైన్యం, హైదరాబాదు మైసూరులనుండి చెరివేయిసైన్యం బయలుదేరి కర్నూలులో దిగింది. జగ్గడికి ప్రభుత్వంవారిసైన్యముల నడకలన్నీ తెలిసినవి. చుట్టుప్రక్కల నున్న సైనిక సంతానుల నందరినీ మూడురోజులలో చేర్చాడు. అవసరండుంటే సంపాదకసంతాను లందరూ పోరాడుటకు రావలసి ఉంటుందని జిల్లానాయకులకు ఉత్తరాలు వ్రాశాడు. యుద్ధప్రకారం నిశ్చయించడానికి సైన్యాధిపతులసభ చేసి సమూహాయుద్ధం పనికి రాదనీ, కేవల దొమ్మియుద్ధంచేతనే అడవులలో శత్రునాశనం చేయవలెననీ నిశ్చయపరచుకొని ప్రతిశత్రుసైన్యమునకూ అయిదు వందల సైన్యంగల సంతాన పటాలాలమర్చి శత్రువులతో యెక్కడా యెదిర్చి పోట్లాడకుండా చుట్టుప్రక్కల కమ్ముకొనివస్తూ మధ్యమధ్య ముచ్చిలిగొని ధనప్రాణముల గొంటూ దీర్ఘకాలం యుద్ధంజరుపుతూ ఉన్నాడు. సంతాను లిదివర కెన్నడూ యుద్ధాలు చేసినవాళ్లు కారు. జగ్గడు వట్టిమూకలను నెలరోజులలో కూటయుద్ధవిశారదులుగా తయారుచేయగలిగాడు. యుద్ధంలో జగ్గడిపక్షంవా ళ్లెవ్వరూ పారి

పోలేదు. ఒక్కడూ అధర్మయుద్ధం చెయ్యేదు. కష్టంలోవున్న శత్రువు తమచేతుల్లో చిక్కినప్పుడు ఔదార్యంతో పంపివేసేవాండ్లు. నాయకులకూ, సంతానులకూ అత్యంతమైన అన్యోన్యం. కొందరు యుద్ధంలో పడిపోతున్నారు. మైళ్లకొలది శత్రువులవెంటనంటి వేధిస్తున్నారు. జగ్గడు మెరికెలవంటి అయిదువందలసంతానులను యేరి మూరుదారిన బొక్కసమును, స్త్రీలను దాటవేయడానికి దారి దీశాడు. రామసింగు తనమూడువేలసేనలోను, పదిహేనువందల మందిని సంతానులతో పోట్లాడడానికి వదిలి వాండ్లకు తెలియకుండా తక్కిన పదిహేనువందలూ చీలదీసి జగ్గడివెంటనంటి కూటయుద్ధం ప్రారంభించాడు. స్త్రీలనూ, బొక్కసమునూ కాపాడవలసినభారం జగ్గడిమీద పడ్డది. ఒకకోటిరూపాయలను ఒకచోట పాతివేసి వట్టిపెట్టెలనుమాత్రం మోసుకొని పోతూవుండవలసిందనీ తమప్రాణా లున్నంతవరకు స్త్రీలను కాపాడవలసిందనీ ఉత్తర్వు చేశాడు. స్త్రీలూ, సైన్యమూ, కాకులుదూరని కారడవిలో ప్రవేశించారు. రామసింగు ప్రాణానికి తెగించి వెంటబడి తుపాకులతో అగ్నివర్షం కురిపిస్తున్నాడు. స్త్రీలు రాత్రింబవళ్లు మూడురోజులు తియ్యకుండా నడిచారు. ఒకచోట నిలిచి వంటచేసుకోవడానికి అవకాశంలేక పస్తులున్నారు. పిల్లలు బొత్తిగా వేలబడిపోయినారు. సాధ్యమైన చోట కొద్దిగా వండి పిల్లలనుమాత్రం బ్రదికించుకుంటూ నడుస్తు న్నారు. రామసింగు సైన్యానికి ప్రతిరోజూ పక్కవూళ్లనుంచి సప్లయిలు వస్తున్నవి. ఒకరోజు జగ్గడిసైన్యం శత్రువులభోజనాన్ని దొమ్మిచేసి పట్టుకోగల్గింది. శత్రువులు ఒకపూట భోజనంలేక వెనుకంజవేసిన సమయంలో జగ్గడు రెండురోజులు తగిన భోజన పదార్థం వండించుకొని ప్రయాణం సాగించాడు. జగ్గడిసైన్యానికి మందుగుండుసామగ్రి తక్కువైంది. అది కనిపెట్టి రామసింగు సమీపించి కాల్చడం ప్రారంభించాడు. కొందరు స్త్రీలూ, పిల్లలూ గుండ్లదెబ్బలు తగిలి మరణించారు. ఇక యుద్ధం యెక్కువకాలం జరిగితే స్త్రీలను రక్షించడం అసాధ్యమని తోచింది. తన నాయకు లను సలహా అడిగాడు. వారు స్త్రీలను వదిలివేసి మనం తప్పించుకొని పోతే స్త్రీలకేమీ అపాయం జరగదనీ, యెక్కువసైన్యాన్ని జేర్చు కొని మళ్లీ యుద్ధం ప్రారంభించవచ్చుననీ సలహా యిచ్చారు.

పనులు. దంపడం, విసరడం, వండడం కష్టమైనా ఖయిదీలకు అవి ఇష్టమైనపనులు. వాళ్లు ఇష్టంవచ్చినంత తిని ఇతరులకు పెట్టి పలుకుబడి సంపాదిస్తారు. ధనాకర్షణకూ, పొగాకుసంపాదనకూ వీలైనపనులు. కొందరు లోలాయలు విసిరే పిండికంటె బొక్కే పిండే ఎక్కువ. చాలామంది సహాయనిరాకరణ ఖయిదీలూ యీ రకం వాండ్లే. పూర్వం బియ్యం ఆడఖయిదీలే దంపుతూండేవాళ్లు. ఈపని వాళ్లకు లేమలకపోతే సంచులునేయడం మొదలగు సన్నపను లిచ్చే వరకు దంపే ఆడఖయిదీలకు సగంవాళ్లు తీసింది. ఖయిదీలందరికీ గొంగళ్లూ చాపలూ నేయడం, లాగులూ చొక్కాలూ టోపీలూ కుట్టడంపని చాలామందికీ పడుతుంది.

దర్జాగల విడిఖయిదీలకూ, ఖయిదీవార్డర్లకూ పళ్లెములూ, లోటాలూ ఇవ్వడం మామూలు. ప్రతిబ్లాకులో అక్కడ పడుకుండే ఖయిదీలందరు భోజనంచేయడానికి చెట్లక్రింద ఒకడుగు ఘనపరిమాణం గల గచ్చుతిన్నెలు వేసివుంటవి. యెవరితిన్నెదగ్గర వారు కూర్చుండి తిన్నెమీద మల్ల పెట్టుకొని భోజనంచేసి కడిగి ముంత అరుగుమీద బెట్టి మల్ల బోర్లిస్తారు. లెమ్మని వార్డరు ఉత్తర్వు చేయంగనే అందరూ ఫైలులో అనగా నలుగురేసి వరుసగా కూర్చుంటారు. ఎవరిబ్లాకు లోనే వారు పనిచేయవలసిననియమం లేదు. వార్డరు ఉత్తరువు యీయంగనే అందరూ లేచి ఫయిలు తప్పకుండా ఎవరి కార్ఖానాలోకి వాళ్లు వెళ్లుతారు.

ఖైదీలందరూ వారివారిపనులలో నియమించిన టాస్కు (Task) ఇవ్వవలసి వుంటుంది. ఈయనివాళ్లకు శిక్ష విధిస్తారు. ఈపని పూరా మధ్యమ కనీసము అని మూడువిధాలు. సాధారణంగా ప్రతికఠిన ఖయిదీ పూర్తిటాస్కు ఈయవలసివుంటుంది. అశక్తతా, వృద్ధాప్యం మొదలైనవానిచేత ఖయిదీలవల్ల తక్కువపని పుచ్చుకోవచ్చు. పూర్తిపని యీయవలసినవాళ్లకు మెడలో తెల్లదారం కడతారు. నల్లదారం కట్టినవాళ్లకు సగంపని. కనీసపుపని ఇవ్వవలసినవాళ్లకు ఎఱ్ఱదారం గుర్తు. కడపటివాండ్ల పని పేరుకుమాత్రమే.

ఖయిదీలు అనుసరించవలసిన నియమాలు క్లుప్తంగా చెబ్తాను. జైలుపుద్యోగులకు తగిన మర్యాదలు చూపాలి. చౌర్యం వగైరా

నేరాలు చేయకూడదు. ఇతరబ్లాకుల వాండ్లతో మాట్లాడకూడదు. సంగీతాలూ ఆటలూ పాటలూ పనికిరావు. పొగాకు ఏరూపంగానూ ఉపయోగించకూడదు. ఫయిలు తప్పి నడువరాదు. భోజనపదార్థాలు దొంగలించరాదు. మార్చుకోనూకూడదు. ఉత్తరువుపొందనిదే కాగితాలు మొదలైన వ్రాతసామగ్రి, పుస్తకాలు ఉంచుకోకూడదు. ఉద్యోగులమీదగాని, ఖయిదీలమీదగాని తప్పుడుఫిర్యాదులు చేయ కూడదు. నియమితస్థలాలలోతప్ప మల మూత్ర విసర్జనం చేయరాదు. కావలెనని వ్యాధి పెంపుజేసి పొడిగించకూడదు. ఎవరైనా ఉద్యోగస్తులమీద తిరగబడితే ఉద్యోగస్తులకు తోడ్పడ వలెను.

ఇట్టివే నిబంధనలు ఇంకా ఉన్నాయి. ప్రతిఆదివారం ఉదయం లెక్కకాంగనే నిబంధనలు క్లుప్తంగా చదివి వినిపిస్తారు. ఏసెంట్రలుజైలులోనైనా ఖయిదీలు యెక్కువగావున్నా, మరి కొన్నింటిలో తక్కువగావున్నా, ఏఖయిదీలైనా ఒక సెంట్రలు జైలులో ఉండడం అనుచితమని తోచినా భాషావివక్షత లేకుండా మరిఒకచోటికి మారుస్తారు. నిడదవోలు సెంట్రలుజైలులో వ్యవహారం నిర్వహించే వార్డర్లంతా తెలుగువాండ్లే. ఖయిదీలలో పంజాబీలు, ఓడ్రులు, ఆంధ్రులు, అరవలు, మలయాళీలు, కన్నడులు, సబులుండాగా అందరూ ఉన్నారు. ఒకరిభాష ఒకరికి తెలియదు. ఇతరభాషలు తెలియనివాండ్లకు జీవితం దుర్భర మవుతుంది. భగవంతుడిచ్చిన వాణినికూడా ఉపయోగించ వీలులేదు. ఖయిదీలను మాటలు వచ్చిన మనుష్యులుగా భావించరు. కాగితాలమీద ఖయిదీలసంఖ్యే కావలసింది. పనిచేయించేటప్పుడు వార్డరు తెలుగులో ఉత్తరువు లిస్తాడు. ఖయిదీవార్డరు తనకు వచ్చిన ఏభాషలోనో అరుస్తాడు. ఇవి రెండూ ఖయిదీలకు తెలియకపోవచ్చు. అర్థంగాక పనిచేయనందుకు బూతులు తిడతారు. అవీ అర్థంకావు. అంతట లాఠీదెబ్బలు పడతవి. ఈ బాధలు పడలేక ఖయిదీలు మరొక జైలుకు మార్చమంటారు. అధికారులీకారణం చాలదంటారు.

ఖయిదీల స్వల్పనేరాలు శిక్షించడానికి సూపరింటెండెంటుకు అధికారమున్నది. పెద్దనేరాలు జరిగితే ముద్దాయీలను మామూలు

కోర్టుకు పంపవలసిఉంటుంది. ఖయిదీలను కొట్టడం మొదలైన శిక్షలు విధించడానికి ఒక్క సూపరింటెండెంటుకే అధికారమున్నది. ఆయన తాబేదారులకు లేదు. ముక్కోణాన కొట్టడం, చీకటికొట్లో పెట్టడం; కొట్లలో ఒంటరిగా పెట్టి తాళాలు వేయడం, అడ్డబేడీలు, నిలువుబేడీలు, కఠినపుపని విధించడం, పస్తు పెట్టడం, తక్కువన్నం పెట్టడం, మందలింపు మొదలైన శిక్షలు సూపరింటెండెంటు స్వయంగా విచారించి విధించడానికి అధికారము ఉన్నది.

ఊళ్లో వుండే పెద్దమనుష్యులను సూపరింటెండెంటుకు తోడ్పడడానికి ప్రభుత్వమువారు కొందరిని నియమించవచ్చు. వీరిని విజిటర్లంటారు. వీరు సాధారణంగా జీహుజూరులై ఉంటారు. ప్రభుత్వ పద్ధతిలో తప్పులేమీ వీళ్లకు కనపడకూడదు. ఎవరైనా సాహసించి దోషాలు కనపరిస్తే మళ్లీ వాళ్లను నియమించరు. వీరు ఖయిదీలకు భోజనాదులు సక్రమంగా జరుగుతున్నవో లేదో, విచారించి సూపరింటెండెంటుకు తెలియపరచవచ్చును. ఖయిదీలను ఉద్యోగులు కొడితే విచారించి శిక్షించడానికి తమకుకూడా అధికారమున్నదని వీళ్లకు తెలియదు. స్వదేశీవాండ్ల తగాదాలలో యీసంగతి బైటపడ్డది.

జైలుకు సంబంధించి ఒకచిన్నబడి, ఆస్పత్రి ఉన్నవి. బాల ఖయిదీలకు రోజూ ఒకగంట చదువుచెపుతారు. చదువుకొని బాగుపడ్డవాండ్లెవ్వరూ కనపడరు. ఐ. జి. గారు సంవత్సరపుతనిఖీకి రాబోయేముందు కొందరు పిల్లలపేర్లు జేర్పిస్తే వాండ్లు విశ్రాంతిగా ఒక గంటసేపు వస్తూ పోతూ ఉంటారు. ఆసుపత్రులలో కొన్నిచోట్ల సూపరింటెండెంటే డాక్టరుగా ఉంటాడు. దీనెంత చెడుపద్ధతి మరొకటి లేదు. ఈయనకు సహాయంగా కొందరు సర్జనులు కాంపౌండర్లు ఉంటారు. క్వయినా, విరోచనాలమందు, కట్టుగుడ్డలు మాత్రమే ఇక్కడ సమృద్ధిగా దొరకే ఔషధ సామగ్రులు. తక్కిన మందులు వెదుకవలసిందే.

అవతారికగా జైలుసంగతులు కొన్ని చెప్పబడ్డవి. వీటి సహాయంతో చదువరులు తరువాతి అధ్యాయములను ఓపికతో చదివి మహాజనులు జైలుసంస్కరణానికి పూనుకొంటారని తలుస్తాను.

## 2. సన్యాసం

రామదాసు, పుల్లప్ప, మహాలక్ష్మి ఉదయం యేడుగంటలకు నిడదవోలుస్టేషన్‌లో దిగారు. వారిని తీసుకొనివచ్చిన నలుగురు పోలీసులు ఉదయకాల్యాలు తీర్చించి యెనిమిదిగంటలకు సెంట్రలు జైలుకు తీసుకొనిపోయి ఒప్పజెప్పారు. ఆడవాండ్లకు వేరేజైలు ఉంటుందనీ, భార్యాభర్తలవియోగంకూడా సంభవిస్తుందనీ నిడదవోలు వచ్చినతర్వాత జవానులు చెప్పారు. రామదాసు సద్గురునామము సంస్మరించి ఇప్పటికి పూర్తయిందని అన్నాడు. మాలక్ష్మి అందరి వెంబడి నడచి వచ్చిందన్నమాటేగాని తనపై తానెఱుగదు. ఇటువంటిసమయములలో ఆమెకు మాట్లాడకుండా వూరుకోడం మామూలు. రామదాసువంక కన్నెత్తి చూడలేకపోయింది. జైలుదగ్గరకు రాంగనే వార్డర్లు ముగ్గుర్నీ స్వాధీనపర్చుకొన్నారు. రోడ్డుకు యెడమ ప్రక్కగావున్న అడ్మిషనుఆఫీసులో డిప్యూటీజైలరు కూర్చొనివున్నాడు. పెరియలు లాయపిళ్ల చాలా సర్వీసుగలవాడు. మనిషి పొడగరి. చామనచాయ. దేహం ముడతలుపడ్డది. సూటు తొడుక్కున్నాడుగాని దోవతి కట్టుకున్నట్టయితే ఆయనకున్న అరవజాడ్యం మఱుగుపడేదే. కండ్లు చాలా యెఱ్ఱగా ఉన్నవి. సర్దుకొని కుర్చీలో కూర్చుండి కొత్తఖయిదీలను తెమ్మని వార్డరుకు సైగ చేశాడు. మనముగ్గురు ఖయిదీలనూ హాజరుపెట్టారు.

పిళ్ల : దాన్ని ముందు తరాజులో యెక్కించు.

వార్డరు : తరాజుమీద యెక్కు.

మాలక్ష్మికి తరాజు యెక్కడమంటే అర్థం కాలేదు. ఇటువంటి త్రాసు యెన్నడూ ఆమె చూడలేదు. తోచక నిల్చున్నది.

పిళ్ల : ఎక్కవేమే ?

మాలక్ష్మి : ఎక్కడ ?

పిళ్ల : ఆలంజకు చూపించవే ఎక్కడ యెక్కుతారో.

దగ్గర నిల్చున్న వార్డరమ్మ కులుకుచూపులు పిళ్లగారిపై నెగడిస్తూ మాలక్ష్మిని చెయిపట్టి తరాజుమీదికి యెక్కించింది.

పిళ్ల : దిగు. పేరు చెప్పు.

మాలక్ష్మి : నాపేరు మాలక్ష్మి.

పిల్లి : తీసుకుపో ఇక, దాన్ని క్వారంటైన్‌లోకి.

వార్డరమ్మ నడవమన్నది. మాలక్ష్మి మెడ పక్కకు దిప్పి రామదాసువంక బిక్కచూపులు చూచి కండ్లు తేలవేసి "మళ్లీ చూడడం వున్నదా?" అన్నది.

రామ: సద్గురూ, వాడిదయప్రకారం జరిగితీరుతుంది.

మాలక్ష్మి : పిల్లలసంగతి తెలిస్తే నాకు కబురుచెయ్యి.

వార్డరు : చేస్తారులే పద.

పుల్లప్ప : (రహస్యంగా) వీళ్లను యేదోమాట చెప్పి లోగట్టుకోవాలి. ఆ యేర్పాటు తర్వాత నే జేస్తాను. డబ్బుంటే కొండమీది కోతి దిగివస్తుంది.

పిల్లి : ఆముసలివాణ్ణెక్కమను. ఆఁ—110 పౌనులు తూగావు. దిగు. నీ వెక్కు—140 పౌనులు.

పుల్లప్ప—నిన్న గుంటూరు రైలుస్టేషన్‌లో తూచుకుంటే 150 పౌన్లున్నాను. ఒక్కరోజుకే పదిపౌనులు తగ్గానా!

పిల్లి : ఒరే వార్డరు! నీలాఠీ యేమైంది?

వార్డరు లాఠీతో మోదాడు. పుల్లప్ప కొంచెంసేపు విలవిల్లాడి వూరుకున్నాడు.

పిల్లి : 140 పౌన్లు యెల్లాతూగావో తెలిసిందా? జైలుపడి దిని వూరుదువుగాని. మీ యిద్దరికీగూడా రాగిపడి వేశాను.

పుల్లప్ప : ఆముసలాయనకు తీర్పులో రైసుపడి వ్రాశారండి. మే మెన్నడూ రాగి తినియెరగం.

పిల్లి : ఔనురా. మీరంతా మాలదొరలు. సన్నబియ్యం, చిన్నచేపలూ కావాలి.

వార్డరు : (రహస్యంగా) ఆసంగతంతా నే జెప్తాతా పదండి.

పిల్లి : తీసుకొనిపో.

వార్డరు యిద్దరినీ క్వారంటులోకి తీసుకొనిపోయినాడు. పదకొండుగంటలైంది. బాగా యెండ గాస్తున్నది. గేటువార్డరు సోదాచేయించాడు. పుల్లప్పగుడ్డలన్నీ విడిచి కుప్పపెట్టాడు. రామదాసు దోవతి విడవడానికి సందేహిస్తున్నాడు.

వార్డరు : విడవవేమిరా.

రామదాసు : ఏదైనా గోచీ యిప్పించండి.

వార్డరు : గోచీ గావలెనా? విడువు.

అని లాఠీ యెత్తి గూడమీద పొడిచేవరకు యెముక కదిలింది.

రామదాసు : సద్గురూ! ఈ అభిమానంకూడా యింతటితో వదిలిపోయింది. ద్రౌపదినీ, గోపికలనూ యిట్టిస్థితికి దెచ్చే రక్షించావు. పుట్టినప్పటిస్థితిలోకి దెచ్చావు. బాలులకుండే నిష్కపటహృదయంకూడా దయచెయ్యి!

రామదాసుకూడా దోవతివిడిచి దిగంబరుడై నిలువబడి అప్రయత్నంగా ఎడమ చెయ్యి అడ్డం పెట్టుకున్నాడు.

వార్డరు : బీడీలేమైనా దాచిపెట్టుకున్నావా? చెయ్యి అడ్డం పెట్టుకుంటున్నావు.

రామదాసు : స—రే—సద్గురూ—తీశా.

వార్డరు : కూర్చోండి—లేవండి.
కూర్చోండి—లేవండి.

నీ పేరేమి? పుల్లప్పా. ఇరకబట్టుకొని కూర్చుంటావేమి? చప్పున కూర్చో. లాఠీ విఱుగుతుంది.

పుల్లప్ప చప్పున కూర్చున్నాడు. ఎక్కడనుండో రెండు బేడలు కింద రాలినవి. ఓవర్సీయరు యేరుకొని నీళ్లుపెట్టి కడిగి ఒక బేడ గేటువార్డరు కిచ్చి రెండవది తానూ ఖయిదీవార్డరూ తర్వాత పంచుకున్నారు.

వార్డరు : వీడిదగ్గర ఇంకా యెన్నివున్నవో నోరు పగల దీయించండి.

పుల్లప్ప : ఇకనేమీ లేవండీ, సామిలోడు.

వార్డరు : సరే ఆ గోచీ పెట్టుకోండి, గొరగరా వీళ్ళకు.

పుల్లప్పకు మంచి జుట్టు ఉన్నది. కుయి కుయి మనకుండా కూర్చున్నాడు. కత్తి చిత్రంగా ఉంది. దూదిబస్తాలకు చుట్టే రేకును ఒకపక్క గాతితో సాగకొట్టి రాతిపలకమీద పదునుపెట్టారు. తల తడపలేదు. జుత్తు మెడంచేత లంకించుకొని ముందుకు లాగి రేకుపెట్టి వెనుకకు దోశాడు. ఒకసార పీతోలు ఊడింది. గాట్లు పడ్డాయి. పుల్లప్పకు చేస్తూంటే రామదాసు పక్కననిలవబడి చూస్తున్నాడు. జుట్టు బట్టుకొని తలగొరగడం చూసి శిఖ మిగులుస్తా రనుకొన్నాడు. చుట్టూ పూర్తికాంగనే గేటువార్డరు పరుగెత్తుకొనివచ్చి పుల్లప్పజుట్టు

పట్టుకొని నిల్చున్నాడు. తనిఖీవార్డరుకూడా వచ్చి పట్టుకొన్నాడు. ఉభయులూ లాగులాడుతున్నారు.

పుల్లప్ప: అయ్యా! నాప్రాణాలు పోతున్నవి. విడవండి.

రామదాసు: అత డేమితప్పు చేశాడండీ?

ఎఱుకలమంగలి: పోరా కామాటి నాయీ నీ కేంతెలుసు. అయ్యా! మీ యిద్దరికీ తగాదా లేకుండా నే చెఱిసగంగా పంచి పెడతా.

వార్డరు: నిన్న నా యిన్‌చార్జిఖయిదీవి నేను కక్కసులోకి పోయివచ్చేటప్పటికి అంతా తను మూటకట్టుకొని బేడ కమ్ముకొన్నాడు. దాంట్లోభాగం ఇస్తే ఇందులోసగం ఇస్తా. లేకపోతే ఇదంతా నాకు రావలసిందే. ఇందాకటిబేడలోది ముందు అణా ఇవతల పెట్టు. లేకపోతే రిపోర్టు చేస్తా.

గే. వా: రిపోర్టుకు నే భయపడేవాణ్ణికాను. నిన్నటివి వట్టిబిఱుసువెండ్రుకలు. ఇవి పట్టుకుచ్చుమోస్తరుగా వున్నవి.

పుల్లప్ప: నాప్రాణం పోతున్నది. జుట్టు విడిచిపెట్టి భాగాలు తెగదెంపు చేసుకోండి. ఇంతకూ అసలువాడికి నాకేమీ భాగం లేకుండా జేస్తారా!

వార్డరు: వీ డెవడో గడుసుముండాకొడుకురా. రేపు నీకు అరుబీడీ లిస్తాము.

పుల్లప్ప: నోట్లోకో.

గే. వా: చూస్తాములే.

పుల్లప్ప: రెండుబేడలూ ఊడబెఱుక్కుంటిరి. ఈ పొద్దు గతేమి?

వార్డరు: ఈవేళ సాధ్యంకాదు. తెచ్చిందైపోయింది. సాయంత్రందాకా బైటకుపోము ఎక్కడైనా దొరికితె చూస్తాము. పోదాలో దొరికిన బేడలుకూడా రాసినజేర్చి అంతా చెరిసగం చూసుకుందాం.

మంగలి: ఇవ్వాళ కీప్రకారం పోనీయండి.

ఉభయవార్డర్లూ రాజీపడ్డారు. జుట్టుగొఱగంగనే గేటు వార్డరు పొదంగాజేర్చి మూటకట్టుకున్నాడు. పుల్లప్పకుమాత్రం పీడవదలినట్లు తేలికగా వుంది. లేచినిలువబడి,

పుల్లప్ప: నోరు తుత్తరగా వుంది. ఏమైనా పెట్టరా?

గేటువార్డరుకూ పుల్లప్పకూ దోస్తీకుదిరింది. పొగాకుముక్క తుంపి చేతికిచ్చాడు.

పుల్లప్ప కనకం యిచ్చినట్లుగా సంతోషించి ఒకతుంపు విరిచి నోట్లో వేసుకొని రెండవది గోచీలో దాచిపెట్టుకున్నాడు. రామదాసుయొక్క తలవూచి వూబచెత్తవలె నాలుగుపోచ లున్నవి. వాటికోసం యెవరూ తగాదా పడలేదు. మంగలి క్షణంలో యావత్తూ వరసబెట్టి దోకాడు. రామదాసుకండ్లకు నీళ్లు వచ్చినవి.

రామదాసు: కొంచమైనా శిఖ వుంచరా?

మంగలి: ఖర్చు అయిపోతుందనా ఏడుస్తున్నావు!—అని అంటూ యావత్తు జుత్తూ గొరిగాడు.

రా: సరే ఇక్కడికి సన్యాసం పూర్తయింది. అయితే "తలలు బోడులైతే తలపులు బోడులా" అని వేమన్నగారు అన్నారు.

పు: మీకు రెండూ బోడులే.

రా: అయితే బలవంతసన్యాసం అయిందోయ్.

పుల్లప్ప: అట్లా కాదు. కాయ పండి యెండి రాలింది. నేను మీ అండను చేరాను. ఎప్పటికైనా జ్ఞాపకం ఉంచుకోండి.

తర్వాత ఇద్దరికీ కాలికి ఇనపకడియం బిగించారు. మీకు బిళ్లదెచ్చి మెళ్లో గడతారు. అదీ కడియం తుప్పుపట్టకుండా తెల్లగా తోముతుండండి. నల్లబడితే లాఠీ విఱుగుతుందని వార్డరు చెప్పాడు. ఇద్దరికీ చెఱివొకముంతా, మల్లా యిచ్చి ప్రతిదినం కూర్చొని భోజనం చేసే తిన్నె చూపించారు. రెండోమాటు బూర వూదారు. క్వారెంటులోవున్న నూటయేభై మంది ఖయిదీలు పని చాలించివచ్చి యెవరిముంతలు వాళ్లు తీసుకున్నారు. క్వారంటువార్డరు 'రైజ్' అనీ, ఓవర్సీరు 'లేస్' అనీ అన్నారు. రామదాసుకు అర్థం తెలియక పోయినా పుల్లప్పా తక్కినవాండ్లూ లేస్తే తానూ లేచాడు. మళ్లీ వార్డరు 'డౌన్' అనేవరకు అందరూ కూర్చున్నారు. రెండు మాటలూ రామదాసు సందర్భాన తెలిసికొన్నాడు. వార్డరు ఫయిలని ఉత్తరువు చేయంగనే అందరూ నాలుగుబార్లు దీఱి కూర్చున్నారు. 'రైస్' 'మాస్' అనంగనే అంతా లేచి బయలు

దేరారు. అందరూ త్వరగా నడవడంలో రామదాసు కొంచెం వరసతొలిగాడు. ఫెడేలుమని లాఠీ భుజంమీదికి దిగింది. రామదాసు అదరిపడి నిలువబడిచూచాడు. జనం తోసుకొని వస్తున్నది. వార్డరు 'హాల్టు' చెప్పి లైను యెందుకు తొలిగావని కర్ర యెత్తాడు.

రామదాసు: నాకు తెలియదు. చెప్పకూడదా!

వార్డ: ప్రతికొత్తగాడిదెకు చెప్పేవరకు నానోరు నొప్పియెత్తుతున్నది. నోటితో చెబితేమట్టుకు జ్ఞాపకం వుంటుందా? లాటీతో చెబితే మరచిపోరు.

అంతా నీళ్లకుండుదగ్గరకు బోయి ఒంటిబారుదీటి నిలవబడి అల్లరిలేకుండా ఒకరితర్వాత ఒకరు ముంచుకొని నలుగు రేసి ఫయిలులో నిల్చున్నారు. వార్డరు మార్చి చెప్పంగనే బయలుదేరి తిన్నెలదగ్గరకు వచ్చి యెవరిచోట వాండ్లు కూర్చున్నారు. ఇనప మంచాలమీద గుడ్డలుకప్పి మోసుకొనివచ్చి దిమ్మెలదగ్గర అన్నమూ రొట్టెలూ దింపారు. వాటివెంటనే సాంబారుగంగాళం వచ్చింది. నూటయాభై మందికని రెంటిమీదా వ్రాసివున్నది. వార్డరు రైజ్ చెప్పంగనే అంతా ఒంటిఫయిలున వచ్చి యెవరిపడి వాళ్లు వరుసగా తీసుకొని అక్కడనుంచి సాంబారుగంగాళందగ్గరకు బోయి తలాఒక కొన్ను పులుసు పోయించుకొని తిన్నెలదగ్గరకు వచ్చి కూర్చొని అన్నం దినడం ప్రారంభించారు. రామదాసుకూ పుల్లప్పకూ పడి రాలేదు. పుల్లప్ప వార్డరును అడిగితే ఈపూటకు కావలసిన సామగ్రి పొద్దున ఇచ్చారు. మీకు పడి సాయంత్రానికి కాని రాదన్నాడు. మంచంమీద ఒకరొట్టె మిగిలివున్నది. వార్డరు అది తుంచి చెరిసగం పంచిపెట్టిమిగిలినపులుసు చెరికాస్తాపోయించాడు. రామదాసుకు వుల్లిగడ్డ యిష్టంలేదు. పులుసు గౌలుకొట్టింది. అది ముల్లంగిఆకుపులుసు. పుచ్చినవీ ముదిరినవీ కొన్ని ముల్లంగిదుంపలు కూడా అందులో వేశారు. తుంగా గటికె యేరి వెయ్యలేదు. తెల్లని పురుగులు పైన తేలుతున్నవి. పుల్లప్ప వార్డరుకు చూపించాడు. పుణ్యానికి పుట్టెడిస్తే పిచ్చకుంచమని పోట్లాడుతున్నావా అని అన్నాడు. రామదాసు పులుసు వదలి రొట్టె తిన్నాడు. అప్పుడే సెంట్రలు జైలులో రామదాసుకు ఒకపూట గడచిపోయింది. వార్డరు 'రైస్' చెప్పంగనే లేచి మల్లలు కడిగి తిన్నెలమీద పెట్టి

యేపనికిపోవలసినవాళ్లు ఆ గుంపుగా ఫయిలు కూర్చున్నారు. రామదాసుకూ పుల్లప్పకూ పడి యేర్పాటు చేయలేదుగాని పని యేర్పాటు చేశారు. సుత్తె యిచ్చి ముక్కరాళ్లు కొట్టమన్నారు. మొదటిరోజు గనుక 'టాసు' యిమ్మని బలవంతపెట్టలేదు. రెండు గంటలకు అందరినీ కక్కసుకు వదలారు. పాకీపనివాడు చెకుముకి రాతితో నిప్పుకొట్టి వుంచాడు. బీడీలు ముట్టించుకొని ఒకర్ని అనుకొని ఒకరు కూర్చొని సందేహనివృత్తి చేసుకొన్నారు. రామదాసుకు మొదటిరోజులలో సందేహంగా వున్నది కాని మధ్యాహ్నం సోదా అయినతర్వాత జంకు తీరింది. పాతజైలు పాకీదొడ్డిలో ఒకరొకరికి మధ్య అడ్డగోడలున్నవిగాని కొత్తజైలులో ఆపద్ధతిమార్చి అడ్డంలేకుండా ఒక్కటేగది యేర్పరచి నేటివుల మూఢాచారాలు పోగొట్టి నాగరికత నేర్పారు. కొత్తజైలులో కూడా పూర్వపుయేర్పాటుప్రకారం ప్రతిసావిట్లో దొడ్డికి అరగోడలు పెట్టివుండేవి. ప్రతి సావిట్లో పదముగ్గురికి పడుకునేందుకు మట్టి అరుగు లుంటవి. ఇప్పుడాపద్ధతి మార్చి మట్టి అరుగులబదులు చక్కటి పాలగచ్చుటరుగులు వేయించి దొడ్డిస్థలంలోగూడా మరి రెండరుగులు గట్టించి స్థలంలో పేస్తరుతీశారు. మానం పోయినా గచ్చుటరుగులు వచ్చాయి. మలమూత్రపుకుండలూ సావిట్లో బహిరంగంగానే పెడతారు. అందరి యెదటా కూర్చోవలసిందే. నిజానికి జైలుకు చోటుకఱవులేదు. వేలకొలది యెకరాలుచుట్టూవున్నవి. ప్రతిబారకాసుచుట్టూ విశాలమైన ఆవరణం వున్నది. దానిలో రస్తాలు, పూలచెట్లూకూడా వేస్తారు. ఇంతస్థలం వున్నా సావిళ్లల్లో అధికార్లు నీతిబెట్టి స్థలం పెచ్చుదీస్తారు. స్థలలాభంకంటె నీతి ముఖ్యమైనదని మన ఉద్యోగులైనా చెప్పరు. ప్రారంభంలో ఉన్న మంచియేర్పాట్లు మార్చి దుర్నీతి నేర్పేపద్ధతులు కొత్తగా యెందుకు అవలంబిస్తున్నారో తెలియదు.

పూర్వం ఆంగ్లేయులు మన ఆచారాలు యెక్కువ గౌరవిస్తూండేవారా? లేక మనవిద్యాధికులు నాగరికులై కొత్తపద్ధతులు యేర్పరిపిస్తున్నారా? ప్రారంభంలో సోదాచేసేటప్పుడు దిగంబరులను చేయవలసిన అవసర మేమున్నది? అవసరమున్నా బహిరంగంగా యెందుకు చేయడం? గోచీలలో డబ్బు, బీడీలు దాచుకుంటారని

ఒకజవాబు చెపుతారు. ఇంత శల్యపరీక్ష చేసి ఒకకేసైనా రిపోర్టవుతున్నదా? జైలులో చుట్ట తాగనివాండ్లెవరు? ఉద్యోగస్తులు చేయకూడనిపనైనా బహిరంగంగా జైలులో చుట్టలు తాగడంలేదా? నూటికి తొంభైమంది ఖైదీలు పొగాకు యేదో ఒకరూపకంగా రోజూ ఉపయోగించేవాండ్లే. అదివరకుచుట్ట అలవాటులేని వాళ్లుకూడా జైలుకు వచ్చినానికె కొత్తగా చాలమంది నేర్చుకుంటారు. కులాసావస్తు వనికదా జైళ్లలో పొగాకు నిషేధించారు. పాతక మని గాదు. గొప్పదుర్వ్యసనమూగాదు. ఖైదీలనుభవించగల కులాసావస్తు విదియొకటే. "కౌపీనసంరక్షణార్థ మయం పటాటోపః!" అని జైలులో చుట్ట తాగితే మేజస్ట్రీటు వద్ద రెండుసంవత్సరాలు శిక్ష. ఒక కేసూ మేజస్ట్రీటుకు పోదు. పోనీ, ఆపగలిగారా?

ఈజైలులోకి ప్రతిదినం యెంతలేదన్నా ఒక అర్థమణుగు పొగాకు, బీడీకట్టలు, నాలుగురూపాయాల పొడుమూ రానే వస్తున్నవి. నిర్బంధాలవల్ల ఖరీదెక్కువకావడం. చట్టవిరుద్ధమైనది గనుక ఖయిదీలకు బాధలు తప్ప ఈనిషేధంవల్ల ఇతర ప్రయోజనం కనుపడదు. ఖయిదీలు మొదట వచ్చేటప్పుడు ఒకటిరెండు బీడీలు దాచి పెట్టుకుంటారనుకోండి. అవి యెన్నాళ్లు వస్తవి! పొగాకంతా వార్డర్లే తెచ్చి అమ్ముతారు. బైటిపనికి పోయే కూలీలు తెచ్చేది గేటులో సాధారణంగా ఆపవచ్చు. గేటువార్డరు నామకా సోదా జేస్తుంటాడు గాని వార్డర్లుగాని, ఖయిదీలుగాని తెచ్చే పొగాకు పట్టుకోడు. ఏవార్డరైనా విరోధంచేత ఖయిదీదగ్గర పొగాకు పట్టుకుంటే ఖయిదీని శిక్షిస్తారుగాని అది యెక్కడినుంచి వచ్చిందో నిగ్గదీసి విచారణ చేయరు. ఈ నిర్బంధములవల్ల ఖయిదీలను క్రింది ఉద్యోగస్తులకు లోబరచడందప్ప మరొకలాభం కనపడదు. కాస్త పచ్చిగల ఖయిదీ జైలులోకి రాంగనే వార్డర్లు తమలో పోటీలుపడి అతనిని తమ ఖాతాదారుగా యేర్పరుచుకుంటారు. ఖయిదీవార్డర్లు, ఓవర్సీర్లు చిల్లరదుకాణదార్లని చెప్పవచ్చు. వీళ్లకు వార్డర్లు సప్లయి చేస్తుంటారు. పచ్చిగల ఆసాములకు వార్డర్లు పెట్టుబడి పెట్టి యింటిదగ్గరనుండి తమపేర రహస్యంగా మణియార్డర్లు తెప్పించుకుంటారు. వచ్చినపైకం చెరిసగం. అంతా వార్డ రనుభవించడ

మూకద్దు. చాలామంది వార్డర్లను నమ్మరు. వీళ్లకు పాకీవాడే కోశాధికారి.

ఒక సూపరింటెండెంటు ఒక న్యాయస్థుణ్ణి గేటుసోదాకు నియమించి పొగాకు దిగుమతి ఆపవలెనని చూశాడుగాని మాటలు గేటు ద్వారా రావడంమాని రాత్రులు గోడలుదూకడం మొదలుపెట్టినవి. వెదురుగడలకు మూటలు తగిలించి సంకేతస్థలములో గోడమీదుగా లోపల విడిస్తే లోపల పహరాచేసే ఖయిదీవార్డర్లు అందుకొని గడ బైటికి వేసేవారు. ఉభయులకూ సాంకేతికపదా లుంటవి. వార్డర్లకిది పెద్దవర్తకం. పొగాకువ్యవహారం సాగేవాండ్లు ఆజీలుగా తలా పదిరూపాయిలు సంపాదించుకుంటారు.

దీని నింతట నిలిపి పొగాకువల్ల యెట్టిబాధలు కల్గుతున్నవో పనిబడ్డప్పుడల్లా ముందు చెబుతాను. పుల్లప్పా, రామదాసూ దొడ్డిపని దీర్చుకొనబోయినారు. ఆ సావిట్లో గట్టిన నీళ్లగచ్చుతొట్టి మూడుకావిళ్లు బడుతుంది. పాకీవాడు తగినన్నినీళ్లు ఉంచవలె. సాధారణంగా ఒక కడవనీళ్లైనా ఉండవు.

రామ : నీళ్లు లేవేమోయ్.

పాకీ : మొట్టన గొట్టండిరా యీమాలనాయుణ్ణి. ఎవరికీ అవసరంలేనినీళ్లు ఈమాలవాడికి కావలసివచ్చినవి. ఈవచ్చిన నూరు మందికీ నీ వేమి తలకట్టువా ?

రామదాసూ పుల్లప్పా మొదలకుండా గోచిపెట్టుకొని వెళ్లిపోయినారు. పుల్లప్ప యెక్కడిదో బీడీ సంపాదించుకొని తాగుతున్నాడు.

రామ : ఎంగిలిబీడీనా ?

పుల్లప్ప : కాదండీ, నాస్వంతమే. నే నొక బుద్ధితక్కువపని జేశా. రెండు బేడలు రాలిపోగా ఇంకా ఒకటి నిల్చింది.

రామ : అసాధ్యుడవే. బీడీ అంతా తాగినట్లు లేదే.

పుల్లప్ప : సగం దాగి పక్కవాడికిచ్చా. వాడు సాయంత్రం నాకో దమ్మిస్తాడు. మిగిలినతుంపు పాకీవాడి కిచ్చాము. జైలులో కల్లా వాడిదే అదృష్టం. తాగినన్ని బీడిముక్కలు దొరుకుతవి.

రామ : అన్నట్టు వాడితో యేదో రహస్యం మాటాడుతున్నావు.

పుల్లప్ప : యేదోలే పోనీయండి. తమకు చెప్పవలసినది కాదు.

రామదాసు : చెప్పవోయ్. నాదగ్గ రెందుకు దాస్తావు? సంగతులు తెలిసికోవాలె.

పుల్లప్ప : యేమైనా చీవాట్లు పెట్టండి. చేసినతప్పు చెబుతా. నిన్న అయిదు రూపాయల బేడలు మింగా. రెండు రోజులలో అన్నీ బైటికి వస్తవి. పాకీవాడితో తీసి వుంచమని చెప్పా.

రామదాసు : ఇదంతా నిజమేనా?

పుల్లప్ప : తమతో అబద్ధమా!

రామదాసు : ఏం చిత్రం! పాకీవాడు లేవంటేనో?

పుల్లప్ప : ఒకమాటు వాడాపనికి వస్తే ఇతరులు నమ్ముతారా? ముద్రశుద్ధిగా తీసి ఉంచుతాడు. లెక్క మనకు తెలిసిందేగా. పెట్టెలో దాచిపెట్టుకున్నట్టే. వాడికీ ఒకపావులా డబ్బులు ముట్టజెబుతా.

రామదాసు : సరే పద. ఇది ఒక కొత్తప్రపంచం. క్రమంగా గాని ఏలోకవ్యవహారాలైనా తెలియవు.

## 3. ఎంత కఠిన శిక్ష!

అర్ధభోజనంతో పొద్దుగూకులూ యెండలో పనిచేయడంచేత రామదాసు ముట్టగిలబడ్డాడు. సుత్తెలేవడంలేదు. ముఖం అగ్గి దగిలింది. నడుమ నడుమ అలుపు దీర్చుకుంటూ చేతనయినంతవరకు కొడుతున్నాడు. ఖయిదీవార్డరువచ్చి,

ఖ. వా : అరే, కామాటినాయీ, కూర్చున్నావు, లోలాయల్లో చేరుతావా?

పుల్లప్ప : ఆయన బతికిచెడ్డమనిషి. యీనాటికీ తిప్పలు వచ్చినవి. కడుపులో యెత్తులేనిదీ సుత్తె యెట్లా లేస్తుంది. మధ్యాహ్నం వస్తేఆయే.

వార్డరు : మీ శిఫారసులు చూస్తే నాకు గొంతుమీదకి వస్తుంది. నాకిచ్చిన మనుషులనుబట్టి నే పని వప్పజెప్పాలె. రేపు నల్లదార మెయ్యమని దొర నడుక్కొమ్మను,

బూర వూదారు. రెండవసారి వూదేలోపల కురదలాలు పూర్తిచేసుకొని బంతిగా బయలుదేరి దిమ్మెలదగ్గరకు బోయి అంతా నీళ్లు దెచ్చుకున్నారు. మిశ్రపడివాండ్లందరికీ ఆవేళ అన్నపుముద్దలు వచ్చినవి. రామదాసు అన్నము దీసుకొని పులుసు బోయించు కున్నాడు. ఉప్పుడుబియ్యపు అన్నమెన్నడూ అతడు చూడలేదు. పత్తివిత్తుల కుడితిమోస్తరుగా పులుసున్నది. ముడికందులు నానబోసి వడకట్టి ముద్దబడదంపి కాగేపులుసులో పిండివేసి వండి నూనెపోస్తారు. పూర్వ్యం పప్పుజేసి సాంబారు చేసేవారు. పొట్టుతో దింటే బలమని డాక్టర్లు చేశారట. కందులు పొట్టుతో జబ్బనీ, పెసలు పొట్టుతీస్తే జబ్బనీ అనుభవాన్ని బట్టి మనకు దెలుసు. డాక్టర్లు బతికివున్నవాణ్ణి చచ్చాడంటే మనము ఒప్పుకొనితీరవలసిందే. అప్పటికి నెలరోజుల నుండి కొత్తపద్ధతి అవలంబిస్తున్నారు. సగంమందికి పాసనాలు బుట్టినవి. ఖయిదీలంతా లగ్గలకెక్కారు. చాలామంది జబ్బుపడితే చెడ్డపేరు వస్తుందని దొర భయపడితే క్రమంగా అలవాటుపడి సర్దు కుంటుందంటాడు పిచ్చయ్యశాస్త్రి.

సూ: మనకు కొత్తవాండ్లెప్పుడూ వస్తూనేవుంటారు. ఇద్దరు జాయాకూడా అయినారు.

పి: ఈజబ్బులు చాలా నటన. ఇంకా చూడాలె.

సూ: ఇంతమంది జబ్బుపడ్డందుకు మనం పైకి సంజాయిషీ వ్రాయాలె.

పి: వీండ్లది గ్రహణికింద చేర్చక జ్వరం, తలనొప్పికూడా వున్నది గనుక వాటికింద చేర్చుదాము.

సూ: ఏదో మాటరాకుండా చూడు. అయినా కందులే ఉపయోగించమని ఉత్తరువు లేదు.

పి: సవరిదుతుందేమో చూడమన్నారు.

సూ: అంటే సరిపడేటట్లు చూడవలసిందనికూడా ఉత్తరువు ధ్వనిస్తున్నది. సరిపడలేదంటే చాలదు. తగినన్ని కారణాలుకూడా చూపాలె.

అందుమీాదట కందులపులుసే ఖాయపరచారు.

రా: ఈబియ్యం ఈదేశానివి గామాలె. గంగ్రడమెతుకు లరిగేనా?

పుల్లప్ప: కడుపులో కాలుతుంటే అరగక తిరగమళ్లుతవా? పులుసు తప్పక అడ్డంబడవేస్తు దంటారు. కనిపెట్టితినండి.

రా: ఈపీచుదుంప లేమిటి?

పు: ముల్లంగిదుంపలు. పొద్దున వేసింది వీటి ఆకే. ఈపసరే సగంరోగాలకు మూల మంటారు. ఈ దుంపలు చాలాకాలం దింటే చెన్నపట్టణపుజబ్బు వస్తుందంటారు.

రామ: ఇదేమిపులుసు? దీంట్లో ఉప్పు, పులుసు, కారము మూడూ లేవూ. ఈ భోజనంవల్ల ఇంద్రియనిగ్రహం సులభంగా పట్టుపడుతుంది.

పు: ఆఁ. అన్నిధ్యాసలూ పోతవి. అసలు ఇచ్చే ఉభయాల లోనే ఉప్పూ కారం మధ్యం. దానికి తోడు కత్తిరింపు. వాట్టుకు మీరు మనకే లాభ మంటారు. మమ్ముల నందరినీ సన్యాసం పుచ్చుకోమంటారా?

ఆకలి రుచెరుగదు. కందులపులుసుతో ఉప్పుడుబియ్యపన్న మంతా తిన్నారు. పుల్లప్పకు ఆగలేదు. మల్లగీటి గుజ్జుదింటున్నాడు. వేళ్లసందులు నాకాడు. నాలుక పెదవులు నెమరింది. అన్న మరుగు ముఖమై లేపాడు. పొద్దుగూకుతున్నది. వార్డరువచ్చి లెమ్మన్నాడు. అందరూ లేచి సావిళ్ల ముందు వరుసగా కూర్చున్నారు. వార్డరు లెక్కపెట్టుకున్నాడు. ఫత్తు కారంటుకు కొత్తగా వాచ్చినవాండ్లను 20 మందిని ఒంటికొట్లలో వేశారు. అవి చాలక రామదాసునూ, పుల్లప్పనూ, 20 మంది బయటపనిచేసేఖయిదీలను, సూపరింటెండెంటు గారి యింట్లో పనిచేసే వంతుకూలీలను కలిపి కాలికడియాలలో గుండా తీగెదూర్చి కట్టి పెద్దసాళిట్లో వేశారు. చదువరులు మేకలను దొడ్లలో కట్టివేసేపద్ధతి ఎరిగేవుంటారు. ప్రతిమేకకూ మెడకు తమ్మెతాడువుంటుంది. దాంట్లోగుండా పొడుగాటితాడు దూర్చి చివరలు కట్టివేస్తారు. మేకలన్నీ చెదరకుండా ఉంటవి. గాడిద గుంపులను మఱొకవిధంగా కడతారు. చిన్నతాళ్లుపెట్టి ఒకదాని కాలు రెండవదానికి కడతారు. అన్నిటికీ లంకెవేసి ఒకదానిని మాత్రం గుంజకు కట్టివేస్తారు.

కొత్తఖైదీలకెవ్వరికీ ఇంకా నారచాపలుగాని, గొంగళ్లుగాని, దుస్తులుగాని ఇయ్యలేదు. కొత్తలు ముప్పదిమందికిగాను పదిహేను

గురికిమాత్రం చింపిరిగొంగళ్లిచ్చారు. వీండ్లలో పదిమందికి ఒంటి కొల్లాయిల్లు దొరికినవి. తక్కినఐదుగురికీ చింపి చాపలుమాత్ర మిచ్చారు. పుల్లప్ప గంద్రగోండితనంచేసి చిన్నదైనా చాపా గొంగడీ సంపాదించుకున్నాడు. రామదాసుకు ఏమీదొరకలేదు. పుల్లప్ప తనగొంగడి రామదాసు కిచ్చాడు. చాపకూడా యియ్యవస్తే పుచ్చుకోలేదు. అందరినీ సావిట్లోకి తీసుకొనిపోయి గోడవైపు తల పెట్టించి రెండువరుసలుగా పడుకోబెట్టారు. కాళ్లు చాపుకుంటే మధ్యన ఒకగజం మెల్లా ఉంటుంది. కాళ్లకడియాల గుండా పొడుగుపాటి గొలుసు దూర్చి రెండువైపులా కట్టివేశారు. రెండుబార్లవాండ్లకు కలిపి నలుగురేసి మందికి నడుమ అందికెలో వుండేటట్టుగా పెద్దమలమూత్రపుముల్లలు రెండు బెట్టారు. బయట వెన్నెల ఉందిగాని తలుపులు, కిటికీలు భార్లాతీసిపెట్టినా లోపల గబ్బగీముగావున్నది. అడివికి గాసినవెన్నె లయింది. నక్షత్ర రూపములు పొందిన భగవత్సంకల్పాలు ఖయిదీలహృదయాలలో సత్సంకల్పాలను జనింపజేయడానికి అవకాశం కలుగజేయడంలేదు. పండువెన్నెలలోగాని గాఢాంధకారములోగాని ఆకాశసౌందర్యా న్ననుభవించేభాగ్యం ఖయిదీలకు లేదు. ఎంత కఠినశిక్ష!

## 4. సొంత యిల్లు

వార్డరు తాళాలు వేయడమే తడవుగా ఖయిదీలంతా చెకుముకిబిళ్లలు గొట్టి బీడీలు, చుట్టలు ముట్టించారు. చీకట్లో జుంజుర్లు వెలిగినట్లు వెలుగుతున్నవి. రామదాసు కిటికీకిందుగా పడుకున్నాడు. యిద్దరు ఖయిదీలకు తరువాత పడుకున్న పాతఖయిదీ యెవ్వడో కిటికీకి వెలుపల పడేటట్టు వెయ్యవలెనని కేకరించి ఉమ్మాడు. అది అంతదూరము పోక కిటికీక్రింద పడుకున్న మనిషి మీద పడడం చూచి పకపకనవ్వుతూ పక్కవాండ్లతో తా నెట్లా తుపుక్కున ఉమ్మేసిందీ, అది దూరంబోక లప్పెడు ముసలివాడిమొగాన ఎట్లా పడ్డదీ, వాడు చవటపెద్దమ్మలాగు తుడుచుకొని వూరుకొన్నదీ చిలవలకు పలవలు చేర్చి వర్ణించి చెపుతున్నాడు. వాడు రాజ మండ్రిజైలులో మునుపు పుల్లప్పకు పాతస్నేహితుడు. వాండ్లు కడుపుబ్బ నవ్వుతున్నారు. ఒకడు కోమటిహాస్యం చెబుతున్నాడు.

మఱికొందరు, ఒకడు బంగారక్క, ఒకడు కేతిగాడు, ఒకడు జుట్టుపోలిగాడు పాత్రలుగా ఎంచుకొని వాటికి తగిన వలపుపాటలు పాడుతున్నారు. "నిన్న దెచ్చిన నీలిచల్లాడం" అనేపదం కేతిగా డెత్తుకున్నాడు. చావిడంతా నవ్వులతో బద్దలయిపోయింది. ఆపాట ముగియంగనే బంగారక్క యేంజేస్తున్నదని కొందరు రసికులు కేకలువేశారు. బంగారక్కపాత్ర చివాలున లేచి "మొన్న దెచ్చిన మొగ్గలరవిక" అని చరణ మెత్తుకొని కీచుగొంతుతో పాడుతుంటే జనంలో రక్తి ఆకాశ మంటింది. వీధిభాగవతంలో మాధవివేషం వేసిన ఒకగొల్లవాడు తన అరవంధం పెనిమిటిమీది పదాలు పాడితేనేగాని మజా ఉండదని లేచి పాడడం ప్రారంభించాడు.

"కొట్టొస్తడే నాకు నవ్వొస్తదే (ఈడిజిమ్మడ)
కొట్టొస్తడే నాకు నవ్వొస్తదే
కూరుచుంటె లేవలేడు కూరచట్టిదింపలేడు. కొ."

తక్కినవాండ్లు దరువువేయడం మొదలుబెట్టారు. చప్పట్లు మిన్నుముట్టినవి.

పు : నీవేనుట్రా రాముడూ, ఇంతసేపటినుంచీ యెవరో ననుకుంటున్నా.

రాముడు : పుల్లప్పవా ! మహరాజా హాజరయినవ్. మగసిరి అంటే నీదిరా. నామనసునచ్చినవాడివి. నామర్దాపని చేసిరాలేదుగదా? దొంగదాసరివాడు దారిదోపిడి పని కెప్పుడూ దిగడు. ఎన్నేండ్లు వేయించుకొచ్చావు?

పు : చెప్పుకోవడానికి నాకే సిగ్గుగావుంది. సీటొస్తుకేసే. తొమ్మిదినెలలు వేశాడు వాడిసొమ్మేమో పొయినట్టు.

రా : సిగ్గులేక చక్కబిళ్ల వేయించుకొని వచ్చావుటరా? నీవు రెండుసార్లు వేయించుకొన్నశిక్షగూడా మునుపు నాకు రిమిషన్ ఇచ్చినంత లేదు. ఇప్పుడు మళ్లీ రాజాగా పదేండ్లు వేయించుకోని వచ్చాం. నన్నికి కదిలించేవాండ్లు లేరు.

పు : ప్లీడరును బెట్టుకొని వాదించుకున్నావా?

కా : అటువంటిపనెన్నడూ చేయను. గాంధిమహాత్ముడు చెప్పినట్లే ప్లీడరును పెట్టుకోకుండా జడ్జీతో "నన్నేమీ అడగవద్దు. నీయిష్టము వచ్చినట్లు చేసుకో" అని చెప్పా.

పు : అవురాపులి ! మొగాన గొట్టినట్టన్నావే !

కా : మరేమనుకున్నావు ? వాడూ మొగాన గొట్టినట్లే పదేండ్లు శిక్ష చెప్పాడు.

పు : గాంధిగారిని ఎవరూ పట్టుకోలేరుట.

కా : మనిషి యెదర కనుపడుతూనే వుంటాట్ట. పట్టుకుంటే చేతికి తగలడుట. బొంబాయిగవర్నరు గాంధిగారిని సముద్రపు గట్టున నిలుచోబెట్టికొట్టితే తగలలేదట. సేనానాయకుడిని పిలిచి స్వయంగా కత్తితో నరకమని ఉత్తరువిస్తే కత్తి ఎత్తేవరకు అది తాచుబామంత మల్లెదండై చేతికి చుట్టుకున్నదట. ఆయన బుద్ధిపూర్వకంగా పట్టుబడితేతప్ప నరమానవుడికి చిక్కడు.

పు : ఒరే కామన్నా, నీవు ఇన్ని మంచిసంగతులు తెలిసినవాడివి ఇందాకా పెద్దమనిషిమీద అట్లా వుమ్మేశావెందుకు ? ఆయన యెటువాంటివా డనుకున్నావు ? ఏదో కర్మంబొసిగి వచ్చాడుగాని మనబోటివాండ్లం వెదికినా దర్శనం దొరకవలసినవాడుగాడు.

కా : పొరపాటుపనే జరిగింది. అటువంటివాండ్లుంటే ముందుగా చెప్పవద్దా ? స్వామీ ! నే వెయ్యవలెనని వెయ్యలేదు. ఈతప్పు గాయండి.

రా : దాని కేమి. పొరపాటు ఎవరికయినా వస్తుంది. అందుకోస మింతగా ప్రాధేయపడడ మెందుకు ?

కా : చిత్తం. యోగులు వుమ్మేస్తే తుడుచుకొనిపోతారంటారు. ఇదేకామాలె. అయ్యా గాంధిగారినిగురించి అగుబ్బుగా జెప్పుకుంటున్నారు. మన కేమయినా లాభం చేస్తారా ?

రామ : మహానుభావుడు పూనుకున్నాడు. ఎవరిబాగు వాండ్లు చేసుకోవాలె. మనంకూడా ప్రయత్నం చెయ్యాలె. ఇంతసేపటినుంచీ మీరు యిన్నిమాటలు మాట్లాడుకున్నారుగదా. వాటివల్ల నోరు చెడడం తప్ప చింతాకంత లాభమున్నదీ ?

కా : నిజమేకాని మాకు కాలం జరిగే దెట్లా ? సందలు కూకంగనే లోపలికి బంపిరి. పొద్దు పొడిచేదాకా యెంతసేపని

నిద్రబోతాం! ఎట్లాగో కాలం వెళ్ళబుచ్చుకోవాలె. మాలో కొందరం చదువుకున్నవాండ్లంకూడా వున్నాము. కాస్త తిల్లికె బెడితె గొరుకొయ్యలు నెత్తిమీదికి వచ్చింగాకా చదువుకొందుము. మీబోటివాండ్లు యేవయినా మంచిసంగతులు చెపితే వినవచ్చు. ఏదీ వల్లకాదంటారు. ఉత్తరవు లేకుండా రామాయణం వెంట దెచ్చుకున్నాడని యిప్పుడు ఒక భద్రాజుఖయిదీమీద కేసు విచారిస్తున్నారు.

రా: ఈ జైలుపద్ధ తేర్పాటుచేసినవాండ్లకు మతి ఉన్నట్లు కనుపడదు. సెటిల్‌మెంట్లల్లోగాని, జైళ్లల్లోగాని వేలకొలదిజనాన్ని బాగుచెయ్యడానికి అవకాశమున్నది. తెలియకడుగుతాను. నా కొక్కమాట చెప్పు. నీవు మీ ఊళ్లో కాలువకుపోతే శుద్ధి చేసుకోవడం అలవాటుందీ?

కా: మా దాసర్లంతా చెంబు దీసుకపోవడం అలవాటున్న వాండ్లే. సీటాక్టు మూలంగా యెంతలేదన్నా మావాండ్లను 200 మందిని జయిలుకు బట్టించారు. అప్పటినుంచీ అలవాటు తప్పిపోయింది.

రా: జయిలుకు వచ్చి నేర్చుకున్న మొదటిసంగతి ఇదా?

కా: రెండోది స్నానం జెయ్యకపోవడం. పొద్దుగూకులూ చెమటబెట్ట పనిజేస్తాం. దంపు, మోత, మట్టిపని చేసేవాండ్లం. ఒళ్లు దుమ్ముకొట్టుకొని పైబేజారై వుంటుంది. దులుపుకోని పడుకుంటాం. వారాని కొకమాటు ఆదివారం గుడ్డ లుతుక్కోవ డానికీ, స్నానంచెయ్యడానికీ యెడ మిస్తారుగాని నీళ్లియ్యరు. భావిదగ్గర ఒక తొట్టిలో నీళ్లు బోసి పాతికెమందిని తొట్టిదగ్గర నిలువబెట్టి ఒక ఖైదీవార్డరు తొట్టిలో నిలువబడి దోసిటితో మామీదికి నీళ్లు జిమ్ముతాడు. మనిషికి రెండుముంతలయినా పయిన బడవు.

రా: యిదా వారస్నానం! లోపలకూడా యిదే మోస్తరా?

కా: అంతా ఒకటే వరవడి. పశువుల మోస్తరుగా కట్టివేయడంమాత్రం తప్పుతుంది. ఉదయం ఆరుగంటలయ్యేవరకు ఖయిదీలలెక్క తేలుతుంది. ఏడుగంటలలోగా బయలుకు పోవడం,

నీళ్లు తెచ్చుకోవడం, మొగం కడుక్కోవడం, భోజనం చెయ్యడం పూర్తిఅయి పనికి హాజరుకావాలె. గుడ్డివాండ్లు కాకపోతే ఇవన్నీ ఒక గంటలో యెట్లా అవుత వనుకుంటారు? రూలుప్రకారం రాత్రులు విధిలేనప్పుడుతప్ప ఇతర సందర్భాలలో గదిలోబెట్టిన కుండలలో మలవిసర్జనం చేయకూడదు. రెండు కారణాలచేత ఈ రూ లెవ్వరూ పాటించరు తాళాలు తియ్యకపూర్వమే అందరూ గదులలోనే విసర్జనం చేస్తే గంజి తాగేవేళకు ఫైలుకు అందు కోవచ్చు. పని ఏడుగంటలకు ప్రారంభమవుతుంది. తాళాలు తీసినతరువాత బయలుకు పోవలసివస్తే వేళకు పనికి బోవడం తెమలదు. పాకీదొడ్లు కుస్సందులు. ఒకరినొకరు ఆనుకొనికూర్చున్నా ఒక్కొక పర్యాయం 20 మందికిమించి పీ లుండదు. రెండువందలమందికి తక్కువలేని బ్లాకులో మూనం బోగొట్టుకొని కూర్చున్నా కనీసం గంట బడుతుంది. అందరికీ పడకసావిట్లో నివర్తిచేసుకోడం సాధ్యం కాదు. ఎవరికి యేవేళకు అవకాశం చిక్కుతుందో నిలుకులేదు. ఉదయం అవకాశం చిక్కనివాండ్లు తొమ్మిదిగంటలకు విడిచినపుడు పోతారు. ఈ అకాలవిసర్జనాలవల్ల స్వాభావికమైన అలవాట్లు చెడి, ఆకలితగ్గి, వీరేచనబద్ధకాలూ, గ్రహణిబాధలూ, పాసనాలూ అర్ధాన్నం తింటూన్నా తేపా వస్తూంటవి. నిబంధనలూ, ఖయిదీల బాధలూ యెట్లావున్నా వార్డరు తనకు మాటరాకుండా యేదు గంటలలోగానే భోజనాలు పూర్తి అయ్యేమార్గం చూసుకుంటూ ఉదయం పాకీదొడ్డికి తాళంవేసి వుంచుతాడు. రెండవకారణంకూడా బలమైనదే. గదులలోనే నివర్తిచేసుకుంటే తోటీ పని చేయనవసరం లేదు. పాకీదొడ్లో నీళ్లఖర్చుకూడా ఉండదు. ఉదయం లేవంగనే ఆ యా గదులలో పాకీకులాలకు సంబంధించినవాండ్లందరూ కుండలు మోసుకొనిపోయి దిబ్బదగ్గర విడుస్తారు. 'దేవుడు వర మిచ్చినా నంబి వర మివ్వ' డని వార్డరు వాలాయకం తీర్చుకోడానికి పదినిముషాలు తలుపు తీసినా తోటీ తన కిష్టులనుతప్ప తక్కిన వాళ్లను చేరకుండా పారకతో కొడతాడు. ఎక్కడికి బోయినా డబ్బు లేనివాడు డుబ్బుకు కొఱగాడు. అదిగాక ఉదయం తొమ్మిదిగంటలకు సూపరింటెండెంటు శుభ్రంగా ఊడుస్తున్నదీ లేనిదీ తనిఖీచేయడానికి, అప్పుడప్పుడు వస్తూంటాడు. ఖయిదీలు ఉదయం దొడ్డి ఉపయోగిస్తే

తొమ్మిదిగంటలలోపల శుభ్రంచేయడం తోటీకి కష్టం, వార్డరుకు మాట వస్తుంది. అందువల్ల దొర వచ్చి చూచేవరకూ దొడ్లో కెవరినీ పోనీయరు.

రామ : కాస్త పెద్దదొడ్లు కట్టి మరికొంత వ్యవధానం ఇస్తే ఈ చిక్కులు బోను.

కా : వందలూ వేలూ జీతాలు తినడానికి తప్ప ఈ సంగతులు ఆలోచించేవా ళ్లైవ రిక్కడ?

రామ : నీ విదివరకు ఖయిదు కెన్నిమాట్లు వచ్చావు?

కా : ఇది మూడోసారి.

రా : ఏమి నేరాలు చేశావు?

కా : మొదటిసారి కఱవురోజులలో ఒకపర్యాయం గడ్డిదిన్నా. దానికి బందిపోటునేర మని మూడేండ్లు వేశారు. రెండోసారీ, ఈసారీ వట్టి అభాండాలువేసి కేసులు పెట్టారు. నేరాలు జరిగినమాట వాస్తవమేగాని అవి మావల్ల జరుగలేదు. ఆ చేసినవాళ్లు ఇప్పటికీ దొంగతనాలు చేసి పంచుకుంటూనేవున్నారు. వట్టివాండ్లం ఏడుగురం రెండోకేసులో వచ్చిపడ్డాము. ఈ రెండు కేసులలోనూ ఆరుగురు మాత్రం ఈ కేసులలో చేయకపోయినా అప్పుడప్పుడు సంచారం పోతున్నవాళ్లే. నే ప్రమాణంచేసి చెపుతాను. ఈ కేసులో వృథాగా నాకు పాతనేరస్తుడ నని పదేండ్లు పడ్డది. అయితే నేను చింతపడడంలే దనుకోండి.

రా : ఎందువల్ల?

కా : మొదటి కేసయినతర్వాత నా పెళ్లాం రెండేళ్లు చూచి ఇంకొకణ్ణి తీసుకొని లేచిపోయింది. రెండోసారి అయిదేళ్లు పడ్డప్పుడు మా అమ్మ నా పద్నాలుగేండ్ల పిల్లవాణ్ణి పెట్టుకొని రెండేండ్లు నెట్టుకు వచ్చి కాలంజేసింది. తర్వాత పిల్లవాడు చెడుసావాసాలు మఱిగి ఏదో దోపిడికేసులో ఎవడో ఖూనీ జేస్తే వీడుకూడా ఆ గుంపులో ఉన్నాడని పదేండ్లు వేశారు. వాడు కన్ననూరుజైలులో ఉన్నాడట. నాకు ప్రపంచంలో ఇక నెవరూ లేరు. బైట నా కేంపని? మొదటి రెండుమాట్లూ గలసి తీసివేత పోను ఆ రేండ్లు ఖయిదుచేశాను. బయట నలుగురిలో తలయెత్తుకొనితిరగడానికి మొగం చెల్లదు. చేసినా చెయ్యకపోయినా దొంగని నా మొగాన వ్రాశారు. అడుగు కదలించ

డానికి వీలులేకుండా వేటకుక్కల మోస్తరుగా పోలీసువాండ్లు వెంట బడతారు. పొరుగూరుపోతే మునసబుకు రిపోర్టుచేసుకోవాలి. ఇదంతా ఎందుకువచ్చిన శ్రమ. మొదటిసారి ఏమనుకున్నా ఈ మూడోతడవ రెండువేల జీతం తినే జడ్జీకీ, బంగారపు గడియారపుగొలుసులు వేసి కొని వచ్చిన పంచాయితీదార్లకూ, పోలీసులకూ, తప్పుసాక్షులకూ వేయిదణ్ణాలు పెట్టుకుంటున్నా. ఇక పదేళ్ళవరకు జైలువాళ్లు పెట్టి నంత దిని తోచినంతపని జేస్తూ గుండె నిమ్మళంగా ఉంటాను. నే నింకా బ్రతికి బైటికి బోతినా పోలీసువాండ్లకు దయవచ్చి నన్ను తిరగ నిచ్చినంతకాలం ఇష్టంవచ్చినన్ని దోపిళ్లు జేసి పదిరూపాయల చేమెల్లాతో మళ్ళీ నా స్వంతఇంటికి వస్తాను.

అని చెప్పేవరకు కళ్లలో తేజస్సు కళకళలాడింది. చీకట్లో ఎవరూ గమనించలేదు.

రామ : నీ సొంత యిల్లెక్కడ?

కాముడు : 'రామాయణ మంతా విని రాముడికి సీత యేమి గావలె' నని అన్నాడట నీబోటివాడు. ఇంతసేపటినుంచీ నే చెబు తున్న దేమిటి? బైట నా అన్నవాళ్లు లేరు. స్నేహితులు లేరు. ఉన్న నలుసొక్కడూ నా మోస్తరుగానే జైలుగోట్టెలు దింటున్నాడు. ఒక గుడిసె ఉంటే మాఊరు ఆసామీ మా అమ్మ చావంగనే చొప్ప దొడ్లో గల్పుకున్నాడు. నే వెళ్లినప్పుడు అడిగితే నీపేరుగలవాండ్లు ఎన్నడూ ఈ ఊరిలో కాపురమే ఉండలేదన్నాడు. నాకు అయినవా ళ్లంతా ఇక్కడనే ఉన్నారు. ఇదే నా ఇల్లూ, నా ఊరూ, నా లోకం, స్వర్గం నరకంగూడా ఇదే. నేనుమాత్రం ఒక బుద్ధితక్కువపని చేశా. రెండోకేసైనతర్వాత నాలుగునెలలే పోలీసువాండ్లు బైట ఉండ నిచ్చారు. దీపం ఉండంగనే చక్కబెట్టుకోవలసింది. మడిగట్టుకొని కూర్చుంటే నావెంట బడరనుకున్నా. నేను మాఊరు బోంగనే మా మునసబు తనకు భాగం ఇస్తే నన్ను చెక్కలుగప్పి కాస్తా నన్నాడు. చోరీలకు నే ఒప్పుకోలేదు. ఆయన సలహా విని వ్యవహా రమే సాగించినట్లైతే లక్షణంగా తిని తాగి పాతికరూపాయలు మిగుల్చుకొని జైలులోకి రాంగనే ఛీఫువార్డరు మొగాన్న పదిరూపా యలు పారవేస్తే నా ఇష్టంవచ్చినట్లు లోలాయిలాగ తిరగనిచ్చేవాడు. అర్ధరూపాయి పారవేస్తే రెండుపూటలా నెలరోజులు ఎక్కువముద్ద

లిస్తారు. నా కిచ్చే రాగిపడి అమ్ముకుంటే చుట్టపోరు గడుస్తుంది. అదీ చెడగొట్టుకున్నా. అయ్యా! ఒక్కమాట చెపుతాను. ఈ ప్రపంచంలో న్యాయానికి కూడు లేదు. ఏదోవిధంగా పదిడబ్బులు పోగుచేసుకున్నవాడే ఉత్తముడు.

'శ్లో. యస్యాస్తివిత్తం స నరః కులీనః స పండితస్సశ్రుతిమాన్ గుణజ్ఞః
స ఏవ వక్తా సచ దర్శనీయః సర్వే గుణాః కాంచన మాశ్రయంతే.'

అన్నాడు.

రా: నీ వేమి చదువుకొన్నావు?

కా: మా నాయన బాగా చదువుకొన్నవాడు. ఆయన వున్నంతవరకు అట్టహాసంగా ఉన్నవాళ్లమే. నాకు తెలుగులో బాగానే వాక్శుద్ధి అయింది. 'శతశ్లోకేన పండితః' అని పది శ్లోకాలుకూడా యేకరువుపెట్టా. ఆ పండితులదగ్గిర పండితుడి ననిపించుకుంటూ పిత్రార్జితం కాస్తా అప్పులకు బెట్టి లోకంమీద బడ్డా. ఇంత బడిచెప్పుకున్నా జీవనం జరిగేది. దానికి పరీక్షలైతేనేగాని వల్లకాదన్నారు. ఇప్పుడు నే నేంపరీక్షలకు బోతా? సరే మళ్ళీ నాకథ ప్రారంభిస్తా. ఇప్పటికైనా మించిపోయిందిలేదు. మా అమ్మతాలూకు పూసా బుర్రా అమ్మినబాపతు ఇరవైరూపాయిలున్నవి. వాటిలో పదిరూపాయిలు పిల్లవాడికి పంపి, అయిదు రూపాయలు ఛీపువార్డరు కిచ్చి తక్కినదానితో పొగాకుబేరం పెడతా. దానిమీద నెలకు రెండురూపాయిలు తీయవచ్చు. అర్ధరూపాయి ఖర్చుపెట్టానంటే రెండుపూటలా మెక్కి తొక్కుతున్న ఆ వరిబియ్యపు అన్నం. ప్రయోజకుడైతే యెక్కడైనా కాలం బాగానే గడుపుకుంటాడు. ఇదివరకు నాదగ్గర ఒకలోపం వుండేది. అది దిద్దుకుంటా.

రా: ఏమిటా లోపం?

కా: న్యాయంగా పోవలెననుకోవడమే. దానిమూలంగానే చెడ్డా. నా పూర్వకథ యెత్తుకుంటే యిది స్పష్టంగా రుజువౌతుంది.

'ఆల్ యీజ్ వెల్' అని పారావార్డరు కేకవేశాడు.

రా: సమయాని కన్నావు. నే నిదివరకు సెటిల్మెంటే నరకమనుకున్నా. ఇది దానిని మించివున్నది. దీనికే రౌరవమని పేరు పెట్టవచ్చు.

కా : కాసేపు పూరుకోండి. వాడు రొండుదిరిగి వెళ్లితాడు. తర్వాత మళ్ళీ ప్రారంభింతాము.

## 5. దేవుడి చరిత్ర

కా : పోయినాడు. పారా మారిపోతుంది. రెండవవాడు వచ్చేవరకూ స్వయం రాజా స్వయం మంత్రి. కాకపోతేమట్టుకు వీడు చేసే దేమున్నది ? వంగితే నెత్తికెక్కుతారు. అది ప్రపంచ స్వభావం. ఈ వార్డర్లది 15 రూపాయిల బండారం. దానికే వీండ్లకు మెడమీాద తల నిలవదు.

రా : అయ్యా ! మీకు ఆక్షేపణ లేకపోతే మీ పూర్వ చరిత్ర విపులంగా చెప్పండి. మీ నామధేయ మేమి ?

కా : నా పూర్వపు పేరు కామానాయుడు. అడిగారు గనుక పెద్దలు చెప్పుకుంటున్నా. పుణ్యమా పురుషార్థమా ?

రా : మానవుడి చరిత్రంటే దేవునిచరిత్ర. గడ్డిపోచచరిత్ర కూడా అటువంటిదే. సృష్టిలో ప్రతివస్తువూ గమనిస్తే చాలుగాని భగవంతుని చరిత్ర వెల్లడిస్తుంది. కవులు వ్రాసిన కృత్రిమచరిత్రలు భగవల్లీలలని చదువుతారుగాని, మహాకవి రచించిన యీ సృష్టికావ్యం చదువగలవాడికి ప్రతిఅణువూ భగవల్లీలలనే బోధిస్తుంది. చదువగల వాడికేకాదు ; ఆ కవి ప్రతివాండ్లచేత తాను రచించిన మహాకావ్యం అనుక్షణం పారాయణ చేయిస్తూనే ఉంటాడు. ప్రతిక్షణానికీ ఒక్కొక్క మెట్టెకిస్తూ గడ్డిపోచనూ, పిపీలికాన్నీ, మానవునీ, దేవతనూ తనదగ్గరకు చేదుకుంటూనే ఉంటాడు. ప్రతిఅణువూ చేదుకో కోటయ్యా అని అరుస్తూనేవుంటుంది. గనుక మీాచరిత్ర జ్ఞానబోధకం కాకతప్పదు.

కా : అయితే వినండి. జైలుకు వచ్చినతరువాత కామా నాయుడు కాముడయినాడు. గుడ్డిగవ్వ జెయ్యని యీవార్డర్లంతా మోతుబర్లనుసహా యేమిరా అనే పిలుస్తారు. మా నాయన రెండువేలు ఋణంచేసి చనిపోయినాడు. బాకీ లిమిటేషన్ పట్టింది. సాహుకారు పొరపాటు జరిగిందంటే తిరిగీ వాయిదాబంది పత్రం ఆస్తి అంతా తాకట్టుబెట్టి వ్రాసియిచ్చాను. తరువాత అయిదేండ్లు

కడుపు నాయగట్టుకొని పండినదంతా ఆజీలుగా వాయిదాలన్నీ చెల్లించి తీర్చాను. యావత్తు బాకీ తీసుకొని చెల్లులు కనపరచకుండా మూడువేలకు డిక్రీపొంది చెంబు బోకెలతోగూడా వేలం బాడించాడు. యీకర్మ మంతా నే చేజేతుల దెచ్చుకొన్నదే. మొదట న్యాయానికిబోయి కాలదోషంబట్టినబాకీ తిరగవ్రాసి గాలికి బోయ్యేది కాలిమీదకు తోసుకున్నా. అన్యాయానికి తలుచుకున్నట్టయితే, కామానాయుడినల్లా ఈపాటికి కామానాయుడుగారి నయ్యేవాణ్ణే. న్యాయానికి బోయి అన్యాయపు డిక్రీని మీదికి దెచ్చుకొని కామానాయుడినల్లా కాముడినయి చోటాకట్టెదెబ్బలూ, బూటుకాళ్ల తన్నులూ కుక్కిరిమిక్కిరిలాడకుండా తింటున్నా. ఇచ్చినడబ్బు ఎందుకు చెల్లువేయించుకోక పోవాలె? లోకంలో న్యాయ మున్నదనుకోవడమే నా లోపం. ఆస్తి యావత్తు వేసుకోగా ఇంకా బాకీ నిల్వ దేల్చి అట్టేపెట్టాడు. మొన్న జయిలులోనుంచి బయటికి పోయినప్పుడు నేనేమో పగదీర్చుకుంటానని నన్ను ఊళ్లో లేకుండా వెళ్లగొట్టడంకోసం డిక్రీబాకీ ఫయిసలు చేసుకోకపోతే హాజరువారంటు పెట్టిస్తానని బెదిరించాడు. అసలు నేను కొసవెర్రివాణ్ణే. మక్రోపంతో చేతిలోవున్నకర్ర యెత్తా. ఏదేవుడో అడ్డపడ్డాడుగాని ఆదెబ్బతో శిరస్సు లేవాలిసిందే. ఎందుకో అజ్జాయించా.

రా : (నిట్టూర్పుతో) మీచరిత్ర చిత్రంగావుంది. ఇటువంటి చరిత్రలు ప్రపంచంలో చాలా వుంట వనుకుంటాను. కోర్టులో జరిగే అన్యాయంవల్ల యెంతబాధపడ్డారు! మీకు జరిగిన అన్యాయం తప్పుడిక్రీతో ప్రారంభమైంది.

కా : అంతటితో పోయిందా! నాది యెనిమిదివేల ఆస్తి: మూడువేలకు కొట్టివేయడం రెండవది. వేలం అన్యాయం అని పిటీషన్ పెట్టితే తోసివేయడం మూడవది. సరీగా వేలం వేయించుకుండే భారం నాదెట. సర్కారునౌకరు లంచం తిని తప్పుడు వేలం వేస్తే దానికి జబాబుదారీ సర్కారుకు లేదట.

రా : రెండవసారి అయిదు సంవత్సరాలూ, మూడోమాటు పదిసంవత్సరాలూ, దానితో మీజీవితం ముగించడం, అక్రమపు

తీర్పులవల్లా, వేలములవల్లా మీసర్వస్వం జీవితంతో సహా నాశనం చెయ్యడం చూస్తే ప్రభుత్వంవారి కార్యాలయాలకు న్యాయస్థానాలా, అన్యాయస్థానాలా తగినపేరు !

కా : నాసంగ తేమిటిగాని బందిపోటుఖయిదీలను, కడపజిల్లా ఖూనీఖయిదీలను విచారించండి. ఒక్కొక్క కేసులో పదిమందికీ ఇరవయిమందికీ పదిసంవత్సరాలు మొదలు ఇరవై సంవత్సరాలవరకూ శిక్షలు వడ్డిస్తూంటారు. ఆ ఖయిదీలను పిలిపించి వాస్తవం చెప్పమని అడగండి. ఆ న్యాయస్థానాలలో అబద్ధాలు చెప్పాలెగాని బయట చెప్పవలసిన అవసరంలేదు. చేసినవాండ్లు తమ ప్రతాపాన్ని వర్ణిస్తూ నిజంయావత్తు చెప్పుతారు. కేసుచేసినవాండ్లలో చాలా మందిని పోలీసులు ముద్దాయిలుగానే చేర్చరు. చెయ్యనివాండ్లను చాలామందిని ముద్దాయిలను జేసి జన్మశిక్షలుకూడా వేయిస్తారు. ఇదంతా తెలియక చేసేది కాదు. బుద్ధిపూర్వకంగా చేసేపని. చేసినవాండ్లను వదిలివెయ్యడం, చెయ్యనివాండ్లకు శిక్ష వేయించడం చేత కావేషాలు పెరిగి కొత్తకేసులకు కారణాలు అవుతవి. డబ్బిచ్చి తప్పించుకోవచ్చుగదా ? అని కొందరికి అలుసు. ఖూనీ చేసినవాండ్లు తప్పించుకోవడంవల్ల కొందరికి ఉత్సాహం. శత్రువులను అక్రమంగా కేసులలో ఇరికించవచ్చునని ఆశ. ఇవన్నీ ఒకదాని కొకటి పెనుసుకొని ఖూనీలు జరుగుతవి. ఒక కేసు విత్తనంగా జరిగిందా, ఒకదాని కొకటి కొక్కేలు తగిలించినట్టు అవిచ్ఛిన్నంగా జరుగుతూనేవుంటవి.

రా : ఇదివరకు నాకున్న అభిప్రాయాలన్నీ మీరు దృఢ పర్చారు. దిగువజాతులకు జీవనంజరిగేటట్టు పని జూపి, పోలీసు డిపార్టుమెంటు యెత్తివేస్తే చాలా కేసులు తగ్గిపోతవి. ఈ డిపార్టు మెంటు తీసివేస్తే కలిగే నష్టంకంటే వచ్చేలాభమే ఎక్కువని నా అభిప్రాయం.

కామానాయుడు కునికిపాట్లతో ఊకొట్టుతూ కొంతసేపటి కది చాలించాడు. రామదాసది కనిపెట్టి నిద్రవస్తున్నట్లున్నది. పడుకొండని సగం గొంగడి పక్కకింద వేసుకొని రెండోసగం కప్పుకొని మెదలకుండా పండుకున్నాడు. ఉత్తరక్షణం కామానాయుడు త్రుళ్లిపడి లేచి :

కా : అయ్యా! మరుపుచొప్పున చెప్పలేదు. ఒకటి మంచిది, రెండవది చింపిరిది నాకు రెండుగొంగళ్లున్నవి. మీకు పక్కకు లేదు కావాలె. ఒకటి తీసుకోండి.

రా : నా కున్నగొంగడితోనే సరిపుచ్చుకుంటా, మీ చింపిరి గొంగడి పుల్లప్ప కియ్యండి. చాప వత్తుకుంటూ మొండెంవలె పండుకున్నాడు.

కా : పుల్లప్పా! ఇదిగో గొంగడి. కాస్త రెక్కలమీద అడ్డం వేసుకో.

కామానాయుడు అయిదునిమిషాలకు గురక ప్రారంభించాడు. రామదాసుకు నిద్ర బట్టలేదు. కామానాయుడిచరిత్ర చిత్రంగా కనపడ్డది. పాప మతడు స్వాభావికంగా మంచివాడు. దయార్ద్ర హృదయంగలవాడుకూడాను. లోకులదుర్మార్గమూ, అన్యాయమూ అతనిలో క్రోధం పురికొల్పి ద్వేషపూరితుని జేసినవి. అతనికి లోకమంటేనే వాకర బుట్టింది. దానిని శత్రుస్థానంగా భావిస్తున్నాడు. మనుష్యులకు తృప్తి లేదంటారు. కాని ఎక్కడికక్కడ మనసు కుదుర్చుకుంటూనే ఉంటారు. అతడు ఛీపువార్డరుప్రాపకం సంపాదించి పొగాకువర్తకంతో జీవనం హాయిగా గడపవచ్చు ననుకుంటున్నాడు. అమాత్రం అవకాశంగూడా లేక, ఇతనినే అదృష్టశాలని భావించేవాండ్లు ఈజైలులో ఎందరున్నారో! కడుపునిండా అన్నం లేక పొద్దుగూకులూ పనిచేసి దెబ్బలు తిని దిగంబరులై నారచాపమీద పడుకొని కప్పుకోవడానికి గొంగడిపీచయినా లేక చలికి వణుకుతూ పడుకున్నా యీ ఖయిదీలు తమ ప్రస్తుతస్థితి యావత్తూ మరచిపోయి కేకిసలుగొడుతూ, సంగీతాలు పాడుతూ, ఆనందించడం చూస్తే మానవుడు యెట్టిహీనపరిస్థితులలోనూ కూడా కష్టాలన్నీ మరచి సౌఖ్య మనుభవిస్తూనే ఉంటాడు. రామదాసు కీవిధంగా చాలాసేపు ఆలోచనలు పోతూనేవున్నవి. మాలక్ష్మి ఏమవస్థ పడుతున్నదో, ఏఅమర్యాదలకు లోబరిచారో, సెంటిల్‌మెంటులో పిల్ల లేవిధంగా వున్నారో, అప్పడికి ఒంట్లో ఎట్లా ఉన్నాదో, నాయుడుగారు పిల్లలను స్వాధీనపర్చుకోవడానికి ఏ ప్రయత్నాలు చేస్తున్నారో, మొదలయిన ఆలోచనలన్నీ పొద్దు కడ్డంవచ్చే మబ్బులవలె రామదాసు నిర్మలమయిన హృదయాకాశాన్ని ఆవరిస్తు

న్నవి. తలంపులు మనసును పీకుతున్నట్లే ఊరక దోమలు ఒళ్లు పీకుతున్నవి. వీటిని తోలలేక చూరవిడిచి వూరుకున్నాడు. వాటియిష్టము వచ్చినట్టు విహరిస్తున్నవి. కొంతసేపటికి దోమలు దేహరక్తం పీల్చి తృప్తిపడ్డవిగాని తలపులు సముద్రకెరటాలవలె ఎడా తెరిపీ లేకుండా వస్తూనేవున్నవి. పోనుపోను తలకు వేడెక్కింది. అర్ధరాత్రిదాటినా కంటికి కూరుకు రాలేదు. లేచి కూర్చున్నాడు. మనసు స్వాధీనపర్చుకోవాలెనని ప్రయత్నించాడు. కట్టివేసినకుక్క గుంజుకుంటూ మొరిగినట్టు, పరుగులు ప్రారంభించింది. కుక్కయినా కొంతసేపటికి అలుపు వచ్చి వూరుకుండేది. మనసు బంధించినకొద్దీ పలుపు పొడుగవుతున్నది. కాని ధీరుడిప్రయత్నానికి కేదీ అసాధ్యంలేదు. పద్మాసనంమీద కూర్చుందామనుకుంటే కట్టివేసిన రెండవకాలు స్వాధీనం గాలేదు. మొదట నిస్పృహజెంది దృఢసంకల్పాలకు విఘ్నాలు అడ్డంరావడమే మనే దృఢనిశ్చయంతో పద్మాసనం వేసుకొన్నట్లే భావించి వెన్ను చేర్చినట్టు మనస్సును కూడదీసుకొన్నాడు. మనస్సును జయించినవాడికి లేనిదేమున్నది! సమస్తం ఉన్నది. "నిర్వాణమపి దుర్వారం, అర్వాచీనాని కిం పునః" అన్నట్లు మోక్షమే విధిలేకవచ్చి పడుతున్నప్పుడు మధ్యలాభాలు ఆగుతవా! తెల్లవారు ఝాముదాకా అలాగే కూర్చున్నాడు. స్వాధీనమయినమనస్సును ఇక పట్టి విడువ గూడదని సహస్రారబృందావనములోనో, తప్పితే మధురాబృందావనంలోనోతప్ప యితరచోట్ల విహరించగూడదని కట్టుబాటుచేశాడు. కొంతసేపటికి పద్మాసనంనుంచి దిగి గొంగడి కప్పుకొని నిద్రపోయినాడు. పారావాండ్లు తిరుగుతూనేవున్నారు. రామదాసు స్వర్గంలో ఉన్నప్పుడుకూడా ఆలీజ్ హెల్-అంతా నరకమేనని పారావాండ్లు అంటూనేవున్నారు. అధికారితారతమ్యాలనుబట్టి స్వర్గనరకాలు ఇహలోకంలోనే మానవులు అనుభవిస్తుంటారుగదా!

## 6. పెద్దయ్య

లోకమంతా నిద్రపోతున్నా గ్రహాలు తమపరిధులలో బీటు తిరుగుతూ మానవులకు సుఖదుఃఖా లొనగూర్చేవిధంగా క్వారంటీను నిశ్శబ్దంగా వున్నా వార్డర్లు ఒకరితరువాత ఒకరు గస్తీతిరుగుతూనే ఉన్నారు, తలుపులూ, కిటికీలూ పరీక్షించుకుంటున్నారు. వార్డ

లోపల పారాజేసే ఓవరుశీయర్లు వంతులప్రకారం ప్రతి అయిదు నిమిషాలకు ఆలీజ్ వెల్ అంటున్నారు. దానిని ఆధారం చేసుకొని పారావార్డరు గేటులోవుండి కేకవేసేవార్డరుకు అంతా క్షేమ మని జవాబు చెప్పుతున్నాడు. చిన్న ఛీఫువార్డరు జ్ఞానానందంనాయరు రౌండుకు వచ్చాడు. ఆయన చాలామంచివాడు. జయిలులో ఆయన ఉండబట్టి ఆప్రాంతాలలో వర్షం గురుస్తున్నది. లేకపోతే అక్కడ జరిగేఘోరకృత్యాలకు జయిలుమీద చినుకు పడకపోయేను. క్వారంటులో రాత్రులు ఖయిదీవార్డర్లు పహరాచెయ్యరు. వార్డర్లే గస్తీ తిరుగుతుంటారు. నాయరు రౌండుకు వచ్చినప్పుడు వార్డరు మునిసామి పారాజేస్తున్నాడు. అతడు పాపభీతిగలవాడు. పది సంవత్సరాలనుంచి నౌకరీ చేస్తున్నా ఛీఫువార్డరును ఆశ్రయించడము గాని, తృణమో కణమో ముట్టజెప్పడముగాని, జయిలులోస్వామిగి ఉద్యోగులయిండ్లలో చేర్పించడంగాని, ఆఖరుకు ఖయిదీలవల్ల మామూళ్లిప్పించడముగాని లేకపోవడంచేత తోటివాండ్లు ఒకటవ తరగతివరకూ పైకిబోయినా అతడింకా ఒకమార్యూ సంపాదించు కోలేదు. జయిలులో వున్న యెనభై మందివార్డర్లలోను యితడూ, వెంకటాచలమూమాత్రమే న్యాయస్తులు. ఇతనికి కొంతవరకు వేదాంతంలో ప్రవేశంగూడా వున్నది. పారావేస్తూ అంతా క్షేమ మని కేకవేసి తత్వాలు పాడుకుంటున్నాడు. చేలాంతరువెలుతురున ప్రతికిటికీలోగుండా చూచి పరీక్షిస్తూవచ్చి రామదాసు యోగ సమాధిలో ఉండడం గమనించి విభ్రమపడి జయిలు పవిత్రమయ్యే టందుకూ, అహోరాత్రాలు యమకూపంలో బడి ప్రపంచమార్గాలే మరచిపోయిన తనతోటివాండ్లు తరించడానికీ అప్పుడప్పుడు మహాత్ములు జయిళ్లకు వస్తుంటారని సంతోషించాడు. నాయరుకు పారాలో కనపడి,

మునుసామి: కాకుల్లో కలహంసను చూచారా!

నాయరు: అతడు పరమహంసే. మధ్యాహ్నం నేనిట్లా వస్తే అతనిచేత బండలు పగలగొట్టిస్తున్నారు. ఓపినంతవరకు ఒళ్లు దాచుకోకుండా చేస్తున్నా వార్డర్లు వేధిస్తున్నారు. మనిషి దగ్గర వచ్చి వున్నదేమో కనుక్కోవడానికి ఛీఫువార్డరు కొంటె తనం చేయిస్తున్నట్టు కనబడుతున్నది. రేపు ఉదయం సూపరింటెం

డెంటుతో ఫయిలుకు వస్తే వృద్ధాప్యంచేత పనిచేయలేననీ, తీర్పులో ఉన్నప్రకారం రైసుపడి ఇప్పించవలసిందనీ అడిగించు. నేను దొరతో మాట్లాడుతాను.

ము : చిత్తం. తమ రతనికి ఉపకారం చేయడం గొప్పసంగతి. అతని భార్యా ఆడజయిల్లో ఉన్నది, ఆమెవిషయంగూడా యేదో పుణ్యం గట్టుకోండి.

నా : పొద్దున దొరతో చెప్పుకుండేటప్పుడు ఏదోఒక సందర్భంలో తన భార్యకూడా జైలులో ఉన్నట్టు చెప్పించు. ఆమెసంగతి గూడా మాట్లాడుతాను. ఆమె ముసలిదో కాదో ?

ము : వాండ్లు పొద్దున వచ్చినప్పుడు చూచాను. పెద్దపాటు మనిషి, ఆఖరుకు నల్లదారం వేయించినా మెరుగే.

పారా పూర్తి అయింది. మునిసామి వెళ్ళిపోతూ సంగతులు యావత్తు పుల్లప్పతో చెప్పి 'ఇవ్వాళ తప్పితే వారంరోజులుదాకా చిన్న ఛీఫువార్డరు దొరతో ఫైలుకు రాడు. తప్పక ఇవ్వాళనే అడిగించు' మని వెళ్లిపోయినాడు.

రాత్రి మూడుగంట లయ్యేవరకు మూత్రపాత్రలు చాలా వరకూ నిండి దుర్గంధం సావిడంతా వ్యాపిస్తున్నది. మలపాత్రలు గూడా అసహ్య మవుతున్నవి. ఆరోపారా ప్రారంభించంగనే ఓవరుశీయరు రైస్ చెప్పాడు. కొందరు లేచి విసర్జిస్తున్నారు. సావిట్లో ఉన్న నల్లాభిపాత్రలూ అరోచకమైనవి. పుల్లప్ప లేచి కక్కసుకు పోయివచ్చి,

పు : అయ్యా ! తమరు అనుమానం తీర్చుకోరా !

రా : నిన్నమధ్యాహ్నం రాగిరొట్టె తినబట్టిగాఁవాఁలె కడుపులో కలవెళ్లాడుతున్నది. ఇక్కడ నీళ్లు లేవుగా.

పు : నీళ్ళక్కడా లేవు. ప్రొద్దున తొమ్మిదిగంటలదాకా వార్డరు కక్కసుకు తాళం తియ్యడు. రూలుప్రకారం కొట్లు తాళాలు తీసేవరకు కక్కసు తెరిచివుంచాలె. రాత్రి చావిట్లో పెట్టిన పాత్రలు, అత్యవసరమైనప్పుడు తప్ప సాధారణంగా ఉపయోగింపగూడదు. అదంతా పోనిచ్చి దొర తనిఖీచేసిపోయినతరువాత తాళం దీస్తాడు.

రా : దొర ఇంతమాత్రం కనుక్కోలేడా? మనం చెప్పుకో కూడదూ?

పు : దొర ఎన్నని చూస్తాడు? తాబేదార్లు గమనించాలిగాని. ప్రతిదీ పైఅధికారి తెలుసుకోవడం కష్టం. ఖయిదీలు ఎవరూ చెప్ప డానికి దొమ్మ చాలదు. ప్రతివాడూ తనపబ్బం గడుపుకుండేవాడే. పాకీవాడితో స్నేహం సంపాదిస్తే సలక్షణంగా అన్నీ గడుపుకోవచ్చు. ఒకవేళ యెవడైనా మొండివాడుండి దొరకు చెప్పుకున్నా యీ ఖయిదీలంతా వార్డరు ప్రతిరోజూ తమను కొట్లు తీయంగనే కక్కసుకు పంపిస్తున్నాడని సాక్ష్యం చెప్పుతారు. అటుతర్వాత తప్పుడురిపోర్టు చేసినందుకు అడ్డబేడీలో, నిలువుబేడీలో పడతవి. బేడీలు పడకపోయినా ఆసాయంత్రమో ప్రొద్దునో రిపోర్టుచేసినవాడి వీపున చోటాకట్టె విరుగుతుంది.

రా : కొట్టినందుకు ఫిర్యాదు చేస్తేనో?

పు : దీనికి లేనిసాక్ష్యం దాని కెక్కడ వస్తుంది? గాయం లేకపోతే కొట్టలేదంటారు. కనబడుతుంటే తాను పనిచేయకుండా వుండడానికి స్వయంగా గాయం చేసుకున్నాడంటారు. నిశ్చయంగా రిపోర్టుచేస్తాడని ముందుగా తెలిస్తే అధికారులను ధిక్కరించాడనీ, లేక కొట్టవచ్చాడనీ ముందుగానే వార్డరు ఫిర్యాదు చేస్తాడు. సూపరిం టెండెంటు ఈకేసు విచారణకు పిలిచేలోగా యితడు తనను వార్డరు కొట్టాడని చెప్పుకోడానికి పోనియ్యరు. వార్డరో, ఖయిదీవార్డరో వెంటలేనిదే యేఖయిదీగూడా జయిలులో తన బారకాసు విడిచి పోగూడదు. తనమీద కేసునిమిత్తం పిల్చినప్పుడు తనను కొట్టాడని చెప్పుకుంటే తప్పుడువాదం చేశాడని కఠినంగా శిక్షించినకేసులు అనేక మున్నవి. ఎదురువాదం చేసుకుంటే యెక్కువశిక్ష పడుతుందని తనను కొట్టినసంగతి దాచుకొని తనమీద వచ్చిన అబద్ధపుకేసు నిజమేనని ఒప్పుకొని సత్యవంతుడని దొరవల్ల మెప్పుపొంది తక్కువ శిక్షలు పొందినవాండ్లనేకులున్నారు. యీప్రకారం కొన్నాళ్లు జరిగినతరువాత పర్యవసాన మేమవుతుంది? జయిలులో జరిగే ఒక నేరమూ రిపోర్టుగాదు. ఒకడూ సాక్ష్యం చెప్పడు. పదహారువందల మంది దుర్మార్గులుండే ఖయిదులో ఒక్కనేరంగూడా జరిగినట్లు

నేరపు జాబితాలో ఉండదు. ఖయిదీలను మంచిఖాయిదాలో ఉంచారనీ, జయిలుపాలన మంచి అదుపుతోనూ, సమర్థతతోనూ జరుపుతున్నారనీ, ఖయిదీలంతా సుశిక్షితులు కావడంచేత జయిలులో నేరము లే నశించినవనీ, దొరగారి పాలనాశక్తి అద్భుతమనీ, తక్కినజయిళ్లకు అధికారులుగా ఉండే నేటీవులు నిడదవోలు సెంట్రలుజయిలు చూచి పాలనాపద్ధతి నేర్చుకోవలసిందనీ మద్రాసు ప్రభుత్వంవారు తమ సాంవత్సరిక ప్రకటనలో ఉదాహరించి ఒక ప్రతిని తక్కిన జయిళ్లకు పంపుతారు.

కా : లేచి కూర్చొని-యీమధ్య స్వరాజ్యపువాండ్లు కొందరు యీజైలుకు వచ్చారు. పెద్దయ్యగారు కొన్ని కేసులు దొరకు రిపోర్టుచేశారు. విచారణకువచ్చేరోజున జైలరు మొదలుకొని తక్కిన ఉద్యోగులు యావత్తుమంది దెబ్బలు తిన్నవాండ్లను, సాక్షులను తిరగదీసి అందరిచేత దెబ్బలుకొట్టలే దనిపించారు. డుబ్ జైలరు (డుబ్=డిప్యూటియొక్క పొట్టిరూపం) తనమీద స్వదేశీవాడు అక్రమకేసు పెట్టాడనీ, బేడీలు వేయించవలదసిందనీ వాదించాడు. తరువాత సూపరింటెండెంటు పెద్దయ్యగారిని పిలిపించాడు. వార్డరు ఆయనను వెంటబెట్టుకొని తీసుకపోతుంటే ఆయనను తప్పకుండా చీకటికొట్లో వేయిస్తారని జైలంతా వుడికిపోతున్నది. ఆయనను వార్డరు సూపరింటెండెంటుదగ్గరకు తీసుకొనిపొయ్యేటప్పుడు ఎదురుగా వచ్చిన ఖయిదీవార్డర్లు, ఖయిదీలు కండ్లనీళ్లు పెట్టుకొని చాటుగా దణ్ణం పెట్టారు. సూపరింటెండెంటు దగ్గరకు ఆయన నిర్భయంగా వచ్చాడు. ఉద్యోగస్తులంతా ఆయనముందు పిచ్చికలలాగు కనపడ్డా సూపరింటెండెంటు యేదో అడిగేవరకు ఖండితంగా జవాబుచెప్పారు. కోర్టులో హాజరుగావున్న దెబ్బలుతిన్నవాండ్లకూ సాక్షులకూ మొగాన కళవచ్చింది. అప్పుడు యీమాటలు జర్గినవి.

సూ : మీ కేసు అబద్ధమని తెలుస్తున్నది.

పె : నిజమని నాకు తెలుసు. నే నీకండ్లతో చూచాను.

సూ : అయితే విచారిస్తారా ?

పె : విచారిస్తాను. ఒక్కసంగతి వున్నది. మీ కీకేసు రిపోర్టుచేసినప్పుడు కొట్టిన ఉద్యోగులకు తెలియకుండా దెబ్బలుతిన్న

వాండ్లను, సాక్షులను స్వయంగా పిలిపించి కనుక్కోమని కోరాను. ఆప్రకారం జరిగించారా ?

సూ : లేదు.

పె : యీ కేసు విచారించేటప్పుడు ఆసంగతిమాత్రం జ్ఞాపకం వుంచుకోండి.

సూ : కానియ్యండి. యే కేసు ముం దెత్తుకోమంటారు ?

పె : శేషయ్య కేసు విచారిస్తాను. యేమయ్యా డుబ్ జైలరు గారు కొట్టారా ?

శేషయ్య : అయ్యా ! కొట్టారండీ. మోకాళ్లు, మోచేతులూ వాచినవండీ.

సూ : దేనితో ?

పె : దేనితో కొట్టారు ?

శే : చోటాకట్టెతో. రూళ్లకఱ్ఱతోగూడా కొట్టారు.

సూ : యిందాకా యెందుకు లేదని చెప్పావు ?

శే : వీండ్లు అట్లా చెప్పకపోతే కొడతామన్నారు.

డుబ్బుజయిలరూ, తక్కిన ఉద్యోగులూ యీమార్పు చూచి ఆశ్చర్యపడి చూస్తున్నారు.

సూ : సాక్షులను మీ కేమయినా సవాళ్లు అడుగుతారా ?

డుబ్బు : అయ్యవారికీ నీకూ పరిచయము ఉందిగదా ?

శే : మొన్న చూడడమే.

డు : నీవు అయ్యవారికి చుట్టలు అమ్ముతుంటావుగదా ?

పె : నా కిప్పటికి నలభై నాలుగేండ్లు నిండవచ్చినవి. ఇదివరకు పొగాకు యేరూపానా ఉపయోగించలేదు. ఇక జయిలులో నేర్చుకోవాలె.

డు : జవాబు చెప్పవేమి ?

సూ : ఆప్రశ్న వద్దు, యింకొకటి అడుగు.

డు : ఇక లేవు.

పె : ఇంకా సాక్షు లున్నారు.

సూ : మీరు చూచారుగదా ?

పె : చూచాను.

సూ : ఇక సాక్ష్యం అవసరం లేదు.

డు : వాండ్లు తిన్నగా పని చేయకపోతే చిన్నగా కొట్టాను.

పె : ఇదివరకు కొట్టనే లేదంటిరే?

సూ : కొట్టడానికి నీ కధికారం లేదు.

డు : దెబ్బలు తిన్నవాడు ఊరుకుంటే ఫిర్యాదుచేయడానికి యీయన యెవరు?

పె : ప్రతివాండ్లకూ అధికార మున్నది.

సూ : ఆయనకు నే నధికారం యిచ్చా.

పె : దెబ్బలు తిన్నవాడు వచ్చి సాక్ష్యం ఇచ్చాడుగదా?

సూ : ఇక మీరు వెళ్లవచ్చు. పిళ్లగారూ! మీకు ప్రథమ తప్పితంగా యెంచి పదిహేనురూపాయిలు జుల్మానా వేశా.

అప్పటినుంచి స్వదేశీవాండ్లయెదుట దెబ్బలు కొట్టడం ఆగిపోయింది. అదివరకు పెద్దకర్రలతో పాతికదెబ్బలు కొట్టినకేసు లున్నవి.

రా : ఎందుకు కొట్టడం?

కా : అనేక కారణా లుంటవి. పనిలో అశ్రద్ధ జరిగిందనీ, మాట్లాడుతున్నాడనీ, నియమించినకాలానికి లోగా కక్కసుకు వెళ్లాడనీ, బియ్యపుబస్తాలు మోయలేనన్నాడనీ, జైలులో వార్డరు కందిపప్పు దొంగిలించి తెమ్మంటే తేలేదనీ, పొగాకు ఒక వార్డరు దగ్గర మాని యింకొకరిదగ్గర కొంటున్నాడనీ, భోజన పదార్థాల విషయం, కంబళ్లు వగైరాల విషయం ఫిర్యాదు చేశాడనీ, ఫయిలులోనుంచి తొలిగాడనీ ఇటువంటికారణాలు యెన్నో ఉంటవి. ఈ ప్రకారం కొట్టికొట్టి ఖయిదీలమనుష్యస్వభావాన్నే చంపివేశారు. ఖయిదీ రిపోర్టు చేయడు. ఈ దెబ్బలన్నీ మొదట తనకు వేసినశిక్షలోభాగ మనుకొని అనుభవిస్తాడు. జయిలరు మొదలు తనిఖీదారువరకూ పెద్దకర్రలు చేతబట్టుకొని పొద్దుగూకులూ పశువులను బాదినట్టు బాత్తూ పనిచేయిస్తుంటారు. జయిలు ఉద్యోగస్తులందరినీ మూడుభాగాలుగా విడదీయవచ్చు. చిన్న ఛీఫువార్డరు, రెమిషన్‌గుమాస్తా, ఆసుపత్రి కాంపౌండరూ, వార్డరు మునిస్వామీ, వెంకటాచలమూ మనుష్యులకోటిలో చేరినవాండ్లు. సూపరింటెండెంటు మధ్యముడు, సద్భావాలుకలవాడు. తక్కిన వాండ్లందరూ రాక్షసగణంలో చేరినవాండ్లు. కొన్నిసంవత్సరాల

క్రింద హెడ్ వార్డరు బ్రహ్మానందం ఒకఖయిదీని కొట్టి చంపితే వందల కొలది ఖయిదీలూ, ఉద్యోగులూ ఎరిగినసంగతయినా, నేరస్తుని శిక్షించడానికి జయిలుఉద్యోగులు ప్రయత్నం చేయకపోగా డాక్టరు దెబ్బలుకావనీ, యేదో పనిముట్లుతగిలి చచ్చాడనీ సర్టిఫికెట్టు యిచ్చాడు. అదిగాక యీమధ్య ఒకస్వదేశపుఆయనను చావు దెబ్బలు కొట్టారు. ఉద్యోగులు చాలామంది ముందుగా ఆలోచించి కొట్టించిందే. అనేకమంది కొట్టడం చూచారు. సూపరింటెండెంటు మొదలుకొని వార్డరువరకూ, న్యాయం కనుక్కోవలెననిగాని, నేరస్తులను శిక్షించవలెననిగాని ప్రయత్నమే లేకపోగా కండ్లారా చూచి, చూచినది చెప్పడానికి సిద్ధంగావున్న సాక్షులను భయపెట్టీ, శిక్షించీ, బహుమతు లిచ్చీ, బెదరించీ చెప్పకుండాచేశారు. యీకేసులోనే ఇట్లా జరిగితే ఇక ఖయిదీలబిసా డెంత?

ఓవరుసీరు: మీసోది చాలించి కక్కసుకు పోయిరాండి. తొమ్మిదిగంటలలోగా తయారుకాకపోతే చోటాకట్టె విరుగుతుంది.

కా: తరువాత మాట్లాడుదాం మీపని తీర్చుకొనిరండి.

రా: రామరామ! నీళ్లు లేకుండా యెట్లాగండీ?

"క. ఆకలముఃలు మృత్తుకయును"

అని తిక్కన్నగారు ఆపద్ధర్మంగా చెప్పారు. అదిగూడా గతిలేకపోయెను. దేహమున్నంతవరకు దేహధర్మాలు అవలంబించక తప్పదుగదా? అంటూ రామదాసు మెల్లిగాలేచి గొలుసులాగి చిమ్మచీకట్లో తొళ్లాడుకుంటూ భాండాలదగ్గరకు జరిగాడు. ఏభాండం దేనికో తెలియక తడివి చూచేవరకు చేతులు అసహ్యామైనవి. చేతులు కుండకు తుడిచి అనుమానం తీర్చుకొనివచ్చి పడుకున్నాడు. కొంత సేపటికి చేతివాసన పోయింది. అంతట హెడ్ వార్డరు వచ్చి గొలుసులు విప్పించి అందరినీ బయటికి తెచ్చి భూలోకం చూపించి ఫైలుకూర్చోబెట్టి లెక్కచూచుకొని వెళ్లిపోయినాడు.

రా: పుల్లప్పా! ఇక్కడ ఉన్నన్నాళ్లూ చుక్కలూ, చందమామా కనబడవుగదా?

పు: యమలోకంలో చంద్రుడూ, చుక్కలూ పొడవవు. ఇది అభాపురి.

## 7. పిడత

తెల్లవారింది. పుల్లప్ప నాకబలిపిడతకంటె కాస్త చిన్నపిడత నిండా బొగ్గుపొడి పోసుకొని పండ్లుతోముకొనేటందుకు రామదాసుకు తెచ్చి ఇచ్చాడు. మహర్షికి లేడిపిల్ల దొరికినట్టుగా రామదాసు పిడతచూచి ఆనందపడుతూ,

రా: ఈబుడ్లు మనకోసం పుర్మాయించి చేయించినట్లున్నారు. వీటికోసం ప్రత్యేకం సువలబెట్టించారా?

పు: పిల్లలాడుకోవడానికి బాగా పనికివస్తవి. దీనిని భద్రంగా మీ పడకదగ్గర దాచుకోండి.

రా: గోచికంటె గొప్పదరిద్రమూ అనేసామెత క్వారంటులో వుండే ఖయిదీలలో బుట్టినట్టున్నది. గోచిపాతరాయుడికి కుండపెంకు పోయినందువల్ల వచ్చే నష్టముండదు. అయినా యీబుడ్డి ముద్దు వస్తున్నది. ఎత్తుకొనిపోయేవరకూ దాచుకుందాం. అని అస్తారు పొదంగా తీసుకొనిపోయి పక్కదగ్గర దాచుకున్నాడు.

అంతా గంజిదాగి యెవరిపనికి వారు పోయినారు. పుల్లప్ప, రామదాసు రాళ్లు గొడుతున్నారు. కామానాయుడు కపిలపనికి పోయినాడు. దొరతొమ్మిదిగంటలకల్లా ఫయిలుకు వస్తా డన్నారు. ఎనిమిదిన్నరకే అంతా తిరిగి వచ్చారు. క్వారంటు ఖయిదీలలో షుమారు 30 మందికి గోచులుతప్ప దుస్తులుగాని, చాపలుగాని, గొంగళ్లుగాని యియ్యలేదు. వీండ్లలో యెవరూ చేతడిగలవాండ్లు లేరు. తొందరపడి దుస్తుల కెవరూ మామూళ్లియ్యలేదు. ఉద్యోగస్తులతోపాటు వాండ్లూ మొండిబడి కూర్చున్నారు. పైవేషాన్నిబట్టి కొందరిని వార్డరు కదిలించి చూచాడుగాని యెవడూ సందుపెట్టలేదు. దొరవచ్చేవేళవుతున్నది. చల్లాడాలు, చట్టలూమాత్రం పిళ్లగారు తెప్పించి దొరగారివల్ల వసట్కారాలు రాకుండా బొత్తిగా ఆళ లేదనుకున్నవాండ్లకు కొందరికిచ్చి తక్కినవాండ్లను గదిలో బెట్టి తాళం వేయించాడు. తక్కిన అందరినీ అలంకరించి ఫయిలులో నిలువబెట్టించి దొరతో గలిసి ఫయిలు తనిఖీకి వచ్చాడు. దొర అందరిమొగాలూ చూస్తూ వెళ్లిపోతుంటే ఒకడు సలాంబెట్టంగనే నిలువబడ్డాడు.

శా : మాది రాజమహేంద్రం. ఉప్పుడు బియ్యం మా కలవాటులేక విరోచనా లవుతున్నవి. పచ్చిబియ్యపు అన్నం, స్వయంలోనుంచి పులుసూ ఇప్పించండి.

సూ : పూరకే మార్చడానికి వీలులేదు. బాగా జబ్బుచేసి ఆసుపత్రికివస్తే పచ్చిబియ్యపుఅన్న మిస్తారు. నీవు బ్రాహ్మణుడవు గావు గనుక స్వయంలోనుంచి ఇయ్యడానికి వీలులేదు.

శా : బాగాజబ్బుచేసేవరకు ఇదే తింటూంటే చివరకు నయంగాకపోతేనో ?

డు. జ : యెవడురా వీడు అధికప్రసంగి.

సూ : నవ్వుతూ-నయంగాకపోతే మార్పే అవసరంలేదు.

శా : మీరు చెప్పేప్రకారం నయమయితేనూ అవసరం లేదన్నమాటే. బాగావుంది తీర్పు.

సూపరింటెండెంటుగారు మొగం చిట్లించుకొని జవాబుచెప్పక ముందు నడుస్తున్నాడు. డుబ్ జయిలరుకు కొమ్ములు లేవుగాని తప్పక లూళాయపిల్లే. సూటు వేసుకొని తోడుగుమోస్తరుగా జరుగుతూ దొరవెంబడి వస్తున్నాడు. చిన్నసర్జను షోకులబొమ్మ. యెఱ్ఱగా పుల్లగా ఉంటాడు. హృదయంమట్టుకు కాఱునలుపు. దయాదాక్షిణ్యాలు లేవు. ఉపకారం చేయకపోతేమాని బుద్ధిపూర్వకంగా అపకారం చేస్తాడు. వేంబయ్యరు (వేపఅయ్యరు) అనేపేరు జ్యోతిష్కుడెవడో ఇతని భావిచరిత్ర కనిపెట్టే పెట్టాడు. టక్కు టక్కుమని బూటుకాళ్ల చప్పుడుతో దొరపక్కగా ఆయన వస్తున్నాడు. హృదయనైర్మల్యం ముఖాన వెలిబుచ్చే చిరునవ్వుతో జ్ఞానానందనాయడు దొరకు కుడిప్రక్క నిలువబడి రామదాసుకోసం ఫయిలులో వెతుకుతున్నాడు. ఎక్కడా కనుపడలేదు. అనుమానపడి,

జ్ఞా : డుబ్ జయిలరుతో రహస్యంగా-కొందరు ఫయిలులో లేనట్లున్నారే !

పి : మీ కెవరుగావాలె. ఎవరయినా పనికి బోయినవాడు దాక్కున్నాడేమో ? తర్వాత కనుక్కుందాములెండి.

జ్ఞా : కాదు. ఫయిలులో సూపరింటెండెంటును కొన్ని సంగతులు తప్పకుండా ఇవ్వేళ అడుగుతా నన్నాడు.

పి : వాడెవడు? ఏ మడుగుతాడు? వచ్చేసారి అడగగూడదా?

జ్ఞా : ఒక ముసలిమాలవాడు. అతనిపేరు రామదాసు. యేమీ పనిచేయలేక బాధపడుతున్నాడు. అతనికి అన్నపుపడి వేయించి పని తగ్గించే యేర్పాటు చేయాలె.

పి : ఓస్ ఇంతేనా-అన్నపుపడి తీర్పులోనేవున్నది, వేసివేతాం. వచ్చేఫయిలువరకూ పని లేకుండా చేయింతాం. ప్రస్తుతం వూరుకోండి. వాడికి గొంగళ్లు లేవు.

పు : వృద్ధభాషలో-అయ్యా! సలామండి.

సూ : యేమి చెప్పుకుంటావు?

పు : రాత్రి నాకూ యింకా 30 మందికి చట్టలుగాని, చాపలుగాని, గొంగళ్లుగాని లేవు. చలికి బాధపడ్డాం. ప్రొద్దున కొంతమందికి కాలిచట్టలూ, చేతిచట్టలూమాత్రం ఒకజత యిచ్చి అలంకరించారు. అవి మళ్లీ మీరు గోడ తిరుగంగనే వూడ దీసుకుంటారు.

పి : వూడదీసుకుంటారని నీ కెట్లా తెలుసు?

పు : అది మామూలె.

పి : నీ వెప్పుడు వచ్చావు?

పు : నిన్ననండీ.

సూ : నిన్న వచ్చినవాడివి ఇక్కడ జరిగే మాములు సంగతి యెట్లా చెప్పగలవు?

పి : ఈపూట కొత్తగా ఇచ్చిం దెవరికి?

పు : ఈపదిమందీ ఈపూట ఇచ్చినవాండ్లేనండి.

పి : ఇవి మీకు నిన్న కాదట్రా ఇచ్చింది.

ఖై : తమరు మాకు నిన్ననే దయచేశారండి.

పు : ఇప్పుడు వీండ్లంతా భయపడి అబద్ధాలు చెప్పుతున్నారు. చట్టలు కొత్తమాసినవేమో చూడండి. అది పోనియండి. వీండ్లకు గొంగళ్లు, చాపలు యిచ్చారేమో కనుక్కోండి.

సూ : ఇంగ్లీషులో-మీకు గొంగళ్లు, చాపలు ఇయ్యలేదా?

పి : అరవంలో - మీకు నిన్న గొంగళ్లు, చాపలూ యిచ్చారు గదా.

చాలామంది అరవము తెలియని తెలుగువాండ్లు. ముగ్గురు అరవవాండ్లు. ఇచ్చారుగాఁవాలె అన్నారు. పిళ్ళ యిచ్చారని చెప్పుతున్నాడు అని ఇంగ్లీషులో తర్జుమా చేశారు.

పు : మీ రేమి అడిగారో, వాం డ్లేమి చెప్పారో నాకు తెలియదండి.

పి : నేను తప్పుతర్జుమా జేశానట. నీకు అరవంగాని, ఇంగ్లీషుగాని వచ్చునా ?

పు : రాదండి.

పి : నేను తప్పుతర్జుమా చేశానని అతడి కెట్లా తెలుసు? అరవం ఇంగ్లీషు తనకు రావట.

సూ : తర్జుమా సరియైనదేనా ?

జ్ఞా : అరవం బాగా నాకు తెలియదు. నాది మలయాళం. చాలాభాగం ఖయిదీలు తెలుగులో మాట్లాడుతుండడంచేత మీ సంభాషణే నా కర్థం కాలేదు.

సూ : యేమీ తోచక ఉర్దుతో - తర్జుమా సరియైనదే. మా ఉద్యోగులను నేను నమ్ముతాను.

పి : యేం పుల్లప్పా ! నీవు తప్పుఫిర్యాదులు చేస్తున్నావు. యెందుకు శిక్షించగూడ దంటున్నారు దొరగారు.

పు : నా కంఠం తీయిస్తా నన్నా భయంలేదు. మీరు దాచిపెట్టిన పదిహేనుమందినీ పట్టిస్తాను. నాతో దయచేయండి.

పి : వాళ్ళంతా అబద్ధాలు ఆడుతున్నారట. పదండి వాడితో నేమి ?

సూపరింటెండెంటు ముందుకు సాగి వెళ్లుతున్నాడు.

పి : వోయివార్డరు ! పుల్లప్పను 10 గంటలకు నా ఆఫీసుకు తీసుకొనిరా. బేడీలు వేయిస్తా. వూరికె తీసుకొనిరాబోకు.

వా : చిత్తం.

సూపరింటెండెంటు వెళ్లిపోయినాడు. వార్డరు పుల్లప్పను చోటాకట్టెతో పిక్కలమీద, మోకాళ్ళమీద కుమ్మాడు. కొట్టారని చెప్పుకున్నా విచారించే దిక్కుండరని విలవిలలాడుతు వార్డరు కాళ్ళమీద బడ్డాడు. పడ్డవాణ్ణి మరిరెండుబాదారు. రక్తమయమైంది. సూపరింటెండెంటుకు చూపుతానని లేచి పరుగెత్తుతున్నాడు.

ఇంతలో ఛీఫువార్డరు ఎదురుగా వచ్చి ఇద్దరు ఖయిదీలచేత పట్టించి ఆసుపత్రిలో రోగిగా చేర్పించకుండా గాయాలకు మందువేయించి మళ్ళీ క్వారంటులోకి బంపాడు. రామదాసు మొదలైనవాండ్ల కందరికీ తెలిసింది. ఖయిదీలందరూ ఉద్యోగస్తులను అయ్యా, నాయనా అని బతిమెలాడుకోవాలెగాని వాండ్లమీద ఫిర్యాదు లేమిటని పుల్లప్పనే చీవాట్లు పెట్టారు.

పు : నన్ను గొట్టడం మీరంతా చూచారుగదా, యిప్పుడు ఫిర్యాదు చేసుకోవడానికి పోనియ్యకపోయినా మళ్ళీ ఫయిలులో చెప్పుకుంటాను. చూచినసంగతులు సాక్ష్యం చెప్పండి.

ఖయి : ఉద్యోగస్తులమీద సాక్ష్యం చెప్పించి మాకు బేడీలు వేయించవలెనని చూస్తున్నావా? యీ మాత్రంగా బతకనియ్యి. ఇది అసలే ఖయిదు. దీంట్లో దెబ్బలుకొట్టక ముద్దుపెట్టుకుంటా రనుకున్నావా? యేదో కాలం వెళ్లబుచ్చుకొని పోవాలె. ఒకవేళ ఫిర్యాదు చెస్తావే చూడవయ్యా, పడ్డదెబ్బలు మళ్లీ వచ్చేనా? యేందో తోచనిపని. మమ్ములనుకూడా యిరికిస్తానంటా వెందుకు?

ఇంతలో పిళ్ళగారు మళ్లీ లోపలికి వచ్చి 'యేడిరా వాడు. ఇంకా ఫిర్యాదుకు పోతానంటున్నాడా' అన్నాడు.

వా : దొరకు దెబ్బలు చూపిస్తాడట, సాక్ష్యం కుదుర్చు కుంటున్నాడు.

పి : వార్డరుతో – నీకు యెన్నిమాట్లు చెప్పినా బుద్ధిలేదు. వాడు లేచి పోగలిగేటట్టుగానా కొట్టేది. యేమిరా ఫిర్యాదుకు పోతావా?

పుల్లప్ప మాట్లాడకుండా తల వంచుకున్నాడు.

పి : వీడు తప్పుడు రిపోర్టు చేసినందుకు ఈపూట పస్తు.

పు : అట్లని శిక్షలరిపోర్టులో వ్రాయండి.

పి : వ్రాయవలెనా? వ్రాయకపోతే యేమిచేస్తావో చూతాం. సాయంత్రం గంజిమాత్ర మియ్యండి. అక్కడికి తిక్క చాలాభాగం వదులుతుంది.

పు : నేను దొంగదాసరివాణ్ణి. ఇంతమాత్రానికి వంగే వాడిని గాదు.

పిల్ల చోటాకట్టెతో మోకాళ్లమీద రెండుదెబ్బలు గోట్టంగనే కొండకేకలు పెట్టుతూ కిందపడ్డాడు.

పి : చాలునా ?

పు : చాలేదే ? మీ రోజులు మంచివైనవి. ప్రొద్దున దాచిపెట్టిన పదిహేనుమందిని దొరవచ్చేముందు యింకొకకొట్లో వేయకపోయినట్లయితే నా తడాఖా చూపించేవాడినే.

పి : దొరగారికి చూపుతానంటివే, చూపకపోయినావా !

పు : రెండోకొట్టు యేదో తెలిస్తే అంతపని చేసేవుందును.

పి : నీ కేమయినా మేస్త్రీపని ఇప్పించమంటావా ?

పు : ఏదో తగలవేయించండి.

పి : కొత్తవాడివి. నెలరోజులు జరగనియ్యి. అందాకా లోలాయిగా ఉండి గాయాలు నయంజేసుకో (తనలో) నల్లకుల్లాయి. వీడికి మేస్త్రీపని ఎట్లా వస్తుందనుకున్నాడో ?

పిల్ల రామదాసుదగ్గరకు వచ్చి నీకు 'అన్నపుపడి వేశాను. పనిసంగతిలో...'

వా : తక్కినసంగతులు నే మాట్లాడి మనవిజేస్తాలెండి. కొద్దిరోజులలో వాండ్లవాం డ్లెవరో వస్తారట.

పి : సరే. (రహస్యంగా) ఈదెబ్బలసంగతి స్వదేశీవాండ్లకు తెలియనియ్యబోకు. వాండ్లు సాక్షులను నిలవదీస్తారు. ప్రాణం మీదికి వచ్చేను.

వా : తలా ఒకబీడీ పారేశా. సాక్షులెవరూ పలికేవాండ్లు లేరు.

డుబ్ జయిలరు కొత్తగా దుస్తులు ఇచ్చినవాండ్లనందరినీ పిలిపించి వరుసగా నిలువబెట్టి విడిపించి మూటగట్టించాడు. వాండ్లు లబలబలాడుతుంటే గుడ్డలు కుట్టించి ఇస్తానని సమాధానపరచి రామదాసుకు ఒకజోడు దుస్తులూ, కంబళీ, చాపా, ఇప్పించి వచ్చే ఫయిలుదాకా తేలికపని ఇయ్యమని వార్డరుతో చెప్పి అన్నపుపడి వ్రాసి వెళ్లిపోయినాడు.

## 8. వెంకటదాసు

జైలులో జనమంతా యెవడో బందిపోటుదొంగ శిక్షకు వస్తున్నాడని గలభాగా చెప్పుకుంటున్నారు. ఉద్యోగస్తులు

రామంధాళీగా వస్తూ పోతూ వున్నారు. గేటుదగ్గర వార్డర్లను విచ్చుకత్తులతో రెండుబార్లు దీర్చి నిలువబెట్టారు. ముందు డోలీ వస్తున్నది. పోలీసుఘాటు చుట్టూ కమ్మి నడుస్తున్నారు. వేలకొలది జనం వెంటవస్తున్నది. జైలరు గేటుకు 50 గజాల ముందుకువచ్చి జానాన్ని ఆగమని ఉత్తరువు జేశాడు. జనం లక్ష్యపెట్టలేదు. అప్పుడు వెంటవస్తూవున్న డాక్టరు అక్కడ మేరువ పోసివుంటే యెక్కి 'జగ్గడు చాలాజబ్బుస్థితిలో ఉన్నాడు. (జగన్నాథమని కేకలు) జగన్నాథం లేచి కూర్చోగూడా లేడు. త్వరగా లోపలికి తీసుకొనిపోయి కట్టుకట్టితే కొంత బాధ తగ్గవచ్చు'నని చెప్పాడు. అంతట జనం గట్టుకుతగిలిన తరంగాలు మోస్తరుగా ఆగిపోయి, 'జగన్నాథంకు జై' అని కేకలు వేశారు. నిజంగా అతడు జగన్నాథుడే అని కొందరన్నారు. అతడు ప్రపంచాన్ని యేలక పోయినా, అతని ఆదర్శాలు మానవులభావప్రపంచాన్ని ఏలుతవని మఱికొందరన్నారు. నిశ్శబ్దంగా డోలీ లోపలికి వచ్చింది. సరాసరి ఆసుపత్రికి తీసుకొనిపోయి పడుకోబెట్టి గాయాలు కడిగి కట్టుగట్టారు. అతనితో వచ్చిన సర్జను కర్నూలుజిల్లా కలెక్టరిచ్చిన పరిచయపు ఉత్తరమును సూపరింటెండెంటు కందిచ్చి వారికి జగ్గడిపై వున్న అభిమానం దెలిపి వెళ్లిపోయినాడు.

సూ : నీపేరు జగన్నాథమా ?

జ : మొదటి పేరు జగ్గడండీ. జగన్నాథమనీ కొందరంటారు.

సూ : కలెక్టరుగారు నీమీద చాలా దయగా ఉన్నారే !

జ : వారు చాలా యోగ్యులు.

సూ : నీవు చాలా జబ్బుస్థితిలో ఉన్నావు. నావల్ల నీకు కావలసిందేమి ?

జ : మా అయ్య రామదాసు అనే ఆయన, మాలక్ష్మి అనే మా అమ్మ యీ జైలులో ఉన్నారు. నేను వెళ్లిపోయేవరకూ నామంచందగ్గర ఉండడానికి ఉత్తర్వు ఇప్పించండి.

సూ : పిల్లగారితో-వా రెవరో మీకు గుర్తేనా ?

పి : గుంటూరునుంచి రెండురోజులక్రిందట వచ్చినవాండ్లా !

జ : అవును.

సూ : వాండ్లు నిద్దరినీ ఆసుపత్రిలో ఉంచు. ఈ దగ్గిర మంచాలు రెండూ వాండ్లకియ్యండి. ఈగదిలో ఇంకెవరూ ఉండగూడదు. వాండ్లు మాట్లాడుకుంటేటప్పుడు మీరెవరూ సమీపంలో ఉండనవసరంలేదు. వెంటనే పిలిపించండి.

పి : చిత్తం.

సూ : సర్జను లిద్దరు, ఒకరు విడిస్తే ఒకరు హాజరుగా ఉండి ఈరోగిని చూస్తుండండి. శస్త్రచికిత్స చెయ్యడానికి వల్లవుతుందేమో రేపుపొద్దుటికి తేల్చండి. ఇప్పటికి వీలులేదనే తోస్తుంది. కొద్దిగా మత్తుకూడా యేర్పడుతున్నదేమో గమనించండి.

రామదాసునూ మాలక్ష్మినీ పిలుచుకొనిరావడానికి వెళ్లిన వార్డరు ఉభయులనూ వెంటబెట్టుకొనివచ్చి ఆసుపత్రిలో దిగవిడిచాడు. వాండ్లకు వెంకటదాసు వచ్చిన సంగతి తెలియదు. తక్కెళ్ళజగ్గడు మిమ్ములను చూస్తా నంటున్నాడనిమాత్రం చెప్పారు. రామదాసుకు అనుమానం తగిలి వెంకటదాసు అతనిగుంపులో చేరి తన సంగతి చెప్పివుంటాడని అనుకున్నాడు. ఉభయులూ వెంకటదాసు పడుకున్న చావిట్లోకి పోయినారు. వెంకటదాసు కైవారం జేసినట్టు యతి రాజుకు ఒంటిచేతితో నమస్కారం జేశాడు. మాలక్ష్మి దూరం నుంచి దిగాలపడి చూచి కొళికలనుబట్టి గుర్తించి నావెంకడు, నావెంకడని పరుగెత్తివచ్చి కావలించుకొని యేడుస్తూ వెఱ్ఱిదానివలె మళ్లీమళ్ళీ ముద్దుబెట్టుకుంటున్నది. స్తన్యంకూడా చేపుకు వచ్చిన వేమో చెప్పలేము. ఆమెపొందిన ఆనందాన్ని వర్ణించడంకంటే అమ్మపొందే ఆనందం పొందిందంటే చాలు. ఇతరమాటలతో చెప్పడానికే వీలులేదు. రామదాసు రిచ్చపడి చూస్తూ "నీవా జగ్గడివి? ఆశ్చర్యం. ధర్మదేవత వనిపించుకున్నావు" అన్నాడు.

వెం : అయ్యా! మీయిద్దరికీ సంతానంవల్ల దుఃఖమేగాని సుఖం గలుగ లేదు.

రా : నాబిడ్డలు కొంతవరకు చింతపడేటట్టు చేసినా, సిగ్గుపడే టట్టు వర్తించలేదు. జగ్గడిచరిత్ర యావత్తు వింటూనేవున్నాను. నీవే జగ్గడివని యిప్పుడు తెలిసింది.

వెం : నీబిడ్డలు వీరులు. వీరోచితమరణమే పొందారు. పొందుతారు. సుఖదుఃఖాలను నీ వతీతుడవు గనుక నీ విషయమై నాకు యెక్కువచింత లేదుగాని అమ్మదే కష్టదశ.

రా : అంతేకాదు. ఆమె మీ అమ్మ. ప్రేమవిషయంలో అమ్మకూ అయ్యకూ హస్తిమశకాంతరం వార ఉంటుంది.

వెం : వాస్తవమేగాని అయ్యకు మించిన రక్షకుడు లేడు.

రా : అమ్మ దేవత. సమస్తమూ అమ్మే. అటువంటివస్తువు యిహపరాలలో వెదకినా మరొకటి కనపడదు. కాని నీ మాటలు దుఃఖవార్తను సూచిస్తున్నవి.

మా : దేనికయినా ఒడిబట్టేవున్నా. పిల్లలసంగతేమి !

రా : నాయుడుగారు క్షేమమా ?

వెం : నాయుడుగారు వొకవిధాన క్షేమంగానే ఉన్నారు.

మా : జోతీ, అప్పడో ?

వెం : లేరు.

మా : లేనేలేరా ?

మాలక్ష్మి నేలకు జారింది. యేమీ మాట్లాడలేకపోయింది. వెంకటదాసు తన ఒంటిచేతితో కూర్చోబెట్టాడు.

రామదాసు వేదాంతం కాసేపు మూల కూర్చున్నది. ప్రేమకు మించిన వేదాంతమేమున్నది ? ప్రేమరహితమయిన జ్ఞానం చవిటినేలవంటిది.

రా : అమ్మా జ్యోతీ, యీ ముసళ్లను విడనాడి పోయినారా ! మమ్ములను కడతేరుస్తా నంటివే ! మమ్ములను వదిలిపోవలసిన అవసరం వచ్చిందా ! అప్పడిసంగతేమిటి !

మాలక్ష్మి వాల్చిన రెప్పలు తెరచింది.

వెం : జోతి ఆత్మహత్య చేసుకొన్న తరువాత అప్పడు ఆమెనే అనుసరించి శవముతో సహితం కృష్ణాప్రవాహగతు డయినాడు. పిల్లవాడిని మంగళాపురం వెంకటయ్యగారు తీసుకొని పోయినారు.

మాలక్ష్మి పడిపోయింది.

రా ; ఆహా ! రామానాయుడుగా రేమయినాడు !

వెం : పిల్లలను విడిపించే ప్రయత్నంలో కారాగారప్రాప్తిని పొందారు. వారం రోజులు ఖయిదులో ఉంచినానికె కేసు ఫయిసలు అయినతర్వాత ఆయనను నిర్దోషినిగా యెంచి విడిచిపెట్టించారు. రెండు మూడు రోజులలో యిక్కడికి వస్తారని వింటాను.

రా : అప్పడిది యెంత అద్భుతమయిన సహగమనం ? ఇది గదా నిజమైన ప్రేమ. వివాహబంధమూ, దైహికసంబంధమూ లేకనే అద్భుతమయిన ఆత్మీయప్రేమ కనబరచారు. అప్పడు జెప్పినట్టు ఐహికాముష్మికాలరెంటికీ ప్రేమ అనేరస్తా వేసి యాత్ర జేశారు. వారు ధన్యులు.

వెం : అదంతా నాకు తెలియదు. ప్రేమ అనేది ఎక్కడా నాకు కనపడలేదు. ఒకచోట వుంటే రెండోచోట లేకుండాబోదు. ఇహా పరా లుండడమే నిశ్చయమైతే రెంటిలోను ప్రేమ శూన్యమే. అమ్మను నా చేతిమీద నిలుపలేకుండా వున్నాను. జారిపోతున్నది. మనస్వారంతి లేదుగామాలె. ఇటువచ్చి పట్టుకో.

రా : ఇదేమిది ? జావాలె చేతికి రావడంలేదు.

వెం : నే లేవలేను. సర్జనుగారిని కేకవెయ్యి.

సర్జన్ : ఈ మాటలు విని లోపలికివచ్చి – యేమది ?

వెం : మాఅమ్మగారు కుమార్తెయొక్క మరణవార్త విన్నది. నాడి తప్పతున్నట్టు కనబడుతున్నది. తమరు చూడండి.

రా : పరీక్షించి-ఇదివరకే తప్పింది. నీవు చాలా జబ్బులో వున్నావు. దుఃఖించవద్దు. మీనాయనకు పెద్దతనంలో కష్టపు రోజులు.

రామదాసు భార్యపొట్టలో తలపెట్టుకొని కూర్చున్నాడు.

వెం : మాఅమ్మ వెళ్లిపోయిందా ! ప్రపంచంలో ప్రేమ లేదన్నాను. తప్పకుండా అమ్మకడుపులో ప్రేమ వున్నది. అమ్మే దేవుడు. మరియొక దేవుడు లేడు. అయ్యా, డాక్టరుగారూ, మా అమ్మ చెయ్యి నా చేతికి తగిలించండి ఒక్కమాటు. నా హృదయ తాపం చల్లారుతుంది.

రా : మాలక్ష్మీ ! నన్ను విడిచిపోయినావా ? ఇంతవరకూ

నా నీడవలె వెంట వుంటుంటివి. యెట్లా విడిచి పోగలిగావు? వస్తువు లేకుండా ఛాయ వుండగలదా? ఛాయలేకుండా వస్తువూ ఉండదు. ప్రకృతి పురుషలక్షణ మిదే. యీసృష్టికంతా భగవంతుడే సాక్షి. నిరావలంబనగా యీ సృష్టి నిలవలేదు. వియోగదుఃఖం మనకంటె ఆయనకే యెక్కువ. వ్యసవి. నిన్ను వదిలిపెట్టి యెలా వుండేది? కట్టి తెచ్చుకున్నభత్యం నాకింకా ఉన్నది. అది తిని మరీపోవాలె. నాకు విమోచనం కలుగలేదు. జ్యోతీ అప్పాదాసులు తరించినప్రేమమార్గంకూడా నాకు కనబడడం లేదు. వృద్ధాప్యం వచ్చినకొద్దీ జీవుడికి పంచేంద్రియములతో సంబంధం ఒకటితరువాత ఒకటి వూడిపోతున్నవి. ఇవన్నీ బంధాలా! నీవు నాకు బంధానివా?

జోతీ అప్పాదాసులూ ఒకరి కొకరు తెప్పలయి తేలిపోయి నారే! నిన్ను నేను బంధ మనుకోవడం నాబుద్ధి జాడ్యమే. నా దౌర్బల్యమే నిన్ను భరించలేకపోయిందని బలవంతంగా కూర్చో పెట్టబోయినాడు. శరీరమంతా చైతన్యరహితంగా కనపడ్డదిగాని చేతులుమాత్రం కొంగర్లుపోయినట్లు చలిస్తున్నవి. కళేబరం కూర్చో బడక జారింది. ఆ జారడంలో చేతులు రామదాసుపాదాలను పుణికినట్టు స్పృశించినవి. పట్టుకున్నవి. స్థూలశరీరంయొక్క చేతులకు పట్టు చిక్కలేదుగాని సూక్ష్మహస్తాలు పాదాలనుగట్టిగా పట్టుకొనే ఉంటవి. చైతన్యం చేతులలోనుంచిగూడా లేచిపోయింది.

సూపరింటెండెంటు కీ సంగతి తెలిసే వొచ్చాడు. శవాన్ని దహనం చేసుకుంటారా? ఖననం చేసుకుంటారా! అని అడిగితే వెంకటదాసు ప్రస్తుతం ఒకపెట్టెలో పెట్టి పాతిపెట్టి వీలుప్రకారం ఆ పెట్టె తమ గ్రామానికి తీసుకొనిపోవడానికి ఉత్తర్వు లియ్యవలసిం దని కోరాడు. చిన్నసర్జను అట్లా చెయ్యడానికి రూల్సు ఒప్పవని అనవచ్చాడుగాని, సూపరింటెండెంటు ఆప్రకారమే చేసుకోవచ్చునని ఉత్తర్వు లిచ్చాడు. జయిలు వెలుపల ఒకప్రత్యేక స్థలంలో ఖననానికి ఏర్పాటుజేసి వెంకటదాసు కోరికప్రకారం అతనిమంచంగూడా శవంతో సమాధిదగ్గరకు తీసుకొనిపోయినారు. అతని చేతిమీదుగా మొదటిసారి మట్టిజల్లి పూడ్చడం ప్రారంభించాడు. ప్రాప్తమున్న వాండ్లంతా తోడ్పడి ధర్మమట్టి జల్లి పూర్తిజేశారు.

సూ : వెంకటదాసూ, నీవు చాలాజబ్బుస్థితిలో ఉన్నావు. నేరా లిక చేయలేవని సర్కారుకు వ్రాసి నిన్ను విడిపిస్తాను. అట్లా చేయవచ్చునా?

వెం : తమరు విడిపిస్తే నా అభ్యంతరం యేమీలేదు. కాని నావాండ్లంతా పరలోకానికి వెళ్లిపోయినారు. ఇక మిగిలింది నాతండ్రి ఒకడే. తమ్ముడు పసివాడు. యీయనను విడిచి బయటికి పోవాలననే అపేక్ష లేదు. ఆయననుకూడా వదిలించడం సాధ్యం అయితేసరి. కాకపోతే నాశల్యాలనుకూడా మావూరు తీసుకొని పోవడానికి ఉత్తరువు దయచేయించండి.

సూ : ఆయనను వదిలిపెట్టమని వ్రాయడానికి నాకధికారం లేదు. ఆయన చేసింది నామకానేరం గనుక ఉభయులనుగురించి వ్రాసి చూస్తాను. అనుకూలమైన ఉత్తరువులు వస్తే ఉభయులను విడిచిపెడతాను. నీకు జబ్బు నయమైనా నేరములేమీ చేయగలవని తోచదు.

వెం : మీకు ఉత్తర్వులు వచ్చేలోగా నేను మరణించకపోతే వెళ్లుతాను. నేను మరణించినా మానాయనగారిని వదిలిపెట్టండి.

సూ : యెవరికి ఉత్తరువు వచ్చినా ఒదిలిపెట్టడానికి ఆక్షేపణ యేమీ వుండదు.

## 9. ఆచరణసాధ్యమే

రామదాసు జోడుపడిపోయిన పక్షివలె తనమంచంమీద ముడుచుకొని కూర్చున్నాడు. సాయంకాలము అన్నపుపడి వచ్చింది. ఒక్క కణమయినా నోటికి పోలేదు. అన్నమంతా జాడమాలి కిచ్చివేశాడు. ముప్పైసంవత్సరాలనుంచీ యేవిధమయిన దీర్ఘమనస్తాపాలు లేకుండా కలిసిమెలిసి ఉన్న తన అర్ధాంగియొక్క వియోగం దుస్సహమై, జోతీ అప్పాదాసులమరణానికే విచార పడుతుంటే మాలక్ష్మియొక్క ఆకస్మికమరణం దుఃఖము యొక్క బాధనే తీసివేసింది. యేమీ తోచక మానివలె మంచంమీద గూర్చున్నాడు. వెంకటదాసుకు దుఃఖంవల్లనో, నాలుగైదుమాట్లు లేవడంచేత కట్లు కదలడంవల్లనో గాయాలబాధ యెక్కువయి

నిద్రబట్టలేదు. ఉభయులూ అతికష్టముమీద రాత్రి వేగించారు. ఒకరొకరి క్షేమం విచారించుకోవడానికయినా మనస్వాస్థ్యం లేక పోయింది. రామదాసు మెదలకుండా పండుకున్నాడు. కాని వెంకటదాసు తెల్లవార్లూ మూలుగుతూనేవున్నాడు. మేలుకొని ఉండీ రామదాసది గమనించలేదు. క్వారంటుకంటె ఆసుపత్రిలో కొంత బాహ్యశుద్ధి ఉన్నా, అక్కడివైద్యులకు క్వారంటులోని ఉద్యోగులకున్న మాత్రమయినా హృదయశుద్ధి లేదు. సర్జను లిద్దరూ బ్రాహ్మణులే. ఇదివరకు జెప్పినరాక్షసగణంలో చేరుతారు. బ్రహ్మరాక్షసులంటే రాక్షసులలో బ్రాహ్మణులా? బ్రాహ్మణులలో రాక్షసులా? వైద్యజ్ఞానం ఉభయులకూ పూర్ణసంఖ్య. దయా దాక్షిణ్యాలు అంటే వైద్యం చేసేటప్పుడు, రోగులను ఖయిదీలుగా భావించగూడదని వారికి తెలియదు. సూపరింటెండెంటూ, డాక్టరూ ఒకమనిషే కావడంచేత, డాక్టరు తనపూర్వసంస్కారం మరచిపోడు. ఆసుపత్రికి కంపౌండరు రామస్వామినాయుడే ఆధారం. ఆయన లేకపోతే రోగులు మురిగిపోవలసిందే. రూలుప్రకారం సర్జనులే రణాలు కడగాలెగాని, జయిలాసుపత్రిలో అక్కడవుండే ఓవరుశీయరే వ్రణచికిత్సకుడు. పూర్వపు సూపరింటెండెంటు వైద్యుడుగాడు. జిల్లాసర్జనుకు నెలకు రెండువందలరూపాయిలు ఎక్కువిస్తే ప్రతిరోజు వచ్చి రోగులను చూచేవాడు. ఇప్పటి సూపరింటెండెంటును సీమలో పెద్దడాక్టరుపరీక్షలలో యేరుకున్నారు. ఈయన పూర్వము సేనలో డాక్టరుగా ఉండేవాడు. పాపం వారిని జిల్లాసర్జన్‌గానైనా వెళ్లక సూపరింటెండెంటుపనీ, డాక్టరుపనీ ఒక్కరికే ఇచ్చే యేర్పాటు జేసి తద్వారా తెల్లపిల్లవాడికోసం పెద్దవుద్యోగం సృష్టించి రెండుపనులకు రెండు ఆరువందలచొప్పున నెలకు రు. 1200 లు జీత మేర్పరచి నియమించారు. ఖయిదీలవల్ల వచ్చేఆదాయంయావత్తు ఈ తెల్లయేనుగుకు సరిపోతుంది. ఉద్యోగస్తుల కందరికీ ఇండ్లు ఉచితముగా ఇస్తారు. సూపరింటెండెంటు గారియింటిదగ్గిర రోజుకు 11 మంది ఖయిదీలు వంతులప్రకారము పని చేస్తారు. డాక్టరు పనిచేసినందుకు సూపరింటెండెంటుకు రు. 600 లు అదనంగా ఇస్తున్నారుగదా! ఈ డబ్బంతా ఎలా తేలాలి? ప్రతి సంవత్సరము జయిలుఆదా తక్కువై ఖర్చుఅమితమై లిడితిపడుతుంటే

సూపరింటెండెంటుజీతం తగ్గించకుండా ఆసుపత్రిఖర్చు తగ్గించారు. ఆసుపత్రిలో వాడేవి ముఖ్యమయినవి మూడేమందులు. ఏక మూలికా ప్రయోగ మనడంకంటె త్రిమూలికాప్రయోగమంటే నిజం చెప్పినట్టు ఉంటుంది. విరోచనాలమందు మొదటి మూలిక, రెండవది కోయినా, నెత్తురుబంకకు పొడిపిళ్ళమందు మూడవది. ముఖ్యంగా ఈమూటితో ఆసుపత్రి సాగిస్తున్నారు. ఇందువల్ల డాక్టరు జీతం చాలావరకు కూడివస్తున్నది. పూర్వం జిల్లాసర్జను రోగులకు సరి అయిన పథ్యం పెట్టించేవాడు. బలహీనులకు పాలు, రొట్టె మొదలయిన ఆహారం అవసరాన్నిబట్టి యిప్పిస్తుండేవాడు. ఇప్పుడు అన్నిరోగాలకు ఒకటే పథ్యం. లంకణం పరమౌషధ మన్నట్లు దెబ్బతగిలినవాడికి, న్యుమోనియా వచ్చినవాడికి, విరోచ నాలవాడికి వరిగంజే పథ్యం. అన్నంబెట్టక మాడుస్తారని ఖయిదీలు తమవార్డులో చావడానికైనా ఒప్పుకుంటారుగాని ఆసుపత్రికి పోరు. అందువల్ల తోచినంతవరకు జయిలుకు పని చేస్తుంటారు.

డాక్టర్లకు పని తక్కువవుతుంది. మందుఖర్చు లేదు. ఈమధ్య స్వదేశీఖయిదీ లందరూ, ఈసంగతులన్నీ కలెక్టరు మొదలయిన విజిటర్లకు జెప్పి గోలబెట్టారు. ఇప్పుడు వాండ్లకుమాత్రం పాలూ, సబ్బుగంజీ, గోదుమగంజీ ఇచ్చామనిపిస్తున్నారు. నిడదవోలు ఆసుపత్రిభాషలో పంచదార అంటే మురికిబెల్లం అని అర్థం. స్వదేశీవాండ్లు పంచదారంటే నల్లబెల్లం గాదు, తెల్లనిపొడి అని అర్థం జెప్పితే అప్పటినుంచి చక్కెర తెప్పించి పాలలో కిస్తున్నారు. ఈపాలూ, గంజీగూడా రోగుల అవసరాన్నిబట్టి ఇయ్యరు. కొత్తరోగికి పాలియ్యావలసివుంటే పాతవాళ్ల కవసరమయినా వాళ్ల కిచ్చేవి తగ్గించి కొత్తవాళ్ల కిస్తారు. అంటే తాము కొనదలచుకొన్న పాలనుబట్టి పథ్యం పెడతారుగాని పథ్యావసరాన్నిబట్టి పాలు గొనరు. డాక్టరు కొనేపాలనుబట్టి రోగాలు రావలసివుంటుంది. సామాన్యపురోగులను ఆసుపత్రిలో ఉంచరు. పొద్దుటిపూట వచ్చి మందు తాగి పొమ్మంటారు. జడ్జీగారు ఉత్తరం వ్రాయబట్టిగామాలె, వెంకటదాసుకు పాలూ రొట్టే ఇస్తున్నారు.

తెల్లవారేవరకు అందరికీ గంజే వచ్చింది. రామదాసు గంజిదాగి వెంకటదాసువద్ద కూర్చున్నాడు. వెంకటదాసుకు

సన్న నిమబ్బులు వస్తున్నవి. సర్జను లిది గమనించలేదు. రామదాసుకు అనుమానం దోచింది.

రా : నాయనా! కళ్లు మూసుకొన్నా వేమిరా?

వెం : యేమీా లేదు; నిద్రవస్తున్నట్టుగా ఉన్నది.

ఇంతలో వాకిట్లో ఏడ్పు వినబడ్డది. రామదాసు గుమ్మంలోకి పోయి తొంగిచూచాడు. యెవడో రోగి విరోచనా లవుతున్నవని వస్తే సర్జను లిది నమ్మక కఱ్ఱబెట్టి వెనుక ముడ్డిలో బొడిచారు. రోగి కేకలువేసి మొత్తుకుంటుంటే పిచ్చయ్యశాస్త్రి నవ్వుతూ విరోచనాలు కాకుండా ఇదే మందురా?— అన్నాడు. ఇంకొకడువచ్చి విరోచనాలకు మందియ్యమంటే కఱ్ఱదెబ్బలుకొట్టి దీనివల్ల విరోచనం కాలేదా? అని అడిగాడు. సకాలంలో ఔషధా లివ్వక రోగం ముదిరినాక ఆసుపత్రిలోకి తీసుకొనిపోవడంచేత అధికబాధ ననుభవించిన రోగులనేకు లున్నారు. ఈ ఆసుపత్రులు ఉద్యోగులజీతాలు ముట్టడంకోసం బుట్టినవేగాని, రోగుల వ్యాధులను కుదర్చడానికి కాదు. సూపరింటెండెంటూ, డాక్టరూ ఒకడుగా ఉండడం సర్వానర్థాలకు మూలం. ఈ ఆసుపత్రి చర్యలు జూచి తాను చిన్నప్పుడు చదువుకొన్న ధన్వంతరి పద్యాలలోని చికిత్స రామదాసుకు చాలా మెరుగుగా కనపడి పద్యాలు గుప్తికి తెచ్చుకొని :

"శ్లో. అర్కక్షీరే శునీక్షీరే శిలాచూర్ణేచ మర్దితమ్,
నేత్రద్వయేఽంజనం కుర్యాత్ పర్వతోఽపి సదృశ్యతే."

ఆ. గీ. "దగ్గుగల్లువాని డాకలి మెడఁగట్టి,
లోతునీటిలోనఁ బాతిపెట్టి
ఒకటి రెండుప్రొద్దు లూరంగఁ బెట్టితే,
దగ్గు విడిచి వాఁడు దయ్యమౌను!"

అని చదువుకుంటూ లోపలి కొచ్చాడు. రెండవ సర్జన్ వెంకటదాసును పరీక్షించి మంచందగ్గర నిలువబడి చూస్తున్నాడు.

వెం : ఈ మత్తుకు కారణ మేమి?

స : నేనూ అదే అనుమానిస్తున్నాను, ఎప్పటినుంచిది?

వెం : నిన్న మధ్యాహ్నంనుంచి సూక్ష్మంగా అడపాదడపా వస్తూ ఉదయం ఉండుండి ఎక్కువగా వస్తున్నది.

స: దొరగారు రెండుగంటలకు వస్తారు. మళ్లీ వచ్చి చూస్తాం.

వెం: మీ రేమీ చికిత్స చేయలేరా?

స: వారి సలహాకూడా పుచ్చుకొంటే మంచిది.

వెం: ఎవరికీ? మీకా? నాకా మంచిది? వెంటనే మందివ్వడము నాకు మంచిదని తోస్తుంది. యిప్పటికే చాలా ఆలస్యం చేశారు.

స: వారి సలహా ఎందుకయినా మంచిదే. యీ శాస్త్రంలో మిగిలిపోయే దేమున్నది?

వెం: ఇక మిగలబోయే దేమీ లేదని నాకూ తెలుసు. వారి సలహా పుచ్చుకుంటే మీ జవాబుదారీ లేకుండా పోతుందని మీ ఉద్దేశం. అదేదూరాక, మీరన్న మంచి.

స: నీవిషయమై సూపరింటెండెంటుకు రిపోర్టు చేస్తా. అమర్యాదగా మాట్లాడుతున్నావు.

వెం: మీరిపోర్టు నన్ను బాధించేయెత్తు దాటిపోయింది. రాత్రి నన్ను ఒకమాటయినా చూడకపోతిరి. నిన్న పగలు చూచి నాయన సాయంత్రం రాలేదు. నిన్న ప్రొద్దున్నే ఏర్పడ్డమగత ఇంతవరకెవ్వరూ కనుక్కో లేకపోయినారు. మీమీద నే రిపోర్టు చేయదలచ లేదు. మీ అశ్రద్ధ మిమ్ములనే కొట్టనియ్యి.

సర్జను టకటకలాడుతూ వెళ్లిపోయినాడు. మరొక అరగంట కల్లా మగత అధికమై సన్నగా శ్వాస బయలుదేరింది. రామదాసు వచ్చి వెంకటదాసుప్రక్కమీద కూర్చున్నాడు. మగత మంపులుగా వస్తుండడంచేత అప్పుడు రెప్పలు మూతబడ్డవి. రామదాసు "వెంకడూ" అని పిల్చాడుగాని దేహం కదిలినా కండ్లు తెరిపిడి పడ లేదు. అయిదునిమిషాలలో చక్కగా మాట్లాడాడు.

రా: నాయనా! ఎట్లా వున్నది?

వెం: ఎట్లాయే మున్నది? సమీపిస్తున్నది. ఇందాకటి మగతలో కొత్తమార్పు గోచరమయినది. ఆ అయిదునిమిషాలూ కొత్తప్రపంచంలో ఉన్నట్టు కనపడ్డది. అయ్యా! నాకొక్క వ్యసనం వున్నది. నన్ను సృష్టించి అష్టకష్టాలూపడ్డ నా అమ్మా నాయనల

ఋణం తీర్చుకోలేకపోతినికదా? మీకు బాకీదారుణ్ణయి వచ్చి మిమ్ము్మను బాధించి వెళ్లిపోతున్నాను.

రా: నాన్నా! నీవు అట్లా అనవద్దు. పితాపుత్రసంబంధంలో ఋణసంబంధం లేదు. ఈసంబంధం మహాపవిత్రమై ఉభయులకూ తరణోపాయమైనది. పుత్రుడిమీద దయలేని తల్లిదండ్రు లుండరు. పుత్రప్రేమచేతనే వారికి ఆత్మోపలబ్ధి కలుగుతుంది. ప్రేమ స్వరూపాన్ని బొందుతారు. పుత్రోదయమయినప్పటినుండీ తల్లి దండ్రులు చేసేసేవ సాధనచతుష్టయాలకంటె ఆత్మోపలబ్ధికి ఎక్కువ సాహాయ్యకారవుతుంది. నాన్నా! నీవు మహోపకారం చేసి వెళ్లుతున్నావు. నీ కేమీ ప్రత్యుపకారం చేయలేకపోయినాను.

వెం: ఎవరు చేసిన సేవకయినా విలువ గట్టవచ్చునుగాని, తల్లిదండ్రులసేవకు విలువ లేదు. మానవులకు తల్లిదండ్రులకంటె వేరు దైవం లేదు. వారిసేవవల్లనే లోకానికి సమస్తశ్రేయాలూ కలుగుతవి.

మళ్లీ మగత వచ్చింది. జ్వరంకూడా యెక్కువైంది. ఒకటి రెండు తబ్బిబ్బుమాటలుకూడా అన్నాడు. మాంద్యం పూర్తిగా వచ్చిన తరువాత కండ్లు మూసుకొని పడుకున్నాడు. ఈసారి మగతలో వ్రణబాధకూడా పడుతున్నట్లు లేదు. చాలాసేపటికి తెలివి వచ్చింది.

రా: గడ్డం పుణికి — నాన్నా! యెట్లా వుంది?

వెం: క్రమంగా క్షీణించుకొని వస్తున్నది.

రా: బాబూ! నా మాట విని ఒక్కమాటు నారాయణా! అనుకో.

వెం: యెవ రాతడు?

రా: దయామయుడైన భగవంతుడు. తుస్కారంగా మాట్లాడగూడదు.

వెం: భగవంతుడౌనేమోగాని దయామయుడుమాత్రం గాడు. ఈ దయామయుడు లోకమంతా పంచమహాపాతకపట్నం చేశాడు. ఈ దేవుడనే ఆయన ఒకడుంటే జనమంతా ఆయనమీద తిరుగబడి సన్మార్గవర్తిని చేయడ మవసరం. యెన్నాళ్ళని యీ పూరు కోవడం? దీనివల్ల మనకు చాలా అగౌరవం.

రా : ఎట్లా అగౌరవం ?

వెం : మీ దేవుడు ఆలనా పాలనా లేని పరరాజువలె వున్నాడుగాని జనుల కష్టనిష్ఠురాలు యోచించే స్వదేశీప్రభువుగ్గా లేడు. ఎక్కడో స్వర్గంలో వున్నాడంటారు. చేతగానివాడు అక్కడవుండి ఈ ప్రపంచపాలన మెందుకు నెత్తిన బెట్టుకోవాలె? దేశంలో దుర్మార్గ మింత యెందుకు ప్రబలాలె? మంచిచట్ట మొకటీ కనపడదు. దుర్మార్గచట్టాలకు బుద్ధిహీనులుగాని లోబడరు. యెన్నాళ్ళని వూరుకోవడం!

రా : ఆస్తిక్యవిషయంలో నీ కభిప్రాయభేదమున్న దనుకో. ఆ పవిత్రనామం స్మరించినందువల్ల నీకు నష్ట మేమున్నది ?

వెం : నష్టమా? అది ఆత్మవంచన మవుతుంది. 'బహుధా విభజ్యమప్యేవం న నమేయం తు కస్యచిత్' చేయి విరిగింది, కాలు తెగింది, మిగిలిన మొండాన్ని వేయిగా విభజించినా యెప్పుడూ నా శిరస్సు వంచను. ఆచీలికెలుగూడా వంగవు.

వెంకటదాసుకు ఉద్రేకంచేత ముఖం గాదరించి జేవురు గమ్మింది. నొసట వుబికి రక్తనాళాలు చెమర్చినవి.

రా : ముఖాన చెయిబెట్టి తుడిచి-పిచ్చితండ్రీ! కొంచెం, స్వస్థపడు. నీ నమ్మకప్రకారమే ఉండు. భగవంతునియందు నీకు నమ్మకం కలుగకపోతే నీ తప్పేమీ లేదు.

నీకు వున్నంత ధర్మనిష్ఠ నాకు లేదు. ఊరికే నమస్కారాలు కొట్టి యేమి ప్రయోజనం? ఆత్మశుద్ధి ఉండాలి.

మళ్ళీ తెర వచ్చింది. క్రిందటిసారికంటె త్వరగాకూడా వచ్చింది. చాలాసేపున్నది. తగ్గిపోంగనే కండ్లు తెరిచాడు.

రా : నాన్నా! యిందాకా పరిస్థితులు మారుతున్నట్టు కనపడ్డవన్నావే. ఇప్పు డెట్లా వున్నది!

వెం : రంగమంతా మారిపోతున్నది. ఆఖరురంగంకూడా ముగింపుకు వచ్చింది. తెర పడబోతున్నది. నాటకం పూర్తి అవుతున్నదిగదా! నే నెట్లా ఆడానో చెప్పు! నీవు నిజం చెప్పే వాడివని ఆత్మతృప్తికొరకై అడిగాను.

రామదాసు దీర్ఘాలోచనజేసి,

రా: నీది చాలా కొత్తనాటకం. నీ నాటకనియమాలు గూడా వేరే. కొత్తపంథా దొక్కావు. నేను మామూలుదారిని పోయినవాణ్ణి. నీది మార్గంకాదని చెప్పలేనుగాని, అంతా అవలంబిస్తే యెట్లావుంటుందో చూడాలె. నీమార్గం నియమబద్ధంమటుకు అవును, ఆ నియమాలు చాలా ఉత్కృష్టమైనవనీ, అమలులో పెట్టడం కష్టమేమోననీ చాలామందికి అనుమానం.

వెం: ధర్మాచరణం ఎప్పుడూ కష్టమే. అలవాటుపడితే సులభమే అవుతుంది. ఇదివరకు జైలుజీవితంయొక్క ఏర్పాట్లు నీకు తెలియవు. నేను ఇదివర కొకమాటు మూడుసంవత్సరాలు శిక్షబడి మారుపేరుతో జైలులో మూడునెల్లుండి నాబదులి కొకణ్ణి బెట్టి వేలుముద్రలు సూపరింటెండెంటుకు యిచ్చి వెళ్ళిపోయినాను. ఇంకొకాయన సూపరింటెండెంటుగా వుండేవాడు. ఆదొరవ మరీఖయిదీ ముఖ్యసమయాల్లో నన్ను బయటికి పంపడానికీ, నాయకులు వచ్చి నావల్ల సలహాలు పుచ్చుకోడానికీ సదుపాయం చేసి తానుకూడా లాభం పొందుతుండేవాడు. నా సిద్ధాంతాలు ఆచరణసాధ్యమా, గాదా యనిగదా నీకు సందేహం. యీ జైలుపద్ధతి చూస్తే నా సిద్ధాంతా లెందుకు ఆచరణయోగ్యాలు కావో తెలియకుండా వున్నది. ఇక్కడ జన్మఖయిదీ లున్నారు. యౌవనులూ, వృద్ధులూ నడివయస్సువాండ్లూ వున్నారు. కొందరు పిల్లలూ ఆడవాండ్లతో వుంటారు. ఖయిదీలే చాలామంది ఉద్యోగస్థులుగా వుండి, జైలు పని యావత్తూ నడిపిస్తున్నారు. అమెరికా జైళ్లలో సర్కారు ఉద్యోగస్తుల సంఖ్య చాలా తక్కువ. అక్కడ జైళ్లు స్వరాజ్యం గల చిన్న చిన్న సామంతరాజ్యాలుగా వుంటవి. సామంతరాజ్యాలన్నీ స్వపరిపాలనంగల జైళ్ళనే చెప్పవచ్చు. జైలురాజ్యంలో ఖయిదీ లెన్నుకొన్నా, లేక చక్రవర్తి ఏర్పాటుజేసినా జైలు అధికారులను ప్రభువుల క్రింద యెంచుకోందాం. ఐర్లండు, బవేరియా, మైసూరు స్వరాజ్యంగల సామంత రాజ్యాలు. జైళ్లుకూడా ఇటువంటివే అనుకో. సామంతరాజ్యాలపాలనకూ జైలురాజ్యాల పాలనకూ భేదమున్నది. జైలు చిన్నగ్రామమంత రాజ్యం. దీంట్లో రెండు వేలజనం, దీనికి రెండువేల యకరాలభూమీ

ఉన్నవి. అయితే భూము లంతమంచివి కావు. అంతా గరువే. కొంత కుందేటికండ నేలకూడా ఉన్నది. భూములు మంచివైతే దీనికి కావలసినధాన్యంకంటె ఎక్కువే పండించవచ్చు. ప్రతివాడూ పనిచేయక తప్పదు. ఖయిదీల తెలివితేటలనుబట్టి ప్రతివాడికీ అధికారులే వృత్తివిభజనముచేసి పని నియమిస్తారు. అనేక వృత్తులు చేస్తారు. వాటిమూలంగా ధనాకర్షణ చేస్తున్నారు. రత్నకంబళ్లు, చక్కని చెప్పులూ, చిరిచాపలూ మొదలయిన వెన్నో సున్నితపు పనులు జరుగుతూవున్నవి. ఎవడేయ్యవలసినపని వాడు సాయంత్రానికి లెక్కప్రకారం ఒప్పజెప్పుతాడు. భూములవల్లా, చేతిపనులవల్లా వచ్చే ఆదాయం యావత్తూ ప్రభుత్వానికే పోతుంది. భూములూ దానివే, వృత్తులకు పెట్టుబడీ అదే పెట్టుతుంది. జైళ్లవల్ల చాలా ఆదావస్తుంది. అయ్యేఖర్చుకంటే కూడా మిగులుతుంది. మిగిలిన డబ్బు యావత్తూ కొందరే అపహరిస్తారు. ఖయిదీలకు కడుపుకొట్టి, అర్ధాన్నం బెట్టి, అధికారులే వందలూ వేలూ జీతాలు తింటారు. సూపరింటెండెంటుకే ఇంటిఅద్దె మొదలయినవి కల్పుకొని సంవత్సరానికి పదహారు వేలరూపాయిలు ముట్టుతవి. నెలకు రు. 1200 వంతున వార్షక జీతం అవుతుంది. ఇంకా ఉద్యోగు లనేకు లున్నారు. ఇందులో చాలాభాగం కొట్టివేస్తే జనాని కన్నవస్త్రాల కేమీ లోపమే ఉండదు. ఈ జైలుజనంలో రాజూ, బంటూ, ధనికుడూ, దరిద్రుడూ, కులస్థుడూ, కులహీనుడూ మొదలయినభేదా లన్నీ సమసిపోతవి. అందరూ పని చెయ్యాలె. అందరికీ ఒకటే భోజనం. ఒకటే మోస్తరుగుడ్డలు. పక్కలూ ఒకేతరహావే. అందరికీ గట్టియిండ్లే. రేపనేదిగులు లేదు. పోటీలు లేవు. అదుర్దా లేదు. అసుపత్రీ, స్కూల్ కూడా ఉన్నవి. అవి ఇంకా వృద్ధి చేసుకోవచ్చు. జైలుభూములలోగాని, వృత్తులలాభములోగాని వ్యక్తిస్వత్వాలు లేవు. అన్నీ జైలువే. జైలువంటే జనాని వన్నమాట. తొంబయితొమ్మిదిమంది పస్తు పడుకుంటే, ఒకడు పండుగ చేసుకొని పిండివంటలు తినేపద్ధతులు ఇక్కడ లేవు. వ్యక్తిస్వత్వాలూ, అనవసరతారతమ్యాలూ లేని సర్వసమత్వధర్మం జైలులో ప్రతిపాదింపబడుతున్నది. అయితే జైలుకు రావడానికి

జనులకు భయ మెందుకు? యెవళ్లు భయపడుతున్నారు? బయట సోమరులుగా తిని పికార్లు కొట్టే భోగపురుషులు భయపడతారు. బయట పస్తులు పడీ పడీ వారాని కొక్కమాటయినా కడుపునిండా భోజనం లేక, చేసుకొందామంటే పని దొరకక, చేస్తే కడుపునిండక మలమలమాడే జనులందరికీ జైలంటే సంతోషమే! జైళకు పోవడంవల్ల వచ్చే అపకీర్తీ, బంధువియోగం, జైలు వెలుపల సోమారు లనుభవించే భోగమూ, కొంతవరకు జైలంటే జనులను భయపెడతవి. కాని ఈ పద్ధతి దేశజను లంతా అవలంబించి, జైలుజీవితానికి అనుబంధంగా వుండే పారతంత్ర్యం, బంధువియోగం, అల్పభోజనం, అపకీర్తి మొదలయిన లోపాలు తొలగిస్తే, జనులందరూ ఈ జీవితమందు ఉండే అసహ్యతను పోగొట్టుకొని దీనికి అలవాటు పడతారు. ఈపద్ధతిలోవుండే అసాధ్య మేమీ లేదు. ఆచరణలో పెట్టడానికి ఆటంకాలు ధనికవర్గమూ, దానిచేత రక్షింపబడే నిరంకుశప్రభుత్వమూ తప్ప, వేరే లేవు. నాధర్మం జను లవలంబిస్తే, ప్రతివాళ్లూ యథాశక్తిగా పాటుపడి, అవసరమైనంత తిని, గుండె నిమ్మళంగా రేపనే చింత లేకుండా, విద్యాబుద్ధు లభ్యసిస్తూ, పస్తులు లేని, భోగాలులేని, రోగాలులేని, నేరాలులేని, వ్యాజ్యాలు లేని, ద్వేషాలులేని స్వచ్ఛంద జీవితాలు అనుభవించడానికి అవకాశ ముంటుంది. దేవు డొక డుంటే ఇప్పు డాయన దగ్గరకు వెళ్లుతాగనా? ఈమార్గం ఆయనకు పనికివస్తుందేమో కనుక్కుంటా. స్వర్గరాజ్యం దేవుడు వచ్చి భూమిమీద స్థాపిస్తాడని కొందరు చెప్పుతున్నారు గదా? ఆ వొచ్చేదేవుడికి ఈపద్ధతంతా వ్రాసిస్తాను. అయినా ఒక్కసందేహం. దేవుడువచ్చి ఆమాట చెప్పినా ధనికు లాయనను అంగీకరిస్తారని తోచదు. ఆయన దేవుడుకాడని వాళ్లే అంటారు. శిలువన కొడతారు. బందిపోటుదొంగంటారు. ఖయిదుల్లో వేస్తారు. అప్పుడు బీదవాండ్లదేవుడూ భాగ్యవంతులదేవుడూ వేరవుతారు. రెండు సైన్యాలుగా యేర్పడి యుద్ధం చేస్తారు. అది నైతికయుద్ధం. అధర్మం నశిస్తుంది. ధర్మం స్థాపిత మవుతుంది. దయామయుడయిన దేవుడు లోకం పాలిస్తాడు. ఆయనను జనులంతా తండ్రిని ప్రేమించినట్టు అనగా, నిన్ను నేను ప్రేమించినట్టు

ప్రేమిస్తారు. అంతవరకూ అమ్మనూ నిన్ను మాత్రమే ప్రేమిస్తా. మీయిద్దరే దేవుళ్లు.

మళ్లీ మంపు వచ్చింది. రామదాసు నిశ్చేష్టుడయి వింటూ కూర్చున్నాడు. చెప్పడం అగినతర్వాతకూడా, తనకూ మగత వచ్చినట్టే కూర్చున్నాడు. ఈతడవ మగత ఒక అరగంటసే పున్నది. మళ్లీ తెలివి కొంతతగ్గే వచ్చింది. వెంకటదాసు పేజీ తిప్పినట్టు తిరిగీ ప్రారంభించాడు.

రా : నాన్నా ! నీజీవితం విచిత్రనాటకం.

వెం : అట్లాగా ? నీ అభిప్రాయం నే శిరసావహిస్తాను. నాకు మరణ మాసన్నమవుతున్నది. తెర పడబోతున్నది. రంగాలన్నీ మరుపుకు వస్తున్నవి. సూర్య చంద్ర తారకమండలాలు గుప్తికి మరుగవుతున్నవి. మన మాలకొండ, వూరగొండా, కొండవీటి కొండా, గన్నేర్లవాగూ, పల్నాటిఅడవులూ, నల్లమలవనాంతరాలూ నాకు ప్రియులయిన సతాంసులూ, తెరలోకి బోతున్నారు. ఆహా ! అమ్మో నీవూ తప్ప నాకితరప్రపంచ మేమీ గోచరం కావడం లేదు. యీ లోకంయొక్క పొలిమేరగట్టుమీద నుంచున్నాను.

అక్కడా మీ—రి—ద్ద—అంతా శమించినది. యీ శరీర ములోనుండి లోకమంతా వెలిగిన నీలకాంతిగల మహాతేజం గుప్పున ఆకాశానికి లేచింది. రామదాసుకుమాత్రం దృష్టిగోచర మయింది.

రా : నాన్నా ! నే పెంచిన శరీరం నాయెదాన పారవేసి వెళ్ళిపోయినావా ?

జవాబు లేదు. అంతా నిశ్శబ్ద మయింది. రామదాసు సమాధినిష్ఠుడయిన యోగీంద్రునివలె కూర్చున్నాడు. తర్వాత సూపరింటెండెంటుకు ఈ వార్త తెలిసి, ఆసుపత్రికి వచ్చి, నీకు కావలసినప్పుడు తల్లీకొడుకుల శల్యాలు తీసుకపోవచ్చు నని ఆర్డరు వేసి ఖననం చేయించాడు.

## 10. అహింస

మరురోజు సూపరింటెండెంటు రామదాసుకు మెడన నల్ల దారము కట్టించి 1 టో బారకాసుకు పొమ్మన్నాడు.

సూ : నీవు చేతనయినంతమట్టుకు యేదయినా తేలికపని చేస్తూవుండు. తూకువేసేవాడికి సహాయంగా వుంటావా? ప్రస్తుతం వాడికి యిచ్చే ఒకరూపాయిలో నీకొక పావులా యిప్పిస్తా.

రా : ఆ పనేమిటో నాకు తెలియదు. తాళ్లు బాగా పేనుతాను. ఆ పని చెప్పించండి.

సూ : ఖూనీచేసినవాండ్లను ఉరితీయడం.

రా : రామచంద్రా! ఇంతబతుకూ బతికి ఇంటివెనుక చావా! అయ్యా, నాకు చేతగాదాపని.

సూ : అది చేతగాకపోతే అడవలో ఈగలు చంపడానికుండు. తాడు పేనడము కఠినమయినపని. చేతులు పోతవి.

రా : వద్దు వద్దు. తాడుపని బాగా అలవాటు. నాలుగు రోజులు చేయించి చూడండి.

సూ : ఈగలపని చాలా సులభం. ముసలివాండ్లకు తగిన పని. యెండలో తిరగనవసరంలేదు. వాకిటిదగ్గర కూర్చొని వచ్చేపోయేవాటినల్లా చంపవచ్చు.

రా : నాకు తాడుపనే యిప్పించండి. చెయిదిరగా మొదటి నుంచీ పేనినవాడిని.

సూ : సరే నీ ఇష్టము. ఆ పనికే పో. చేయలేనప్పుడు చెప్పుకో మార్చుతా.

రా : చిత్తం.

రామదాసు ఒకటోబారకాసుకు పోయినాడు. రెండో వార్డులో ఒక అరుగిచ్చారు. కామానాయుడినీ, పుల్లప్పనూ, బయటపని తీసివేసి ఆవార్డులోనే ఉంచారు. ఆబారకాసులో 5 సావిళ్లున్నవి. ఒక్కొక్కదాంట్లో ఒకచిన్న కక్కసుదొడ్డి వెలుపలికి కట్టివున్నది. ఇది చాలా పూర్వోత్తరపుపద్ధతి. మల మూత్రాలకు రెండు అరలుగా వుంటవి. కడుక్కోవడానికి అవకాశంగా ఉన్నది. గదిలోవాండ్లు కనుపడరు. దాంట్లో బానలు రెంటికీ పెట్టారు. ప్రతిగదిలోను 13 అరుగులు వుంటవి. రెండుగదులకూ మధ్య గోడలో యెత్తుగా కిటికీలో రెండుగదులకూ వెలుతురు కనుపడేటందుకు లాంతరు పెడతారు. అయిదుగదులకు గాను రెండులాంతర్లు ఉన్నందున ఒకటి చీకటిగుయ్యారమే.

లాంతరులో చిన్నదీపం పెడతారు. లీలగా కనపడుతుంది. మామూలు తతంగాలు జరిగి అంతా భోజనం చేశారు. రూలు ప్రకారము ఒక్కొక్క చావిట్లో 13 గురిని ఉంచవలసినా, జన మెక్కువయినప్పుడల్లా 16 రింటిదాకా వేస్తారు. ఆ రోజు యెక్కువగా వేసిన యిద్దరూ నేలమీద పడుకొన్నారు. రామదాసుకు ఒకమూల అరుగు వచ్చినది. పాకీకుండలకు దూరంగాకూడా వున్నది. కామానాయుడూ, పుల్లప్పా నోటిమంచితనాన రామదాసుకు పక్కఅరుగులవాండ్లకు తమ అరుగులిచ్చి వాండ్లవి తీసుకొన్నారు. రామదాసుకు పారజూసుకొంటే యీ జైలు ప్రపంచములో ఆప్తులు వాండ్లిద్దరే కనపడ్డారు. బయటమాత్ర మెవరున్నారు ? బొడ్డూడని పిల్లవాడు, వెంకటయ్యా, రామానాయుడూ లోకబాంధవులు. రామదాసుకు లోకములో ప్రత్యేక బంధాలు తెగినకొద్దీ లోకబంధుత్వభావం యెక్కువవుతున్నది. సంగరహితు డయివున్నాడు. స్వార్థచింత పోయింది. పరార్థచింత బలమయింది. కేవల సన్యాసైనాడు. ఆయన విడిచిపెట్టింది బాహ్యవేషాలు గావు. ప్రపంచం విడిచి అడవికి బోలేదు. జనం మధ్యనే విజనస్థలం సమకూర్చుకున్నాడు. అరిషడ్వర్గాలు జయించాడు. ఇం కాయనకు శత్రువులేరీ ? వాచాలత్వం, వాక్పారుష్యం, హేళనా అంతర్ధాన మయినవి. మృదువాక్కులతో అప్రియం గాకుండా, హేతువు చెప్పగలడు. కొంతవరకు జిహ్వాచాపల్య ముండేది. ఉప్పు కారంలేని జైలు భోజనంచేత అదీ కట్టుబడ్డది. శమదమాదు లేర్పడ్డవి. శాంతస్వరూపు డయినాడు. తరంగ ఘోషలో శయనించిన విష్ణుమూర్తివలె పాటలూ, కేకలూ, బూతులూ చెలరేగుతున్నా నిశ్చంచలమయిన మనస్సుతో అరుగుమీద పడుకున్నాడు. పుల్లప్పా, కామానాయుడు దూరంగా కూర్చొని బీడీ తాగివచ్చి 'అయ్యా! నిదురబట్టిందా ?' అని పిలిచారు.

రా : లేదు. ఊరకనే కండ్లు మూసుకొని పడుకున్నాను. యేమిటా పిండివంట వాసన ?

పు : ఏమీ లేదు. ఖయిదీలు కొందరు భండారములోనుంచి కందిపప్పూ, నూనె తెచ్చుకొని వడలు చేసుకొంటున్నారు.

రా: బయటికి వాసన కొట్టితే వార్డర్లూరుకుంటారూ!

పు: జయిల్లో రాత్రులు ఫారావేసేది ఖయిదీవార్డర్లే. క్వారంటులోమోస్తరు కాదు. తొమ్మిదిగంటలతర్వాత ఒకరు గడియారం చూడడానికీ, మరొకరు తనిఖీకి వస్తారు. టవరులో ఇద్దరు హెడ్ వార్డర్లు మాత్రమున్నా ఫారారు రారు. ఖయిదీవార్డరు చూచినా రెండువడలిస్తే చూడనట్టే ఉంటాడు. తమకు రెండివ్వమని నాచేతి కిచ్చారు.

రా: భండారములో చోరీచేసి తెచ్చారన్నమాటేనా?

పు: ఆమాట అంటారని అనుకొంటూనే ఉన్నాను. ఏదో వాండ్ల తంటాలు వాండ్లు పడతారు. దీర్ఘశిక్షలు బొంది, చప్పిడి కూడు తింటూ నాలుక చవిచచ్చి ఎంతకాలమని వుంటారు! వాండ్ల పడైనా వాండ్ల కిస్తున్నారా అంటే అదీలేదు. భండరమంతా ఉద్యోగస్తులు దోచుకుంటుంటే, వీళ్లుమాత్ర మెందుకు తినగూడదు?

రా: యీవిషయంలో తగువు చెప్పడానికి నాకు తోచలేదు. అయినా అవి నాకు వద్దు. ఆ కమురుకం పేమిటి?

పు. అరే! అదీ ఇప్పుడే పెట్టారు. తమకు చెప్పవలసింది కాదు. కొందరు మాదిగెలు ఉడతలను ఉచ్చులువేసి పట్టుకొని ఇప్పుడు కాల్చుకుంటున్నారు. పిండివంట చెయ్యంగా నూనె మిగిలితే దాంట్లోవేసి వేలుస్తున్నారు.

రా: మీరు మాంసం తినరా?

పు: వారు ముట్టుకోరు.

రా: అయితే గారెలుకూడా వారికి పనికిరావు. మెత్తనిది పిండిలో కలిపారు.

పు: అదొకటా? వారు తీసుకోకపోవడమే మేలయింది. లేకపోతే అభాసు పనౌను. ఇవ్వే మనవాండ్లుచేసే అవకతవకపనులు.

రా: అయితే నాకూ వద్దు.

తక్కినవాండ్లు—అయ్యా మాకూ వద్దు, మాంసంగూడా తినం. పొద్దున రెండూ ఎవరికీ తెలియకుండా పారవేస్తాం.

రా: సరే బాగున్నది.

పు: మా కేమయినా మంచిమాటలు చెప్పండి. ఇక్కడ మిమ్ములను సెటిల్మెంటులో మోస్తరుగా వద్దనేవాండ్లు లేరు.

రా: మీకందరికీ తెలియనిమంచిమాట లేమున్నవి? సంగతు లందరికీ తెలుసు, వాటిప్రకారం నడుచుకోం గాని.

పు: చదువుకుంటే విశేషసంగతులు తెలుస్తవి.

రా: తెలుస్త వన్నమాట నిజమే. చదువు వేరు, సద్గుణం వేరు. ఇప్పుడు మీకు తెలిసినవి ఆచరించండి. చదువుగోనేవిషయమై సోమవారం దొర నడుగుదాం.

పు: అవును. మమ్మి నిప్పు డేమిచేయమంటారు?

రా: మీరెవ్వరూ లోలాయలవలె తిరుగకుండా మీరు చేయవలసినంతపని జేసి బయటికి బోయినా జీవనాధారంగా పనికి వచ్చేది యేదో ఒకవృత్తి నేర్చుకోండి. మీ అభిలాషనుబట్టి, ఎవ రేమిచేయవలసినదీ రేపు యేర్పరుచుకొందాం. నాకు సల్లదొర మిచ్చినా నలుగురితోపాటు దారంపేని చూపిస్తాను.

కా: రోజూ దేవుడిపేరు తలుచుకోవడం మంచిది.

రా: అవును. సాయంత్రం, ఉదయం మనమంతా గలిసి ప్రార్థన చేతాం. మనం మట్లాడుకోవడ మయినతర్వాత ఈరోజే ప్రారంభింతాం.

కా: తరువాత యేమిటి?

రా: మీకొక్కసంగతి చెపుతాను కోపపడకుండా వుంటే.

కా: మా మేలుకోసమేగదా తమరుచెప్పడం. కోపమెందుకు?

రా: స్వరాజ్యపుఖయిదీలు కక్కసుదొడ్లో తొట్టినిండా మామూలుప్రకారం నీళ్లు పోయించి ఉంచవలసిందని దొరతో చెప్పితే దొర ఆప్రకారం పోయిస్తున్నాడు. మీరు కడుక్కోవడం లేదట. అది యెందువల్ల?

కా: యెందువల్లనంటే, వీండ్లలో కొందరికి యెన్నడూ అలవాటు లేదు. పశువులమోస్తరే. తక్కినవాండ్లకు పూర్వం అలవాటున్నా జైలుకు వచ్చినతరువాత బొత్తిగా తప్పిపోయింది. వీండ్లందరికీ ఇక అలవాటు చెయ్యాలె.

పు: రాత్రిపూట మనసావిట్లో నీళ్లు లేవుగదా, దాని కేమిచేతాం? నీళ్లు లోపలికి తెచ్చుకున్నా అవి బయటికి పోయే మార్గం లేదు.

రా : వీలయినంతవరకు చూతాం. ఇంతకంటె మంచిరోజులు వస్తే ఎక్కువసంగతులు ఆలోచించుకొందాం. కేవలం అవసరమున్న వాండ్లు తప్ప రాత్రులు కక్కసుకు పోవద్దు. పొద్దున లెక్కకాంగనే పోదాం. దొడ్లో అందరికీ స్థళం వ్యవధి లేకపోతే దొరతో చెపుదాం. దొడ్డి పెద్దదయినా చేయిస్తాడు లేక పని 7½ కైనా ప్రారంభించమని అడుగుదాం.

పు : అడిగితే వినేనాథు డెవరు? ఎండాకాలంలో ఆరింటికి పని ప్రారంభిస్తారు.

కా : స్వరాజ్యపువాండ్లకు తెలియపరుచుదాం. వాండ్లు ఇక్కడ ప్రయత్నించి నిడివేరకపోతే బయటికి వెళ్లినతర్వాతనయినా పని జేస్తారు. సంగతులు యావత్తూ బయటబెట్టడం అవసరం. అందాకా ఎందుకు? స్వదేశీవాండ్లు ఇక్కడ కుళ్లంతా బయటబెడతారనేగదా వాండ్లకు అన్ని సౌకర్యాలు యేర్పరుస్తున్నారు. మనం కూడా అట్లా చేస్తే మనమాటలుమాత్రం ఎందుకు వినరు?

ఒకముసలివాడు—సరే ఇదంతా బాగానే వున్నది. నీవు చెప్పావు. మేము వినుకొంటాం. ఈగలు చంపమంటే నీవు తప్పించుకొని వూరుకొంటివి. నాసంగతేమిటి? రోజూ సాయంత్రానికి ఒక వందయినా చూపించాలె. నీవు మాంసం తినవద్దంటివి. రోజుకు నూరింటిని జంపితేగాని నాబ్రతుకు వెళ్లదు.

రా : ఇది చాలా పెద్దప్రశ్న. హింస పనికిరానందువల్ల మాంసం తినడం తప్పు. మాంసంకోసం చంపడం తప్పు. ఇదివూరికే చంపడమే. వీటివల్ల ఆరోగ్యం చెడుతుందనిగామాలె ఇంత ఏర్పాటు జేశారు. అబ్బా! నాకేమీ చెప్పడానికి తోచడంలేదు. మనుష్యులు స్వరక్షణంకోసం చేసేపని ఇది. స్వలాభంకోసం ఇతరులకు హాని చెయ్యవచ్చునా? వ్యసనిగాకుండా లోకబాధనివారణార్థం వేటాడవచ్చు నన్నారు. ఈగలు చంపడమూ దానికిందకే తీసుకోవాలె. ఫలాపేక్షారహితంగా చేయవలె నన్నమాట. ఈగలు చంపవలె ననే వాడికి వ్యసన మేమున్నది? జింకలను వేటాడి మాంస్యం దింటారు. కాని వన్యమృగాల మాంసం పనికిరాదు. ఈగలూ వూరికే చంపేవే. ఈగలు చంపడం క్రూరమృగముల వేటమోస్తరే అంధామా!

సుబ్బన్న అతనిపని తాను నెరవేర్చాడు. ఆపని ఎందుకు ఒప్పుకోవాలె. ఒప్పుకోకపోతే నీకిచ్చినపని చేయవలసిందని నిర్బంధిస్తారేమో. అయితే తన నిర్బంధం తప్పించుకోవడానికి ఇతరులను బాధించడం న్యాయమా? అంతకంటె ఉద్గ్రంథం లేదుగదా? భారతంలో యేమి చెప్పారో ఆలోచింతాం. అహింస అన్నిటికన్న ఎక్కువధర్మమన్నారు. అహింసాధర్మాన్ని పూర్ణంగా ఆచరిస్తే ఇతరుల మనసుకుగాని దేహానికిగాని నొప్పి గలిగించగూడదందున అన్ని ధర్మాలూ దీనిలోకే వస్తవన్నారు. ఏనేరం చేయడానికీ వీలుండదు. మాంసందింటే శరీరానికి అనేకవిధాల లాభమంటూ, నీకు లాభమని ఇతరులకు హానిజేస్తావా? అని భారత మాక్షేపిస్తుంది. ఈధర్మం భీష్ముడు ధర్మరాజుకు జెప్పాడు. మన ధర్మవ్యాధుడు కొత్త పంథా దొక్కాడు. ప్రపంచంలో హింస చేయనివా డెవడో చెప్పమని సవాల్ గొట్టాడు. కూరగాయలు తరిగితే వాట్లో జంతువులు చావవా అన్నాడు. చెట్లు నరికినా, మొక్కలు తరిగినా, లోహం కాచినా బాధచేత గిలగిలకొట్టుకుంటవని ప్రకృతి శాస్త్రవేత్తయయిన చంద్రవసుగారు ప్రతివాండ్లకూ ప్రత్యక్షంగా చూపించారు.

ఈయన కొత్తసిద్ధాంతంవల్ల అహింసాధర్మ మెగిరిపోయిందని కొందరంటున్నారు. అయితే మనుష్యుడు మనుష్యుణ్ణి హత్యచేస్తే తప్పా? తప్పుగాకపోతే చంపినవాణ్ణి ఉరిదీయమని చట్ట మెందుకు బుట్టింది? పెద్దచేప చిన్నచేపను తిన్నట్టు బలవంతుడు బలహీనుని జంపి వాడి ఆస్తి ఎందుకు వేసుకోగూడదు? మనుష్యమాంసంతినే అడవి మనుష్యులను హీనంగా ఎందుకు చూడవలె? రాక్షసులను క్రూరులని ఎందుకనాలె? తీసినకొద్దీ వస్తున్నది. మాంసం తినడమే కాదు, మనుష్యులను చంపడంకూడా తప్పుకాదని తేలుతుంది. హత్య తప్పని చట్టం చేసిపెట్టుకున్నారు. పైగా చంపినవాణ్ణి ఉరిదీయమన్నారు. అయితే ఇంతకూ పర్యవసాన మేమి? వసుగారి సిద్ధాంతం పూర్వపు 'అహింసా పరమో ధర్మః' అనే ధర్మాన్ని తోసివేసిందా? లేదు. తోసివేయడానికి బదులు దానిని విస్తరింప జేసింది. ఏసు మానవు లందరినీ తనతోపాటివారినిగా ప్రేమించ మన్నాడు. బైబిలులో చంపడం దోష మని చెప్పితే మాంసభక్షకులగు తదనుచరులు మానవులను చంపడంమాత్రమే దోష మని

అర్థం చేశారు. సర్వభూతములను సమానంగా చూచుకుండేవాడే పండితుడని ఉపనిషత్తు చెప్పుతున్నది. మహమ్మదీయులు మాంస భక్షకు లయినా హింస చేయకపూర్వం ప్రాయశ్చిత్తపూర్వక మయిన మంత్రం చదువుతారు. బిసిమిల్లాచేయక చంపినజంతువు మాంసమును వారు తినరు. ధర్మవ్యాధుడు వసుగారి సిద్ధాంతమునకూ కలిపే జవాబు చెప్పాడు. చంపడ మంతా హింసేనంటూ సాధ్యమయినంతవరకు హింస మానవలసిందన్నాడు. జంతువులనుగాని, ధాన్యంగాని, మొక్కలుగాని తినందే జీవిత మసాధ్య మని గ్రహించి ప్రకృతిశాస్త్రసిద్ధమైన ధర్మమునే బోధించాడు. హిందూధర్మశాస్త్రాలప్రకారం వృక్ష లతాదులనే కాక లోహములను కాల్చడమూ హింసే. అందువల్లనే లోహకారకవృత్తిని అహింస దృష్ట్యా ప్రశంసించ లేదు. ఇంకొక ధర్మసూత్రంగూడా వున్నట్లున్నది. కపిల డార్విసుల గుణపరిణామసిద్ధాంతప్రకారం మనకు కనపడేటంతవరకు మానవుడు చివరిమెట్టు. అణువు మొదలు మానవునివరకు కోట్లకొలది జన్మలలోని అనుభవం పేరి మానవుడయినాడు. అందువల్ల మానవజన్మ యెక్కువ విలువగలది. అందువల్లనే ప్రతిమతంలోనూ మానవజన్మ ఉత్తమమైన దంటారు. అందువల్లనే శిక్షాస్మృతులు మనుష్యుని జంపినందుకు ఉరిశిక్ష జెప్పి, తక్కిన జంతువులను జంపితే తక్కువశిక్ష విధించుతున్నవి. లోహాలను చంపినందుకు దోషం చెప్పినవిగాని శిక్ష చెప్పలేదు. దూడకంటె పడ్డకూ అంతకంటె గేదెకూ ఖరీదు యెక్కువగదా? అటులనే పరిణామ సిద్ధాంతప్రకారం పైమెట్టులో వుండే భూతాలు క్రింది మెట్టులోవానికంటె యెక్కువ విలువగలవి. కనుక పైమెట్టులోని వానిని జంపడం యెక్కువదోషం. అందువల్లనే ధర్మవ్యాధుడు సాధ్యమయినంతవరకు తక్కువహింస చేయమన్నాడు. మఱియు భూతము లన్నిటికీ ఒక తేవిధమైన బాధ లేకపోవచ్చు. పైకిపోయిన కొద్దీ పంచేంద్రియా లెక్కువసున్నితములయి బాధగూడా యెక్కువ వుంటుంది. వసుగారు చెప్పేప్రకారంగూడా లోహాలకు యెక్కువ వేడిసిస్తేగాని బాధపడుతున్నట్టు కనుపడదు. అత్తపత్తి కున్న స్పర్శజ్ఞానం తక్కినవానికి లేదు. వృక్షంకంటె జంతువులకు స్పర్శ

జ్ఞాన మెక్కువ. ఓషధులహింసకంటె జంతువులహింస బాధనుబట్టి యెక్కువయితీరవలె. కనుకనే శాకాహారం మాంసాహారంకంటె అహింసరీత్యా మంచిదయి ఉంటుంది. ఇంకొక సంగతికూడావుంది. మాంసవర్జనం కేవల అహింసాధర్మంమీద ఆధారపడ్డది గాదు. మనము తినే ఆహారాన్నిబట్టి మనలో సాత్విక రాజస తామసగుణాలు వృద్ధియౌతవి. మాంసంకంటె తామసగుణాన్ని వృద్ధిచేసే శాకాలనేక మున్నవి. అటువంటిశాకము లన్నీ ధర్మశాస్త్రాలు నిషేధిస్తూ, సాత్వికగుణాన్ని పెంపుజేసే జంతువులమాంసములనుగూడా చెప్పినవి. ఆ మాంసములు విశేషంగా రుచించునవిగూడా గాదు. అట్టిజంతువులూ, పక్షులూ అరుదుగూడాను. కనుక మాంసం రాజస తామసగుణాలను వృద్ధిజేస్తుందనే నిషేధించబడ్డది. కనుక జంతుహింస చేయవద్దని ఖండితంగా చెప్పవచ్చు.

అబ్బీ! విను. నేను యింతసేపటినుంచీ యోచించాను. ఈగలు చంపడం తప్పే. ఇల్లు శుభ్రముగా వుంచితే ఈగలే రావు. ఈగలు వాలడంవల్ల అనారోగ్యం వృద్ధి అవుతుం దనడంకంటె అనారోగ్యవస్తువులు ఇండ్లలో వున్నట్టు ఈగలు ముసరడంవల్ల నిశ్చయించి వాటికి కృతజ్ఞత చూపి యిల్లు బాగుచేసుకోవడం మేలు. ఈగలను చంపమనడం చిత్రంగా వున్నది. మీ రెంతమంది వున్నారు? మీ కెట్లా చిక్కుతవి?

ము: మేము ముగ్గురం ముసళ్ళం ఉన్నాం. వాకిళ్లదగ్గర నిలిచి లోపలవచ్చేవాటిని మాకిచ్చిన తోలువిసనకఱ్ఱలను ప్రయోగించి సంహరిస్తాం. చంపినవాటిని నీళ్ళపాత్రలో వేసి వుంచితే ప్రతిరోజు దొరగారు తనిఖీకి వచ్చినప్పుడు అవి తేలి పాతవో కొత్తవో పరీక్షించి దూరంగా పారవేయిస్తారు. వారికి ఈగలు చంపించడంమీద వుండే శ్రద్ధ వంటపదార్థం దొంగిలించకుండా చేయడంలోగాని, సరిఅయిన సామగ్రి యిప్పించడంలోగాని ఉపయోగిస్తే బాగుండు. మేము సోమరులమై కొత్తవి చంపకుండా నిన్న చంపినవే నీళ్ళలోవేసి తనకు లెక్కచూపిస్తామని అనుమానం. మరిన్ని చంపకపోతే మాకు శిక్షగూడాను.

కా: వీండ్లు ఈగపులులు. వీండ్లు యీగలను లేచి కొట్ట నవసరంలేదు. పుసులుగారే ముసలికండ్లతో ఒకమూల గూర్చుంటే

దారినబోయే ఈగలన్నీ దీపంలోపడే రెక్కలపురుగులవలె పీండ్ల కండ్లమీదికి వచ్చి వాలుతవి. పీండ్లలెక్కకు అవే చాలు. ఈ కంపుగొట్టే ముసలివాండ్లను వంటఇంట్లోకి రాకుండా చేస్తే ఆరోగ్యం యెక్కువ బాగావుంటుందని నా అభిప్రాయం.

అంతా నవ్వారు.

## 11. ఉరిశిక్ష

వెంకటస్వామి : కండ్లారుస్తూ – దేవరా ! ఈగలు చంపడం అనవసరమనీ, పనికిరాదనీ చెప్పారు. మరి నాసంగతేమిటి ?

రా : నీచేత యేమిపని చేయిస్తారు ?

వెం : ఉరితీయడం !

రా : ఉరితీయడమా ! చెప్పు చెప్పు సవిస్తరంగా, అక్కడ యేమేమి చేస్తారో ? ఈ పని నీ వెందు కొప్పుకున్నావు ?

వెం : స్వప్రయోజనం, స్వామిపనీ రెండూ కలిసివచ్చినవి. దుర్మార్గులను ఉరిదీయడం లోకానికి ఉపకారంగదా ? నాకూ మాఅన్నకూ తడవకు చెరి పావుసొమ్మూ ముడుతుంది. మెడకు మాడకేటున గిట్టుతుంది. చెరిసగం పంచుకుంటాం. ఇక్కడికి అయిదుసంవత్సరాలనుంచి ఒక్కటాయిన పని జేస్తున్నాం. చెరి యెనభై రూపాయిలూ వెనకబడ్డవి. దేవుడు చాలా మేలు జేస్తే, ఇక్కడ ఇంకా ఐదేండ్లుంటాం. మాది కూనీకేసులెండి, గల్లుకు తప్పింది. మాకుగూడా ఉరిజెప్పినట్టయితే ఈసంపాదనంతా ఎవరికి బోయేదో ? మాకు ప్రాప్తముంటే ఇంకొకరి కెట్లా బోతుంది ? మేము వెళ్లేలోగా ఇంకా చెరివందా అందుకోని తీరుతాం. మఱియేం జెప్పావు దీనికి ? దుర్మార్గులను అచ్చుబోసి వదలమంటావా దేశం మీద ?

రా : జన్మశిక్ష వేస్తే చాలదా, చంపకపోతేను ?

వెం : మీరు నలుగురూ వాదించుకోండి. అన్నం పున్నం ఎరుగనివాణ్ణి. ఆయన సవాళ్లకు నే నెక్కడ ఆగుతా ?

శా : మనిషిరక్తం రుచి చూచిన పులిని ఎప్పుడూ నమ్మరాదు. పంజా ఎప్పుడు విసురుతుందో.

రా : ఖయిదులో ఉంచుతారుగదా! అదిగాక యేకోప తాపాన్నో ఒకమాటు చంపారని ఎప్పుడూ అదేపని చేస్తారా? చేనుదగ్గరా, చెట్టుదగ్గరా తగాదా పుట్టే పెద్దదయి చంపుకుంటారు. ఖూనీచేసి జన్మశిక్ష పడ్డవాండ్లు అందరినీ చంపుతున్నారా? ఎక్కడ జూచినా కాంతా కనకం దప్ప ఖూనీలకు మరొకకారణం నాకు కనపడలేదు. చిన్నతగవులకే కాకుండా పెద్దయుద్ధాలకూ ఈ రెండే కారణాలు. రామ రావణయుద్ధం కాంతకోసం, భారత యుద్ధం రెంటికినీ. ద్రౌపదికి పరాభవం జరక్కపోతే ధర్మరాజు కేవలం రాజ్యంకోసం యుద్ధానికి మొగ్గేవాడుగాడు. ఉభయపక్షాలా కోట్లమరణాలకు కారణమయిన ఐరోపాయుద్ధంపై క్షేమజా లెన్ని జెప్పినా భూసంపాదనకోసమో, వర్తకంకోసమో జరిగింది. యుద్ధాలు ముగిసినతర్వాత ఇన్ని మరణాలకు కారకులయినవాండ్లను ఉరి దీశారా? న్యాయంగా విచారిస్తే లక్షలజనాన్ని ఉభయపక్షాలా ఖూనీనేరంకింద ఉరిదీయవలసి ఉంటుంది. నేలకోసం కొట్టుకొని చావడం నాగరికజాతులకు న్యాయమయితే సామాన్యజనులకు అన్యాయమెట్లయింది? భూమికోసం ధర్మరాజూ, భీష్ముడూ పోట్లాడి అక్షౌహిణీలను జంపితే, యల్లయ్యచౌదరీ, పుల్లయ్యరెడ్డీ భూమికోసం ఎందుకు చంపుకోకూడదు? ధర్మరాజునూ భీష్మున్నీ శిక్షించే నాథు డేడంటారా? పై అధికారి లేకపోయినా వాండ్లు చేసినది తప్ప నైనా ఒప్పుకుంటే చాలు. భారతకర్త అనృతదోషానికి ధర్మ రాజుకు నరకం జూపించాడుగాని, అక్షౌహిణీలను నరికినందులకు అందరికీ స్వర్గసుఖ మిప్పించాడు. చచ్చినవాండ్లకు వీరస్వర్గంగూడా వస్తుందట. ఏ ధర్మశాస్త్రంలోను యుద్ధంలో చంపినందుకు శిక్షలు చెప్పలేదు. అట్లైతే సామాన్యజనం చంపుకుంటే నేర మెట్లయింది! జాతులదీ సామాన్యజనులదీ నేరమేనని ఒప్పుకొన్నా ప్రాణానికిబదులు ప్రాణం దీయవలసిందనే ద్వేషజన్యమయిన చట్టం ధర్మాన్నాధారం జేసుకొని లేదు. దెబ్బకు దెబ్బ, డబ్బుకు డబ్బు ప్రతినేరానికీ శిక్షగా విధిస్తున్నట్టయితే ప్రాణానికి ప్రాణమనే సిద్ధాంతాన్ని ఒప్పుకోవచ్చు. ఏనేరానికీ లేనిది హత్యకుమాత్రం ఇటువంటిశిక్ష ఎందుకు విధించవలసివచ్చింది?

కా: మాలో తమప్రశ్నకు జవాబు చెప్పగలవాం డ్లెవరూ లేరు. తమరే శలవిస్తే చేతనయినంతవరకు గ్రహిస్తాం.

రా: యుద్ధం జెయ్యడం జాతులకూ సామాన్యజనులకూ తప్పే. మానవునిలోవున్న పశుస్వభావమే చంపుకోవడానికి ప్రేరేపిస్తుంది. గుణపరిణామం జరుగుతున్నా కోతి అడవిమనిషై, వాడు రాక్షసుడై, తరువాతవాండ్లు రాక్షసప్రాయులయిన జనులయి, క్రమంగాగాని మానవుడు తనపశుస్వభావాన్ని పోగొట్టుకొని దివ్య స్వరూపాన్ని పొందడు. మానవులింకా పూర్తిగా సాధువులు కాలేదు. మానవులందరూ సాధుత్వాన్ని పొందినప్పుడుగాని జాతులు గాని, ప్రత్యేకవ్యక్తులుగాని కొట్టుకోవడము పశుధర్మంగా ఎంచి సరళమార్గాలలో తగవులు పరిష్కరించుకోరు. ఐరోపాయుద్ధము ముగిసినతర్వాత ఇకమీద జాతులమధ్య యుద్ధాలు జరుగకుండా నానాజాతులసంఘాన్నొకదాని నేర్పరచి దానిద్వారా వ్యవహారాలు రాజీగా ఫయిసలు జేసుకోవడానికి ప్రయత్నం జరిగింది. ఐరోపా జాతులలో పశుస్వభావం యుద్ధాంతమందు కొంచెము వెనుకంజ వేసినా, యుద్ధబాధలు మరపుకు వచ్చి యథాప్రకారము శాంతి వ్యాపించి జనులు భోగపరాయణులు కావడముతోటే మళ్లీ యథాస్థితికి వస్తూవున్నారు. సరిసమానజాతులతో వ్యవహారాలు రాజీగా పరిష్కరించుకుంటున్నా బలహీనులను కత్తితోనే అణచి పెడుతున్నారు. కనుక మానవులలో సాధుస్వభావము వృద్ధిఅయ్యే టప్పటికి ఇంకా చాలాకాలము పట్టవచ్చు. గాంధిమహాత్ముడు సాధుమార్గాన ఇండియాకు స్వరాజ్యం సంపాదించే ప్రయత్నం జేస్తున్నాడు.

"అహింసా పరమో ధర్మః" అనే సూత్రాన్ని అనాది సిద్ధంగా ఆచరిస్తున్న భారతదేశమే ఈధర్మాన్ని ప్రతిష్ఠించి లోకానికి మార్గం చూపవలసివుంటుంది. ఈవిషయం మీరంతా బాగా గమనించండి. కేవలం స్వాతంత్ర్యము సంపాదించడమే మనప్రయత్నం గాదు. స్వరాజ్యం నిజంగా స్వర్గరాజ్యమేగావాలె. మనమార్గం రక్తసిక్తమయితే స్వర్గరాజ్యం రాదు. నెత్తురుకూడు మనకు ఒంటదు.

మన మెంత అహింసాధర్మాన్ని పురస్కరించుకొని పని జేస్తున్నా పశుస్వభావం మధ్యమధ్య పైకి వస్తుంది. స్వచ్ఛమయిన మనమార్గం బొంబాయీ చౌరీచౌరాలలో మైలబడ్డది. మహాత్ముడు మన మింకా తగినంత గురుశిక్ష పొందలేదనీ, స్వర్గరాజ్యాని కింకా అర్హులం గామనీ ఎంచి ప్రయాణం ఆపమన్నాడు. మనం మనలో దాగివున్న పశుత్వాన్ని చంపడానికే ఇప్పుడు మహాత్ముడు గుటి మైనాడు. మహాత్ముడిలోగూడా ఏమయినా పశుస్వభావం ఇంకా మిగిలివుంటే జైల్లో హరిస్తుంది. జైలుకుబోయినవాం డ్లందరూ తమలో ఉన్న పశుస్వభావాన్ని చంపుకోవడానికి, మంచి అవకాశం భగవంతు డిచ్చాడు. ఖయిదులోకి బోయిన ఇరవై అయిదువేల మందీ సాధువు లయి బయటికి వస్తే వారు మార్గదర్శకు లయి అందరినీ సాధువులను చేయవచ్చు. మన మంతా సాధువులు కాంగనే యుద్ధం గోరం. "సంధి మిచ్ఛంతి సాధవః" అనే సరళమార్గాన్నే కార్యం నెరవేర్చుకుంటాం. భారతజాతి నెత్తురుబొట్టు కార్చకుండా స్వాతంత్ర్యాన్ని పొందగలిగితే లోకమంతా అది మహాద్భుతకార్యంగా పరిగణిస్తారు. అహింసాధర్మాన్ని ప్రతిపాదించిన మన ఋషులు అప్పుడుగదా ధన్యవాదం జేస్తారు. చంపడం జాతులకూ ప్రత్యేక వ్యక్తులకూ పనికిరాదు. ఉత్తరువు ఇచ్చిన జడ్జీదీ తప్పే; ఉరిదీయించిన ఉద్యోగులదీ తప్పే. చట్టంచేసిన శాసనసభ్యులకు దోషంలో పెద్ద భాగం పందేరం చేయక తప్పదు. నీదిగూడా తప్పే. జాతులను యుద్ధానికి పురికొల్పిన పశుస్వభావమే శాస్త్రకారులను ఉరిశిక్ష వేయడానికి పురికొల్పింది. ధర్మశాస్త్రాలలో ఉరిశిక్ష కేవలం హత్యకేగాక ఇతర నేరాలకుకూడా విధించియున్నది. తక్కిన నేరాలకు ప్రస్తుతం ఉరిశిక్ష కొట్టివేసినా ఇంకా ధర్మశాస్త్రాలకు మకిలె వదలలేదు. అది కూడా తుడిచివేసి శిక్షాస్మృతులను పవిత్రం చేయవలసిఉంటుంది.

కా: అయితే జనులు హత్య చేయరా?

రా: హత్య ఇప్పుడు మానారా? క్రోధం అధికమైనప్పుడు అన్నిటికీ తెగించే చంపుతాడు. అవతల చంపి ఇవతలికి వచ్చి తాను చంపానని గర్వపడుతూ ధర్మాధికారులతో దంభోక్తులు పలికేవాండ్లు ఎందరు లేరు? అటువంటివాండ్లకు ఉరివేయడం నిజముగా శిక్షగాదు. అందువల్లనే శిక్షలేని నేర మేమంటే, హత్యనే చెప్పవలసివస్తుంది.

వాడు పశ్చాత్తప్తుడై బాగుపడడానికి అవకాశముగూడా లేదు. కుక్క కరవంగనే పిచ్చియెత్తి అందరినీ కరుస్తుందని భయపడి చంపి నట్టు, ఒకడిని చంపంగనే వాడిని ఉరితీయడం అవివేకాన్ని తెలియ జేస్తున్నది. ఖయిదులో ఖూనీనేరస్తుణ్ణి దీర్ఘకాల ముంచితేనే బాగు పడడానికి మార్గం చేయవచ్చు. తాత్కాలికక్రోధంతో చంపిన వాండ్లను, ఉరిదీయడంకంటె అన్యాయం లేదు. శిక్ష ఎప్పుడూ నేరస్తుని బాగుచెయ్యడానికి ఉద్దేశించారు. అందుచేత చంపినవాడు ఏవిధంగానూ బాగుపడడానికి అవకాశమియ్యని ఉరిశిక్ష సర్వవిధాలా నింద్యమే. కనుక యీ పాపం ఒడిగట్టుకోకుండా మీరయినా మానుకుంటే చదువుకున్నవాండ్లు జ్ఞానం మిమ్మును చూచెయినా నేర్చుకుంటారేమో? సరేగాని ఉరిదీసేచోట యేమేమి చేస్తారో వివరంగా చెప్పు.

వెం: యేముంది. మామూలుగా జరిగేదే. ఉరిదీసేయింట్లో రెండు దూలాలకు రెండు వుచ్చులు వేలగట్టి వుంటవి. మెడకు తగిలించే భాగం సులభంగా వుచ్చుజారి దబ్బున బిగుసుకోనేటందుకు మెత్తగా మైనం పూస్తారు. పూర్వం ప్రతిమాటూ కొత్త తా డుపయోగిస్తుండేవాళ్లు. ఇప్పుడు వృథాఖర్చు లేకుండా తెగకుండా వున్నంతకాలం యెన్నిసార్లకయినా వొకతాడే ఉపయోగిస్తున్నారు. కాళ్ళకిందుగా మనిషి లోతు గచ్చుగుంటలు రెండుంటవి. గుంటల మీద చెక్కలు మూతవేస్తారు. చెక్కలు రెండూ జోడించే వుంటవి. వాటిరెంటికీ బిగించి వొకప్రక్కగా మర వొకటి వుంటుంది. ఆ మర తిప్పితే రెండుచెక్కలూ వొంగుతవి. గుంట అడుగున కొద్దిగా యిసుక బోసివుంటుంది. హైకోర్టువారు ఉరిశిక్ష ఖాయం చేసిన తర్వాత గవర్నరుగారికి అపీలు చేసుకోకపోయినా, చేస్తే తోసివేసినా ఉరివేసేతేదీ నియమిస్తారు. జిల్లాకోర్టులో ఉరిశిక్ష వేసినప్పుడే మనిషి నిరాశ చెందుతాడు. అపీలులో ఉరి ఖాయ మైనతర్వాత జీవితాశే వదులుతుంది. ఈ మధ్యకాలంలో కృష్ణా, రామా అనుకొంటూ చదువుకున్నవాండ్లు భజనలు చేసుకుంటారు. రామదాసుచరిత్ర మొదలైన పుస్తకాలుగూడా చదువుకుంటారు.

రా:. ఉరిశిక్ష బడ్డవాండ్లకు కోరినతిండి పెడతారంటారే?

వెం: అదంతా లేదు. పూర్వాంసంగతి నాకు తెలియదు. నా హయాంలో అందరికీ పెట్టేభోజనమే వాండ్లకూ పెట్టుతున్నారు. భోజనానికీ, స్నానానికీమట్టుకు బయటికి దీస్తారు. హమేషా రాత్రింబగళ్లు వంతులప్రకారం ప్రతిఖయిదీకి ఒక్కొక్క వార్డరుచొప్పున ఫారా యిస్తుంటారు. భోజనానికి బయటికి తీసేటప్పుడు ఛీపువార్డరు వచ్చి బయటికి దీయించి అన్నం తనిఖీజేసి మల్లలో బెట్టించి, అపాయవస్తువు లేమయినా ఆత్మహత్య జేసుకొనేటందుకు గదిలోగాని, దుస్తులలోగాని వున్నవేమో జడితీ చేయించి లోపలికిపంపిస్తారు. సాధారణముగా ఉదయం $5\frac{1}{2}$ గంటలకు ఉరితీస్తారు. జబ్బుగావుంటే ఉరిదీయగూడదు. యెందుకనో తెలియదు. నిండుప్రాణాన్ని ఉరిదీయవలెనని ఉద్దేశ్యం గామాలె. రేపు ఉరిదీస్తారనంగా ఆ మనిషి తూకంగల యిసుకబస్తాను, ఉరితాడు ఆగుతుందో ఆగదో చూడడానికి దూలానికి వేలదీస్తారు. ఉరిదీసేసమయాన సూపరింటెండెంటు, జైలరు, మేజస్ట్రీటు, డాక్టరు, ఛీపువార్డరు హాజరులో ఉంటారు. వార్డర్లంతా చుట్టూ ఫారా వేస్తుంటారు. రేపు ఉరిదీస్తారనంగా నేను, మాఅన్నా తాడు సరిజేసి బల్లలన్నీ తుడిచి సిద్ధముగా ఉంచుతాము. ఆరోజు ఉదయం 5 గంటలకు వార్డర్లు మమ్ములను కొట్లల్లోనుంచి ఉరిమానిదగ్గరకు తీసుకొనిపోతారు. మేము వెళ్లి మళ్లీ తాళ్లుచూస్తాం. దొరగూడా తనిఖీచేస్తాడు. అంతట ఆయన ఉత్తరు వియ్యంగనే వార్డర్లు బోయి ఖయిదీని చేతులు వెనుకకూ, కండ్లకు గంతా గట్టి నడిపించి తీసుకొనివస్తారు. సాధారణంగా ఖయిదీకి ఇసుక తూకం వెయ్యడాన్నిబట్టే మొదట తెలుస్తుంది. ఆరాత్రి సాధారణంగా నిద్రపట్టదు. తీసుకుపోవడానికి ప్రతినిమిషం వార్డర్లు వచ్చి లేవమన్నట్టే వుంటుంది. తీసుకొని వచ్చేటప్పుడు సాధారణంగా నడిచే వస్తాడు. తెల్లవాండ్లంత ధైర్యంగా నడవలేరు. నడవలేక కిందబడతారు. అట్లా పడిపోయే వాండ్లు మనలో నూటికి ఒకరుగూడా వుండరు. నడిపించి తీసుకొని పోయి బల్లమీద నిలువబెట్టి జాడించకుండా కాళ్లకు తాడు కట్టుతారు. మాఅన్న ఉచ్చు సరిజూస్తాడు. నే మెడకు తగిలించి బిగిస్తే ముడి ప్రక్కకు పోయేట్టుగా పెడతాను.

రా: ఆసూత్ర మేమిటి?

వెం : అట్లయితే చప్పున బిగిసి ప్రాణం హాయిగా పోతుంది.

కా : నీ హాయి పాడుగాను — హా యేమిటోయ్ ?

వెం : ఎక్కువశ్రమపడడు. నేను తగిలించంగనే దొర ఇషారా ఇస్తే జయిలరు కాలితో మర తొక్కుతాడు. చెక్కలు రెండూ వంగుతవి. మనిషి వేలాడుతాడు.

రా : ఉరి తగిలించేటప్పుడుగాని, మరతిప్పేటప్పుడుగాని, మనిషి యేమయినా అంటాడా ?

వె : ఏమీ అనడు. ముడుక్కొని ఊరకుంటాడు. బిగుసు కుండేటప్పుడుమాత్రం కిచుక్కుమని చిన్నశబ్ద మవుతుంది. మూత్ర విసర్జనం చేసుకుంటాడు. నాలుక, గుడ్లు బైటికి వస్తవి. గుంటలో వేలాడుతుంటాడు. కాళ్లు నేలకు తగలవు. అయిదు నిమిషాలలో పని పూర్తిఅవుతుంది. అంతట తలుపులు తాళాలువేసి ఎక్కడివా ళ్లక్కడ వెళ్లుతారు. తరువాత ఏడుగంటలకు సూపరింటెండెంటు వచ్చి తాళందీస్తేనే శవాన్ని దింపి ఉరి ఊడదీస్తాను. దొర, డాక్టరు పరీక్ష జేసి చచ్చినట్టు సర్టిఫికెటిస్తారు. చచ్చినట్లు దృఢపర్చుకోవ డానికి సీలమండలవెనుక నరాలు కోస్తారంటారు గాని ఈజయిల్లో చేయరు. ఉరిదీసినవాడిచుట్టాలు కోరితే శవాన్ని స్వాధీనపరుస్తారు. లేకపోతే వైద్యవిద్యాలయాలకు విద్యార్థులు కోసి పరీక్షించుకొనే టందుకు పంపిస్తారు.

రా : దేవుడు పుట్టించి పెంచిన జీవాన్ని అయిదునిమిషాలలో నాశనం జేస్తారా ?

వెం : ప్రాణ మేమి తట్టెడా ? పుట్టెడా ? నిమిషంలో వుప్పున ఊదినట్టు గాలి ఎగిరిపోతుంది. ఇంతకూ ఆఘటానికి అట్లా వ్రాసి పెట్టివున్నది.

రా : అంతే నన్నావు. ఒక్కమాటలో తేల్చివేశావే!

వెం : కాకపోతే మరివొకరి వశమా ? శివు డెరికలేనిదీ చీమయినా కుట్టదు.

రా : ఆ. అవును. ఆచీమే కుట్టకపోతే మనిషిమాత్రం ఆయన ఎరుకలేనిదీ చస్తాడా ? పెదవులు చప్పరించి — అవునుగాని, మనుష్యప్రయత్నమే ఎక్కువ. పురుషప్రయత్నం ఆరుపాళ్లయితే దైవం రెండుపాళ్లు, వెంకటస్వామీ! నీకర్మ సిద్ధాంతం జెప్పి

నావుత్సాహం కొంత అణిచావు. కాని లోతుకు దిగి విచారిస్తే నిరుత్సాహపడడానికి కారణం లేదు. ఉరిశిక్ష ఘోరం. నీకు ఉరిదీసేటప్పుడు భయంబుట్టదా?

వెం: పిచ్చిఅయ్యలా గున్నావు. నాచేతిమీదిగా ఎనభయి మందిని ఉరిదీశాను. ఒకటీ రెండూ అయ్యేవరకూ కొంచెం పీచు పీచుమన్నదిగాని, తరువాత పరిపాటి అయిపోయింది. ఇప్పుడు ఉరిదీయడమంటే నీళ్లచర్లాటమే.

రా: అవును. ఉరిశిక్ష వేసే జడ్జీలకు, ఉరిదీయించె సూపరింటెండెంట్లకూ, మేజస్ట్రీట్లకూ, డాక్టర్లకూ, నీమోస్తరుగానే మొదట కొంచెం కష్టంగావున్నా తరువాత గడుసుపారుతారు. అనగా సున్నితభావాలు నశించి ఘట్వాయీలయినారని అర్థం. ఇంత మందికి పశుత్వమిప్పిస్తున్న ఈ ఉరిశిక్ష పోవడం అవసరము.

కా: తక్కినసంగతు లెట్లా వున్నా, అనేకమంది ఒడ్డున బడుతారు. ఎన్నికష్టాలు పడుతున్నా ప్రాణమంటే ప్రతివాడికీ తీపిగదా? అదృష్టముంటే యేజూబిలీకో బయటన్నా పడతారు.

పదిగంటలు కావచ్చింది. రెండవఫారాకూడా మారి పోయింది. మాటలసందడిన జనం చుట్టలుగూడా మానుకొన్నారు. చాలామంది గారెలు వొద్దన్నారు. కొంవరు అందరిమెదుటా తినకపోయినా తినేవస్తువు పారవేయగూడదని దాచిపెట్టుకొన్నారు. పేల్చిన ఉడతను అందరూ పట్టుబట్టి పారవేయమన్నారు. రామదాసు కొంత మనస్సంతోషంతో పడుకున్నాడు. అందరూ మెదలకుండానే పండుకున్నారు. చిటుక్కున శబ్దం, దూదికాలిన కముకంపు, కొద్దిగా పొగవాసన వస్తూనేవున్నవి.

## 12. అసహ్యమే లేదు

సోమవారం ఫయిలురోజు. ఒక అరగంటముందే కొట్లు దీశారు. దూరంగాపోయి తెచ్చుకోకుండా బ్లాకు ఆవరణంలోవున్న కొళాయిలోకే నీళ్లువచ్చినవి. చాలాసేపు తెరిచివుంచితే ఆలస్యమవుతుందని కక్కసు వెంటనేమూసి జాడుమాలీ బాగుచేస్తున్నాడు. మొగాలు కడుక్కొనేవరకు గంజిహండాలు హాజరుగా వున్నవి.

వార్డరు జీవరత్నం అందరినీ ఒంటిఫయిలుగా నిలువబెట్టించి గంజి బోయిస్తున్నాడు. రత్నం జైలు ఉద్యోగస్తులలో రాక్షసగణంలో చేరినవాడు. విడిఖయిదీ రాముడు ఫయిలులో ఒక అడుగు ప్రక్కకు తొలిగి నిలుచున్నాడు. వార్డరు బూటుకాలుతో తన్ని చోటాకర్రతో ముంజేతిమీద గొట్టాడు. కాలు నెత్తురు కారుతున్నది. చెయి కదుముగట్టింది. ఇద్దరు స్వదేశీఖయిదీలు గూడా చూశారు. వార్డరు ఒకాయనకు బీడీ లిచ్చి లోబర్చు కున్నాడు. ఒకరిద్దరు స్వదేశీఖయిదీలు దొరతో చెప్పుకోమని రాముణ్ణి ప్రోత్సాహపర్చారు. భోజనాలయినతరువాత ఆవరణమూ, గదులూ శుభ్రంగా వూడ్చారు. చాపలూ, గొంగళ్లూ, రెండేసోజత చట్టలూ, ముందు పర్చుకొని అంతా ఫయిలులో నిలువబడ్డారు. స్వదేశీఖయిదీలు, తక్కినవాండ్లూ కలిసి నిలువడానికి వీలులేదు. విడిగా నిలుచోవాలె. క్వారంటులో ఉన్నంతకాలం గొంగడి లేకుండా ఉండి కొత్తగా బారకాసులోకి వచ్చినఖయిదీ ఒకడు ఫయిలులో నిలుచున్నాడు. వార్డరు వెళ్లి దాక్కోమన్నాడు. స్వదేశీవాండ్ల ఆసరా చూచుకుని వాడు పోలేదు. మిటకరిస్తూ వార్డరు ఊరుకున్నాడు. అలవాటుపడ్డచోటాకర్ర కదిలింది గాని చెయిలేవలేదు. దొరా, జైలరూ, సర్జనూ, ఛీఫువార్డరూ ఫయిలుకు వచ్చారు. వరుసగా చూస్తూ పోతున్నారు. స్వదేశీఖయిదీలు పులుసు బాగుండ లేదనీ, రొట్టెలకిచ్చే గోధుమపిండిలో బియ్యపుపిండి కలుస్తున్నదనీ, మరికొందరు అన్నం పడడంలేదు, రొట్టె లిప్పించమనీ అడుగుతున్నారు. చిన్నఉద్యోగస్తులప్రాపకం గలవాండ్లు తాము స్వయంగా అడగనట్టు నటించి వాండ్లే అడిగేటట్టు చేసుకున్నారు. తోచిన జవాబులు చెప్పుతూ దొర వెళ్లుతున్నాడు. ఒక వెట్టిబాగులఖయిదీ స్వదేశీవాండ్లతో పాటు తనకూ రోజూ స్నానం చేయడానికి ఉత్తరువు గోరాడు. దొర సాధారణంగా తొణికేవాడు కాడు. హృదయం మంచిది. ఖయిదీ ధూర్తుగా మాట్లాడినా వాడిమీద దీర్ఘకోప ముండదు. అప్పు డేదయినా లేదన్నా తరువాత ఆలోచించుకొని యుక్తమైన ఉత్తరువు లిస్తాడు. కిందిఉద్యోగులే

ఆయనను కొంతవరకు చెడుతోవని నడుపుతారు. రాముడు సలాంపెట్టంగనే దొర ఆగాడు. వార్డరు తాను గంజి పోయించుకుండేటప్పుడు కాలిమీద తన్ని చేతిమీద కొట్టాడని చెప్పుతూ గాయాలు చూపించాడు. అక్కడికి స్వదేశీవాండ్లు దూరంలో ఉన్నారు. వాడు చెప్పినదాంట్లో గంజి అనేమాట ఒకటే దొరగారికి తెలిసింది. గాయాలుమాత్రం చూచి వార్డరువంక దిరిగాడు. గంజికీ, గాయాలకూ లంకెబెట్టి గంజి బోయించుకోబోతే రాయితగిలి పడితే గాయ మయినది యని హిందూస్తానీలో తర్జుమా చేశాడు. దొర ఓదార్చి తత్క్షణం ఆసుపత్రిలోకి తీసుకొని పొమ్మని సర్జనుకు ఉత్తరువు చేసి ఇంకొక బ్లాకుకు వెళ్లిపోయినాడు. స్వదేశీవాండ్లు వార్డరు నడిగితే తన ప్రాణంమీదికి వచ్చినప్పుడు యేదో అబద్ధమాడి తప్పించుకొన్నా నన్నాడు. స్వదేశీవాండ్లు ఏమిచేయవలసినదీ ఆలోచించుకున్నారు. స్వదేశీఖయిదీలు తప్పుజేస్తే వార్డరు రిపోర్టు చెయ్యకుండా ఊరుకున్నాడు గనుక అతనిమీద రిపోర్టుచెయ్యవద్దని చాలమంది అన్నారు. ఒకాయన మనవాండ్లు చేసేనేరాలు రిపోర్టుచెయ్యకుండా కమ్మిపుచ్చుతూ ఉద్యోగస్తులమీద మాత్రం ఎందుకు రిపోర్టు చెయ్యడమని వూరుకున్నాడు. మొత్తంమీద ఖయిదీని కొట్టినందుకూ, దొరకు తప్పుసంజాయిషీ ఇచ్చినందుకూ రత్నానికి ఉద్యోగం పోకుండా నిలిచింది. రాముడుమాత్రం ఆసుపత్రిలో ఉండి కాలిమీద దెబ్బకు నాలుగురోజులు గంజిపథ్యం జేసి కొనవూపిరితో వార్డుకు తిరిగివచ్చి స్వదేశీవాండ్లతో మాట్లాడ్డం మానివేశాడు. వార్డరు స్వదేశీవాండ్లు రాముడిని మళ్లీ రేపెడతారేమోనని రాముడికి రెండు బీడీ లిచ్చి రాజీపర్చుకున్నాడు. అంతటితో రాముడికేసు అంత్యమయింది.

ఫయిలు అయినతర్వాత అంతా చాపలుమడిచి చుట్టలు అరుగుమీద బెట్టుకున్నారు. అన్ని బారకాసులలోను ఫయిలు పూర్తిఅయింది. ఎనిమిది గంటలకు పనిగంట కొట్టారు. ఈలోపుగా రామదాసు రెండోచల్లడమూ, చొక్కా ఎవరో కాజేశారు. వెదకడాని కవకాశం లేకుండా వార్డరు ఫయిలు కూర్చోమని కేకలు వేస్తున్నాడు. రామదాసు వార్డరుతో చెప్పుకుంటే,

ఎవరికో బీడీల కమ్ముకొని పోయినవని వంక పెట్టావా? అని చోటాకట్టె ఎత్తాడు. పుల్లప్ప ఆయన చాలా పెద్దమనిషి అని చెప్పబోతే కొందరు స్వదేశీవాండ్లే చల్లాడాలు, ధోవతులు దొంగిలించి బీడీల కమ్ముకుంటున్నారని ఫిర్యాదు వచ్చింది. దాని కేమి చెప్పుతా వన్నాడు.

జీవరత్నానికి స్వదేశీవాండ్లమీద బాగా కంటు కలిగింది. వాండ్లను సాధించవలెనని పట్టాడు. స్వదేశీవాండ్లు మొదటిమోస్తరు కాదు. జన మెక్కువైనకొద్దీ అన్నిరకాలవాండ్లూ వచ్చారు. బీడీలూ, సిగరెట్లూ, పూర్తిగా తాగుతున్నారు. అల్లరెక్కువయింది. వార్డరీసంగతి దొరకు రిపోర్టుచేశాడు. సాయంత్రం 7, 8 గంటలమధ్య కాపలా తక్కువ. అంతా చుట్టలు తాగుతుంటారు. డుబ్బుజైలరూ, వార్డరులూ స్వదేశీవాండ్ల బ్లాకుమీదపడి తాళాలుదీసి సోదాలుజేశారు. ఆరాత్రి యేమీ దొరకలేదు. తక్కిన ఖయిదీలదగ్గర పొగాకు కొంత దొరికిందిగాని ఆసంగతి దొరకు రిపోర్టుకాలేదు. తక్కినవాండ్లెవరూ తాగరనీ, స్వదేశీవాండ్లు ధనవంతులు కావడంచేత వార్డర్లను లోబరుచుకొని తెప్పించుకుంటారనీ దొరకు తెలిసిన సమాచారం. స్వదేశీవాండ్లదగ్గర పట్టుబడ్డా క్రింది ఉద్యోగస్తులు బయటబెట్టరని దొర కనుమానం. ఒకరోజు స్వదేశీవాండ్లంతా స్నానానికి పోయినప్పుడు తానూ, యూరోపియన్ జైలరూ, వార్డరును తీసుకొనివచ్చి అనుమానపుమనుష్యుల పడకలు సోదాజేశాడు. ఒకరి పడకక్రింద పొడుంమాత్రం దొరికింది. అది దొరికినాయన తనదిగాదు అరుగుమీద ఎవరో పొడుం పెట్టివుంటారు. చూడక దానిమీద పక్క వేసుకున్నా నన్నాడు. పెద్దచేపలు చిక్కకపోవడంచేత దొర అంతగా ఆవిషయం గమనించలేదు. స్వల్పంగా వదిలిపెట్టాడు. ఇంకొకసారి పగలు అంతా ఉండగానే జైలరూ, తానూ వచ్చి సోదా చేశారు. ఇది వదిలేటట్టులేదని దొరకు అనుమానంగా ఉన్నవాండ్లు ప్రస్తుతం మానివేశా రని నచ్చజెప్పితే అంతట సోదాలు మానుకున్నారు. ఖయిదీలు నూటికి తొంభైతొమ్మిదిమంది పొగాకు ఉపయోగిస్తారనీ, వార్డర్లు పొగాకువర్తకం చేస్తారనీ స్వదేశీవాండ్ల

ద్వారా తెలిసింది. దానిమీద గేటులో జ్ఞానానందనాయరును జప్తీచేయడానికి నియమించారు. అంతవరకు పొగాకు బాహాటంగా సింహద్వారంగుండానే వచ్చేది. బయట పనిచేసే ఖయిదీలు సాయంత్రము లోపలికి వచ్చేటప్పుడు ఒక చేతిలో కూరగాయలూ, రెండవదానిలో బీడీలు తెచ్చుకుంటే గేటుదగ్గర కూరగాయ లిచ్చి లోపలికి అడ్డంకి లేకుండా పోవచ్చు. జ్ఞానానందనాయరు జప్తీచేయడం మొదలు పెట్టిన తరువాత గేటుగుండా విశేషంగా రావడంలేదు. చాలాభాగం రాత్రులే మూటలుగట్టి వార్డర్లు గోడలమీదుగా అందిస్తున్నారు. వర్తకం యథాప్రకారంగానే జరుగుతున్నది.

రామదాసుగుడ్డలు బోయినతరువాత పుల్లప్ప జాడాలుతీసి తమవార్డులోవున్న ఒక ఖయిదీ కిటికీకమ్ములలోగుండా అవి బయటికి విసిరితే పాకీవాడుదాచి రెండో వార్డులోవున్న ఇంకొకడి కమ్మకుంటే వాడు పన్నెండుబీడీ లిచ్చాడనీ, అవి ఉభయులూ పంచుకున్నారనీ తెలిసి వాండ్లముగ్గురిదుస్తులూ పుల్లప్ప దొంగిలించి దాచిపెట్టి వాండ్లు పోయినవని అనుకుంటే అవి రామదాసుదుస్తులను వెదకబోయినవి నాలుగూ కలసి ఎవరివి వాండ్లకు వస్తవని పుల్లప్పన్నాడు. అంతట నలుగురూ తగాదా తీర్చి ఎవరివి వాండ్ల కిప్పించారు.

పుల్లప్ప వంటపనికీ, కామానాయుడు డుబ్ జయిలరుదగ్గర సామగ్రు లందించేపనికీ, రామదాసు తాడు పేనడానికీ వెళ్లారు. పుల్లప్పకూ, కామానాయుడికి చాలా మంచిపనులు దొరికినవి. రాజుకూ, ఆంబోతుకూ, జయిలులో వంటఖయిదీలకూ అశనలోపముండదు. సామగ్రు లందించే కామానాయుడినిగూడా ఈరకంలోనే చేర్చవచ్చు. కామానాయుడుదగ్గర గోధుమపిండి తీసుకొని ఆసుపత్రిపని చేయించే ఖయిదీవార్డరు రోగుల కివ్వవలసినపాలలో నీళ్లు గలిపి మానెడుపాలూ, పంచదారా మిగిల్చి ఆసుపత్రి అడవలో క్షీరాన్నం చేయించాడు. గోధుమపిండి మిగిల్చి తరచుగా ఉపమా చేయిస్తుంటారు. కామానాయుడు తన భాగంకింద ఇచ్చిన క్షీరాన్నంలో మిగిల్చి రామదాసుకోసం మధ్యాహ్నభోజనానికి వచ్చినప్పుడు తెచ్చి ఇచ్చాడు. రామదాసు దాని పుట్టుపూర్వాం విచారించి తిన నన్నాడు. కామానాయుడు తానా పని చేసినందుకు

పశ్చాత్తాపపడి శిక్ష విధించమని రామదాసును కోరితే ప్రథమ తప్పిదంగా యెంచి ఆపూట ఉపవాసం, రెండువందలసార్లు రామనామ జపం విధించాడు.

ఆపూట భోజనంలోకి సాధకం వంకాయలపులుసూ, కొంత ముల్లంగి ఆకూ, ముదురుగడ్డలుగూడా ఇచ్చారు. జయిలులెఖ్ఖలలో ఆరుమళ్లవంకాయలు ఇచ్చినట్టు ఖర్చు వ్రాసివున్నది. దర్జాకొద్దీ దేశీయవుద్యోగులందరికీ సువారాలు పంపారు. మిగిలినవాట్లో చాలాభాగం వార్డర్లందుకున్నారు. శేషించినవాట్లో ఏరి ఖయిదీ వార్డర్లు తియ్యాన వండుకున్నారు. మిగిలినపుచ్చువంకాయలు తరిగి పుచ్చుముక్కలు తీసివేస్తే బొత్తిగా పులుసులో వంకాయలు వేసినట్టే కనపడదని ఆపాళంగానే వేశారు. ఇచ్చిన ముల్లంగాకు, ముడిగడ్డలూమాత్రం ఎవరూ అంటుకోలేదు. అంతా పులుసులోనే పడ్డది. పుచ్చుముక్కలూ, తెల్లపురుగులూ పులుసుమీాద ఈదులాడుతున్నవి. ఎగ్గులేనివాండ్లుగనుక జనం కనపడ్డపురుగు లేరి రోతలేకుండానే తిన్నారు. “క్షుధాతురాణాం నరుచిర్నపక్వం” అన్నట్టు పురుగులుంటేమట్టుకు బాగుండ కేమి జేస్తుంది? పుల్లప్ప స్వయంపులుసు తెచ్చే ఆయన నడిగి కాస్త వేయించుకొని వచ్చి రామదాసు కిచ్చి ఎట్లాగో ఆపూట తోశాడు. పుల్లప్ప అడవలోనే భోజనం జేశాడు. అతనిపని అందరిలోకి వాటంగా వున్నది. అంతా పనికి పోయినారు.

రామదాసు చెయిదిరగా తాళ్లుపేనినవాడయినా అలవాటు తప్పి చేయి వరుసుకున్నది. అట్లాగే ఒరగబెట్టి, సాయంత్రానికి నలుగురితోపాటు టాసిచ్చాడు. రూలుప్రకారం అలకంగా సగంపని చెయ్యవచ్చునని మనస్సుకు ధైర్యం దోచింది. సాయంత్రం నవ్వు మొగంతో వచ్చి పుల్లప్పతో చెప్పాడు. అంతా భోజనం చేసి ఫయిలు కూర్చున్నారు. స్వదేశీవాండ్లుగూడా కప్పలతక్కెడవలె ఫయిలు కూర్చుంటున్నారు.

ఎవరో కొట్టుకుంటున్నట్టు అరుపులు వినపడ్డవి. అడవ కెదురుగా డుబ్జైలరుఆఫీసుముందు గలభా జరుగుతున్నది. ఖయిదీవార్డర్లూ, హాజరులో ఉన్న కొందరువార్డర్లూ పరుగెత్తు

తున్నారు. ఎవరో వార్డరు వచ్చి ఒకటోనంబరుస్వదేశీవాండ్లుండే బారకాసు ఆవరణకు గేటుతాళం వేశాడు. 1-వ బ్లాకులో ఉన్న నల్లకుళ్లాయిలు స్వదేశీవాడిని కొడుతున్నారని అరిచారు. వెంకట రెడ్డిని కొట్టి మోసుకొనిపోయి ఒంటికొట్లో దోసి దిగంబరిని చేసి మర్దన చేశారు. రెడ్డి చాలాబలవంతుడు. ఛీఫువార్డరుకుకూడా దెబ్బలు తగిలినవి. జైలులో ఒకవస్తాదు ఖయిదీగా ఉన్నాడు. వాణ్ణి ఉద్యోగస్థులంతా ఇష్టమువచ్చినట్లు అడవకుపోయి తిననిస్తారు. బలవంతుడయిన ఏఖయిదీనైనా కొట్టించేటప్పుడు అతనినే ఉపయోగిస్తారు. ఇది జైలరూ, ఛీఫువార్డరూ ఆలోచించి చేసినపని. ఛీఫువార్డరు ఆదంసాహెబు స్వభావంగా క్రూరుడు. కాని జిత్తులమారి. సాధారణంగా ఎవరికీ చిక్కేవాడు గాడు. జైలరు మూలకంగా ఈ స్వదేశీవాండ్లవ్యవహారంలో ఇరుక్కున్నాడుగాని లేకపోతేదూరంగావుండేవాడు. ఇరుక్కున్నందుకు శాస్తి అయింది. కేసు బయటపడకుండా చేయడానికి ఉద్యోగస్థులంతా ప్రయత్నించారు. సాక్షుల నందరినీ తిరగదీశారు. ఒంటికొట్లలో ఉన్న స్వదేశీవాండ్లనుగూడా తిరగదియ్యడానికి జైలరు ప్రయత్నించాడు. వాండ్లు సాధ్యంకాలేదు. అయినా వాళ్లు ప్రత్యక్షసాక్షులు కారు. అడవలో పనిజేస్తున్నవాళ్లందరూ ప్రత్యక్షంగా చూచినవాండ్లే. వాండ్లు సాక్ష్యం జెప్పడానికి సిద్ధంగా వున్నారు. ఉద్యోగస్థులు ఒకండ్లనూ పలకనియ్యలేదు. దెబ్బలుతిన్నవాడు చచ్చినా కేసు ఇంతే అయ్యేది. సాక్ష్యం జెప్పించదగినటువంటి ఉద్యోగస్థులు కోరినప్రకారము పోవడానికి ఒప్పుకోనటువంటి ఖయిదీవార్డర్లను కమానెత్తారు. జైలు అధికారులకూ గవర్నమెంటుకూ అపకీర్తి వస్తుందని న్యాయమయినకేసును కమ్మీచేశారు. ఈకేసు ఫలితం ఏమయినా దీనివల్ల నేర్చుకోవలసిననీతి ఒకటున్నది. జైలు సూపరింటెండెంటుకు లోపడని ప్రత్యేక డిపార్టుమెంటు జైలులో జరిగే నేరాలను కనిపెట్టి సాక్షులను అమర్చే ప్రత్యేకశాఖ లేకపోతే జైలు ఉద్యోగులుచేసే దుండగాలు బయటికి రావు. చిన్నఘాతనేరం దగ్గరనుంచి హత్యవరకూ ఇదివరకు అనేకనేరాలు కమ్మీ జరిగినట్టే వినికి. వెంకటరెడ్డిని ఒంటికొట్టిడిలో వేసినతర్వాత బిగుబ్లాదారు.

నేరము అడవ కెదురుగా జరగనట్టే లెక్క. ఎవడయినా అడవలో వాడు సాక్ష్యం చెప్పినా విలువలేకుండా జేశారు. హాజరులో లేని సూపరింటెండెంటు తాను వచ్చినప్పుడు బిగులు ఒంటిగొట్టుదగ్గరనే వేసినట్టు వినబడ్డదని సాక్ష్యం చెప్పుతాడు. ఆయన మోతుబరి సాక్ష్యంమీద అన్ని సాక్ష్యాలు ఎగిరిపోతవి. చీకటిపడ్డది. రామదాసు వగైరాలను బారకాసులలోకి పంపి తాళాలు వేశారు. తెల్లవార్లూ సాయంత్రం జరిగిన తగాదా కబుర్లే వస్తున్నవి. ఖయిదీవార్డర్లు తలా ఒకరకంగా కబుర్లు దెచ్చేవాండ్లు. ఆరోజు మనమిత్రమండలిలో ఇతరసంభాషణ లేమీ ముఖ్యమయినవి జరుగలేదు. దైవప్రార్థన మాత్రం చేశారు. తేపావచ్చే కబుర్లు తర్కించుకుంటూ ఆలస్యంగా నిద్రపోయారు. తెల్లవారి లెక్క అయినతర్వాత కామానాయుడు కక్కసుకు పోయినాడు. రాత్రి ఒంటిగంటకే పుల్లప్పను అడవకు లేపుకొని పోయినారు. ఓవరుసీయరు ఆరోజు రెండుమాత్రపుకుండలు కక్కసుకుండా మోయడానికి ఒంతులప్రకారం మనుష్యులను యేర్పాటుచెయ్యడంలో రామదాసు ముగ్గురిలో ఒకడు కావడం తటస్థించింది. యేర్పాటుకాంగనే ఒకడు రెండుకుండలలో మాత్రం ఒకదాంట్లో పోసి ఒట్టికుండ తననెత్తిన పెట్టుకొని వెళ్లి పోయినాడు. తేలికయిన కక్కసుకుండ రెండవవా డెత్తుకున్నాడు. నిండుకడవ రామదాసుపాల బడ్డది. నీరు తొణికిసలాడుతున్నది. ఓవర్ సీయరు ఎవడో టక్కరితసం జేసి ఒట్టికుండ ఎత్తుకొనిపోయినాడని తిడుతూ పార్లిపోయేకుండను రామదాసు నెత్తిని పెట్టించాడు. మెల్లెగా నడుస్తూ కక్కసుభావిదగ్గిరకు పోయేవరకూ ఆపాదమస్తకం తడిసింది. గుడ్డలు తడిసి ముద్దయినవి. కడుకోవడానికి అక్కడ నీళ్లు లేకపోయినవి. తిరిగీ బారకాసుకు వచ్చేలోగా పుల్లప్పకూ కామానాయుడికీ జరిగినవృత్తాంతమంతా తెలిసింది. వాండ్లు వార్డరును బతిమెలాడుకొని కొళ్లాయిదగ్గిర రామదాసు స్నానం చేయడానికి ఒప్పించి చౌకా చల్లాడం తెచ్చి సిద్ధంగా ఉంచారు. రామదాసు వచ్చి,

రా : పుల్లప్పా! ఈరోజు వంతుపని చేసివచ్చా. దూరంగా ఉంటే ఆపని అసహ్యాంగా ఉండేదిగాని దిగిచేస్తే అన్ని అసహ్యాలు

పోయినవి. ఎవడివృత్తికి వాడలవాటుపడతాడు. ఇకమీద కక్కసుకుండ చూడంగనే ఉమ్మివేసి తొలిగిపోవడం మట్టుకు నాకుండదు. ఈమధ్య స్వదేశీవాండ్లంతా అధికార్లతో తగాదాపడి కుండలు మేము మోస్తామంటూ ముందుకువచ్చి పెద్దా పిన్నావరుసగా మోశారట. ప్రపంచంలో అసహ్యామంటూ లేదని నాకు స్పష్టమయింది.

పు : కండ్లనీండ్లపర్యంతమయి స్వదేశీవాండ్లంటే యేదో మాటపట్టింపుమీద చేశారు. మొయ్యవలసినజాతులు వేరేవుంటే నిన్నెందుకు మొయ్యమన్నాడు ?

రా : అందరివీ ఒంతులుగా ?

పు : ఆ కులపువాండ్లలో ఒకరొకరికి ఒంతుగాని మన కేమివంతు ? ఓవరుసీయరు టక్కరితనంజేసి ఎదట ఉన్నవాడినెత్తిన బెట్టి పంపాడు.

రా : అయితే నేమిలే. ఇదీ ఒకందుకు బాగానేవున్నది. అంతా రామమయమె. అసహ్యించుకోవలసిం దేమీ లేదు. ఆధర్మం నాకు బాగా సుబోధకమయింది.

పు : స్నానం చెయ్యండి.

రా : ఎందుకు స్నానం ?

పు : అనారోగ్యం గాదా, కంపుగొట్టుకొంటూనూ ! మాకు చెడుగాలు గొడుతున్నది. మీవద్దకు రావద్దంటారా ఏమి ?

రా : అవును. అడవులలో నివసించే అవధూతలు తమఇష్టం వచ్చినట్టుండవచ్చును గాని జనపదంలో వుండే మనబోటివాండ్లు ప్రపంచానికి ఎబ్బెరికంగా ఉండగూడదు. సాధ్యమయినంతవరకు సరియైన ప్రపంచధర్మాలే అవలంబిస్తూ పోవాలె.

పు : త్వరగా స్నానం చెయ్యండి. భోజనంవేళ అవుతున్నది.

రా : అట్లాగే పదండి.

## 13. భాగాలు

కొబ్బరితాడు పేనడంచేత బుడిపి గట్టు రాచుకొని చేతు లక్కడక్కడ ఎఱ్ఱపుండుపడ్డా రామదాసు సాయంత్రానికి టాసియ్య

గలిగాడు. యథాప్రకారం భోజనం చేసినతరువాత కొట్లుతాళాలు వేశారు. చుట్టలుతాగడం చాలావరకు తగ్గింది. చుట్టరంధి ఆచుకోలేనివాండ్లు అరుగులసందున కూర్చుని కక్కుర్తిపడుతున్నారు. కనకుండా కట్టెడుపత్తిస్తే వినకుండా వీరంగ మెట్లాగని చెకుముకిరాతి దెబ్బ లందరికీ వినబడ్డవి. అందరూ శబ్దం బుట్టినవైపున చూశారు. ఒకరిద్దరు సిగ్గుపడి క్రమంగా వారం రోజులలో మానుకుంటా మన్నారు. అన్నపుముద్దలు బీడీలకమ్ముకొని పస్తుపడుకుండే అలవాటు వదిలి కడుపుకు తింటున్నారు. పావుగంటలో అంతా రామదాసు చుట్టూ పోగయినారు. బయట పారావేస్తున్న ఖయిదీవార్డరు గుంపు పోగైనా రెందుకని మందలిస్తే లోపలవున్న ఓవరుసీయరు దేవుణ్ణి ప్రార్థన చేసుకుంటున్నా మని జవాబు చెప్పాడు. ప్రార్థించు దామని వేరే అడక్కుండానే ఓవరుసీయ రిచ్చిన జవాబునుబట్టి చుట్టూచేరిన ఖయిదీలవుద్దేశ్యం కనిపెట్టి రామదాసు తత్వాలు పాడడం ప్రారంభించాడు. కాసేపు పాడి భక్తినిగురించి చిన్న ఉపన్యాసం జెప్పుతూ భక్తి అంటె ప్రేమ అనీ, జ్ఞానం సర్వోత్కృష్ట మయిన ప్రేమకు సాధనమనీ, జ్ఞానం కుదరనిదీ సార్వజనిక ప్రేమ గలుగదనీ, పూవు సౌరభము, పండు మాధుర్యము ఇచ్చినట్టే ప్రేమ జ్ఞానానికి ఫలమనీ, ప్రేమగలిగినప్పుడే ఫలాపేక్షరహితమయిన లోక సేవ సాధ్యమవుతుందనీ, ప్రతిఫలం కోరనిది ప్రేమేనని తేలికమాట లలో ప్రేమతత్వం ఉపదేశించాడు. జనమంతా ఓపికగా కూర్చుని విన్నారు. ఉపన్యాస మయినతరువాత రోజూ రామదాసుచరిత్ర చదివి వినిపించేటట్టయితే దీపం ఈగదిలో పెట్టిస్తానని ఓవరుసీయ రన్నాడు. అందు కందరూ సంతోషించారు. తత్వాలు, భక్తి సంగతులు విన్నతరువాత ఎవరూ బూతులు మాట్లాడలేదు. బూతు కీర్తనలు పాడలేదు. ఎవరయినా అలవాటు చొప్పున నోరుజారి ఒకముక్క అన్నా పక్కవాం డ్లిశ్శోకొట్టి మాన్పేవారు. కాసేపు ఆషామాషీగా కాలంగడిపారు. తొమ్మిదిగావచ్చింది. గడియారం వచ్చిపోయింది. పెద్ద ఉద్యోగస్తులు రౌండుకు వచ్చేవేళగూడా అయింది. అందరూ గుంపుగా చేరితే బాగుండదు. తనిఖీకివచ్చే ఉద్యోగస్తుడు చూస్తే కోపపడుతాడు. ఎవండ్ల అరుగులమీదికి వాండ్లు పోదామన్నారు. అంతా తమ అరుగులమీద కూర్చున్నారు.

జయిలరు రెండుకువచ్చి వెళ్లిపోయినాడు. మళ్లీ అంతా రామదాసు చుట్టూ పోగయి యేమయినా కథలు చెప్పమన్నారు. పుల్లప్ప కథలకేమి మన జయిళ్లలోవుండే చిక్కులన్నీ ఆయనకు చెప్పకుంటే ఆయన బయటికి పోయినతరువాతనయినా నివర్తిచెయ్యడానికి ప్రయత్నం చేస్తారన్నాడు.

రా: నేను మీచిక్కులు నివర్తిచేయలేకపోయినా విందామని నాకూ కుతూహలంగానే వున్నది. ఏమయినా చెప్పండి.

పు: కామానాయుడు బండారములో జరిగే చిత్రాలన్నీ చెపితే బాగుంటుంది.

కా: అడవసంగతులు నీవు చెప్పరాదా? వాటికంటె చిత్రాలెక్కడవున్నవి?

రా: వలపక్షంలేని తీర్పు చెపుతాను. ఇద్దరూ చెప్పండి. తూలుగా పోవద్దు పొద్దు బోయింది.

కా: డుబ్‌జైలరూ, హెడ్‌గుమాస్తా, పెద్దసర్జనూ, వంటసాల వార్డరూ ఒకపార్టీ. తోడుదొంగలన్నమాట. ఇరవై పుట్ల రాగులు యివ్వాళ కంట్రాక్టరు తెచ్చి వొప్పజెప్పతాడనుకోండి, బండ్లు గేటుబయటే నిలుస్తవి. దొర, పెద్దసర్జను తనిఖీజేస్తారు. చెడగొట్టదలచుకుంటే, పెద్దసర్జను ఏదో సమిధవేస్తాడు. ఆయనను డిప్యూటీజైలరు లోకట్టుకుంటే 'యేదుమ్మయినా మంచిసరుకే. రకం తేడాలో వచ్చేలాభంలో కొంత కంట్రాక్టరుకు పోతుంది. వచ్చినబండ్లలో పదిబస్తాలు పెద్దసర్జను తిప్పివేస్తాడు. దొర లోపల వేయించమని చెప్పి వెళ్ళిపోతాడు. అంగీకరించినబస్తాలన్నీ తూకం వేయించి భండారములో చేరినట్టే హెడ్‌రైటరు దస్కతు పెట్టాలె. తోసివేసినబస్తాలుగూడా మంచివిగానే లోపలికి వస్తవి. మంచివే, వెనుకకు పంపివేస్తారు. సరుకులగదిలో రోజుకు రెండు బస్తాలవంతున మిగిల్చినరాగులు నిల్వవుంటవి. అవి యిప్పుడు లోపలికి చేర్చినట్టే లెక్కచూచుకొని రెండుమూడుబండ్లు బయటివి బయటే పంపివేస్తారు. దొర వచ్చి తనిఖీ చూచుకున్నా బస్తాలన్నీ చేరినట్టే ఉరువులు కనపడతవి. ఈ తనిఖీ సాధారణంగా జరగదు. అందువల్ల లోపలవున్న బస్తాలకంటెగూడా యెక్కువే తిరిగిపోతవి. ఆలోటు నాలుగయిదురోజులలో పూర్తిఅవుతుంది. బియ్యం

గొన్నప్పుడు బస్తాలు కంట్రాక్టరింటికి తిరిగిపోవు. జైలువెలుపల సర్కారు ఉద్యోగస్తులందరికోసం కట్టించినయిండ్లకు చేరుతవి. భాగాలులేని ఉద్యోగస్తులకు వాండ్లకుటుంబానికి కావలసినబియ్యం, పప్పు, యితరసామగ్రి పంపడం మామూలు. చింతపండు వగైరాలు ఒకటి రెండు పెండెలు బయట వుంచితే దర్జానుబట్టి, ఖర్చునుబట్టి, ఉద్యోగులంతా పంచుకుంటారు. వాండ్లకు వచ్చినసామగ్రి మిగిలితే అమ్ముకోవచ్చు. ఇండ్లదగ్గర కందిపప్పు చేసుకోవడం కష్టమని కందులబస్తా లన్నీ లోపలికే వస్తవి. మంచికందులు వచ్చినప్పుడు, ఖయిదీలు పప్పు తయారుచేసిన తరువాత బస్తాలు ఉద్యోగస్తుల యిండ్లకు చేరుతవి. ఈమోత ఆదివారంరోజున జరుగుతుంది. ఆ రోజున దొర ఆఫీసుకురాడు. కాసేపు ఆసుపత్రిచూచి పోతాడు. ఉద్యోగస్తు లారోజున నిర్భయంగా సంచరిస్తారు. వారానికి కావలసిన కిరసనాయిలూ, జైలులో ఆడే మంచినూనె డబ్బాలతో ఆరోజున ముఖ్యంగా బయటికి జేరుతవి. ఖయిదీలలో కొందరు ముసలివాండ్లుంటారు. ఒక ఖయిదీ 11-వ మారు జైలుకు వచ్చాడు. అడపాదడపా బయటికిపోతూ నలభై యేండ్లు జైలులో గడిపాడు. ఇటువంటి వాండ్లింకా వున్నారు. వాండ్లకు బయట నా అన్నవాండ్లు లేరు. జైలుఉద్యోగులే వాండ్లకు తల్లిదండ్రులు. విడుదలయినా మళ్లీ వస్తారు. పోలీసులూ కోర్టులూ వాండ్లకు మహోపకారులు. ముసలివాండ్లు వీండ్లేమి నేరాలు చెయ్యగలరని దొర పైకివ్రాసి వదిలిపెట్టిస్తానంటే వాండ్లు ఒప్పుకోలేదు. అంతట వాండ్లకు యర్రదారాలు గట్టి బతకమని వదిలిపెట్టారు. జైలులో కరుణతోగూడిందిది ఒక్కపనే. పని చేయలేకపోయినా అన్నం కడుపునిండా తింటారు. ఆదివారం పొద్దుకూకులూ, ఉద్యోగులయిండ్లకు జైల్లోనుంచి బరువులు మొయ్యడమే వాండ్లకు పని. వాండ్ల కా రోజు ఉద్యోగులు అణా బేడా బహుమతిస్తే దుకాణాలకు పోయి నీళ్ళు తాగి వస్తారు. వాండ్లకు కాపలాలేదు. ఎటుదిరిగీ పక్షులు గూళ్లు చేరినట్టు సాయంత్రానికి జైలు చేరుతారు. వెళ్లిపోతా రనే భయమెవరికీ లేదు. వాండ్లకు జైలుబిడ్డలని పేరు. ఏ ఖయిదీకి యేది కావలసివుంటే అది తెచ్చిపెడతారు. జైలులో ఏ రెక్కడయినా తిరగవచ్చు. దొరవున్న కాసేపుమాత్రం విశేషంగా బయట తిరగరు.

జైలరుకూ ఛీఫువార్డరుకూ భోజనపదార్థాలలో భాగాలు లేవు. జైలరు ఖయిదీలు తయారుచేసే వస్తువు లమ్మి లాభాలు తీస్తాడు. బహిరంగంగా అమ్మేవిగాక చెప్పులూ, బూట్లూ, చాపలూ వూళ్ళో అమ్మకమవుతుంటవి. ఖయిదీలుగూడా వార్డర్ల ద్వారా అమ్ముకొని డబ్బు చేసుకుంటారు. ఈమధ్య కొనుగోలు విక్రయాలలో నాలుగువేలు లెడితేపడ్డది. స్వదేశీవాండ్లను బాధించి ప్రభుత్వంవల్ల మెప్పుబొంది తప్పుకోవాలెనని జైలరు చూశాడుగాని రెండువందలజీతం వచ్చే ఉద్యోగానికి రాజీనామా యియ్యవలసి వచ్చింది. అంతటితో పొయ్యేటట్టు లేదంటారు.

ఛీఫువార్డరుకు భోజనపదార్థాలభాగం లేకపోయినా అతడూ పరిగేరుకుంటూనే వుంటాడు. ఖయిదీవార్డరు పనికి శిఫారసు చేసినందుకు రు 5 లు, వోవరుసీయరుపనికి రు 3 లు, మేస్త్రీకి 1 రూపాయి సాధారణంగా పుచ్చుకుంటాడు. స్థితిమంతులు త్వరగా ఖయిదీవార్డరుపని రావడానికి యెక్కువగాకూడా యిస్తారు. కొందరు ఖయిదీవార్డర్లు యీ జైల్లో రాజులు. ఖూనీకేసులలోనూ, అల్లరికేసులలోనూ వచ్చినవాండ్లు లక్షాధికార్లున్నారు. జైలులో వాండ్లకు, జరగని సౌకర్యమూ మరియాదా లేవు. వేళ్లతో పని యెప్పుడూ ముట్టరు. అధికారులకు అప్పులు బెడతారు. నజరానా యిస్తారు. ఇక్కడనుంచి దక్షిణాదికి కమా నెత్తిన ఖయిదీవార్డరు యింకా పదిసంవత్సరాలు శిక్ష జరుగవలసివుంటే సూపరింటెండెంటుగా వున్న డాక్టరుకు యెనిమిదివే లిచ్చి అనారోగ్యకారణాలనుబట్టి విడుదల బొందాడట. డబ్బు చెయ్యలేనిది లేదు. ఇంతేకాకుండా ప్రతిఖయిదీ తేలికపని యిచ్చినందుకు బహుమతు లిస్తాడు. ప్రతివాడికి జైలులోకి రాంగనే కష్టపుపని వేస్తారు. చేయి తడిగలవాడు వెంటనే తేలికపనికి పోతాడు. డబ్బియ్యలేని బీదవాండ్లే కష్టపుపని చేసుకుంటారు. డబ్బులేనివాడు దుబ్బుకు కొరగాడు. ప్రతిఖయిదీకి విడుదలయ్యేటప్పుడు దారిద్ర్యంక్రింద కొంతపైకం సర్కారువారిచ్చి పంపుతారు. ఛీఫువార్డరు ప్రతివాండ్లదగ్గరా దాంట్లోనుంచి అణాబేడ వసూలు చేస్తాడు. భాగ్యవంతులైన సాక్షులూ, అసెసర్లూ, జూరర్లూ తమకు రావలసిన భత్యాలు కోర్టుగుమాస్తాల కిచ్చి

నట్టు ఖయిదీలు ఛీఫువార్డరు కిచ్చిపోతారు. ఇవ్వకపోతే మళ్లీ వచ్చినప్పుడు చోటాకట్టెలు విరుగుతవని పాతనేరస్తులకు భయం. కొందరు విడుదలయ్యేవాండ్లు వాగ్దానాలుచేసి ఇండ్లకు పోయి పంపుతారు. వెంకటేశ్వర్ల మొక్కుబళ్లకంటె జైలు మొక్కుబళ్లు ఎక్కువశ్రద్ధతో చెల్లుబడెవుతవి. మొత్తంమీద ఛీఫువార్డరుకు భోజనఖర్చుపోను నెలకు రు. 50-0-0 ల కంటె పైగానే గిడతవి. ఆదంసాహెబు నలుగురుపెండ్లా లున్నవాడు. జోటి కెప్పుడు తక్కువవుండదు. నల్లమందుభాయీగూడాను.

రా : ఈప్రకారం ఎప్పుడూ అవిచ్ఛిన్నంగా జరుగుతుండేదేనా?

కా : ఆహా జరుగుతుండేదే. వెనుక ఒకఅయ్యరు జైలరుగా ఉండగా దొంగతనాలు సాగేవిగావు. నాతోగూడా ఒకరెడ్డి ఖయిదీ సరుకులకొట్లో పనిజేస్తాడు. స్వదేశీఆయన పెద్దయ్యగారు రెడ్డిచేత ఏఖయిదీ ఏవుద్యోగస్తుడింటికి ఏవస్తువులు మోసుకొని పోయిందీ నమూనా వేసి తయారుచేయించాడు. ఎంతసరుకువచ్చేదీ, లెక్కలలో ఎంతవచ్చినట్టు జమకట్టుకుండేదీ, తేదీవారీగా ఆరాదీసి లెక్కలు వ్రాస్తున్నాడు. వరుసగా మూడునెలల లెక్కలు తయారయినవి. ఈ సంగతి ఎట్లాగో డుబ్ జైలరు పసిగట్టి రెడ్డి నాపనిలోనుంచి తీసివేసి వేరొకపనిలో వేశాడు. ఇదివరకు వ్రాసిన మూడునెలలలెక్కలు చాలవా యని డుబ్బును పెద్దయ్య మొగాన పట్టుకొని అడిగాడుట. పెద్దయ్య కేసు పెట్టడానికి వెనుకాడు తున్నాడు. పదిమంది పిల్లలుగలవాడని, పింఛనుకు తయారు అయినాడని, ఎన్నితప్పులు చేసినా మనవాడని, కనికరిస్తున్నట్టు కనుపడుతున్నది. అదిగాక స్వదేశీవాండ్లు కేసు పెట్టరట.

రా : ఇంకా విశేషా లేమీ?

కా : సరుకులకొట్టులో ఉండేప్రతివస్తువులోనూ డబ్బు పిక్కుతూనేవుంటాడు. ఆకథ లన్నీ చెప్పదలచుకుంటే రాత్రింబగళ్లు పడుతుంది. అన్నిటికంటె ఒకచిత్రమున్నది. ఎందుకో పెద్దయ్య సందేహించాడుగాని ఒక్కచిటుకాతో డుబ్బువదిలేవాడు. పెద్దయ్య తనగదివాకిట్లో వుండి చూస్తే డుబ్బుఆఫీసు కనుపడుతుంది. వారం వెళ్లిపోంగనే డుబ్బుఆఫీసుకు ఆడవార్డర్లు వస్తుంటారు. పెద్దయ్య డుబ్బుకు పగవాండ్లను దగ్గరకు దీసి సంగతు లన్నీ రాబట్టాడు.

అయ్యగారు ఒప్పుకుంటే వార్డర్లూ రెడ్డీ కలిసి తలుపు తాళం బెట్టాలనే. ఆయన ఇది అసహ్యాపుపని అంటాడు. వార్డర్ల పెద్దయ్యను మెడలు విరుస్తున్నారు. ఆయన సాక్ష్యం లేకపోతే కేసు నిలువదు. డబ్బుపార్టీవాండ్లు తలుపుదీసి దొర వచ్చిన తరువాత అంతా పట్టి దంటారని వార్డర్లభయం. పెద్దయ్య ఒక్కముక్క సాక్ష్యం చెప్పుతానంటే అంతా బందవుతుంది. ఇట్లా అనుకుంటుండంగనే ఆయనను ఇంకొక బారకాసుకు మార్చారు.

జైలులోనే ఇటువంటిసంగతులు జరుగుతుంటే ఇంకా యేముంది ?

రా : చివరకు మనకథ రంకుపురాణాలక్రిందికి దిగింది. ఇక పుల్లప్ప కథ విందాం.

కా : అవును. మార్పులలోనే మధుర మున్నది. పుల్లప్పా! ఇక నీకథలు కానియ్యి.

పు : అతనికథలు పూర్తి కానియ్యండీ. నావి ఇంకొకమాటు విందురుగానీ. అయినా అంత రసవంతంగా ఉండవు.

రా : కామానాయుడు శృంగారరసంతో అంత్యంజేశాడు. ముంతఖర్జూరం తిన్నతరువాత చింతపండు బాగుండదు.

పు : నాకథ రేపు సాయంత్రం చెప్పుతా.

రా : సరే. అట్లాగే కానీయి. పొద్దుబోయింది. కామానాయుడు కథపెంచాడు.

## 14. జైలు విశేషాలు

మరురోజు రామదాసు యథాప్రకారంగా టాసియ్యగలిగాడు. ఈరోజు ముఖ్యంగా గమనించదగింది ఒక్కవిషయంమాత్ర మున్నది. వెనుక వోధ్రఖయిదీ ఒకడు ఈజైలులో కొద్దికాల ముండి పోయినాడు. విడుదలయ్యేటప్పుడు ఒక వార్డరుకు డబ్బు పంపిస్తానని వాగ్దానం చేసి పోయినాడు; పంపలేదు. తాను మళ్లీవచ్చినా ఈజైలు కెందుకు పంపుతా రనుకున్నాడు. మళ్లీ దీర్ఘశిక్ష పడి కర్మంజాలక ఈజైలుకే కమా నెత్తారు. అతనిని వెనుకటివార్డరు ఛీఫువార్డరుతో మాట్లాడి తనదగ్గరనే పనికి వేయించుకున్నాడు. మొదటిసారి విడిఖయి దనుభవించడంచేత వోధ్రుడు పనుల

కలవాటుపడలేదు. పని చేయించడంలో వార్డరు చెప్పేది ఉరియావాడి కర్థ మయ్యేది కాదు. చెయ్యమన్నాడో, ఒద్దన్నాడోకూడా తెలియకపొయ్యేది. వార్డరుఛోటాకర్రైట్టి ఎప్పుడూ వాడివొంటిమీద ఆడుతూనేవుండేది. పైకంకోసం ఇంటికి వ్రాస్తే జవాబు రాలేదు. పగలల్లా దెబ్బలు. ఒకరితో మాట్లాడేందుకైనా బాస గాదు. జీవితం దుర్భరమైంది. ఈరెండుకారణాలు చెప్పి దొరను కమానెత్త మని ఫైలులో రెండుమాట్లడిగాడు. వాడు చెప్పేది ఎవ్వరికీ తెలియలేదు. సూపరింటెండెంటు తలవూచి వెళ్లిపోతూ వచ్చాడు. వీడికి ఒకటి రెండు హిందీముక్కలుమాత్రం వచ్చును. చచ్చిపోతా నని దగ్గరవాండ్లకు చెప్పి చింతమానెక్కి అక్కడినుంచి అందరికీ దణ్ణాలుపెట్టి కింద బడతానని సైగజేశాడు. మొదట వట్టిదే అనుకున్నారు. గట్టిదని తెలిసి ఖయిదీవార్డరూ, వార్డరూ బిగుళ్లూదారు. దొర పరుగెత్తుకుంటూ చెట్టుదగ్గరకు వచ్చేవరకు ఓఢ్రుడు చేతులు వదిలిపెట్టి దొరకు పదిగజాల దూరంలో పడ్డాడు. ఒకచేతి ఎముకలు నుజ్జునుజ్జు అయినవి. ఒళ్లంతా హూనమైంది. సూపరింటెండెంటు భయపడి పరుగెత్తాడు. వ్యవహారం విచారణలోకి రాలేదు. జరిగింది నేరమే అయినా బయటికివస్తే పాలన బాగుండలేదంటారని యావత్తూ కప్పిపుచ్చి వురియాను ఆసుపత్రిలో ఉంచి ఎముకలు కట్టుకున్నతరువాత ఎక్కడికో కమాను పంపారు. ఆరోజుసాయంత్రం యథాప్రకారం కొట్లు మూశారు. ఆసుపత్రిలో ఒక రోగి ఆరోజే కాలంజేశాడు. పీనుగ మంచంమీదనే ఉన్నది. కాలు కిందికి వ్రేలాడుతున్నది. చిన్నసర్జను ఆస్పత్రికి వచ్చి శవముతో సరసాలాడాడు. ఆరోజు ఉదయం దొర చూడవచ్చినప్పుడు గోధుమరొట్టె పెట్టించమని అడిగాడుట. నంజు గోధుమరొట్టె తింటే నయమవుతుందని వాడి ఆశ. ఖయిదీకిమాత్రం ప్రాణం తీపిగాదా? చిన్నసర్జను పీనుగను ఒరే నాయనా! నీకు రొట్టె పెట్టించేదటరా అని బుజ్జగించి అడిగాడు. అది పలుకలేదు. వైద్యుడు కోపమువచ్చి బూటుకాలితో వ్రేలాడే కాలు తన్ని, పలుకవేమిరా అని బెదిరించాడు. అన్నీ భగవంతుడే విచారిస్తాడనిగామాలే శవము దానికి జవాబు చెప్పలేదు. వెళ్ళిపోయినాడు.

ఆసుపత్రిలో బ్రతకడంకంటె చావడమే యెక్కువ అసహ్యం. బొంగులకు కట్టిన గోనెపట్టలోకి పీనుగను దోసి వాహకులు ఓహోం, బీబీం అని నవ్వుతూ మోసుకొనిపోయినారు. దొర దగ్గరవుంటే మెదలకుండానే మోస్తారు. స్వదేశీ ఉద్యోగస్తు లివి గమనించరు. శవాన్ని ఎట్లా మోసుకొనిపోతేనేమని సర్జను ఒక స్వదేశీఆయనకు జవాబు చెప్పాడు.

రోజూ ప్రార్థనచేయడం మామూలు అయింది. రామదాసు మంచినడతనుగురించి కొంతసేపు చెప్పినతరువాత పుల్లప్ప దూరంగా పోయి కూర్చున్నాడు. ఉపన్యాసం ముగించి పుల్లప్ప ఏడని రామదాసడిగితే కామానాయుడు నిన్న నాచేత కథ చెప్పించుకొని ఇవ్వాళ తాను చెప్పబడుతుందని ఏ అరుగులసందునో తొంగా డన్నాడు.

రా : అబ్బాయీ! ఆపప్పు లుడకవు. ఇట్లావచ్చి నీకథ చెప్పు.

పు : ఈపూట నాకు సుస్తీగా ఉందండీ, రేపు చెపుతాను.

రామ : స్వస్తిగావుండే మార్గం నే జెపుతా రా.

పు : దగ్గరకు వచ్చి—చెప్పండి.

రా : (మొగము తేరిపారజూచి) ఒకనవ్వు నవ్వు.

పు : నవ్వి, తల పక్కకు తిప్పాడు.

రా : పోయింది, పో.

పుల్లప్ప స్వస్థుడైనాడు. అంతా ఆశ్చర్యపడ్డారు. కథ ప్రారంభమైంది.

పు : అనంగనంగా ఒక సెంట్రలుజైలు. అంతా నవ్వారు.

రా : కథానాయకుడు పుల్లప్ప ; కానియ్యి.

పు : కుసిసీలో పనిచేసే వార్డరుదగ్గరనుంచి ఖయిదీదాకా అమ్ముకుండేవాండ్లే. పైవాండ్లు డబ్బులకమ్ముకుంటే ఖయిదీలు బీడీల కమ్ముకుంటారు. జయిలుధరలప్రకారం కానీకి రెండు అన్నాలు. అన్నానికి నాలుగు బీడీలు. అన్న మిస్తే రాగిరొట్టె ఇచ్చి రెండు బీడీ లిస్తారు. గోధుమ రొట్టెకు పన్నెండు బీడీలు. అడవలో పని చాలా కష్టం. అహోరాత్రాలు హండాలు పొయిమీదనే వుంటవి. రెండువేలజనానికి గంటలప్రకారము మూడుపూటలా అన్న మమరాలె. అడవవాడు రాతిసగణములోవాడయితేగాని నెగ్గలేడు.

ఫోటోకొట్టె ఎప్పుడూ ఆడుతూనేవుంటుంది. కాపలా బాగాచేయకపోతే ఖయిదీ లంతా అమ్ముకుంటారు. వార్డరుదగ్గిర కొనేవాండ్లే వుండరు. ప్రతిపూట తూనికలో యేడన్నాల కొక అన్నం, యేడు రొట్టెల కొకరొట్టె పిక్క మిగులుస్తారు. మూడుపూటలా లెక్కజూస్తే ఎంతపెచ్చు వస్తుందో చెప్పవచ్చు. రెండువందల ఏబదిమందికి రెండుపూటలకూ సరిపొయ్యే ఆహారం మిగులుతుంది. వీటిలో కొందరు, వార్డర్లు పూరికేనే తింటారు. ఛీపువార్డరుఇంటికి రోజూ మధ్యాహ్నం పన్నెండు పోతవి. ప్రైవేటుగా రాగిరొట్టెలు ఖర్చయ్యే అన్నాలలోను పేస్తరులో శేషించినదానిమోయిను మొదట బియ్యామియ్యడమే తగ్గిస్తారు. ఇంతమందికి సరిపడేపప్పూ, ఉప్పూ, కారమూ, తక్కిన మసాలావస్తువులూ మిగులతవి. దొర ఎప్పుడయినా తనిఖీ చేస్తూనే ఉంటాడుగాని దొరలు గుడ్డిదొరలు. దీనిని పట్టుకోవలెనంటే మనవాండ్రే పట్టాలె. ఇప్పుడున్న మనఉద్యోగస్తులలో న్యాయస్తు డొకడూ లేడు. స్వరాజ్యం వస్తే పెద్దయ్య ఇవన్నీ మారిపోత వంటాడుగాని నాకు నమ్మకం లేదు. ఈమధ్య స్వదేశీ వాండ్లను కొందరిని అడవలో చేరిస్తే వాండ్లూ కొందరు తక్కినవాండ్ల పాటే అయినారు. సిక్కులు అడవలోకి రొట్టెలు చేసుకొనేటందుకు వచ్చారా అంటే అందరికీ హడలు. వార్డర్లు యేమయినా యెత్తుకొని పోతుంటే చెవి పట్టుకొని దొరదగ్గరకు లాక్కొనిపోతా మంటారు. వాండ్లున్నంతసేపు యేదొంగతనమూ జరగదు. అడవలోకి పోయే స్వదేశీవాండ్లు గట్టిపనిచేస్తే చాలా ఉపయోగమయ్యేది. వాండ్లేమీ చెయ్యలేకపోయినారు. తగినవాండ్లు పోలేదు.

గంజి గాచడానికి తలకు నాలుగౌన్సులరాగిపిండి గోధుమపిండి బియ్యమూ యిస్తారు. గంజిమోయినులు సాయంత్రము తీసుకొని వంట రాత్రి పన్నెండుగంటలకు ప్రారంభించి గంజిగాచి ఉదయం ఆరుగంటలయ్యేవరకు హండాలు బారకాసులకు తెస్తారు. గంజి తనిఖీచేసేవాం డ్లెవ్వరూ లేరు. మనిషికి బియ్యంగానీ, పిండిగానీ, రెండు అవున్సులమాత్రమే గంజికి ఉపయోగిస్తారు. తక్కినదంతా ఉద్యోగస్తుల లెక్కకిందనే జమ.

శా: ఈ దొంగతనాల కేమి. లంచాలు తక్కిన ఉద్యోగస్తులు మట్టుకు తినడంలేదా ? ప్రతిడిపార్టుమెంటూ యీలాగే యేడుస్తుంది.

పు: అయితే ఒక భేదంమాత్రమున్నది. లంచం యిచ్చేవాడు కొంత ప్రతిఫలం పొందుతాడు. డబ్బున్నవా డిస్తాడు. లేనివాడు మానుకుంటాడు. జైలులో ఖయిదీలు చేసేవస్తువులమ్ముకొని జైలరు లాభము తింటే సర్కారు సొమ్ము హరించినట్టే. మనకు నష్టంలేదు. ఖయిదీలకు సర్కారువారిచ్చేపడే తక్కువ. సాధారణంగా నాజూకుగా తినేవాండ్లకుకూడా సరిపోదు. ఉప్పుకారంగూడా స్వల్పంగా ఇస్తారు. ఈ అర్ధాన్నంలో విద్యాధికుల మని పేరు బెట్టుకుండేవాం డ్లంతా చౌర్యం జేసి సగానికి సగం హరించడం కేవలం అన్యాయం. వంటయింట్లోకి వచ్చేవరకే చాలా భాగం హరింపవుతుంది. వచ్చి వండినతర్వాత నోరుగలదేవుళ్ళకు ముందు ప్రొముక్కలు చెల్లాలె. ఖయిదీవార్డ ర్లందరూ ఉదయం సాయంత్రం రెండేసి అన్నాలు తీసుకొనిపోతారు. వార్డర్లలో హాజరు వున్నవాండ్లంతా అడవలోనే భోజనం చేస్తారు. తక్కిన ఖయిదీలలో నెలకు పావలా యివ్వగలిగిన ప్రతిఖయిదీ రెండేసి అన్నాలు తెప్పించుకొంటాడు. వంటవాండ్లూ, వడ్డనవాండ్లూ తిన్నంత దిని బీడీల కమ్ముకుంటారు. రెండు బీడీలు అడవకు పట్టుకొని వచ్చిన ప్రతివాడికీ వొక అన్నం చేతికిస్తారు. ఇవన్నీ పోగా తక్కిన అన్నంముద్దలు వొట్టి దరిద్రగొట్టు ఖయిదీలకు పంపుతారు. వేలు జీతాలు తినేవాండ్లేగాని యిది విచారించేవా డెవడూ లేడు. ఖయిదీలదగ్గరకు వచ్చేవరకు పులుసు వట్టి నీళ్లుగా వుంటుంది. నీళ్ళలో ముక్కలూ కూరా దేవుకుంటారు. పయినుంచి కింది దాకా యెవరు చూడబోయినా దొంగే. వంగి పనిచేసేవా డెవడూ లేడు. అంతా వట్టిబూటకం. రూలుప్రకారం ఐ. జీ. సంవత్సరానికి ఒక్కమాటూ, సూపరింటెండెంటు వారాని కొకమాటూ, జైలరు ప్రతిదినమూ ప్రతిఖయిదీని చూడాలె. దొరమాత్రం వారాని కొకమాటు ప్రతిఖయిదీని చూశా ననిపిస్తాడు. అందరినీ వరుసగా నిలుచోబెట్టి చూస్తూపోతాడు. తనిఖీవార్డర్లు దొర చూడడానికి వచ్చినప్పుడు,

యేమీ చెప్పుకోకూడదనీ, దానికి వ్యతిరేకముగా వర్తిస్తే కట్టె విరుగుతుం దనీ చెపుతారు. అందువల్ల యెవడూ నోరెత్తడు. స్వదేశీవాం డ్లున్న బ్లాకులో మాత్రం ఖయిదీ లప్పుడప్పుడు ధైర్యం చేసి దొరను యేదయినా అడుగుతున్నారు. తక్కిన బారకాసులలో కిమిన్నాస్తి. నో రెత్తగూడదు. ఫయిలుకు పోయేటప్పుడు జైలరు సూపరింటెండెంటు వెంట తిరుగుతాడు. అంతకు మిక్కిలి సాధారణంగా యెవరినీ చూడడు. కార్ఖానాలలోకి అప్పుడప్పుడు పోతుంటాడు. ఇది అంతా యెందుకు! మొన్న ఇనస్పెక్టరు జనరలు వచ్చి యెంతమందిని చూచాడు? ఆఫీసులో కూర్చొని చుట్టుదిరిగి పోయినాడు. స్వదేశీవాండ్లు స్నానానికి పోంగా చూచి వారి బారకాసుకు వచ్చి వొకరిద్దరు స్నానానికి పోనివాండ్లను చూచి పోయినాడు. ఐ. జీ. గారే యింతగా చూస్తే జైల రెంతగా చూస్తాడు! సర్జను జనరలుగారు వస్తాడని గడబిడగా చెప్పుకున్నారు. మోటారు మీద ఆసుపత్రికి వచ్చిపోయినాడుట. ఆసుపత్రిలో వున్న నోరుగల స్వదేశీఖయిదీ పడుకుండేగదికి బయట తాళంవేశారు. యెందుకో ఆయనకు తెలియదు. తీరా విచారిస్తే సర్జను జనరలు వచ్చిపోయినాడని తెలిసింది. ఇదంతా దొర చేయించాడనిగాని ఆయనకు తెలుసుననిగాని అనడానికి వీలులేదు. ఇవి బయటికి వస్తే దొరకు మాట వస్తుందనీ, అందువల్ల ఆయనకు ఆగ్రహం రావచ్చుననీ భయం. ఇదంతా సంస్కారం కావలెనంటే జాతిలో నీతివర్తన యెంత అభివృద్ధి కావలెనో ఆలోచించుకోండి. స్వదేశీవాండ్లల్లో ఈ దోషం తగులనివాం డ్లెందరో నాకు లెక్కబెట్టి చెప్పు. రేపు వాండ్లను జైలు ఉద్యోగులనుగా ఏర్పాటుచేసినా ఇంతే పని జరుగుతుం దని నా అభిప్రాయం.

రా : నిట్టూర్పుతో ఈ కథింతటితో ఆపి, రెండువేల జనానికి భోజనపు ఏర్పాటుకు ఎంత పెద్ద ఏర్పాట్లు చేసివుంటాఁవో నా కాశ్చర్యంగా ఉన్నది. అవి కొంచెం వర్ణించి చెప్పు.

పు : పూటకు పది పదునాలుగువందల రాగిరొట్టెలు కాలుస్తారు. నాలుగుగజాల పొడుగునా, గజమెత్తునా గోడవెంబడి గాడిపొయ్యి గట్టి పక్కగుండా మానులు నరికి పొయ్యిలో పచ్చివే పడవేస్తారు. ఇల్లంతా పొగ కమ్ముకొని మనుష్యులు నిలువడానికి వీలులేకుండా

వుంటుంది. యేరోజు కావలసిన వంటచెరుకు ఆరోజు చెట్లు పడనరికి వెయ్యడమే. ఇంతమందికి వంట ఎందుకట్టెలు లేకుండా ఎట్లాచేస్తా రని ఉద్యోగు లనుకుంటారో తెలియదు. వంటచేసే ఖయిదీలు బాధలు చెప్పుకున్నా వినేవాండ్లులేరు. ఈ పెద్దపొయ్యిమీద నాలుగుగజాలు పొడుగూ, గజం వెడల్పూగల ఇనపపెనం వేస్తారు. ఒక్కొకసారి వందరొట్టెలు కాలుతుండవచ్చు. నాలుగు వరసలుగా నాలుగుగజాల పొడుగునా వేస్తారు. నానినపిండి కొల్చి ముద్దలు చేసేవాండ్లూ, రొట్టెలు తట్టేవాండ్లూ, పెనంమీదవేసి నీళ్లు జల్లే వాండ్లూ, తిరగవేసేవాండ్లూ విధీ విరామం లేకుండా పనిజేస్తూనే వుంటారు. ఇంకొకచోట మధ్యపొగబోయే చిమ్నీ, మూడువయి పులా గోడలుబెట్టి ఒక్కొకవయిపున రెండేసిపొయిలూ వుంటవి. ఒకవైపున అన్నం, ఒకవైపున పులుసూ, ఒకవైపున పప్పూ ఉడుకుతుంటవి. యీబైశేర్లు వుడికే గంగాళాలలో వండుతుంటారు. గంగాళాలచెవులలో బొంగులుదూర్చి ఇద్దరు భుజాన బెట్టుకొని ఉడికిన హండాలు దింపుతుంటారు. గాడిపొయిలలో పచ్చిమానులు పడవేస్తుంటే పొగసే అగ్గికి ఎండి కొంతసేపటికి గణగణలాడుతూ మండుతుంటవి. వంట అయిన తరువాత లెక్కప్రకారం ఏవార్డుకు పోవలసినభోజనం అక్కడికి పంపుతుంటారు. అన్నం ముద్దలు గొట్టడంలో చాలా చాకచక్యం వుంటుంది. అదిమి గొడితే అన్నం ఎక్కువ పడుతుంది. తేల్చికొడితే పెద్దముద్దలలో రెండేసిఔన్సులు మిగుల్చుకోవచ్చు. తగాదాలు పెట్టేవాండ్లున్న బారకాసులలోకి తక్కువ ముద్దలు పంపరు. మొత్తంమీద మెత్తనివాండ్లున్న బ్లాకులలో యేపిచ్చముద్దలయినా చలామణి అవుతవి. హండాలలో కాస్త గంజెక్కువ వుండేటట్టు ఎసరుపోస్తే ముద్ద సఖువవుతుంది. ఎంత పెద్దదొరనయినా కండ్లుమూసి తూనిక చూపించవచ్చు. ఇదంతా పరీక్షించి కనుక్కొండేవాడు లేడు. దొరకు ప్రయత్నించినా కనుక్కోవడం సాధ్యంకాదు. ఎక్కడ నొక్కాలెనో ఆయనకు తెలియదు. నొప్పి లేనిచోట వత్తితే డాక్టరు కేమి తెలుస్తుంది! జయిలు బాగుచేయవలె నని ప్రయత్నించడం నిష్ప్రయోజనం. వలుగురు బయటివాండ్లూ చూడడానికి వీలులేకపోవడమే కారణం.

ఖయిదీలకు ఉద్యోగస్తులను పరీక్షించే అధికార ముంటే వాండ్లు అదుపులో ఉండరనీ, బయటివాండ్లకు స్వేచ్ఛగా ఖయిదీలతో మాట్లాడి సంగతులు తెలుసుకొనే వీలుంటే కారాగృహముయొక్క భయమే పోతుందనీ ఎంచడంమూలంగా జయిళ్లు పాడవుతున్నవి. యీఅభిప్రాయాలకితోడు, మంచివర్తనగలవాండ్లను వీరి ఉద్యోగాలకు నియమించకపోవడం మరియొకలోపం.

రా : ఖయిదీలకే జ్ఞానం కలిగించి వాండ్లవల్లనే ఈఅక్రమాలు అణచాలె.

కా : వాండ్లను పశువులుగా నుంచినంతకాలం వాండ్ల నణచడానికి శస్త్రే సాధనం. కాని వాండ్లకు జ్ఞానం వృద్ధిజేస్తే మాటలచేతనే అదుపులో వుంచవచ్చు.

పు : అధికారం చేతులో వున్నవాడల్లా దొంగే అవుతాడు.

రా : పుల్లప్పా! నీవు సర్వం అనర్థమేననే సిద్ధాంతం అవలంబిస్తున్నావు. ప్రపంచాన్ని అన్నివిషయాలా ఆదృష్టితో చూడడం తప్పు. నాకుకూడా మనస్సుకు కష్టంగా వుంది. బాగుచేసేభారం భగవంతుడిది. మనకు దిగు లెందుకు? మనధర్మం మనం చేస్తేచాలు. మిగతాది ఆయనే జాగ్రత్తపెట్టుకుంటాడు. పోయి పడుకోండి.

## 15. మార్పు

రామదాసుకు జయిలుజీవితం కొత్తబాసింది. మొదట ఎబ్బెరికంగా ఉన్నా పద్ధతులన్నీ పాతగిలి సాధారణ మయిపోయినవి. రేపులూ మాపులూ రాటపాకులవలె క్షణంలో తిరిగివస్తున్నవి. మొదట ఉత్సాహంగా తాను ఇవ్వవలసినదానికంటె ఎక్కువపని చేస్తూ మొదటిరకంటాసు యిస్తున్నా కొన్నాళ్లకు విసుగెత్తి నల్లదారపువాండ్లతోపాటు పనిజేస్తున్నాడు. ఎండలు బాగా ముదిరినవి. సంవత్సరాది వెళ్లిపోయి చైత్రమాసం జొరబడి సగపడ్డది. రామదాసు క్వారంటులోనుంచి ఆసుపత్రికి రావడం, వచ్చినవెంటనే పిల్లలమరణవార్త వినడం, మాలక్ష్మి వెంకటదాసూ పోవడం, ఒకదానివెంట ఒకటి తగిలినవేలికే తగిలినట్టు సంభవించి ఇతరచోక్యాలేమీ పెట్టుకోలేదు. వీరదాసూ, రంగదాసూ మొదలయినవాండ్లు నిడదవోలు

జయిల్లోనే మూడోబారకాసులో వున్నా రామదాసు వచ్చినసంగతి గాని, ఆతనికి వచ్చిన విపత్తులనుగురించిగాని వినలేదు. తక్కెళ్ల జగ్గడు వచ్చి చనిపోయినాడని విన్నారుగాని అతడు తమవెంకటదాసే నని యెరుగరు. ఒకటవ బారకాసులో పుల్లప్పా, రామదాసు కలుసుకున్న తరువాతకూడా వాళ్లతో మాట్లాడడం పడలేదు. మూడవ బారకాసులో వంచెలున్నవని అక్కడి కెవ్వరినీ పోనియ్యడం గాని, అక్కడి వాండ్లను ఇతరబ్లాకులకు రానివ్వడంగాని లేదు. నాలుగవబ్లాకులో వంచెలు ముమ్మరమై ప్రతివాండ్లూ ముజిడ్డుగా పడిపోవడంచేత పొయ్యనివాండ్లను అక్కడనుంచి తీసి ఇతరచోట్లకు సర్ది నాలుగవబ్లాకును ప్రత్యేక ఆసుపత్రిగా చెయ్యడంలో పుల్లప్ప ఛీఫువార్డరుతో యేదో తంత్రంజేసి మంగళాపురపువాండ్లను ఒకటవ బ్లాకులో వేయించాడుగాని తమసావిట్లో వుంచడం వీలులేక పోయింది. పగలల్లా ఒకరినొకరు చూచుకొని మాట్లాడడానికి వీలు కలిగింది. రామదాసుసంగతి క్రమంగా అన్నిబ్లాకులలోను తెలిసింది. ఒకటవబ్లాకులో ఉన్న 11 సావిళ్లవాండ్లూ తలా ఒకరోజు రామదాసును మార్చి తమసావిళ్లలో పడుకోబెట్టుకుంటూ, లోక సంగతులూ, నీతిమతబోధలూ వింటున్నారు. తక్కిన బారకాసుల వాండ్లుగూడా తమ సావిళ్లలోవున్న చదువుకున్న ఖయిదీలను బతిమలాడుకొని స్వదేశీవాండ్లదగ్గరనుంచి పుస్తకాలు తీసుకొనిపోయి చదివించుకుంటున్నారు. ఈసంగతులు సూపరింటెండెంటుగారికి తెలియలేదు. ఎరిగినవాండ్లు నలుగురూ ఒకచోటే ఉన్నా కొన్ని నెలలు గడిచేవరకూ జీవితంలో ముక్కడక్కీలు దిన్న రామదాసుకు కూడా తత్వం మారిపోయింది. అక్కడికీ రోజూ కొంతపని చేస్తూవున్నా స్వేచ్ఛగా దిరక్కపోవడంచేత అన్నం సరిగా అరగడం లేదు. మనిషి దుర్బలుడై పట్టుమని పదినిమిషాలు ఫయిలులో గొంతుకూర్చోలేదు. కాళ్లు తిమ్మిరిపుట్టేవి. ఎప్పుడయినా నీళ్ల కోసం దూరంగా పోవలసివస్తే రెండుఫర్లాంగులు నడిచేవరకు కాళ్లు తీసేవి. కదలకుండా కాసేపు నిలువంగనే పిక్కలు నొప్పిపుట్టేవి. మజ్జిగ లేకపోవడం, నువ్వులనూనె పులుసులో వేయడం, తలంటు లేకపోగా వారాని కొక్కమారయినా స్నానవసతి లేకపోవడంచేత

శరీరం పైత్యదారుణానబడి వయస్సుమీరినా నరవని తలంతో పలితరోగికివలె జనపనారకట్టయింది. అయిదారునెలలు మాడున చమురు పెట్టుకొని ఎరుగడు. కండ్లకు బాగా మసక లేర్పడ్డవి. స్వదేశీవాండ్లు రోజూ స్నానం చేయడం చూస్తే ఒంటికి రోమాంచం గలిగింది. ఈమార్పుల కేమిగాని బలహీనులకూ వృద్ధులకూ రక్షణసాధనమయిన కోపం ప్రవేశించింది. స్వల్పవిషయాలకుగూడా మనశ్శాంతి పోయేది. ప్రతిదానికీ అనవసరమయిన పట్టుదల యేర్పడ్డది. ఇదివరకు ఎదటివాండ్ల ఆక్షేపణలకూ, దూషణలకూ పెడమొగం పెట్టేవాడు. ఇప్పుడు తనలో దోషం లేదని తెలిసికూడా తనజీవితాన్ని గురించి స్వల్పవిమర్శన చేసినా సహించలేకపోతున్నాడు. ఇతరులకు యేస్వల్పబాధ గలిగినా మనస్సుకు అనవసరమయిన వుద్రేకంగలిగేది. ఇంద్రియనిగ్రహంగల రామదాసుస్థితే ఇలావుంటే తక్కినవాళ్లసంగతి చెప్పవలసినపని లేదు. రాయివంటి శరీరముగల పుల్లప్ప బొత్తిగా దసిలిపోయినాడు. ప్రతిదానికీ చిర్రుమనడం అందరికీ స్వభావగుణం అయింది. వీరదాసు మొదలే ముక్కోపి. పైగా అరవై యోపడిలో ఉండడం, అర్ధభోజనం బొత్తుగా దిగదీసింది. ముల్లంగిఆకుపులుసు పడక రెండుమూడుసారులు ఆసుపత్రిలో వుండివచ్చాడు. మనిషి బొత్తిగా హావిష్యం భవిష్యం లేకుండా పోయినాడు. బయట జీవనాధారం యేమీలేనివాళ్లకు, జైలులో ఉండడమే మేలంటారనుకున్నవాళ్లకు దేహ మనోబలాలు క్షీణించి వున్నవి. దేహంయొక్కయూ, ఆత్మయొక్కయూ సర్వశక్తులకూ పుష్టినిచ్చే స్వాతంత్ర్యము లేనప్పుడు అన్నిశక్తులూ క్షీణించేవుంటవి.

నిడదవోలు సెంట్రలుజయిలులో చాలాబ్లాకులలో జనం నిండాలేరు. గడువు తీరినవాండ్లు వెలుపలికి పోతున్నారు గాని క్రొత్తగా వచ్చేవాండ్లు తక్కువ. సి. టి. అక్టుఖయిదీ లెవ్వరూ రావడంలేదు. అందువల్ల జయిళ్లలో నాలుగోవంతు సంఖ్య తగ్గింది. మహాత్ముని అసహాయోద్యమం దేశమంతటా వ్యాపించినది. మాలపల్లెలు మగ్గాలతో నిండినవి. సాలీలూ, తొగటలూ, మాలలూ మొదలయిన తంతువాయజాతులన్నీ దేశానికి కావలసిన గుడ్డలన్నీ నేయలేకుండా ఉన్నారు. సాధారణంగా వాండ్ల

కుటుంబాలకు సరిపొయ్యే కూలి గిట్టుతున్నది. సంతానులలో చాలామంది డబ్బు చేతికిచిక్కించుకొన్నవాండ్లు బాగా పుష్టిపడ్డారు. స్వదేశీచెప్పులయందు జనానికిఅభిమానం కలగడంతోటే మాదిగె వాండ్లకుకూడా చేతినిండా పని దొరుకుతున్నది. ఖద్దరు వృద్ధి కావడంతోటే కోట్లమందికి వడకడం, యేకడం, రంగులద్దడం పని సరిపోతున్నది. మునుపు ముతకనూలుమాత్రం వడకడం చేతనయిన వాండ్లు సన్నపునూలు తీస్తున్నారు. ప్రత్తిపండే జిల్లాలలో నేత మరీ ఎక్కువయింది. చాలాజిల్లాలు నేతజిల్లాలని పేరుపడ్డవి. వాటిల్లో వుండే పెద్దబస్తీలన్నిటిలోను ఖద్దరుసంతలు పెట్టి అధికంగా ఉండే నూలూ, గుడ్డలూ ఇతరజిల్లాల కెగుమతిచేస్తున్నారు. ప్రతినెలా సంతలసంఖ్య పెరిగిపోతున్నది. మొదట నెలసంతలుగా పెట్టినవి పక్షసంతలూ, వారసంతలుగా మారినవి. మాలమాదిగెపల్లెలలో పూర్వం జగ్గడిసంతానులుగా ఉండి చెయిమెల్లాచిక్కించుకొన్న వాళ్లు చాలామంది ఖద్దరువర్తకం ప్రారంభించి గుడ్డలూ, నూలూ కొని నిలువజేసి దూరపుసంతలకు పంపుతున్నారు. పల్నాడు మాంచెస్టరయింది. సీమనూలంటే పల్నాటిసీమ, కొండవీటిసీమ యని అర్థం రూఢ మవుతున్నది. ఖద్దరువల్ల కోట్లకొలది జనానికి జీవనం కలగడంతోటే తక్కినకూలీలకు వ్యవసాయపుపనులవల్ల ఎడతెగకుండా కూలి దొరికి సుఖజీవనం జరుగుతున్నది. విదేశీగుడ్డ లమ్మేవర్తకు లంతా స్వదేశీగుడ్డలనే అమ్ముతున్నారు. ఇదివరదాకా అహమ్మదాబాదు, బొంబయిపట్టణాలలో ముతకనూలు వడికేయంత్రాలన్నీ ఆపనికట్టిపెట్టి సన్నపునూలుమాత్రం వడుకుతూ కొన్నింటిని ఇతర పనుల కుపయోగిస్తున్నారు. అందుమూలంగా ఇతరవృత్తులు చాలా అభివృద్ధి అవుతున్నవి.

కూలీలకు పని పుష్కలంగా దొరికి, డబ్బు మిగులుతుండడముతోటే కూలీకూటాలకూ, పరపతిసంఘాలకూ ప్రాముఖ్యత హెచ్చింది. ఊరూరా ఒకరి ప్రయత్నం లేకుండానే సంఘాలేర్పడుతున్నవి. జనం బొత్తుగా తాగుడు మానివేశారు. ఏ ఇంగ్లీషు విద్యాధికులలోనోతప్ప సామాన్యజనంలో మత్తుద్రవ్యాలవుపయోగం లేనేలేదు. ప్రభుత్వోద్యోగులూ, సారాయి. యిజారాదారులూ

జనులచేత సారాయి తాగించవలెనని విశ్వప్రయత్నాలు చేస్తున్నారు. సారాయి తాగవద్దని బోధిస్తే శిక్షించడానికి మొగం చెల్లక బోధకులు అల్లరి చేస్తున్నారనీ, జనులకు తాగేటందుకు స్వతంత్రత ఉండాలనీ, దేనికీ నిర్బంధ ముండగూడదనీ, ప్రబోధకులమీద ఉద్యోగులు తప్పుకేసులు పెట్టి నిర్బంధాలపాలు జేస్తున్నారు. ఒక గడుసుప్రచారకుడిమీద తాగవద్దని నిర్బంధిస్తున్నట్టు కేసు పెట్టి విచారణ జరగడంలో ఈ క్రిందిసంభాషణ జరిగింది.

జిల్లామేజస్ట్రీటు : సారాయిదుకాణాలదగ్గరకు పోయేవాండ్లను నీవు నిర్బంధిస్తున్నావా ?

ముద్దాయి : మా పేటలో దుకాణం నడిఊళ్లో ఉన్నది. చుట్టుపట్ల కాపురంవుండే మాకు తాగుబోతులు తొందరజేస్తుంటే ఆపడానికి ప్రయత్నించినమాట వాస్తవం.

జి-మే : దూరంగా బెడితే తాగేవాండ్లకుమట్టు కిబ్బందిగాదా!

ము : తాగేసౌకర్యం, తాగేవాండ్లఉసులు, మీరు చూస్తుంటే కాపుర ముండేవాండ్ల సౌకర్యం, ఉసులూ నేను చూస్తున్నాను.

జి-మే : అందరిహక్కులూ కాపాడడం ప్రభుత్వంవారి ధర్మమయివున్నది.

ము : చుట్టుప్రక్కల అల్లరులు లేకుండా కాపుర ముండడానికి మాకు ఉండే హక్కును ప్రభుత్వంవారు కాపాడవలెగాని తాగి అల్లరి చేసే హక్కును కాపాడవలసిన బాధ్యత ప్రభుత్వంమీద లేదు.

జి-మే : ప్రచారకులు చేసే బోధలవల్ల ఎట్టి నేరాలు జరుగుతున్నవో తెలుసునా ? కులకట్టుకు వ్యతిరేకంగా తాగినవాడికి అలగాజాతులు నెత్తిగొరిగించి అవమానం జేశారట. ఈసంగతి మా పార్లమెంటులోగూడా ప్రశ్నించారు. ఈదేశంలోని మూఢాచారాలకు నాగరక దేశాలు నవ్వవా ?

ము : అవును. నవ్వుతవి. తాగవద్దని బోధించే పెద్దలను శిక్షించి ఖయిదులో బెట్టి నెత్తిగొరిగించి అవమానపరచిన ప్రభుత్వపు జాతివారు నవ్వినా నవ్వనియ్యి. తా మామోదించి అమలులో బెట్టిస్తున్న చట్టం అలగాజాతులుగూడా నవ్వేటట్టుగా ఉన్నదని పార్లమెంటు సభికులకు తెలియదుగామాలె. ఇటువంటి నాగిరికుల చట్టాల

కంటె మూఢుల ఆచారాలే ఎక్కువ నీతిదాయకాలని నే స్పష్టంగా చెప్పగలను. రాజకీయప్రభువు వేస్తున్న శిక్షకంటె సంఘం అనే ప్రభువు వేసే శిక్ష ఎక్కువ ఫలకారీ, న్యాయమయినదీనీ. ప్రభుత్వం వేసే శిక్షలంత కఠినంగా సంఘం వేసే శిక్ష లుండవని నా అనుభవం.

ముద్దాయిని ప్రశ్న లడగడం దొరగారికి ఇబ్బందికరంగా తోచి జామీను ఉత్తర్వు ఖాయం జేశారు. జామీ నివ్వడానికి ముద్దాయి నిరాకరించినందువల్ల స్వాతంత్ర్యరక్షకుడయిన మేజస్ట్రేటుగారు సంవత్సరం కఠినశిక్షా, రాగిపడీ వేసి ముద్దాయి నారాయణరావుపంతులును సెంట్రలుజైలుకు పంపారు. ఇటువంటి కేసులు అనేకం జరుగుతున్నవి.

## 16. పొందు

అసహాయోద్యమంయొక్క విచిత్రచరిత్రతో మన కవసరం లేదు. కొన్నాళ్లు ఆటూ, కొన్నాళ్లూ పోటూగా ఉద్యమం అడుగులు వేసింది. మహాత్ముడు కొంతకాలం ఉపేక్ష అనే పంచమోపాయాన్ని అవలంబించాడు. ఈ సంధికాలంలోగూడా చక్రం పనిజేస్తూనే వుండడంచేత ఇదికూడా యుద్ధకాలమనే చెప్పవచ్చును. మాడరేట్లు కాంగ్రెసుపగ్గాలను బిగబట్టవలెనని ప్రయత్నించారుగాని మహాజనులు సాగనియ్యలేదు. మహాజనుల పరమావధులను గుర్తెఱిగి గమ్యస్థానం చేర్చ నుద్యుక్తులయినవారినే నాయకులనుగా గ్రహించే స్థితిలో జను లున్నారుగాని స్వామికార్యం స్వకార్యంగూడా చూచుకుందామని దూరంగా నిలిచి వీలయితే దోట్లు బెట్టి కొన్ని పండ్లు గోసి కొన్ని తమఊళ్లోకీ, వీలయితే కొన్ని దేశజనులకూ హక్కులు సంపాయింతామనే నాయకులను గ్రహించరు. అందువల్ల కొందరు వృద్ధులూ, స్వార్థపరులూ, వెనుకంజ వేసినా చాలామంది ఉద్యమంలో నూతనంగా ప్రవేశించారు. దేశమంతా దార్ఢ్యరహితమయిన మహాయుద్ధానికి తయారయింది. పునర్యుద్ధం ప్రకటించడానికి దేశం తయారయింది. నాయకులు ఆహవప్రకటన చేయక తప్పదనీ, దేశం ఘోరసంగ్రామంలోకి దిగకపూర్వమే శాంతికి భంగం కలుగకుండా జేసి భారతీయుల జన్మస్వాతంత్ర్యముల నంగీకరించి స్వరాజ్య మియ్యవలసిందనీ ప్రభుత్వంవారిని కోరారు. ఇండియాలోని ఆంగ్లేయులూ,

ఆంగ్లోహైందవులూ, ఇంగ్లండు ఇకముందు భారతదేశంతో సంబంధం పెట్టుకోదలచుకుంటే వలసదేశములకు స్వరాజ్య మియ్యవలసివుంటుందని నిశ్చయించుకొన్నారు. మాంచెష్టరువర్తకులు మొంత ప్రోద్బలం చేశారు. అంతట దేశమునకు కాంగ్రెసు కోరినప్రకారము స్వరాజ్యం వచ్చింది. కేంద్రప్రభుత్వం దేశమొత్తానికి సంబంధించిన వ్యవహారాలన్నీ చూస్తూ, భారత పార్లమెంటుకు జవాబు చెపుతుంటుంది. హిందుస్థానీ పార్లమెంటుయొక్క సలహాప్రకారం బ్రిటిషు పార్లమెంటు విదేశపు వ్యవహారములు నడుపుతుంటుంది. త్వరలో బ్రిటిషురాజ్యంలో వుండే అన్ని దేశాల ప్రతినిధులూ మహాపార్లమెంటు యేర్పాట్లుజేసి హిందూస్తానులకు దగిన ప్రాతినిధ్య మియ్యడానికి యేర్పాటయింది. అన్నివిధములా హిందుస్థానమునకు బ్రిటిషురాజ్యములోని అందరు భాగస్తులతోపాటు సమానహక్కు గౌరవములు గలిగినవి.

భారతీయులు దౌర్జన్యరహితమైన సత్యమార్గమున స్వరాజ్యమును సంపాదించి లోకానికి మార్గదర్శకు లయినారు. ఈ విధంగా సంపాదించిన హక్కులను దేశక్షేమమునకు, ప్రాచీనగౌరవమునకు తగినట్టుగా వుపయోగించ సంసిద్ధులుగా నున్నారు.

హిందుస్థానముయొక్క ప్రాచీనవిజ్ఞానమూ, ఆధునికశాస్త్ర పరిజ్ఞానమూ, వారి బుద్ధికుశలతా, సౌజన్యమూ, అనంతములైన ఖనిజములూ, సమృద్ధమయిన పాడీ పంటా మొదలయినవన్నీ భారతీయులకు బ్రిటిషురాజ్యములోనేగాక ప్రపంచమంతటిలోనూ అగ్రస్థానము తెచ్చినవి. హిందూస్థానమూ, చైనా, జపానురాజ్యములు మైత్రిగలిగి ప్రపంచమున ప్రాముఖ్యత వహించినవి. ప్రపంచ వ్యవహారనిర్ణయములకూ, విజ్ఞానమునకూ కేంద్రస్థానం పడమటి నుండి తూర్పుకు జాగింది.

## 17. విమోచనం

పార్లమెంటులో హిందూస్థానీ స్వరాజ్యచట్టం తీర్పుకాంగనే రాజకీయఖయిదీ లందరినీ వొదిలిపెట్టారు. కేవల అసహాయోద్యమమునకు సంబంధించినవాండ్లనే గాక రాజకీయ సంబంధముగల

బందిపోట్లూ, పంజాబుకుట్రలూ, పాటకోద్యమం, మునిసిపాలిటీలూ, అడవిచట్టాలూ, మద్యపానం, సెటిల్‌మెంట్లూ మొదలైనవాటికి సంబంధించిన యావత్తుకేసులలో శిక్షబడ్డవాండ్లందరూ రాజకీయ నేరస్తులుగానే యెంచబడి విడుదల జేయబడ్డారు. రణరంగములో జయమును బొంది యిండ్లకు వచ్చే వీరులవలె దేశీయులందరూ విడుదలయిన యావత్తుమంది ఖయిదీలను ఆహ్వానించి స్వాగత మిచ్చారు. విడుదలైన రాజకీయనేరస్తు లందరూ స్వరాజ్య పార్లమెంటును ఢిల్లీలో ప్రారంభించే రోజున అది దేశానికంతకూ ముక్తిదినం గనుక జయిల్ఖానాలలోని యావత్తుమంది ఖయిదీలనూ విడుదలచేసి దేశీయు లందరికీ ఆనందం కలిగించవలసిందనీ, దేశంలోని ప్రస్తుత చిత్రపరిస్థితులవలన గలిగిన దారిద్ర్యమే అనేకములైన నేరాలకు కారణమయిందనీ, పంచాయితీలు నశించి పోలీసు, న్యాయ శాఖలు ప్రబలి, అన్యాయం పెడమార్గంబట్టి అనేకులను కేవల కల్పిత నేరాలకూ, సాంకేతిక నేరాలకూ అక్రమంగా శిక్షించడంచేతనూ, స్వరాజ్యం లభించి నూతనపరిస్థితులు గలగడంతోటే వృత్తులు వృద్ధయి, ప్రతివాండ్లకూ న్యాయంగా జీవించడానికి అవకాశం గలిగి నేరా లాగిపోవడానికీ, దేశగౌరవము సంపాదించడానికీ అవకాశ మియ్యవలసిందనీ, దేశమంతా ఆందోళన గలిగించారు. దేశం సుముఖమైంది. ఖయిదీలందరూ స్వరాజ్యం రాంగనే తమకందరికీ జూబిలీ వస్తుందనీ, అప్పుడు యావత్తుమందినీ విడిచిపెడతారనీ ఉవ్విళ్ళూరుతున్నారు. స్వరాజ్య పార్లమెంటు వారంరోజులకు ప్రారంభిస్తా రనంగా హిందూస్థాన శాసనసభ జరిగింది. స్వరాజ్యం సంపాదించిన మహాత్మా మున్నగువారి దేశసేవను అభినందిస్తూ ఒకతీర్మానమూ, స్వరాజ్య మిచ్చినందుకు ఆంగ్లపార్లమెంటుకు కృతజ్ఞతను దెల్పుతూ ఒక తీర్మానమూ, పార్లమెంటు స్థాపించే రోజున యావత్తుమంది ఖయిదీలను వదిలిపెట్టవలసిందని ఒక తీర్మానమూ మాత్రం చేసి సభ అంతమైంది.

స్వరాజ్య పార్లమెంటు ప్రారంభించేదినం వచ్చింది. ఆ రోజున దేశంలో అస్వతంత్రులు లేరు. కొత్తపార్లమెంటు రాకపూర్వమే రాష్ట్రీయశాసనసభలు పురుషులతోపాటు స్త్రీలకు రాజకీయహక్కు-

